శ్రీరామకథా సుధాలహరి

# యుద్ధ కాండము

## మొదటి భాగము

(శ్రీ వాల్మీకి రామాయణము ననుసరించి - గీతికలలో)





దుర్గాప్రసాద్

ప్రథమ ముద్రణము : 500 ప్రతులు



విక్రమ నామ సంవత్సరము
శ్రావణమాసము - వర్ష ఋతువు
ఆగస్టు - 2000

మూల్యము రు. 50-00

ముద్రణ :
డి బి. ప్రింటర్స్
విజయవాడ-2

---

ప్రతులకు :
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞానభవనము, బ్యాంకుస్ట్రీటు,
హైదరాబాదు-500 001
అన్ని బ్రాంచీలలో లభ్యమగును.

పి. దుర్గారావు, యం.ఓ.యల్., తెలుగు పండిట్ (రిటైర్డ్)
అడవిదేవులపల్లి గ్రామం (పోస్టు) 508 207
(వయా) మిర్యాలగూడ, నల్లగొండజిల్లా.



## సమర్పణ:

కూజంతం రామరామేతి
మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితా శాఖాం
వందే వాల్మీకి కోకిలమ్॥

పుష్పాంజలులతో.

# దేవతా వందనము

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

యోగివంద్య జ్ఞానజ్యోతి! సారస్వత స్వాదురూప!
మృదుపద సుందరభావన! కవికులజన వరదాయిని!
విశ్వరూప విమలచరిత! అక్షరరూపిణి భారతి!
లలిత లలిత పదశోభిని! లాలిత సుందర భాషిణి!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

ఉదయసంధ్య అరుణారుణ రేఖాంకిత సదయనేత్రి
కరుణామయి! కావ్యగేయ గాన కళా సుప్రసన్న!
అజరుద్రాచ్యుత పూజిత! ఆదిరూప! సుఖదాయిని!
బుధ సేవిత! ధవళవర్ణ! భూరికృపానంద లహరి!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

లలితకళానందమూర్తి విలసిత చైతన్యమూర్తి!
మానవ విజ్ఞాన భాండ మధుర సుధా కలశహస్త!
శివరూపిణి! ప్రణవనాద! తేజోమయి! దీపరేఖ!
అఖిల జీవకోటి హృదయ! ఆనందిని! శ్రీదుర్గా!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! నందిత జన సకలలోక!

# వి న య  వా క్య ము

శ్రీమద్రామాయణ మహాకావ్యము సంస్కృతభాషలో రచింపబడినది. రచించినది శ్రీ వాల్మీకులవారు. ఐదువేల సంవత్సరముల క్రిందట వ్రాయబడినదని పెద్దలు జెప్పుదురు.

శ్రీమద్రామాయణమును భారతీయ భాషలలో, ప్రపంచభాషలలో ఎందఱో మహానుభావులు ననువదించిరి. ఆంధ్రభాషలోగూడ గద్య పద్య గీతికారూపాలలో ఎందఱో మహాకవులు గానముజేసిరి.

శ్రీమద్రామాయణము భారతీయ సాహిత్యమునకును, సంస్కృతికిని మూలము, ప్రతీక. రామాయణ కావ్యములోని నాయకుడైన శ్రీరామచంద్రుడు భారతీయులకు పరమదైవము. పరబ్రహ్మస్వరూపము. ఋషితుల్యుడు. ఆదర్శమానవుడు.

తమకు పుట్టిన బిడ్డలకు తెలుగుదేశములో శ్రీరాముని పేరు బెట్టుకుందురు. రామమందిరము లేని గ్రామము తెలుగుదేశములో లేదని చెప్పవచ్చును. ఇట్టి శ్రీరామ చరిత్రమును తెలుగులో, తేలికభాషలో, సామాన్యులు పాడుకొనుటకు వీలుగా, గీతికారూపమున వ్రాయుటకు బూనుకుంటిని.

వృత్తిచేత ఉపాధ్యాయుడ నైనప్పటికిని, సంస్కృతభాషాపరిజ్ఞానము స్వల్పమైనప్పటికిని, శ్రీరామునిపైగల భక్తిభావముచేతను, శ్రీమద్రామాయణమునందుగల ప్రీతిభావముచేతను, ఇట్టి మహత్కార్యమునకు బూనుకుంటిని. శ్రీరామచంద్రుడే నాచేత యీ మహత్కార్యమును జేయించుచుండెనని నా భావన.

ముందుగా సుందరకాండమును, తరువాత బాలకాండమును, అయోధ్యకాండమును రెండు భాగములుగా ప్రచురించితిని. ఆ తరువాత అరణ్య, కిష్కింధాకాండములను శ్రీరామపాదారవిందములకు నర్పించితిని. ప్రస్తుతము యుద్ధకాండము ప్రథమభాగము ప్రచురించి పాఠకలోకమునకు నందజేయుచున్నాను. త్వరలో యుద్ధకాండము రెండవ భాగమును గూడ ప్రచురింపవలెనని నా యాకాంక్ష.

నాకోరిక సఫలము జేయవలెనని పరబ్రహ్మ స్వరూపమైన శ్రీర
చంద్రుని వేడుకొనుచున్నాను.

**ఈ గ్రంథములోని విశేషములు :**

1. శ్రీ వాల్మీకి రామాయణము ననుసరించి తేలికభాషలో రచ
   ప్రయత్నించితిని బాలురకర్థమగురీతిలో, పాటగా పాడుకొను
   వీలుగా రచించుటకు యత్నించితిని.
2. గీతికలుగా వ్రాయుటవలన స్వేచ్ఛానువాదమని భావింపవచ్చు
   చేర్పులు, మార్పులు లేకుండా మూలము ననుసరించి అనువద
   బడినది.
3. 68 సర్గలుగల యుద్ధకాండము - ప్రథమభాగము దాదాపు 2
   చరణములుగా పూర్తిచేయబడినది.
4. ఏ సర్గమున కాసర్గము విడదీయబడి విషయసూచిక
   బడినది.
5. మూలము ననుసరించి రెండు మూడు శ్లోకములు ఒక చర
   లేదా ఒక శ్లోకము ఒక చరణముగా గూర్చబడినది.
6. ఇందలి ఛందస్సు చతురస్రగీతి. మధ్యాంతరమున యతి
   ప్రాసగాని యుంపబడినది. నాలుగేసి పాదములు మూడు
   రెండు ఒక చరణముగా సమకూర్చబడినది.
7. మున్యాశ్రమములో మహర్షి వాల్మీకులవారి దగ్గఱ నేర్చుకొని
   గాయకులుగా గానము జేసిన లవకుశులే ఆదర్శము.

ఈ గ్రంథ రచనయందు భాషలో, భావనలో, అచ్చులో కథాగ
పుష్టిలో ఎన్నియో దోషములుండవచ్చును. సహృదయులు దెలియబ
పరిదిద్దుకొందును.

గీతికా రచనలోగాని, ప్రచురించుటలోగాని యెట్టి యాటంకక
గలుగునందులకు శ్రీరామచంద్రునకు నా నమోవాకములు. తక్కిన ర
యణకాండలను గూడా యిదే రీతిగా బ్రచురించవలెనని నా యాకాంక్ష

శ్రీ వాల్మీకులవారు శ్రీమద్రామాయణ కావ్యమును రచించి ముద్దుగా కుశలవులచే పాడించిరి. అదే విధముగా విద్యార్థులు గూడ యీ రామాయణ మును ముద్దుగా పఠించి గానముచేసి సంగీత సాహిత్య సంస్కృతులను సంపాదించు కొనవలెనని నా కోరిక.

శ్రీ రామాయణ గ్రంథము భారతీయులకు పూజనీయమైనది. ఆది కావ్యము. అట్టి మహాగ్రంథముయొక్క ఆత్మీయతను, వాల్మీకులవారి కవితా హృదయమును రామాయణములోని మహోజ్జ్వలములైన పాత్రలను స్పృశించుటయే గాక, రామాయణములోని శిఖరాయమానమైన సుందర కాండ, బాలకాండ, అయోధ్య,అరణ్య, కిష్కింధాకాండములను ప్రచురింప గలుగుట నాపూర్వజన్మ సుకృతమని భావించుచున్నాను. సహృదయులకు నమస్కారములు.

—రచయిత

---

# కృతజ్ఞతలు

ఆర్ష విజ్ఞాన ట్రస్టు, హైదరాబాదువారు ప్రచురించిన రామాయణ గ్రంథము నా యీ యుద్ధకాండము-ప్రథమ భాగము గీతికా రచనకు మిక్కిలి తోడ్పడినది. వారికి నా హృదయపూర్వక నమస్కృతులు.

అదే విధముగా ఆ గ్రంథమును టీకా తాత్పర్య సహిత ముగా వ్యాఖ్యానించిన ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు గారికి నా వినయపూర్వక నమోవాకములు.

22. సముద్రుని అనుమతిచేత నీలుడు నూఱు యోజనముల సేతువు
నిర్మింపగా రాముడు సైన్య సహితుడై సముద్రము దాటి అక్క
సేనను నిలుపుట.

23. రాముడు లోకవినాశ సూచకములైన శకునములు లక్ష్మణున
జూపుట. లంకపై ఆక్రమణము జేయుట.

24. రాముడు లంక శోభను వర్ణించుచు సేనను వ్యూహములుగా నిలు
మని లక్ష్మణుని ఆదేశించుట. అంతవరకు బంధింపబడి వున్న
శుకుణ్ణి విడువగా, అతడు వెళ్ళి రావణునకు రాముని సైన్యశక్తి
గూర్చి వర్ణించి చెప్పుట.

25. రావణుడు శుక సారణులను గూఢచారులుగా వానర సేన లోని
బంపుట. విభీషణుడు వారలను గుర్తించి పట్టుకొనుట. రాము
యనుగ్రహముచేత విడువబడి, వారలు రాముని సందేశముతో
లంకకువెళ్ళి రావణునకు ఉపదేశించుట.

26. సారణుని మాటలువిని రావణుడు వానర సైన్యమును జూచుటకై
ప్రాసాదముపైకిఎక్కుట.సారణుడు నా యా వానరులను జూపుచు
వారి బలపరాక్రమాదులను వర్ణించి చెప్పుట.

27. సారణుడు ఆయావానర వీరులపేర్లు జెప్పుచు, వారల పరాక్రమాదు
లను వర్ణించుట.

28. సుగ్రీవుని మంత్రులు మైంద ద్వివిదులు, హనుమంతుడు, రామ
లక్ష్మణులు, విభీషణుడు, సుగ్రీవుడు వీరందఱి గూర్చి చెప్పి,
శుకుడు వానరసైన్యము సంఖ్యను జెప్పుట.

29. రావణుడు శుకసారణులను నిందించి వారలను సభనుండి పంపి
వేయుట. అతడు గూఢచారులను బంపగా రాముని యనుగ్ర
హముజేత వారు వానరుల బాధనుండి బైటపడి లంకకు తిరిగి
వచ్చుట.

30 శార్దూలుడు వానర సైన్యములోనున్న ప్రముఖ వీరులను గుఱించి రావణునకు దెలుపుట.

31. రావణుడు రాముని మాయాశిరస్సు ఛేదించి, తీసికొనివచ్చి సీతకు జూపి, ఆమెకు దుఃఖమును గలిగించుట.

32. రాముని శిరస్సును, ధనుస్సును జూచి సీత విలపించుట, రావణుడు అచ్చటనుండి వెడలిపోవుట.

33. "ఇది రాముని శిరస్సుకాదు; రావణుడు మాయచేత కల్పించినది" అని చెప్పి సరమ సీతను ఓదార్చుట.

34. సీత కోరగా సరమ రావణుడు ఏమి చేయుచున్నాడో తెలిసికొని వచ్చి సీతకు జెప్పుట

35. మాల్యవంతుడు లంకలో గనబడుచున్న దుశ్శకునములను గూర్చి వర్ణించి చెప్పి రామునితో సంధిజేసికొనుమని రావణునకు బోధించుట

36. రావణుడు మాల్యవంతుని యుపదేశమును దిరస్కరించి, నగర ద్వార రక్షణమునకై మంత్రులను నియోగించి, గృహములోనికి బోవుట.

37. లంకా రక్షణమునకై రావణుడు చేసిన యేర్పాట్లను గూర్చి విభీష ణుడు రామునకు దెలుపుట. లంకా ద్వారములను నాక్రమింపుడని రాముడు వానర సేనానాయకులను ఆదేశించుట.

38. రామలక్ష్మణులు వానర ముఖ్యులతో గలిసి సువేలపర్వతము నధిరో హించుట.

39. రాముడు, వానర వీరులు సువేల పర్వతము శిఖరమునుండి లంకను గాంచుట.

40. సుగ్రీవ-రావణుల మల్లయుద్ధము.

41. ఇట్టి దుస్సాహసము జేయవలదని రాముడు సుగ్రీవునకు దెలుపుట. లంక నాలుగు ద్వారములవద్ద వానరులను నియమించుట. అంగదుని రావణునివద్దకు దూతగా బంపుట. అంగదుడు రావణునిసభలో తన పరాక్రమమును జూపుట- వానరులు ఆక్రమించుటచే రాక్షసులు భయముజెందుట.

42. వానరులు లంకను ఆక్రమించుట. రాక్షసులతో యుద్ధము చేయుట.

43. ద్వంద్వయుద్ధములో వానరులు రాక్షసులను ఓడించుట.

44. రాత్రి వానర రాక్షసుల మధ్య భయంకర యుద్ధము జరుగుట, అంగదుడు ఇంద్రజిత్తును ఓడించుట, ఇంద్రజిత్తు మాయాబలము చేత అదృశ్యుడై రామలక్ష్మణులను నాగపాశములతో బంధించుట.

45. ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణములచేత రామలక్ష్మణులు సంజ్ఞ కోల్పోవుట, వానరులు శోకించుట.

46. మూర్ఛితులైన రామలక్ష్మణులను జూచి వానరులు దుఃఖించుట- ఇంద్రజిత్తు ఆనందముతో బడాయి జెప్పుకొనుట- విభీషణుడు సుగ్రీవునకు ధైర్యము జెప్పుట- ఇంద్రజిత్తు లంకలో ప్రవేశించి తండ్రికి శత్రువధ వృత్తాంతమును జెప్పుట- రావణుడు సంతోషించి పుత్రుని యభినందించుట.

47. వానరులు రామలక్ష్మణులను రక్షించుచు చుట్టూ నిలిచి యుండుట, రావణుని యాజ్ఞచే రాక్షస స్త్రీలు సీతను యుద్ధభూమికి తీసికొనివెళ్లి రామలక్ష్మణులను జూపుట, సీత దుఃఖించుట.

48. సీత విలపించుట, త్రిజట ఆమెను ఓదార్చి రామలక్ష్మణులు జీవించియే యున్నారని ఆమెకు నమ్మకము గలిగించి తిరిగి లంక లోనికి తీసికొనిపోవుట.

49. రామునకు తిరిగి స్పృహవచ్చి, లక్ష్మణునికొఱకు విలపించుట. ప్రాణములను త్యజింప నిశ్చయించుకొని "మీరందఱు స్వగృహము లకు వెళ్ళుడు" అని వానరులను ఆజ్ఞాపించుట.

50. విభీషణునిగాంచి యింద్రజిత్తు అనుకొని వానరులు పాఱిపోవుట. జాంబవంతుడు వారికి ధైర్యము జెప్పుట. గరుత్మంతుడు వచ్చి రామలక్ష్మణులను నాగపాశములనుండి విముక్తులను జేసివెళ్ళుట. వానరులు సంతసించుట.

51. రాముడు శరబంధములనుండి విముక్తుడైనట్లు తెలిసికొని రావణుడు చింతాక్రాంతుడగుట. ధూమ్రాక్షుని యుద్ధమునకు బంపుట.

52. హనుమంతుడు ధూమ్రాక్షుని వధించుట.

53. రావణుడు వజ్రదంష్ట్రుడను రాక్షసుని యుద్ధమునకు బంపుట. అతడు వానరులతో భయంకరమగు యుద్ధమును జేయుట.

54. అంగదుడు వజ్రదంష్ట్రుని సంహరించుట.

55. రావణుని యాజ్ఞచే అకంపనుడు యుద్ధమునకు బయలుదేరుట. దుశ్శకునములు, వానర రాక్షసుల మధ్య భయంకరమైన యుద్ధము జరుగుట.

56. హనుమంతుడు అకంపనుని వధించుట.

57. రావణుడు సేనాపతియైన ప్రహస్తుని యుద్ధమునకు బంపుట.

58. నీలుడు ప్రహస్తుని వధించుట.

59. ప్రహస్తుడు మరణించుటచే దుఃఖితుడైన రావణుడు యుద్ధమునకు బయలుదేరుట.

అతనితోవచ్చిన వీరులను గుఱించి విభీషణుడు రామునకు జెప్పుట- రావణుడు సుగ్రీవుని మూర్ఛబోవునట్లు జేయుట. లక్ష్మణుడు

యుద్ధమునకు వచ్చుట. రావణ హనుమంతులు పోరాడుట. రా
ణుడు నీలుని మూర్ఛజెందించుట. రావణుడు శక్తిని ప్రయోగింప
లక్ష్మణుడు మూర్ఛజెంది మరల లేచుట, రాముని చేతిలో రావణు
పరాజితుడై లంకలో ప్రవేశించుట.

60. రాముని జేతిలో పరాజితుడై రావణుడు దుఃఖితుడై అతనియాజ్ఞచే
కుంభకర్ణుడు నిద్రనుండి లేపబడుట. అతనినిగాంచి వానరుల
భయముజెందుట.

61. విభీషణుడు కుంభకర్ణుని గూర్చి రామునకు జెప్పుట. రాము
యాజ్ఞచే వానరులు లంకా ద్వారమువద్ద నిలుచుట

62. కుంభకర్ణుడు రావణుని భవనమునకుబోవుట. రావణుడు అతని
శత్రువినాశనమును జేయమని కోరుట.

63. కుంభకర్ణుడు రావణుడు చేసిన చెడ్డపనులకు అతనిని మొదట
నిందించుట. చివరకు తన యుద్ధోత్సాహమును తెలుపుట.

64. మహోదరుని కపటోపాయము.

65. కుంభకర్ణుడు యుద్ధమునకు బయలుదేరుట.

66. కుంభకర్ణుని జూచి వానరులు పారిపోవుట. అంగదుడు ధైర్యము
జెప్పి యుద్ధమునకు ప్రోత్సహించుట.

67. కుంభకర్ణుడు ఘోర యుద్ధముజేసి రామునిచే సంహరింప
బడుట.



# శ్రీ రామకథా సుధాలహరి

## నివేదన

శ్రీరామాయణ పుణ్యగథను జనచిత్తము హర్షము రంజిలగా!
మధుర పదములను మధుర భావముల మల్లెమాలగా నలరింపన్!
శ్రీగణేశ్వరుని చిన్మయభక్తిని చిత్తము బొంగగ స్మరియింతున్!
శ్రీభారతి గిరిజామ తల్లులను సిద్ధిని గోరుచు ప్రార్థింతున్!

ఆదికవులు శ్రీవాల్మీకుల కిదె యలరి జేయుదును వందనముల్!
పూర్వకవులకును బుణ్యమతులకును బూర్ణభక్తి నే నర్పింతున్!
రామ కథను వ్రాసిన ఘనులకు నిదె రమ్య నమస్కృతు అర్పింతున్!
సీతారాముల భజించు వారిని జేరికొలుతు నే నడుగడుగున్!

ఆసేతుహిమాచల పర్యంతంబును నలరెడి భారతదేశమునా!
భారతీయులకు బరమాదర్శము భవ్యరామ సీతాకథయే!
వారి మార్గమే యాదర్శము మఱి వారి చరిత దిగ్దర్శనమూ!
వారు నడిచినా మధుర మార్గమే వన్నెదెచ్చు జీవనధర్మం!

రామాయణమది మహాసముద్రము రంజిలు హిమగిరి శిఖరమదీ!
తేట తెలుగులో మహాత్ములెందఱొ తెలియగ వ్రాసిరి విశదముగా!
సకల శాస్త్రములు విననేలా? మఱి సర్వ గ్రంథముల శ్రమయేలా?
రామాయణమది విన్నజాలు! భువి రాజమార్గమగు జీవనమున్!

అందులకే నే నఖిల దేవతల యారాధనలను జేసితినీ!
పదముల నిమ్మని భావము లిమ్మని భారతాంబ నర్థించితినీ!
ఇష్టదైవమగు నిందిరారమణు నిహపరమిచ్చెడి రఘుపతినీ!
భక్తిభావమున శిరమును మోడ్చితి భావమునందున నిలువమనీ!

ఎట్టి పుణ్యమును జేసితినో మఱి!యెట్టి సుకర్మలు జేసితినో!
గట్టిగ యా శ్రీరాముని చరితము బట్టువడెను నా మనసునకున్!
మధురాక్షరములు మధురపదములై మంజుల గీతముగా వరుసన్!
లయతాళములను నృత్యము చేసెను లలితరాగ మధురోక్తులతోన్!

అల వాల్మీకులు వ్రాసినదానిని యా శ్రీరాముని సభయందున్!
వీధి గాయకులుగా కుశలవులును విమలగానమును జేసినదీ!
ఆ పాటను నే దెనుగున బాడితి నమరగానమును జేయంగన్!
తెలుగు బాసలో .తేటతెనుగులో దెలుగు బాలకులు బాడుటకున్!

కఠిన పదములకు దూరముగా నే కఠిన భావముల కోరనీకన్!
బాలకులగు నా కుశీలవులనే భవ్యాదర్శముగా గొనుచున్!
శ్రీరాముని మహనీయ చరితమును జేయగ బూనితి గేయముగా!
బాలుర వృద్ధులు బాడుకొనుటకై భవ్య రాగ లయ తాళములన్!

భారతదేశమునం దణువణువును భవ్య రామ శుభచరితంబున్!
పాడుకొనును శ్రీరామరామ యని భవ్యరాగలయ తాళములన్!
గాలి కదలికల వినిపించును నా కమ్మని రాముని నిస్వనముల్!

సిద్ధివినాయక! చిత్తము రంజిల శిల్పి వోలె నా మదియందున్!
శ్రీరామాయణ చిత్రమందిరము జేయుచుంటి భక్తిని రక్తిన్!
ఒక్కొక్క చరణము నందియిమ్ము నే మక్కువ తోడను నిర్మింతున్!
మధురాక్షరములు మధురభావములు మానసంబు జిందులు ద్రొక్కన్!
చిక్కని మక్కువ సురచిర భాషను చక్కని భావము లందించీ!
అందుకొనగ నే నసదృశ భక్తిని యా శ్రీరాముని జేరుకొనన్!

కన్న తల్లివని కలల యందునను గాంచుదుగద! భారతి! వాణీ!
అంధకారమును దొలగజేసి న న్నాదరింపు వీణాపాణీ!
హృదయకమలముల నడుగిడి దయతో హృదివెన్నెలను గావించీ!
కావ్య కన్యకను గమనీయముగా కాంచన కుసుమము గావింపూ!

కోరుచుంటి నాయువు నారోగ్యము కూర్మి భావనా శక్తియునూ
సాగిలబడి నే మ్రొక్కుచుంటినీ చక్కని సీతారాములనూ!

★ ★ ★ ★

# శ్రీ రామకథా సుధాలహరి

## యుద్ధకాండము - మొదటి భాగము

### ప్రథమ సర్గము

[శ్రీరామచంద్రుడు హనుమంతుని ప్రశంసించుట — అతనిని కౌగలించుకొనుట — సముద్రమును దాటుట యెటులని యాలోచించుట.]

శ్రీరాముడు నున్నది యున్నట్లుగ శ్రీకరముగ భాషించిన యా
హనుమంతుని వాక్యములను వినుచును నానందంబున గూడికొనీ!
ప్రత్యుత్తర వాక్యమును నీ విధిని బ్రస్తుతించుచును మారుతినీ
సంతోషించుచు నీ విధి బలికెను చారుశీలుడా రాఘవుడున్! 1

హనుమంతునిచే జేయబడిన యా యద్భుత కార్యము నీ ధరణిన్!
ఇతరుల జేత మనస్సు జేతనూ యెవ్వారులు జేయని దానిన్!
భూలోకములో దుర్లభమైనది భూరి మహాద్భుతమైనదియున్!
ఘనతరమగు కార్యమును జేయబడె కర్మవీరుడగు మారుతిచేన్! 2

గరుత్మంతుడును, వాయుదేవుడును కర్మవీరుడగు బావనియున్
వీరికంటె మఱి యితరు లెవ్వరును వీరులు నుదధిని దాటుటకున్!
సమర్థు లెవరును గానరారుగా సకల ప్రపంచము నందుననూ
దేవదానవులు, నక్షులు, నురగులు దీరుగ రాక్షస గంధర్వుల్! 3

ఎదిరింపగరానిది దుర్లభమును నెవ్వరు గూడను నీ జగతిన్!
రావణు పాలితమైన లంకలో రయమున జొచ్చిన వాడెవడున్!
ప్రాణంబులతో రాగలరా మఱి బన్నుగ దన బలవీర్యములన్! 4

ఎదిరింపగ శక్యము కానిది మఱి యింపుగ రాక్షస బలములచే
రక్షింపగ బడుచున్నది మఱియును రమ్యమైన లంకను బోవన్!
ధైర్య వీర్యబల సంపన్నుండును దగ హనుమంతుని సమానుడున్
అట్టినారలే బ్రవేశించెదరు అన్యులకున్ మఱి శక్యందే? 5

హనుమంతుడు దన పరాక్రమంబును ననుపమగు దన వీర్యంబున్!
దగు విధమున దా ప్రదర్శించెనూ ధర్మపద్ధతిని గీర్తింపన్!
సుగ్రీవునకును దగిన బంటుగా సురుచిరముగ కృతకృత్యుండై
భృత్యకార్యమును నిర్వర్తించెను భీమబలాఢ్యుడు తేజమునన్! 6

ఏ భృత్యుడు దుష్కర కార్యంబును నెవనిజేత నియమింపబడీ,
ఆ భృత్యుడు ప్రభుభక్తి గలిగి మఱి యల సత్వంబును లేకుండన్
ప్రభుకార్యము బహు ననురాగముతో బరగ జేయునో యాతండున్
పురుషోత్తమునిగ తెలుపగ బడు నిల భూరి ప్రశంసను నతడంచున్! 7

ఏ భృత్యుడు నిలబుద్ధి మంతుడై యింపుగ సమర్థుడై కూడన్
ప్రభువుజేత నియమింపబడుచునూ ప్రభువుకు హితమగు కార్యంబున్
అధికముగా జేయక యుండినచో నాతడు లోకము నందుననూ
మధ్యమ పురుషునిగా దలంచెదరు మాన్యులు దెలుపుచునుందు తిలన్! 8

నియుక్తుండునై రాజకార్యమున నిర్ణయములు జేసెడి వాడున్
బుద్ధియుక్తుడును సమర్థుండునూ పొలుపుగ తెలిసినవాడు నిలన్!
సావధాన చిత్తముతో భృత్యుడు సాధింపనిచో కార్యంబున్
పురుషాధముడని లోకమునందున స్ఫూర్తిని మాన్యులు దెలిపెదరూ! 9

సుగ్రీవునిచే నియమింపగబడి సురుచిరముగ యా కార్యంబున్
సాధించెను మన హనుమంతుండిల సకలలోకమును సంతసిలన్!
తనను దాను దేలికబఱచు కొనీ తరుగ జేయడుగ ప్రభుకీర్తిన్
సుగ్రీవునకు సంతోషంబును సురుచిరముగ పావని జేసెన్. 1

వైదేహిని దర్శించి వచ్చుటను వరుసగ నేనును లక్ష్మణుడున్
హనుమంతుని ఘనకార్యము జేతను నలవికాని దుర్లభమైనా
కార్యముజేతను రక్షింపగబడి కడు కృతార్థులం బైతి మిలన్
ధర్మరీతి రఘువంశము గూడను ధర నిల్పగబడె సత్కీర్తిన్!

ఇంతటి ప్రియమగు వార్తను దెలిపిన యీ మారుతికిని దగురీతిన్
ప్రియమును జేయగ జాలకుంటినీ ప్రీతి పూర్వముగ వెనువెంటన్!

దీనావస్థను నుంటిగదా! మఱి ధీరుడైన హనుమంతునికిన్!
ఇదియే మనసును గుంగదీయుచును నిమ్మగ బీడించుచు నుండెన్! 12

అట్టి మహాత్ముండైన మారుతికి యిట్టి సమయమందున నేనున్
నా సర్వస్వంబైన కౌగిలిని నయముగ నిచ్చుచు నున్నాదన్! 13

ఇటుల బలికి శ్రీరామచంద్రుడును నింపుగ సంతోషము దోడన్
వికసించిన వక్షము గలవాడై వినీత బుద్ధియు గలవాడున్
కృతవాక్యము గలవాడై వచ్చిన మతిమంతుండగు మారుతినీ!
కౌగలించుకొనె రామచంద్రుడును గల కపివీరులు గాంచగనూ! 14

రఘుసత్తముడగు రామచంద్రుడును రహి మది యాలోచన జేసీ
వానర ప్రభువగు సుగ్రీవుండును వనరగ వినుచుండగ నంతన్!
మధుర మధుర వచనములను బలికెను మాధుర్యము విలసిల్లగనూ! 16
సుదతి సీత పరిమార్గణంబునూ సురుచిరముగ మీరందఱునూ
సర్వ విధములను బాగుగజేసీ సఫలత్వంబును నొంది రిలన్!
కానీ! నామది మహాసముద్రము కనులకు స్మృతికిని బొడగట్టన్
ఏమి చేయవలెనో మది దోపక యింగిత మనునది నశియించెన్! 16

సమాగతులు నగు వానరులందఱు సాధ్యముగా నిది దాటుటకున్!
మహాంతసమునగు మహాసముద్రము మఱి దక్షిణ తీరంబునకున్!
ఎటుల జేరగలరో మఱి యెవ్విధి యెటు దాటగ గలరో కపులున్!
అంతుబట్టకున్నది నా యోచన సుంతయు గానగ రా దిపుడున్! 17
సతి సీతా వృత్తాంతం బంతయు చక్కగా దెలిసెనుగాని సఖా!
ఈ మహోదధిని వానరు లెటులను నింపుగ దాటుదురో మఱియున్!
దక్షిణ తీరము నెట్టుల జేరుదురో దగురీతిని రణమును జేయన్!
ఈ సమస్యకును సమాధాన మిల నింపుగ దొరుకుట లేదుగదా! 18

శత్రు విఘ్నుడైన రాఘవుడు సాహసవంతుడు నాతనితో
ఇటుల బలికి శోకముతో గూడుక కటువేదన మది బొందుచునూ!
ధ్యాననిమగ్నుండై శ్రీరాముడు దా యోచన జేయగ సాగెన్!
ధ్యానికి సాధ్యము గానిదున్నదా దగ యీభూమండల మందున్? 19

(యుద్ధకాండములోని మొదటి సర్గము సమాప్తము)

# యుద్ధకాండము మొదటి భాగము

## రెండవసర్గము

[సుగ్రీవుడు శోకసంతాపుడైన రామునకు ధైర్యమును జెప్పు]

శ్రీమంతుండగు సుగ్రీవుండును చిత్తము శోకమునను గూడి!
పరితపించుచుండిన శ్రీరాముని బన్నుగ యోదార్చుచు మఱియున్!
శోకనాశనంబగు వచనములను సురుచిరముగ నీవిధి బలికెన్! 1

ఓ రఘువీరా! సామాన్యునివలె యోరిమి యింతయు లేకయునూ
ప్రాకృత పురుషునివలె దుఃఖించుట బన్నుగ దగునా రఘువీరా?
ఇట్టి శోకమును బొందకుమా మఱి గట్టి ధీరతను బొందు మికన్!
కృతఘ్నుండు స్నేహమును విడిచినటు మతి దుఃఖంబును వదులుమిక 2

రాఘవ! సీతా వృత్తాంతంబును రమ్యముగా దెలిసినది గదా!
శత్రువెచట గండో! మఱి వాని స్థిరస్థావరమును దెలిసినదీ!
అందువలన యీ దుఃఖమెందులకు కందుట యీవిధి యెందులకూ?
శోకించుట కిల కారణ మేమియు శూర! నాకు గనబడదు నికన్! 3

మతి మంతుడవును, శాస్త్రవిదుండవు ప్రాజ్ఞుడవును, పండితుడవునూ!
తగు నిర్ణయములను జేయువాడవును దగ సర్వము దెలియును నీకున్!
నిగ్రహశక్తిని గలపురుషుడు వే నిర్జించును నాటంకములన్!
అట్లే ప్రాకృత బుద్ధిని వదులుము అల యోచనలను విడువు మికన్!

మహా నక్ర సంకులము సముద్రము మాననీయ! యిదె దాటెదమూ!
లంకాపట్టణ మాక్రమించెదము శంక జేయకుము రఘువీరా!
శత్రువైన యా లంకాధిపురినీ చరచర బోయి వధించెదమూ!
ఉత్సాహంబును దెచ్చుకొనుము నిక యూరట జెందుము ధీరతనూ!

ఉత్సాహము మది లేనివాడునూ యులికిపాటు గల దీనుండున్!
శోకాకుల బుద్ధియు గలవాడును శూరత్వంబును గోల్పోవున్!
అట్టి పురుషునీ సర్వ కార్యములు నిట్టె నశించును రఘురామా!
కష్టంబుల పాలగును నిశ్చయము నష్టంబుల పాలగు నతడున్!

మనచుట్టును గల వానరవీరులు మహా శూరులును సమర్థులున్!
త్వత్ప్రియార్థమై యనలమునందును యలరి దూకుటకు సంసిద్ధుల్
వానర వీరుల హర్షము జేతను వనరగ దీనిని తెలిసితినీ!
నా కీ విషయంబున రామా! విను నమ్మకమున్నది దృఢముగనూ! 7

పాపకర్ముడగు రావణాసురుని పరాక్రమముచే వధియించీ!
సీత నే విధము గొనిదెచ్చుదుమో శ్రీకరముగ భువి కీర్తింపన్
తగిన యుపాయము నాలోచింపుము తక్షణ కర్తవ్యము నీకున్!
వానరవీరులు సాయము జేతురు వధియించెద నా రాక్షసులన్! 8

రఘురామా! యా సంద్రము పైనీ రయముగ సేతువునిర్మించీ
రాక్షసరాజగు రావణాసురుని రమ్య నగరమగు నా లంకన్
ఏవిధముగ మఱి జేరుదుమో మఱి యెటుల జూతుమో జానకినీ!
ఆలోచింపుము నా యుపాయమును నసాధ్య మేమియు లేదుసుమా! 9

త్రికూట పర్వత శిఖరముపైనీ దీరుగగల లంకాపురమున్
జూచిన బిమ్మట యుద్ధమునందున శూరుడు రావణు డంతటనూ!
కంటికి గనబడినంతనె నాతడు కాలుని పురమునకును వేగన్
బోయినట్లుగా నిశ్చయింపుమా! పొల్లు మాట లివి కాదు సుమా! 10

భయంకరంబగు వరుణాలయమగు భవ్య మహా సాగరమందున్
సేతువు నల మఱి నిర్మించనిదే జేరలేరుగా యాలంకన్
ఇంద్ర సహితుడగు నమరులు గూడను సాంద్ర బలాఢ్యులు రాక్షసులున్!
లంకానగరము జయింపజాలరు లావు గలిగినా శూరులునూ!
స్వేచ్ఛారూపముగల హరివీరులు స్థిరవిక్రములును యుద్ధమునన్! 11

లంకానగర సమీపము నందున వంకలేక సంద్రము నందున్!
ఎంత త్వరితముగ వారధిగట్టిన యంతలోను మన సైన్యంబున్
దాటినచో మఱి యంత త్వరితముగ దగ మనచే యా లంకయునూ!
జయింపబడినదిగా భావింపుము జయము నిశ్చయము రఘురామా! 12-13

ఆకారణమున రఘురామా! విను నాపుము శోకము జాలు నికన్!
సకలకార్యముల నశింప జేయును సర్వనాశకరమైనదియున్;
కావున నాపుము! వ్యాకులత్వమును కరుణామయ! యీ లోకమునన్
మానవునకు శోకము శౌర్యంబును మాపివేయు నిది నిజమునమా! 14

మానవుండు గనపరుపవలసినా మహా శౌర్యమును బూనుమికన్!
ఆ శౌర్యంబును జూపెడి వారికి యగును కార్యసాధనము నిలన్!
జయము జేకొనును శత్రులమార్కొని జాగృతి నొందును కార్యముల 15

మహాప్రాజ్ఞ! ఓ శ్రీరఘురామా! మఱి యీ సమయము నందుననూ!
తేజముతో కూడిన సత్త్వంబును దీరుగ యవలంబింపు మికన్!
భార్యాపిల్లలు, నాత్మబంధువులు బన్నుగ మనుష్యు లెవరైనా
కంటికి గానగ బడకపోయినను కాలమందు నశియించిననూ
నీసరి శూరులు మహాత్ము లెన్నడు నీరసింపరుగ లోకమునన్
సకల ప్రయోజనములు నశించునూ సకలాపదలును సుడిముట్టున్! 16

బుద్ధిమంతుడవు! శ్రేష్ఠుండవు మఱి పూర్ణ జ్ఞానవంతుడవు మఱిన్
సర్వశాస్త్రములు నెఱిగినవాడవు సాధుశీలుడవు లోకమునన్!
అందుచేత నావంటి సచివులను నాధారముగా జేసికొనీ!
జయించు శాత్రవులను శ్రీరామా! సాధింపుము నీ కార్యములన్! 17

దశరథరామా! యుద్ధమునందున ధనుసు ధరించిన నీతోడన్!
ధనుసు ధరించిన వాడెవ్వడునూ దగ యెదురుగ నిలిచెడివాడున్
మూడులోకముల యందున నాకును ముదమున గనబడ లేదుగదా!
అట్టి మహావీరుడవు యీ విధిని యారట మొందుట యెందుకని? 8

వానరవీరులతో గూడిన యీ వనరగ యీ ఘన కార్యంబున్
విఫలత్వంబును బొందదు మఱియును విపత్తులను ముడివడదు సుమా
అచిరకాలమున యక్షయమై నా యల సముద్రమును వాలెదవూ!
సీతాదేవిని జూడగలుగుదవు శీఘ్రము శుభముల బడయుదవూ!

అకారణమున శోకము మానుము! అవలంబించిన నిస్పృహనూ!
క్రోధము నవలంబింపుము రామా గుఱి జూడుము నీ శత్రువులన్!
యత్నహీనులగు క్షత్రియ వీరులు నరసిజూడ మందులును సుమా!
శూరుడైన కోపిష్ఠికి లోకము స్రుక్కుచు భయపడుచుందు రిలన్! 20

సూక్ష్మబుద్ధిగల నీ విప్పుడు మఱి సురుచిరముగ నూతో గూడి
నదీభర్తయగు భయంకరంబగు నయముగ సముద్రమును నెటులన్
దాటవలయునో విచారింపుమా! దగ నీ సచివులతోడ నికన్! 21

ఆ సైన్యంబులు సంద్రము దాటిన యలరి మనకు ఘన విజయంబున్!
గలిగినదని మది నిశ్చయింపుమా! గలుగదింత సందేహంబున్!
నాదు సైన్యమంతా సముద్రమును నయముగ దాటిననైన మఱిన్
జయము లభించినదని నిశ్చయముగ చాటగ వచ్చును రఘురామా! 22

ఈ వాసరులందఱు శూరులు సుమ! యిన వంశోత్తమ! రఘురామా!
కామరూపమును గలవారును మఱి కనియందు బహు సమర్థులున్!
శిరోపాదములను వర్ణించుచు శీఘ్రముగా మన శత్రువులన్
నశిలప జేయుదు రిది సత్యము సుమ! నయముగ భయమింతయు లేకన్

శత్రు నిబర్హణ! శ్రీరఘురామా! సముద్రమును నే విధముగనో
'దాట గలుగుదుము' అని నా మదిలో దగ దోచుచు నున్నది మఱియున్!
యుద్ధము నందున రావణాసురుడు నుర్వియందు బడుననుచు మదిన్
దలచుచుంటినీ యూహాలహరిని దశరథరామా! సత్యముగున్! 24

బహు విధములుగా దెలుపగ నేలా? ప్రయోజనం బది యేల యికన్?
సర్వవిధములును జయము నిశ్చయము సార్వభౌమ! సంశయ మేలా?
మంచిశకునములు గనబడుచున్నవి మానుగ ప్రకృతి యందుననూ!
నాదు మనసు నుత్సాహ భరితమై నవ్యత్వంబును బొందినదీ! 25

(యుద్ధకాండమునందు ద్వితీయసర్గము సమాప్తము.)

* * * *

# యుద్ధకాండము - మొదటి భాగము

## మూ డ వ స ర్గ ము

(సుగ్రీవుని మాటలు వినిన పిమ్మట రాముడు లంకను ర్చి
సవివరముగా జెప్పుమని హనుమంతుని యనుగుట-అతడు జెప్పుట)

రఘుకుల తిలకుడు రామచంద్రుడును రమ్య యుక్తి యుక్తములైనా
సుగ్రీవుడు బలికిన పలుకులు విని సురుచిరముగ యాలించి మఱిన్!
పరమార్థములగు వాక్యము లనుచును బన్నుగ రాముడు గ్రహియి న్
ఆటుపిమ్మట హనుమంతుని తోడను నలరి బలికె యీ విధముననూ! 1

తపస్సుచేతను వారధి జేతను దగ సముద్రమును నెండించీ
అన్నివిధములను నీ సాగరమును నలరి దాటగల సమర్థుడన్! 2

పవనకుమారా! ఓ హనుమంతుడ! బన్నుగ దెలుపుము వివరముగా
ప్రవేశింపగా శక్యముగానీ బలీయమగు లంకాపురికిన్
ఎన్నిదుర్గములు గలవో దెలుపుము! సన్నిహితముగా సర్వమునూ!
కనులజూచినది వలె సమస్తమును గాంచ గోరుచును న్నాడన్! 3

సైన్యము యొక్కయు బరిమాణంబును సకల ద్వార దుర్గముల క్రియ
లంకానగరము రక్షణ కర్మను పొంకమైన యీ శిల్పమునూ!
రాక్షసగృహముల వీధుల చందము రమ్యమైన జీవితరీతిన్
యధా సుఖముగా యథా శక్తిగా యీ లంకను గాంచితివి గదా!
దానిసంతటిని జూచిన దానిని దగ దెలుపుము సంపూర్ణముగా
పండితుడవు మఱి సమర్థుండవును సకల శాస్త్రముల యందుననూ! 5

వాక్య విదులలో శ్రేష్ఠుండును మఱి వాయుపుత్రుడగు జావనియున్
శ్రీరాముని వాక్యములని వినియును శీఘ్రముగా నిటులను లలికెన్!
మధురవాక్యముల మధురాక్షరముల మంజుల ధ్వనితో విలసిల్లన్! 5

లంకా నగరము నెటులనున్నదో శంకలేక వినిపింతు నిదే!
దుర్గకర్మలా యేర్పాటులచే దులకించుచు నిర్భయ రీతిన్!

సైన్యంబుల రక్షణను బొందుచును సకల కళలతో నెటులుండెన్
విషయమంతయును దెలిపెద వినుమా! వివరముగా శ్రీరఘురామా! 7

రాక్షసులకుగల ప్రభుభక్తియునూ రావణు దేజస్సుల జేతన్!
లంకలోపలను గల సమృద్ధియును లావగు నుదధి భయంకరమున్!
సేనా సముదాయముల విభాగము స్థిర వాహనముల గేర్పాటున్

ఈ విషయంబుల నన్నిటి దెలివెద నింపుగ వినుమా రఘురామా!
అనుచు బలికి యా యాంజనేయుడును నాలంకను దా జూచినదీ
ఆ కపిశ్రేష్ఠుడు శ్రీరామునితో నలరి బలికె నీ విధముననూ! 8-9

మదించినట్టి గజములతోడను మఱి వ్యాకులమై యుండె నటన్!
రథములతో నిండినది మఱియునూ రమ్యమైన హయముల తోడన్!
రాక్షసగణములతో నిండినదై రమ్యమైన భవనంబులతో!
విశాలమగు లంకాపట్టణమును విమల శోభలను గూడికొనీ
సంతోషించుచు నున్న ప్రమదవలె సర్వ సౌఖ్యములతో నుండెన్! 10

విశాలమైనవి యతి పెద్దవియును విమలమైన శిల్పంబులతో
ఆ లంకాపట్టణము నందునను నలరును నాలుగు ద్వారంబుల్
దృఢమగు దలుపులు గలవియు మఱియును దృఢమగు గడియలతో గూడీ
బంధింపగబడియున్నవి రామా! బహు పదాతి దళముల గూడీ! 11

అపట గలవు బలమైన యంత్రములు నతి ఘనమగు కూర్పులతోడన్
ఆ యంత్రంబులు శిలల, బాణముల యతి వేగంబున వర్షించున్!
అచటికి వచ్చిన శత్రుసైన్యముల యా యంత్రంబుల సాయముతో
శత్రుసైనికుల నశింపజేతురు చయ్యన రావణు సైనికులున్! 12

సంస్కరింపబడి భయంకరమునగు బన్నుగ యినుప వికారములున్!
వాడియైన యాశతఘ్ను లచ్చట వందలకొలదియు గూర్పబడెన్!
రాక్షస గణములతో గూడను నట రక్షణకై ద్వారములందున్
ఆ యంత్రములను ప్రయోగించుటకు నట నుండిరి మఱి సిద్ధముగా! 13

అతి విశాలమగు లంకానగరము నతి దృఢమగు ప్రాకారంబున్
స్వర్ణ నిర్మితంబగు ప్రాకారము సువర్ణ కాంతులు జిమ్ముచునూ
ఆక్రమింపగా జాల రెవ్వరును నల దేవతలును రాక్షసులున్
మణి విద్రుమ వైడూర్య ముత్యముల మానుగ యలంకరింపబడీ
ఆశ్చర్యంబును నానందంబును నాప్రాకారము గలిగించున్! 14

ఆ ప్రాకారము చుట్టును గలవూ యతి భయంకరములును నైనా
శీతతోయములు గలవియు మఱియును శ్రీసుందరములు నగు నవియ
అతిలోతైనా పరిఖలు గలవూ యా ప్రాకారము చుట్టుగనూ
ఆ పరిఖలలో మీన మకరములు నలరి వసించును గుంపులుగా! 5

ఆ ప్రాకార ద్వారమున కెదురుగను బరిఖలపై బహు పొడవుగనూ
నాలుగు వంతెన లచట నున్నవీ నయముగ జనములు నడుచుటకున్
అనేక యంత్రము లమర్పబడినవి యా పరిఖల పైనను గూడన్
మహోన్నతంబగు గృహపంక్తులునూ మానుగ గల వచటను రామా! 5

పరసైన్యంబులు వచ్చిబడి నపుడు బన్నుగ రావణ సైన్యముచే
ఆ వంతెనలను రక్షించుచునూ యలరి యుందురతి జాగృతినీ!
ఆ యంత్రంబుల ప్రయోగించెదరు నా పరిఖల నలుమూలలనూ!
బాణ శిలాదుల వర్షించెదరూ బరగ వంతెనల రక్షణకున్!

ఆ నాలుగు వంతెనలను నొక్కటి యతి బలీయమై యుండునటన్!
బహు దృఢముగ మఱి కదల్పరానీ పర్వతమును వలె కన్పించున్!
అనేక బంగరు స్తంభములతో నలరు చుండు బహు వేదికలన్
ప్రకాశించుచుండును గన్నులకును బహు చిత్రముగా గనిపించున్!

రామా! రావణ రాక్షసు డిప్పుడు రయమున యుద్ధము జేయుటకున్
సన్నద్ధుండై యున్నవాడు సుమ! సకల బలంబులతో గూడీ!
భయమన్నది లే దతని మనస్సున బాధ యించుకయు లేదు సుమా!
సైన్యంబును దా బరీక్షించుచును సకలమైన బరివారముతో!
ఏమరి పాటును లేక యుండెనూ యిమ్ముల యుత్సాహము తోడన్

దేవదానవులు ప్రవేశించుటకు దీరత నా పురి జూచుటకున్
ఆధారం బేమియు లేదుగదా! యతి భయంకరం బైనదియున్!
లంకచుట్టు నది ప్రవహించుటచే నదీదుర్గమని పేరందెన్!
పర్వతములలో నున్నది గావున పర్వత దుర్గం బన బడియెన్!
వనముల మధ్యను నుండుట చేతను వన దుర్గంబని పేరందెన్!
కట్టిన ప్రాకారము లుండుటచే కృత్రిమ దుర్గం బనబడియెన్
ఈనాలుగు దుర్గంబులు లంకను నింపుగ చుట్టును గలవు సుమా! 20

శ్రీరామా! యా లంకానగరము స్థిరముగ బహుదూరంబుననూ
సాగరదక్షిణ తీరమునందున దగ నిర్మింపగ బడెను సుమా!
అచటికి బోవగ నౌకా మార్గము నగుపింపదు శ్రీరఘురామా!
వార్తలంపుటకు నవకాశంబును వార్తలందుటయు లేదుసుమా! 21

అమరావతితో సమానమైనది యా లంకాపురి రఘురామా!
శైలాగ్రంబున రచింప బడినది శ్రీ విలసిల్లెడి శోభలతో!
వాజి వారణములను గూడిన యా వన్నెల యా లంకాపురమున్!
జయింపజాలరు నెవ్వరైననూ జయింప జాలరు రావణునిన్! 22

దురాత్ముడగు నా రావణు నగరము దుర్భరమగు నా లంకకునూ!
అనేక విధముల యంత్రంబులనూ యలంకారముగ యున్నవి సూ!
సైన్యంబులతో నిండి యున్నదీ కాంతి కాంతి గనరాదుగదా! 23

ఆ లంకాపురమందు రాక్షసులు నచట తూర్పు ద్వారమునందున్
పదివేల్ సైనికు లచట యుండిరీ ప్రాంగణమును గాపాడుచునూ!
శూలహస్తులును, దురాధర్షులును శూరులైన యా సైనికులన్
ఖడ్గంబులతో సేనాగ్రంబుల కలగి రణము జేసెడి వారున్! 24

లంకలోని పదిలక్షల సైన్యము శంకలేక పడుసలు దీరి
దక్షిణద్వారమునందు సైన్యమును దగ లక్షకు పైగా నుండెన్!
ఆయుధ ప్రాణులు నట్టి యోధులను నతి భయంకరంబగు వారున్
చతురంగంబుల సైన్యము గూడుక యతిబలవంతులు నతిశ్రేష్ఠుల్
దక్షిణ ద్వారము సంరక్షించుచు దగ చతురత నుండిరి యచటన్ 25

లంకలోని పది లక్షల సైన్యము శంకలేక వరుసలు దీరి
పశ్చిమ ద్వారము సంరక్షించుచు బాహుబలాఢ్యులు నటనుండి
లంకానగరము సంరక్షించుచు నింపుగ కావలి గాయుచునూ
యుండి రచట సర్వాస్త్రకోవిదులు బండిచక్రముల వ్యూహములన్!

ఉత్తర ద్వారమునందు నుండిరి తత్తర బాటును లేకుండున్
కోటిమంది పైను రాక్షసు లచ్చట కూడియుండిరి రక్షణకున్!
వారలయందున రక్షకులు, వీరులు వరుస యశ్వములు గల వారున్
మాననీయులగు నుత్తమ కులజులు మహి నొప్పుచు నున్నా రచటన్!

మధ్య నున్న సేనాసమూహమున మఱి వందల వేల్ సంఖ్యలతో
ఎదిరింపగ శక్యంబుగాని యా కదము ద్రొక్కెడి రాక్షసులున్!
కోటికి మించిన రాక్షసు లచ్చట కూడియుండిరి రక్షణకున్!
శంకలేక నే నందఱ జూచితి చారు విక్రమోత్సాహమునన్! 2

రామచంద్ర! నే నా వంతెనలను రయమున గూల్చితి వీర్యమునన్
బరిఖల నన్నిటి నింపివేసితిని బాహుబలంబున్ శ్రీరామా!
లంకానగరము గాల్చివేసితిని శంకలేక ప్రాకారములును!
నశింపజేసితి! రాక్షసులందున సమముగ సైన్యము లోపలనూ!
ఒకభాగంబును నశింపజేసితి చకచక యిటకొచ్చితి మఱలన్! 2

ఏదో యేదో యొక మార్గముచే నిక సముద్రమును దాటుదమూ!
వానరులందఱు లంకాపురినీ వనరగ నశింప జేసిరనీ!
నిశ్చయించుకొనుమా! శ్రీరామా! నిజమిది నే జెప్పిన బలుకుల్! 30

ఓ రామా! మిగిలిన సైన్యముతో వనరగ బయోజన మేమి యికన్
అంగదుండు ద్వివిదుండు, మైందుడును నలరు జాంబవంతుడు మఱియున్
పనసుడు, అనలుడు, సేనాపతియగు బరగ నీలుడును రఘురామా!
గంతులు వేయుచు నెగురుచు బోయీ ఘనమగు బర్వతముల దోడన్

వనములతోడను బరిఖల తోడను వనరగ ముఖద్వారంబులతో
ప్రాకారంబులు, భవనంబులతో బన్నుగ నుండిన యాలంకన్

ధ్వంసముజేసి సీతామాతను దగ దేగలరు సుమా! రామా!
రాక్షసులందఱ నా యమపురికిని రయమున బంపుచు రతివేగన్! 31-32-33

సేనలనన్నిటి నొక్క చోటికిని శీఘ్రము జేరగ వేగముగా
ఆజ్ఞాపింపుము! దగిన ముహూర్తము నలరి దండయాత్రకు వేగన్!
నిశ్చయింపుమా! సుగ్రీవాదుల నిర్మల మతి యాలోచనతో!

(యుద్ధకాండములోని మూడవసర్గము సమాప్తము)

* * * *

## యుద్ధకాండము - మొదటి భాగము

### నాల్గవ సర్గము

(రాముడు వానరసైన్యముతో బయలుదేరి సముద్రతీరమునందు విడియుట)

మహాతేజమును గలవాడును మఱి మహావిక్రమము గలవాడున్
శ్రీరాముడు హనుమంతుని వాక్యము స్థిరబుద్ధిని యనుపూర్వముగన్
నాలకించి యటుమీదట బలికెను హనుమంతునితో నీ విధమున్! 1

భయంకరంబగు రావణురాక్షసు బన్నుగ లంకా నగరంబున్
శీఘ్రముగా కల్లోలము జేసెద చిత్తశుద్ధితో నే నింకన్
నిజము దెలుపుచున్నాడను వినుమా! నిర్మల మతి! ఓ పవనసుతా! 2

ఓ సుగ్రీవా! యీ ముహూర్తమున యొప్పుగ ప్రస్థానంబునకున్
తగిన సమయమని దెలుపుచుంటిని దగ నిశ్చయమును జేయు మికన్!
విజయమనను శుభ ముహూర్తం బిదే విజయమునకు దగినది సుమ్మా!
దివాకరుం డదె! తేజముతోడను దివి మధ్యంబున గలడు సుమా! 3

ఆ రావణుడును సీతను హరించి యల లంకకు బోవును గాకన్!
ప్రాణంబులతో బోగల డెచటికి బన్నుగ యెట దాగిన గూడన్

జానకి నా యభిమానంబును విని చయ్యన విషమును గ్రోలిన యా
పీడితుండు మరణించు సమయమున బన్నుగ యమృతము స్పృశించినా
రీతివోలె యా జానకి గూడను మదియందున యాశయు బొందున్!

నేడు ఉత్తరాఫల్గుని తారయు నిర్మలముగ శశితో గూడున్
రేపు హస్త నక్షత్రము గావున రిపుల జయింపగ సాధ్యమగున్!
సకలసైన్యమును గూడుక మన మిదె వికలము జెందక యీనాడే
బయలుదేరుదము దండయాత్రకును బన్నుగ లంకాపురి పైనీ!

ఏ శకునంబుల గాంచుచుంటినో యా శకునంబుల ఫలితమునన్
లంకను జయించి రావణాసురుని శంకలేక వధియించి మరిన్
జనకసుతను నే దేగల ననుచును మనసున దోచుచు నున్నదియున్!

పైభాగంబున నా నయనంబును బన్నుగ యదురుచు నున్నదిగా!
అందుచేత నా మనోరథంబును చందముగా నీడేరు నటుల్
విజయము జేకూరిన విధముననూ! విప్పిచెప్పినటులున్నది సూ!

అటుబిమ్మట సుగ్రీవుని చేతను నల బలవంతుడు లక్ష్మణుచే
సుపూజితుండును ధర్మాత్ముండును సురుచిర కార్యజ్ఞుండు నగూ
దశరథరాముడు మరలను బలికెను దగ సుగ్రీవుని దోడుతనూ!

మార్గంబును జూచుటకై నీలుడు మహావీరులగు వానరులన్
లక్షమందితో బయలుదేరవలె శిక్షణ గలిగిన సైన్యముతో!
మహాసేనకును ముందు నడుపవలె మానుగ మార్గము జూపుచునూ!

సేనాపతి! ఓ నీలా! వినుమూ! శీలవంత! నా మాటలనూ!
ఫలమూలంబులు గలది మరియునూ బన్నుగ చల్లని యుదవులనూ!
ఉదకంబులు గలదియును మరియునూ మధువులు గలదియు యైనట్టి
మార్గమునందున యతిశీఘ్రంబుగ మన సేనల నడిపింప వలెన్! 10

దురాత్ములగు నా రాక్షసాధములు దుష్టచిత్తులగువారు సుమా!
మార్గమందు జల ఫలోదకములను మలినము జేయుచు నుందు రటన్!

కావున మఱి నీ వెల్లప్పుడునూ కార్య తత్పరత జాగృతినీ
ఫలజల మూలాదుల కాపాడుము బరగ రాక్షసుల దుష్క్రియలన్! 11

వనదుర్గములంతున, వనములనూ వనరగ బల్లపు భూములనూ!
దుమికి యచట శత్రువుల సైనికులు దుష్టులుగలవారేమో యనుచున్!
పరిశీలింపగ వలె మనవారలు బరగ రాక్షసుల జాడలనూ! 12

దుర్బలమగు నే సైన్యమున్నదో దూరప్రాంతమును బయనింపన్
దుష్టరాక్షసులతో బోరాడగ కష్టము కద! మఱి వారలకున్!
కావున యా సైన్యము కిష్కింధను కలతలేక యుండగ వలయున్
ఎందువలన ననగా మనకార్యము చందము భయంకరము గాదా?
అవ్యక్రవిక్రమ పరాక్రమంబున యలనిపోక బోరాడవలెన్! 13

వందలకొలదియు వేలకొలదియును చందముగా కపిసింహులునూ!
సముద్రజల సముదాయముతోడను సమానమును భీమమునైనా
ముందు నడువవలసిన సైన్యంబును జంగక ధైర్యమునను గూడి!
నడిపింపగవలె సేనాపతులును నర్మిలి బహు క్రమశిక్షణతో! 14

గిరిసంకాశుండైన గజుడునూ కెవ్వున కేకలు వేయుచునూ!
మహాబలుడు గవయుడు గవాక్షుడును గర్వించిన ఋషభముల వలెన్
సైన్యము ముందఱ నడుచువారలై సాహసమును ప్రకటింపవలెన్! 15

వానరపతియును, వానరశ్రేష్ఠుడు వనరగ ఋషభుడు సనువాడున్
వానర సేనను దక్షిణ పార్శ్వము వనరగ సంరక్షించుచునూ!
నడుచుగాత! బహు జాగరూకతను నయముగ సేనను గాంచుచునూ! 16

మత్త గజమువలె దుర్ధర్షుండును మహాబలము గలవాడు మఱిన్
గంధమాదనుడు ననువానరుడును కదము త్రొక్కుచును సైన్యమునన్!
వామ పార్శ్వమును నధిష్ఠించునూ వనరగ సైన్యము గాచుచునూ!
నడుచుగాత! వానర వీరులునూ నయముగ గంతులు వేయుచునూ! 17

ఐరావతమును నింద్రు డెక్కినటు నలరి నేను ఉత్సాహముతో
హనుమంతునిపై యధిరోహించి నలరుచు సేనా మధ్యమునన్
ఉత్సాహంబును వృద్ధి జేయుచును నొప్పుగ బోయెద కపులారా!

అంత శోభనుండైన లక్ష్మణుడు నలరుచు యక్షుల ప్రభువైనా
కుబేరునకు వలె సార్వభౌమమను కుంజర మెక్కుచు బోయినటుల్
యంగదు నెక్కి వెడలుగాత! మఱి యతి యుత్సాహము దోడుతనూ! 1

భల్లూకంబుల రాజును మఱియును భవ్య బలాఢ్యుడు నగు వాడున్!
జాంబవంతుడును, వేగదర్శియును సుషేణుండు నను కపివీరుల్
యాముప్పురునూ సేనామధ్యము నలరుచు రక్షింతురు గాతన్! 2

రాముని మాటలు విని యంతటనూ రహి సేనాపతియును మఱియున్
మహావీరుడగు సుగ్రీవుండును మానుగ వానర వీరులతో!
రాముడు జెప్పిన విధమున జేయగ రయమున దా నాజ్ఞాపించెన్! 2

మహా తేజమును గలవానరులును మఱి సమస్త వానరగణముల్
గుహలనుండి పర్వత శిఖరములను కూరిమి యెక్కుమ్మడి లేచి
శీఘ్రముగా బైకెగిరి యందఱును శ్రీ రఘురాముని కార్యంబున్
జగిలి సేయగా నుత్సాహంబున దరుగని కార్య బటుత్వమునన్! 2

అటువిమ్మట సుగ్రీవుని జేతను నల లక్ష్మణుతో బూజితుడై
ధర్మాత్ముండగు రాము డంతటను దగ సైన్యముతో గూడికొని!
దక్షిణ దిశకును బయలు వెడలెనూ! దగ ధర్మంబును నిలుపగనూ! 23

అపుడా రాముడు గజబలంబుగల యలరెడి వానర బలగముతో
వందలు, వేలును, లక్షలు, కోటులు చందముగా చుట్టును జేరి
నడుచుచుండగా శ్రీ రఘురాముడు నయముగ దక్షిణ దిశకు జనెన్! 24

ఆ విశాలమగు వానర సైన్యము నగ్రభాగమున నడిచెడి యా
శ్రీ రఘురాముని యనుసరించుచును శీఘ్రముగా బోవుచు నుండెన్
సుగ్రీవునిచే బాలింపగబడు సురక్షితంబగు సైన్యంబున్
ఉత్సాహముతో సంతోషించుచు నుండిరి వానర వీరులునూ! 25

అంతట వానర వీరులందఱును నతి ఉత్సాహము దోడుతనూ!
ఎగురుచు, వలయముగా జుట్టుచునూ యిమ్ముగ బహు గర్జించుచునూ
సింహనాదములు జేయుచు నలుచుచు శీఘ్రముగా దుముకుచు వారున్
దక్షిణ దిశకును బయలుదేరిరీ దరుగని యుత్సాహము దోడన్! 26

సుగంధపూరిత మగు మధుపులనూ సురుచిర మధుర ఫలంబులనూ!
భక్షించుచు నా వానరవీరులు భవ్య మంజరీ పుంజములన్
ధరించుచుండిన మహావృక్షముల దగ మోయుచు బోయిరి వారున్! 27

గర్వించిన యా వానర వీరులు గలహించుచు నన్యోన్యంబున్
పైకి యెత్తి మోయుచు వారలనూ మరగ క్రిందికిని విసరుచునూ!
మఱికొందఱు క్రిందికిని దుముకుచును మఱల పైపైకి యెగురుచునూ!
మఱికొందఱు క్రిందికి సహచరులను మానుగ బడద్రోయుచు వారున్!
ఉత్సాహముతో నుండిరి వారలు నుల్లాసంబును మితి మీరన్! 28

రావణుండు జంపగ దగువాడను రజనీచరులను గూడ మఱిన్!
అనుచు వానరులు గంతులువేయుచు నా శ్రీరాముని దాపుననూ
గర్జించుచు నుండిరి హరివీరులు గలగల ధ్వనులు జెలంగగనూ! 28

ఋషభుడు నీలుడు, వీరుడైన యా కుముదుడు ననేక వీరులతో
సైన్యము నడిచే ముందు మార్గమును సరిజేయుచు నుండిరి వారున్
ఫలమూలంబుల జలముల గాంచుచు బరిశోధనలను జేయుచునూ! 30

శత్రువులను వధియించు వారలై జయమును మఱి సాధించుటకై
సుగ్రీవుండును రామలక్ష్మణులు శూరులైన వానరవీరుల్!
నడుచుచుండగా వారలతోడుత నయముగ సేనా మధ్యమునన్
ప్రయాణమును జేసిరి వేగముగా పన్నుగ యుత్సాహము మీరన్! 31

పదికోటులతో గూడిన వీరుడు బన్నుగ శతబలి యనువాడున్!
సమస్తమైనా వానర సేనను సంరక్షించుచు నుండె నటన్! 32

నూఱుకోట్ల బరివారము గలిగిన శూరుడు కేసరి, పవనుడునూ!
గజుడును ననేక వీరుల గూడిన కదన వీరుడగు నర్కుండున్!
ఒకవైపునగల సైన్య పార్శ్వమును వనరగ రక్షించుచు వారున్
ఉత్సాహంబును గొలుపుచుండిరి యురు గర్జనలను నెఱపుచునూ!

సుషేణుండు మఱి జాంబవంతుడును శూరులైన భల్లూకంబుల్
ఆవరింపగా బడిన వారగుచు నలరుచు రాజగు సుగ్రీవున్
ముందునుంచుకొని కదము ద్రొక్కుచును మోదముతో గర్జించుచునూ!
సేన వెనుకభాగము రక్షించిరి స్థిరమగు రక్షణ జేయుచునూ!

ఆ వానర వీరుల సేనాపతి యల వానర శ్రేష్ఠుండు మఱిన్
ఆత్మసంయమనమును గలవాడును నలరు ప్రాణులను శ్రేష్ఠుండున్!
అగు నీలుడు నా మహాసైన్యమును నలరి పర్యవేక్షించుచునూ!
బరిపాలించుచు నుండె నాతడును బటుతరమగు దీక్షాయుక్తిన్!

వలీముఖుండును, ప్రజంఘుండునూ జంభుడు, రభసుడు నను వీరుల్
వానరులంతట ముందు నడుచుచును వనరగ దిరుగుచు నలువైపుల్
తొందర బెట్టుచు బదపద మనుచును దొరముగా బోయిరి వారల్! 3

ఈవిధమున బలదర్పము దొరుల నిటు జెలరేగుచు బోయెడి యా
వానరశ్రేష్ఠులు గిరి శిఖాయుతము వనరగ పర్వత శ్రేష్ఠమునూ!
సహ్య పర్వతము గాంచిరి వారలు సరసుల పుష్పిత తామరలన్
తటాకంబులను గాంచిరి వారలు దన్మయులై ప్రకృతి యందున్ 35-3

సముద్ర జల సముదాయము తోడను సమానమగు భీమంబైనా
ఘనమగు నా వానరబలంబునూ ఘనమగు శ్రీరాముని యాజ్ఞన్
స్మరించుచును మనసున భయబడుచును చక్కని నగర సమీపంబుల్

జనపదంబులను వర్జించుచునూ జనుచును దూరముగా జనుచున్!
మహా ఘోరమును మహాధ్వనియు గల మహార్ణవముపగి సేనయునూ
ప్రయాణంబు గావించె నంతటను పెనుగాలిని ధర కదిలినటుల్ 39-40

శూరుత్తైన కపిశ్రేష్ఠు లందఱును సురుచిరముగ రఘురామునికిన్
పార్శ్వమునందున జేరితి వారలు బన్నుగ తోలగ బడినట్టి!
ఉత్తమాశ్వములవలె హరి వీరులు సురుకులు బరుగులు దీయుచునూ!
యెగురులు బెట్టుచు నరిగిరి వారలు దగ శ్రీరాముని బ్రక్కగనూ! 41

కపు లిద్దఱచే మోయబడుచునూ కదిలిపోవు యానరశ్రేష్ఠుల్
రెండు మహాగ్రహములచే ముట్టిన దండి వెలుతురులు గలిగిన యా
చంద్రభాస్కరుల వలె భాసించిరి సాంద్ర కాంతులను వినువీధిన్! 42

వానరరాజగు సుగ్రీవునిచే వినయ వంతుడగు లక్ష్మణుచే
సుపూజితుండై ధర్మాత్ముండగు శూరుడైన యా రాఘవుడున్!
ససైన్యంబునను దక్షిణ దిక్కుకు సరగున బోయెను వినువీధిన్! 44

అంగదు భుజమున గూర్చుండిన యా చెంగున బోయెడి లక్ష్మణుడున్
శుభకరమగు వాక్యమును బలికెనూ సురుచిరముగ శ్రీరామునితో!
పరిపూర్ణార్థము గలుగునట్లుగా పరమార్థము గోచరమగునటులన్
మధురాక్షముల మధుర వాక్యములు మానుగ బలికెను నేర్పిన్! 46

రఘురామా! రావణుని వధింతువు రయమున జయించి యాలంకన్
అపహరింపబడినట్టి జానకిని యలరి యందెదవు వేగముగన్
కృతకృత్యుడవై సమర్థమైనా యతి యైశ్వర్యము గలదియునూ
అయోధ్యకును మఱి బోయెదవు సుమా నఱరు ప్రజావళి హర్షింపన్! 46

రామా! భువి యాకాశమందునను రమ్య శకునములు గనబడుచున్
నీకు శుభంబులు గలుగు ననుచునూ నెమ్మది జూచుచు నున్నాడన్!
మంగళకరమును మృదువు హితంబును శృంగారంబగు వాయువులున్
సేవకు ననుకూలముగా వీచుచు చిత్తము హర్షము నొందెడినీ! 47

ఈ మృగ పక్షులు బహు వేడుకతో నింపుగ మధురములగు స్వనముల్
బలుకుచునున్నవి సకల దిశలుసూ బరగ నిర్మలముగా నుండెన్!
సూర్యుడు గూడను విమలకాంతులను సురుచిరముగ గనబడుచుండెన్!
వికసించెను పుష్పములు వృక్షముల విమల బరిమళము చిందుచునూ! 48

భృగుమహర్షి పుత్రుండగు శుక్రుడు దగ ప్రసన్నమగు కాంతులతో
అనుసరించి యున్నాడు సుమా! నిను నలరుచు గ్రహరాశిని రామా!
బ్రహ్మరాశిగల ధ్రువుడు గూడనూ పరిశుద్ధిగ నుండెను నిపుడున్!
సప్తఋషులు గూడను బరిశుద్ధులు సరసకాంతులను జిందుచునూ!
ధ్రువునికి బ్రదక్షిణముగా నరుగుచు దోరముగా నుత్తర దిశనూ! 48-4

మహాత్ములగు నిక్ష్వాకుల కులమున మానుగ జన్మించిన వాడున్
మన ముత్తాతయు రాజర్షియనగు మఱి త్రిశంకువును దన యెదుటన్
పురోహితుడు విశ్వామిత్రునితో బూర్ణకళలతో గూడికొనీ
ప్రకాశించుచుండెను శ్రీరామా! బరఘ శుభంబులు గలుగునటుల్! 5

విమల విశాఖా నక్షత్రంబులు నమల కాంతులను జిమ్ముచునూ!
ఉపద్రవము లేమియు లేకుండగ యున్నత బథమందున్నవియున్
మహాత్ములగు మన యిక్ష్వాకులకును మానుగ పూజిత మగునవియున్! 5

రాక్షసనక్షత్రంబైన మూలయును రహి దుష్టగ్రహముల జేతన్
ధోకచుక్కచే స్పృశింపబడుచును దోరము బీడింపగ బడుచున్
నిర్ఋతి దేవతగా గలిగిన యా నైఋతి మూలా తార మఱిన్
తపింపజేయగ బడుచున్నదిగా దరుగని వేదనలను గూడీ! 5:

వినుమిది యంతయు రాక్షసాధముల వినాశమునకును వచ్చినదీ!
మృత్యువు నాసన్నంబగు వారికి మఱి వారల నక్షత్రంబుల్!
మరణకాలముల దుష్టగ్రహముల మానుగ గూడుక యుండుగదా!
కావున రాక్షస వినాశకాలము కాలగతియు నిపు డొచ్చినదీ! 53

ఉదకంబులు మఱి ప్రసన్నములుగా నున్నవి రుచితో గూడికొనీ!
వనములు ఫలవంతములై యున్నవి వాయువులును సుఖ గంధములై
అధికముగా వీచుటలేదు గదా యలరుచుండె మృదుమధురముగా
ద్రుమము లన్నియును పూలు బూచినవి దోషము ఋతువుల లేకుండన్! 54

ఓ ప్రభు! వానర సైన్యములన్నియు యొనరగ వ్యూహములుగ జేరి!
పొందికగా నున్నవి కనుగొనుమా! పూర్వము దారకు వధయందున్

జరిగిన యుద్ధమునందున దివిజుల సైన్యములకు వలె నధికముగా
ప్రకాశించుచున్నవి యల్లవిగో! పన్నుగ సురుచిర కాంతులతో!
ఓ పూజ్యుడ యీ విధముగ నున్నా యీ శుభశకునములను గాంచి
సంతోషింపుము రామచంద్ర మది సరగున వదులు విచారంబున్!

సంతోషించిన సౌమిత్రియునూ సహోదరుని యోదార్చుచునూ!
పై విధంబుగను బలికి లక్ష్మణుడు బన్నుగ ధైర్యము జేకూర్చెన్!
అట్టి సమయమున వానర సేనయు నలరు నఖంబులు దంతములున్

ఆయుధములుగా గలిగినట్టి యా యలరెడి భల్లూకంబులచే!
భూమి నంతటిని హరి పీరులచే బొలుపుగ గప్పుచు వేవేగన్!
పయనించెను మఱి దండయాత్రకును బన్నుగ రావణు దునుమాడన్!56-57

కరాగ్రంబులను చరణాగ్రంబుల క్రమముగ యెగిరిన బరాగమున్!
సూర్యకాంతులను గప్పివేసెనూ బూర్ణముగా నింగిని వేగన్
పర్వతములచే వనముల చేతను బన్నుగ యాకాశము జేతన్
కూడిన లోకము గవబడకుండగ కూరిమి నింపెను నా రజమున్!

భయంకరంబగు నా సైన్యంబును ప్రబల మేఘసముదాయంబున్!
ఆకాశంబును గప్పినటులనూ యా దక్షిణదిశ గప్పుచునూ
బయనించుచు నుండెను వేగముగా బ్రబల రాక్షసుల దునుమాడన్! 58-59

అవిచ్ఛిన్నముగ యా హరి సైన్యము నలరి దాటెడి సమయమునన్
నదీ ప్రవాహములను మఱలుచునూ నయముగ యనేక యోజనముల్
వెనుకకు బోవుచు బహు చోద్యముగా వింతగ బ్రవహించిన వపుడున్! 60

నిర్మలోదకము గల సరస్సులను నిండిన వృక్ష సమూహముతో
గల పర్వతములు సమానమైనా గలిగిన యా ప్రదేశంబుల్
ఫలములతో నిండిన వనములునూ బరగ వీని యన్నిటి యందున్
మధ్యభాగమున నలువైపులనూ మానుగ యద్ధముగా మఱియున్!
క్రింది భాగముల నుండి యా సేన జిందుచు ప్రవేశమును నందెన్! 61

అరిభయంకరంబగు నా సేనయు నతి ప్రబలంబై నట్టిదియున్
మహీప్రదేశము నంతను గప్పుచు మానుగ బయలించెను వేగన్!
వాయు వేగమును గలవారందఱు వనర సంతసించిన వారై
పయనంబై పోయిరి హరి వీరులు బన్నుగ గంతులు వేయుచునూ!

రామ కార్యమును నిర్వర్తింపగ రమ్యముగా బలవీర్యంబుల్
ఆరోపింపగ జేసికొనుచునూ యలరు బలాధిక్యము వలనన్!
బరాక్రమంబును సంతోషంబును బరస్పరము జూపించుచునూ!
యౌవన యుద్రేకంబు వలననూ హరివీరులు మార్గము నందున్
అనేక విధముల వ్యవహారములను వనరుచు జేసిరి పొంగుచునూ! 6

వనవాసితులగు నా హరివీరులు వనరగ కొందఱు వేగముగా
నడిచిబోవుచుండిరి మఱికొందఱు నయముగ యెగురుచు బైపైకిన్!
మఱికొందఱు కిలకిల ధ్వనిజేసిరి మఱికొందఱు చలక్రిందులుగా
వ్రేలాడుచు వృక్షములు బట్టుకొని వింత చేష్టలను జేసిరటన్! 6

హరివీరులలో గొందఱు దోకల యఱచుచు నేలను జఱచుచునూ!
కొందరు ధీరులు తమ పాదములను చందముగా నేలను దట్టి!
కొందఱు తమ భుజములను విసరుచూ చిందగ శిలలను ద్రుమములనూ
విసిరి వేయుచును నానందించిరి వేగముగా బోవుచు వారున్! 6

బోవుచు హరివీరులలో గొందఱు బొలుపుగ పర్వత శిఖరములన్
అధిరోహించుచు బ్రబల నాదములు నాలపించుచును గొంతఱునూ!
మఱియు గొందఱును సింహనాదములు మానుగజేయుచు బోయిరటన్! 6

ఊరువు లవి వేగంబుల జేతను నున్నత లతా నికుంజములన్
నలిపి వేయుచుండిరి హరివీరులు నలరి యవయవంబుల చేతన్
ప్రబల పరాక్రములగు నా వీరులు బరగ శిలాద్రుమముల తోడన్!
క్రీడించుచు నుండిరి యా వీరులు కిచకిచ లాడుచు నడవులనూ! 68

అటు బిమ్మట నా భూమి యంతయును గిటకిట లాడుచు హరివీరుల్
వేలకొలది లక్షలకొలదియు మఱి కోట్లకొలది హరివీరులచే
శోభాయుక్తముగా గప్పగబడి సురుచిరముగ యుండెను ధాత్రీ! 69

ప్రబలమైన మఱి విశాలమగు నా బటుతరమగు నా వాహినియున్
దివారాత్రములు బయనించుచునూ దేజరిల్లుచుండిరి వారున్
సుగ్రీవుని రక్షణతో నుండియు సురుచిర యానందము తోడన్
ఉత్సాహముతో బోవుచునుండిరి యల యుద్ధోత్సాహము మీరన్!

సీతాదేవిని విడిపించుటకై స్థిరముగ దలచిన హరివీరుల్
ఎచ్చట గూడను ముహూర్త కాలము ముచ్చటగా నిలబడలేదూ!
శరవేగంబున బోవుచుండిరీ శాంతిలేక వారందఱునూ! 70-71

అటుబిమ్మట యా వానరవీరులు ననేక వృక్షములను గూడి!
యిరుకుగ నున్నదియును, ననేకముల నింపుగ పశు పక్షులగూడి!
నిండియుండినా సహ్య పర్వతము నింపుగ జేరెను సైన్యంబున్!
ఆ పర్వతమును నధిరోహించుచు నా కపిసైన్యము బయనించెన్! 72

రామచంద్రుడును రమణీయములగు రమ్య సహ్య పర్వతము మఱిన్
మలయ పర్వతపు ప్రకృతి దృశ్యముల మానుగ గాంచుచు బులకించెన్!
విచిత్రములునగు గాననములనూ విమలమైన నదులను దాటెన్
సెలయేఱులనూ జూచుచు మదిలో బులకించుచు వే బయనించెన్! 73

అటుబిమ్మట యాప్లవంగ వీరులు నా పర్వత మార్గము నందున్
చంపక వృక్షములను, దిలకములను ప్రసేక చూత సువృక్షములన్
సింధువారకములును, దిసిశములును శ్రీకరముగ కరవీరంబుల్
ఫల పుష్పాదుల గ్రహించుచును మఱి బన్నుగ మధువులు గ్రోలుచునూ! 74

అటుబిమ్మట యా వానరవీరులు నటగల యశోక వృక్షములన్!
కరంజు వృక్షములును మఱి యటగల ప్లక్ష మఱ్ఱి వృక్షంబులనూ
జంబుక-యమలక-నాగవృక్షముల జనిత పుష్పఫల మంజరులన్
గ్రహించి రంతట వానరవీరులు గలకల ధ్వనులను జేయుచునూ! 75

సుందరమగు నా చరియలపైగల సురుచిర కానన వృక్షములున్!
వాయువేగమున గదులుచు మెదులుచు వానర వీరులపైని వెస్తన్
పూవులు జివురులు బుష్పవృష్టిని బులకితులగునటు జల్లినవీ! 76

మధు గంధముగల వనముల యందున మధుర ధ్వనుల షట్పదము కో!
చందన శీతలమగు వాయువులను శరీరములకును సుఖస్పర్శన్
కలిగించుచు వీచుచు వానరులకు గడు మోదంబును గలిగించెన్! 77

పర్వతరాజగు సహ్య పర్వతము ప్రభువగు రాముని రాకడచే
హర్షమైనటుల తను భాసించుచు దన కడగల ధాతువులను వే
పరాగమును వెదజల్లుచు నంతట భవ్యమైన హరిసేనలకున్
స్వాగత రీతిని గప్పివేసెనూ సరసరీతి దన రేణువులన్! 76

రమ్యములగు గిరి చరియల యందున రమణీయములగు వృక్షములు
పుష్పించిన యా వృక్షంబులతో బూర్ణగంధముల దోడుతనూ
మొగలి డొంకలను మోదముతోడను సింధువార వృక్షంబులునూ
వసంత ఋతువున వికసించెడి యా వన్నెలు చిన్నెలు గలవియునూ!

మాధవీలతలు మల్లెదీగెలును మధూక వంజుల వకులములున్
రంజక దిలకములును జిరిబిల్వాలు నాగ చూత పాటలికములున్
కోవిదార ముచుకుందంబులునూ కుటజార్జున శింశుపములునూ

నవ వృక్షంబులు, బూరుగ చెట్లును హింతాలంబులు దినిశములున్
హారక నీపక ఎఱ్ఱగోరింట నీలాశోక సువృక్షములున్
సకలాంకోలా పద్మకంబులను సరసత జేసిరి వ్యాకులతన్!
ప్రముఖులగు వానరవీరులు పయనమందు నుత్సాహులునై 79 ౹

ఆ పర్వతమున దిగుచు బావులను నతిరమ్యముగా నటనుండెన్
చిన్న చెఱువులను శ్రీలు జిందెడి శ్రీకరముగ సరసులు నుండెన్!
వానియందు మఱి చక్రవాకములు వలనొప్పగ కారండములున్
నీటికాకులును గ్రౌంచపక్షులును నిర్మలముగ విహరించుచునూ!

వరాహంబులును, లేళ్లు, సింహములు భయంకరంబగు జిఱుతపులుల్
ఎలుగుబంట్లు మఱి పెద్దపులులునూ వలనొప్పగ భీకర గజముల్
నలుమూలల జలములను ద్రావుచును నయముగ సరసుల వసించుచున్
ఆశ్రయించుకొని యుండెను మృగములు పత్రిలుచుండెను శాంతముగా

పద్మంబులలో సౌగంధికములను బన్నుగ తెల్లని కలువలతో
నల్లని కలువలతోడ మఱియునూ నయముగ జల పుష్పలబులతో
ఆ సరస్సులటు నిండియుండెనూ నతి సౌరభములు జిందుచునూ
వానినిగూడను వానర వీరులు వ్యాకులంబు జేసిరి వేగన్! 85-87

మఱియు సహ్యాపర్వతపు చరియలను మానుగ యనేక విధములగా
పక్షిగణములును ధ్వనులు చేయుచును బరమానందము గలిగింపన్!
వానరు లంతట యా సరస్సులను పసరగ స్నానంబులు జేసి
తీయని యా యుదకముల ద్రావుచును దీరుగ క్రీడల వర్తిలుచున్!
శైల శిఖరముల నెక్కుచు దిగుచును శ్రీలు చిందు సరసుల యందున్
ఒకరినొకరు నీటను ద్రోయుచునూ నొనరగ సలిపిరి క్రీడ లటన్! 88-89

మదోత్కటులును వానరు లంతట మానుగ యటగల వృక్షములన్
అమృత గంధములు గల ఫలంబులను నతిరుచిగల బహుమూలములన్
కుసుమంబులనూ కోసిరి వారలు గోరెను వృక్షము గడకు జనీ!
ఈ రీతిని యాడిరి పాడిరి యట యింపుగ యుత్సాహము మీరన్! 90

తేనెవోలె పచ్చని శరీరములు దీరుగ గలిగిన వానరులున్
వ్రేలాడెడి యా తేనె తుట్టెలను విలవిల దేనెల రాల్చుచునూ!
ఆ తేనెల ద్రావుచును మురియుచును సలరి కిచకిచల జేయుచునూ!
సంతోషించుచు బోయిరి వారలు సహ్యా పర్వతపు చరియలపై! 91

ఆ వానర శ్రేష్ఠులు నట బోవుచు నలరుచు నటగల వృక్షములన్
విరుచుచు బోయిరి లతలను లాగుచు విహరించుచు నా కొండలపై
కొండల బండల నిటు నటు లాగుచు బిండి జేయుచును కపివీరుల్
బండల నటునిటు నెగుర వేయుచును చందశాసనుల వలె వారున్! 92

మధుధారలచే మత్తులైన యా మహావీరులగు వానరులున్!
ధ్వనులు జేయుచును దరుల నుండి దిగి తరలి వచ్చిరట వెలుపలకున్
కొండలు వృక్షంబులపై నెక్కిరి కోరికతో మధు ధారలకై
మఱికొండఱు నధికముగా ద్రావుచు మత్తిల్లుచు నుండిరి యటనూ! 93

పచ్చని శరీరములు గలిగిన యా బన్నుగ వానర వీరులతో
నిండిన యా వన భూమి యంతయును పండిన వరి చేలను ధరిణిన్
గప్పినట్లుగా గానిపించె నట కానన మంతయు నలరుచునూ!
పండి యొరిగినా వరిచేనుకు వలె నిండుగ కనిపించెను నచటన్! 4

అటు బిమ్మట రాజీవలోచనుడు నలరు బలాఢ్యుడు రాఘవుడున్!
మహేంద్ర పర్వతమును జేరికొనీ మానుగ వృక్షంబుల చేతన్!
అలంకరింపగ బడిన యట్టి యా యమల శిఖరమును దా నెక్కెన్! 5

అటు బిమ్మట యా దశరథాత్మజుడు నా రాముడు శిఖరము నెక్కి
కూర్మ మీనములచే నిండిన యా కూరిమి సలిలాకులమైనా
మహా సముద్రము జూచెను రాముడు మానుగ యాశ్చర్యము నందెన్! 6

వారంతటనూ వహ్యా పర్వతము వరుస మహా పర్వతమైనా
మలయ పర్వతంబును దాటుచునూ మానుగ వచ్చిరి దాపునకున్!
భయంకరంబగు ధ్వనులు గలిగినా బరగ సముద్రము జేరికొనీ!

ఆనందింపగ జేయువారిలో నతిశ్రేష్ఠుడు శ్రీ రాఘవుడున్!
సుగ్రీవుడు, లక్ష్మణులను గూడుక సురుచిరముగ పర్వతము దిగీ
సముద్ర తీరమునందు నుండినా సాంద్రమైన యా వనమునకున్
జూడగబోయెను సురుచిరముగ నా సుందర ప్రదేశముల వేగన్!

అటుపిమ్మట శ్రీరామచంద్రుడును హఠాత్తుగా లేచిన యట్టి!
జలసముదాయములను దరంగముల స్వచ్ఛమైన శిలలను గూడి!
నిండియుండినా సముద్రతీరము నిర్మలమగు మది గూడికొనీ
సమీపించి శ్రీరాముడు పలికెను సరసరీతి మృదు మధురముగా. 9

ఓ సుగ్రీవా! వినుా! మన మిప్పుడు వరుణాలయమును జేరితిమీ!
పూర్వమందు మన మనుకొనునట్టీ పొలుపగు నాలోచన యిపుడున్
సముద్రమును దాటుట యెటులంచును సాంద్ర యోచనను జేసితిమీ!
ఆ చింతయె యిపుడొచ్చి బడినదీ యాలోచింపుడు సఖులారా! 10

నదీ భర్తయగు నీ సముద్రమును నయముగ తీరమును లేదూ!
దీనిని యేదో యుపాయంబుచే దీరుగ దాటగ వలయు సుమా! 102

ఆ కారణమున యీ ప్రదేశమున నఖిల సేన నిలిచెది గాతన్!
ఈ వానర బలమును సముద్రమును నెటుల దాటగలదో వేగన్
అవలి యొడ్డుకు యెటుల జేరునో నాలోచింతము నుపాయమున్! 102

మహాబాహువులుగల వాడును మఱి మానుగ సీతా విరహముచే
కృశింపజేయగ బడినవాడునూ శ్రీ రఘురాముడు శీఘ్రముగన్!
సముద్రతీరము సమీపించుచును సరగున యిటు లాజ్ఞాపించెన్
'సేన యాగవలె' నంచు బలికెనూ సేనయంతయును వినునటులన్! 103

హరిపుంగవ! ఓ సుగ్రీవా! విను నలరుచు నా దగు బలుకులనూ!
సమస్తమైనా మనసేనలనూ సముద్ర తీరము నిలుపవలెన్!
ఇహ నిప్పుడు సాగరము దాటుటకు నింపుగ విషయము యోచింపన్
సమయ మొచ్చినది సహచరులారా! సాగింపుడు మీ యోచనలన్! 104

ఎవ్వండును మఱి తమ తమ సేనల చివ్వున విడువగ రాదు సుమా!
ఎటువైపునకును సేనను విడిచి చటులత బోవగ రాదు సుమా!
రహస్యమైనా భయ హేతువులును రహి మన కిచటను నుండు గదా!
సేనా నాయకులైన వానరులు శీఘ్రము బోవలె వేగముగన్!
తమ సైన్యంబును బరివేష్టించుచు దగు జాగ్రత గలిగుండవలెన్! 106

సహ లక్ష్మణుడగు సుగ్రీవుండును సరగున రాముని వాక్యములన్
విని వానర సేనల నన్నింటిని వేగము సముద్ర తీరమునన్!
వృక్షంబులతో గూడినట్టి యా విమల మహోదధి తీరమునన్
విడిదిజేయగను జేసిరి వారలు విమలమైన శ్రీరామాజ్ఞన్! 106

అటుపిమ్మట యా వానర శ్రేష్ఠులు నా సముద్ర తీరము నందున్
గల వనమున విడిదిని చేసిరిగా కామితార్థమును బొందగనూ!
అవలి యొడ్డుకు చేరుటకును మఱి యా రాక్షసులను మర్దింపన్
మదిలో గోరుచు నా హరి వీరులు మానుగ విడిదిని జేసి రటన్! 107

సాగర సమీపమున జేరిన యా సైన్యము వానర బలగంబున్!
తేనె వోలె పచ్చవి రంగును గల దీరుగ రెండవ సంద్రముగా
భాసించుచు నుండెను మఱి యచ్చట బన్నుగ కన్నుల బండువుగా 08

వానరు లందఱు విడిది సేయగా సైన్య సంచలన నాదములున్!
అటగల సంద్రపు మహానాదమును నంతర్ధానము జేయుచునూ!
సారి వీరుల కలకల ధ్వనులే యట విరివిగ వినిపించుచు నుండెన్! 09

మూడు భాగములుగా నట నుండిన మోదముతోని విభక్తములై
వానరములు మఱి గోపుచ్ఛంబులు వరుసను భల్లూకంబులునూ
సుగ్రీవుడు పాలించు చుండినా సురుచిరమగు వానర సేనల్
రాముని కార్యము బూర్తిచేయగా రహి నిశ్చయమును గలిగుండెన్! 10

ఆ హరిసేనయు మహార్ణవము దరి నలరుచు నట నిడిదిని జేసీ
వాయువేగమున యలల దెరలచే వరుసగ కదల్ప బడుచుండెన్!
కనుల గాంచి యా మహాసంద్రమును గడు సంతోషము నంది రటన్! 1

మారము నందున తీరము గలపియు భారమైన యలలను గలిగీ
విశాలమై రక్షో గణములచే వేడుక సేవింపగ బడెడీ
అబ్ధి వరుణ వాసమును గాంచుచును వానర వీరులు నందఱునూ!
అట నిశిచరి బహు మోదము తోడను నలల దెరలనూ గాంచుచునూ! 2

భయంకరబగు మొసళ్ళ తోడను బలురకముల జలచరములతో
ఆ దివసాంతమునందు సంధ్యలను ననంతమగు నురుగుల చేతన్!
హసించుచున్నట్లుండె సముద్రము నలరెడి తరంగముల చేతన్!
నృత్యము జేయుచు నున్నట్లుండిన నెలత వోలె గనబడుచుండెన్!

ఆ చంద్రోదయ సమయమునందున నలరుచు బొంగెడి సంద్రమునన్!
అనేక కోటుల చంద్రబింబములు నా జలముల గనబడుచుండెన్!
మహావాయువుల వంటి మకరములు మానుగ తిమి తిమింగములున్!
వ్యాప్తమైన యా మహాసంద్రమును వానరవీరులు గాంచుచునూ! 1

ప్రజ్వలించు బహు బడగలు గలవగు బహు సర్పంబులు గలదియునై
ఆసంద్రంబున మహాసత్త్వములు ననేక పర్వతములు గూడన్!
మునిగి యుండె జలరాశి లోపలను ముద్దుగ పసిపాపల వోలెన్!
ప్రవేశింప శక్యముగానిది మఱి బహు యగాధమై యొప్పునదీ! 115

మొసళ్ళచేతను సర్పంబులచే మునిగి యున్న జలరాశులునూ!
వాయువుచేతను గదల్పబడుచును వసరగ యలల సమూహములున్
పైకిపైకి యెగురుట గాంచుచునూ బన్నుగ ప్లవంగ వీరులునూ!
సంతోషించుచు నానందించిరి వింతగ యుదధిని గాంచుచునూ! 116

అగ్ని చూర్ణమును జల్లినట్లుగా నా సముద్రమున నటులుండెన్!
ఆ సముద్రమున పైభాగంబున యలరుచుండె నక్షత్రంబులయూ!
ప్రతిబింబంబులు గనబడుచుండెను బన్నుగ ముత్యంబుల వోలెన్!
మహాసర్పములు గల యాసంద్రము మఱి రాక్షసులకు నిలయంబై
పాతాళము వలె భయంకరముగా బరగ కపులకును గనిపించెన్! 117

సాగరంబు నాకాశము వలెనూ సరసత గనబడుచుండె నటన్!
ఆకాశము సాగరము వోలెనూ నలరుచు గనబడుచుండె మఱిన్!
సాగర మనియును నాకాశంబని దగభేదము లేకుండగనూ!
గనబడుచుండెను నీలి వర్ణముగ గగనము సంద్రము నేకముగన్! 118

సముద్ర జలములు నాకాశముతో నాకాశము సంద్రము తోడన్
గలిసి పోయెనూ చూడ ముచ్చటగ చూడ్కికి నటు గనబడుచుండెన్!
నక్షత్రములను నిండిన గగనము నయముగ రత్నంబుల చేతన్
నిండిన సంద్రము సమతుల్యములై రూపము నొకటిగ కనిపించెన్! 119

సముత్పతిత మేఘంబులు గలిగిన సరసత యాకాశంబునకున్
తరంగ పంక్తులతో వ్యాకులమగు దగ మహాసముద్రంబునకున్
భేదము లేకున్నట్లుగ నుండెను భీకరమగు నా రెండిటికిన్! 120

అన్యోన్యంబును గలిసికొన్న యా యలరు సముద్ర తరంగములున్!
భయంకరంబగు ధ్వనులతోడ మఱి బన్నుగ యాకాశము నందున్!
మహాభేరి మ్రోగించిన విధమున మానుగ గనబడె నచ్చటనూ! 1

మహాత్ములగు నా వానరులందఱు మానుగ గాంచిరి సంభ్రమునూ!
రత్నంబుల సముదాయము తోడను రమ్య జలధ్వని సంఘముతో
ధ్వనులు జేయుచున్నదియును మఱియును దగ వాయువులను మిళితం
కోపించినదిగ యాసముద్రమును కూరిమి పైకెగురుచు నుండెన్!

జలజంతువులను నిండినట్టి యా జలరాశిని వాయువు చేతన్!
కొట్టబడిన రీతిని గనబడుచును నట్టిటు నూగు దరంగములన్!
అనిలోద్ధూతము లైన తరగలును నాకాశమునకు నెగురుచునూ!
ఏవో మాటలు బలికినట్లుగా వింపుగ గనబడుచుండె నటన్! 122-12

పైకిలేచినా తరంగధ్వనులను బన్నుగ మహా సముద్రంబున్
కదిలిపోవుచున్నట్లుగ నుండెను కన్నులబండువు జేయుచునూ!
అట్టి సముద్రము గాంచిరి కపులును నాశ్చర్యము మది జెందుచునూ!
దాటులెట్టులో యని చింతించుచు దరుగని వేదన జెందుచునూ! 12

(యుద్ధకాండమునందు నాల్గవ సర్గము సమాప్తము.)

* * * *

# యుద్ధకాండము - మొదటి భాగము

## ఐ దవ స ర్గ ము

విధివిధానముగ నీలుని చేతను యథావిధిని రక్షింపబడీ
సావధానముగ గూర్చబడినదియు సకలసేన యా తీరమునన్!
ఉత్తరప్రాంతమునందు నిలువ బడె తత్తరపాటును లేకుండన్!
సేనాపతి యా నీలుడు సేనను స్థిరముగ బాలించుచు నుండెన్! 1

వానర పుంగవుడైన మైందుడును వరుసను ద్వివిదుడు నిరువురునూ!
రక్షణార్థమై సకల దిశలనూ రమ్యముగా రక్షించుచునూ
సంచారము గావించిరి వారలు మించిన మేధా సంపదనూ! 2

నదనదీపతీ యగు సముద్రునకు నయముగ తీరమునందుననూ!
వానరసేనయు నిలిచియుండగా నిర్మలగతి శ్రీరాఘవుడున్!
ప్రక్కననిలిచిన సుమిత్రనందను బన్నుగ యా లక్ష్మణుతోడన్
ఈరీతిని బలికెను వేదనతో నిమ్ముగ గద్గద స్వరముననూ! 3

గడుచుచున్న కాలముచే లక్ష్మణ! గతించు శోకము ననుచు మఱిన్
పెద్దలు బలుకుచు నుందురు జగతిని సిద్ధము శాస్త్రములందు మఱిన్!
కానీ నా ప్రియురాలు బాపునను గనబడకుండుట చేత మఱిన్
నా శోకము నిల రోజురోజుకును నయముగ వృద్ధిని బొందుచునూ
బీడించుచు నున్నది లక్ష్మణ! నను బెల్లుగ సంద్రపు సలలవలెన్! 4

నా ప్రియురాలగు జానకి లక్ష్మణ! నయముగ దూరము నుండెననీ
దుఃఖించుటయును లేదు సుమా! మఱి దురపిల్లుటయును లేదు గదా!
రావణుచేతను హరింపబడెనని రహి నే జింతించుట లేదూ!
ఆమె వయస్సును దాటుచున్నదని యనియే నే జింతిలుచుంటిన్

నాయన! వాయువ! గాలివీచుమా నయముగ నెమ్మది నెమ్మదిగా
నాప్రియురా లే వైపునున్నదో నయముగ స్పృశించి ననుగూడన్
స్పృశింపుమా! ప్రియురాలి స్పర్శయను శీఘ్రము నే పొందెదనుగదా! 5

ఆమె జూచినా పూర్ణచంద్రునీ యలరి నేను జూచుటచేతన్
ఆమె చూపులకు నా చూపులకును నలరెడి సంబంధము గలుగున్!

హరింపబడుచున్నట్టి సమయమున యా ప్రియురాలును 'హా! నాథా!'
యనుచు బలికినా పలుకులు నామది యలలవోలె ఘూర్ణిల్లుచునూ!
త్రాగబడిన విషమును వలె నామది తల్లడిల్లి జేయుచు నుండెన్!
నా సర్వాంగములను లక్ష్మణ! విను రహ దహింప జేయుచు నుండెన్!

ఆమె వియోగం బనియెడి కట్టెలు నామెను గూర్చిన చింతయనే
నిర్మలమైనా జ్వాల గలదియగు నిత్యము మన్మథ జ్వాలలనూ!
రేయింబవలు నా శరీరమును రివ్వున దహింప బడుచుండెన్!

సౌమిత్రీ! నీవును లేకుండగ సముద్రమునను ప్రవేశించీ!
నిదరబోయెదను గాఢముగా మఱి నిర్మలమతి నే నీ రీతిన్!
జలమునందు నిద్రించిన నన్నిక జ్వలించుచుండిన కామమునూ!
దహింపకుండగ నుండునేమొ మఱి దగ ప్రీక్షింతము దగు రీతిన్!

నేనును మఱి యా సుందరి జానకి నిజముగ యొక ధరణిని నిలిచీ!
యుంటిమనే యా ప్రబల సత్యమే యుంటిని నే నీ ప్రాణములన్!
కామాతురుడను నైన నాకు నిదె ఘనమగు విషయము సౌమిత్రీ!
దీనివేళ నే జీవించుటకును దీప్తి నిచ్చుచున్నది నిజమున్! 1

జానకి జీవము తోడ నున్నదని సరసముగా వినుచున్నానో!
నీరములేనీ కేదారంబును రరముగల వరి చేను మఱిన్
దాపుననుండీ తడుపుట చేతను దగ ప్రాణముతో నుండి నటుల్
నీరులేని వరిచేనుకు వలెనే నిలిచియుంటినీ జీవముతో! 1

శత్రువులను నే వధించి వేగము సరగున సుశ్రోణియు నైనా
శతపత్రాయుత చారునేత్రయగు శశిముఖి యగు నా జానకినీ!
రాజ్యలక్ష్మివలె నున్నదియును మఱి రమ్యకాంతులును గల సీతన్!
ఎన్నడు గాంతునొ యేమో లక్ష్మణ! యెన్నడు గాంతునా! జనకసుతన్? 1

సుదారు దంతోష్ఠములును గలదియు సుపద్మంబువలె యాననమున్!
గలిగియున్న నా ప్రియురాలిని నే గాంచెదనో గద! సౌమిత్రీ!
సుందరమగు నా జానకి ముఖమును సురుచిరముగ కొంచెము నెత్తి
రోగి రసాయనమును ద్రాగినటుల రూఢిగ నే ద్రాగుదునా కదా! 13

నవ్వుచున్న ప్రియురాలి ముఖంబును నయముగ జూతునా సౌమిత్రీ!
తీయని పలుకుల నెపుడు విందునో దీరుగ నా సమ్ముఖమందున్!
కోకిలవలె సంగీత రవళితో కొసరి పాడునో సౌమిత్రీ!
నెమ్మినోరె నర్తనము జేయునో నిండుగ నా మది పులకింపన్! 14

నల్లని నేత్రములు గలదియును నాథుడనగు నే నుండగనూ!
ఆ జానకి రాక్షసుల మధ్యమున యల నాథుడు లేనిదియు వలెన్!
దుఃఖము దోడుత వేదన బొందుచు దురపిల్లుచు నున్నది నేడున్! 15

జనకరాజు ప్రియమైన దుహితయును సకల ధర్మముల నెఱిగినదీ!
మహావీరుడగు రాముని సతియును మదుర భాషిణియు నైనట్టి
మహారథుండగు దశరథు కోడలు మఱి రాక్షస స్త్రీలకు మధ్యన్!
ఏ విధముగ శయనించు చున్నదో యెటుల జీవితము గడిపెడినో! 16

శరత్కాలమున చంద్రలేఖ వలె సరగున నల్లని మేఘములన్
తొలగద్రోసికొని వచ్చినట్లుగా దోరముగా జానకి గూడన్
క్షోభింపగ శక్యంబుకాని యా క్రూర రాక్షసుల దూరముగన్!
దొలగద్రోసి పైకిని రాగలదూ తోరముగా జయలక్ష్మి వలెన్! 17

స్వభావంబు జేతను సన్నముగా సరసిజాక్షి జానకి యుండున్!
దేశకాలముల వైపరీత్యమున దీనత్వంబున శోకమునన్!
ఉపవాసంబుల జేతను మఱియును నుగ్రరాక్షసుల బాధలకున్
మఱియును జానకి స్రుక్కియుండునూ మనసున బొంగిన వేదనలన్! 18

రాక్షసేంద్రునీ వక్షస్థలమున రయమున సాయకముల నుంచీ
మనస్సునందున శోకము విడిచీ మాపి రాక్షసుల నందఱినీ

జనకసుతను నే నెప్పుడు మరలను జాగుసేయకను దెచ్చెదనో!
అయోధ్యకెన్నడు బయని మగుదుదమో యలరి సుఖంబులనందుదుమో

పతివ్రతయునూ, సురసుతోపమయును సుందరి నా జానకి మరలన్
పరమ వేడుకను గూడికొన్నదై బన్నుగ నా దృఢ కంఠంబున్
కౌగలించుకొని మృదు హస్తంబుల దగ యానందజ జలంబులన్
విడుచునో గదా! నా చెలి! నా సఖి! విమల హర్షమును నే నందన్!

లక్ష్మణ! మైథిలి వియోగంబునను మానుగ గలిగిన శోకమునన్!
మాసిన వస్త్రము విడిచినట్లుగా మానుగ విడిచెదనో నేనున్!

ధీమంతుడగు రామచంద్రుడును దీనత విలపించుచు నుండన్
దినక్షయము నగుచుండగ రవియును దీనత మంద శరీరుండై
భాస్కరుండు నస్తాద్రిని జేరెను బహు తేజము క్షీణింపగనూ!

పద్మపత్రముల వంటి నేత్రములు బన్నుగ గలిగిన జానకినీ!
స్మరించుచును వ్యాకులతను బొందిన సరసిజాక్షుదగు రాఘవుడున్
లక్ష్మణుండు నోదార్చెను ధీరత లలిత లలిత మృదు వచనములన్!

(యుద్ధకాండములోని 5వ సర్గము సమాప్తము)

* * * *

# యుద్ధకాండము - ప్రథమ భాగము

## ౧వ సర్గము

[లంకలో రావణుడు రాక్షసులతో ఆలోచన జేయుట]

మహాత్ముడగు నా హనుమంతుడును మానుగ దేవేంద్రునకు వలెన్!
లంకయందు జేసిన భీమంబగు లావగు కర్మల వీక్షించీ!
సిగ్గుబడినవాడై రావణుడును స్థిర ధైర్యంబును లేకయునూ
అవాఙ్ముఖుండై మంత్రులతోడను నలసటతో నీవిధి బలికెన్! 1

వానర మాత్రుండైన వానిచెచే వరుసను లంకను నెదిరించెన్
సహింప శక్యముగాని లంకలో సరసత ప్రవేశ మొనరించెన్!
జనకరాజ తనయను వైదేహిని సరసత గాంచెను నిర్భయతన్!
లంకాపురినీ తగులబెట్టి మఱి బింకముతో జనె తనదారిన్! 2

ఆ హనుమంతుండు మహాసంద్రమును నలరుచు దాటి యిటకొచ్చెన్!
చైత్య ప్రాసాదమును, భవనముల జేసెను విధ్వంసము గాగన్
శ్రేష్ఠులైన మన రాక్షస వీరులు నష్టములందిరి ప్రాణములన్
లంకాపట్టణ మంతయు గూడను కంకాళము జేసెను వాడున్ 3

మీ కందఱికిని మంగళ మగుతను మీకు శుభంబులు నగుగాతన్!
ఏమి చేయవలెనో నే నిప్పుడు నెటుల ప్రవర్తింపగ వలెనో!
ఏది యుక్తమో! యేది హితందో నింపుగ దెలుపుడు వివరముగా! 4

మహా బలముగల వీరులార! మఱి మానుగ నా మాటలు వినుడూ!
మంత్ర మూలమున విజయ సిద్ధి యని మనస్వినులు దెలుపుదురు గదా!
అందువలన యా రాముని గురించి యాలోచింవుడు వివరముగా! 5

లోకమందు నుత్తములు, మధ్యములు లోలత యధములు నుండెదరూ!
త్రివిధములగు పురుషులు విల నుందురు దీరుగ వారల చేష్టలనూ
గుణదోషంబుల గూర్చి దెలిపెదను గూరిమి వినుడో సఖులారా! 6

హిత సంయుక్తులు మంత్ర నిర్ణయము మతి నిర్ణయమును జేయుటలో
సమర్థులైనా మంత్రులతోడను చక్కగ యోచన జేయుచునూ!
ఒకే విధమునగు ప్రయోజనంబును యొద్దికగల మిత్రుల తోడన్!
అధిక సంఖ్యలగు బంధులతోడను నాలోచించియు కార్యములన్
ఆరంభంబును జేయునో మఱియు నలదైవము ననుకూలముగా
కార్యసిద్ధికై యత్నము జేయునొ కార్యశూరుడని పించుకొనున్!
అతడే పురుషులలో నుత్తముడని యలరి బలుకుదురు బండితులున్!

ఒంటరివాడై కార్యము గూర్చి జంటలేక మఱి యెవ్వండున్
విమర్శించునో యొంటరి వాడై విమల ధర్మ నిర్ణయమందున్!
ఒంటరిగానే కార్యములందున జంటలేక జేయుచు నుండున్!
అట్టి పురుషునీ మధ్యము డందురు గట్టిగ వివరింతురు బెద్దల్!

గుణదోషములను నిశ్చయింపకను గూరిమి మిత్రుల బంధులతో
ఆలోచింపక యన్ని విషయముల యల దైవ సహాయము నొదిలీ
కార్యంబుల మఱి జేయుచుండునో కలహించుచు దూషించుచునూ!
అట్టివాడు మఱి నరాధముండని గట్టిగ పెద్దలు బలుకుదురూ! 1

పురుషులలో నుత్తములు మధ్యములు బొలుపుగ యధములు నున్నటులన్
మంత్రంబులలో గూడ నుత్తమము మధ్యమంబు నధమంబులనీ!
మూడు విధములగు భేదము లున్నవి ముదముగ విజ్ఞులు దెలియదగున్. 1

శాస్త్రమందు జెప్పిన విధానమును సరసత ననుసరణము జేసీ
ఐకమత్యమును నంది మంత్రులును నలరుచు నే యోచన యందున్
స్థిరముగ నుందురొ యా మంత్రంబే స్థిరమని యత్తమమని యంద్రూ! 12

అనేకవిధముల యాలోచనలను నలరి యుండినను మంత్రులలో!
చివఱికి యేకాభిప్రాయంబును జేరినటులయిన వారలలో
ఆ మంత్రము మధ్యమమని యందురు నలరి బలుకుదురు బండితులున్! 13

ఎవరికి వారే వేఱువేఱుగను నేకాభిప్రాయము లేకన్
అభిభాషింతురొ యనేక విధముల యైకమత్యమును లేకుండన్!

కలహించుచు నుందురొ కార్యములను కలిసి మెలిసి వర్తింపకనూ!
ఆ మంత్రము నధమమునని యందురు నల బండితులును శాస్త్రములన్!14

అకారణమున మతిమంతులు నగు నలరు బుద్ధిమంతులు మీరున్!
సుమంత్రితంబగు మంచికార్యమును శోధింపుడు మీరలు మంత్రుల్
మీరు దెలిపినా కార్యంబును నే మీరిన భక్తిని సమ్మతితో
అలరిజేయుదును బంధువులారా! యాలసింపకను వేగమునన్! 15

ఆ రాముడు బహుధీరులైన యా యతి బలవంతులతో గూడి!
వేలకొలది కపివీరుల తోడను గలిసి మనల నెదిరించుటకై
లంకాపురికిని వచ్చుచు నుండెను శంకలేక పోరాడుటకై 16

రాఘవు డిప్పుడు దగిన బలముతో రయమున దమ్మునితో గూడి!
సైన్యము తోడను గూడిన వాడై సరగున యనుచరులను గూడి
వచ్చుచు నుండెను వనధిని దాటును వచ్చును లంకను జయింపగన్
మీ మీ యాలోచనలను దెలుపుడు మీరిన మేధా సంపదతో! 17

సాగరమును నెండింపగ వచ్చును సాహస పరాక్రమము జూపి!
మఱి యేమైనను జేయగ వచ్చును మానుగ వినుడో సఖులారా!
వానరవీరులతో గూడను మఱి వనరగ వచ్చెను విరోధమున్!
ఇట్టి విషమ సమయంబున మీరలు గట్టిగ మది యోచింపు డికన్!
నా లంకకు మఱి నా సైన్యమునకు నయముగ యేది హితం బగునో!
అట్టి కార్యమును నాలోచింపుడు నాత్మరక్షణకు మార్గంబున్! 18-19

(యుద్ధకాండములోని ఆఱవ సర్గము సమాప్తము)

★ ★ ★

## ఏడవసర్గము

[రాక్షసులు తమ తమ బలములను ప్రకటించుచూ ఏమాత్ర ము దిగులు జెందవలసిన పనిలేదు అని రావణునకు దెలుపుట]

రాక్షసేంద్రు డా విధమున బలుకగ రహి ఘన బలములు గలవారున్
నీతిబాహ్యులును బుద్ధిహీనులును నతి దంభంబును గలవారున్
ఆ రాక్షసు లందఱు నంజలితో నరి బలమును దెలియని వారున్!
ఆ రావణుతో నీవిధి బలికిరి నరయక భావి పలాఫలముల్! 1

ఓ రాజా! పరిఘలు శక్తులునూ యొనరగ పట్టిస, శూలములున్
ధరించినట్టి మన సైన్యంబులు దగ ఘనమగునవి లోకమునన్!
ఎందువలన నిటు దిగులు జెందెదవు నీ విషాదమును నీ కేలా? 2

పాతాళమునకు నీవు బోయి మఱి పన్నగులను యుద్ధమునందున్!
జయించితివిగద! కైలాసమునకు సరిత వేగమున బోయినటుల్
అనేక యక్షుల బరివారముగల యా కుబేరు నిర్జించితివీ!
మహాబలాఢ్యుల రణరంగంబున మానుగ లొంగగ జేసితివీ! 3

మహేశ్వరునకును స్నేహితుండనని మానుగ గర్వించెడి వాడున్!
మహాబలుండును లోకపాలుడును మఱి యా ధనదుని కోపించీ
ఘనపరాక్రమము జూపి యుద్ధమున కానలకును బంపితివి గదా! 4

యక్షుల సముదాయము నిర్జించీ యవల జేసి మఱి వారలనూ!
క్షోభింపగ జేసియు బంధించియు క్షోణీతలమునకును నీవున్
ఈ విమానమును గొనితెచ్చితివీ సిలపై సాటెవ్వడు నీకున్?

దానవకుల ప్రభువైన మయుండును దగ నీకును భయబడుచు మఱిన్
నీతో మైత్రిని స్థిరముగ గోరుచు నిజ దుహితను మండోదరినీ
అర్ధాంగినిగా పాణి గ్రహణము నలరుచు జేసిన వాడు గదా!

మహాబాహు! దానవులకు ప్రభువును మహా పరాక్రమ వంతుడునూ!
వీర్యముచే గర్వించిన వాడును విపుల సైన్యములు గలవాడున్!
నీ సోదరి కుంభీనస భర్తయు నిర్జర వైరియు నగువాడున్!
అట్టిమధువునూ జయించితివి గద! యిట్టి యుద్ధమున బోరాడి! 8

మహాబాహు! ఓ అవక్ర విక్రమ! మానుగ రసాతలంబునకున్
జైత్రయాత్ర మఱి సలిపినావుగద! జయమును బొందినవాడవుగా!
వాసుకినీ, మఱి పక్షకు శంఖుని వనరగ జటినీ మర్దించి
వశము చేసికొంటివి రాజా! మఱి వనరగ సాటెవ్వడు నీకున్?

అరిమర్దన! ఓ రాక్షసరాజా! నలరుచు నొక సంవత్సరమున్
రణభూమిని యుద్ధంబును జేసీ యక్షయులును బలవంతులునూ!
లబ్ధవరంబులు గలవారును మఱి లావు శూరులగు దానవులన్
నీబలంబుచే వశము జేసికొని నిర్జించితివీ కదనమునన్
వారినుండి నీ వనేకమాయలు వనర నేర్చికొంటివి గాదా! 10

మహాభాగ! శూరులు, బలవంతులు మానుగ నాలుగు విధములగూ!
సైన్యము గలిగిన వరుణ పుత్రులను సలలితముగ యుద్ధము నందున్!
జయించితివి గద! మహా వీరుడా! జయ జయ ధ్వనులును జేయగనూ!
అట్టి నీకు భయమేల ఓప్రభూ! యిట్టి చింత మది యేల విభూ! 12

రాక్షసేంద్ర! మా మాటలు వినుమా! రణమున నీతో సరిలేరూ!
యమలోకమనే మహా సంద్రమును యముని సైన్యమను సాగరమున్!
ప్రవేశించి విజయము సాధించీ బన్నుగ యమునిని గూడ మఱిన్!
పారిపోవునట్టులను జేసితివి ప్రబలమైన నీ బలములతో! 13-14

అట్టి సముద్రము యమదండమనే గట్టి మొసలినీ గూడియునూ
శాల్మలి వృక్షాకారముతోడను చలించు నాయుధముల తోడన్
కాలపాశమను ఘన తరంగమును గలదియు, యమకింకరులు అనే
మహాసర్పములు గలదియు మఱియును మహాభయంకరమై యచటన్
జ్వరదేవత యటనుండుట జేతను జయింప శక్యము గానిదియై
అట్టి సంద్రమును ప్రవేశించియును నలరుచు విజయము గాంచితివీ!

# యుద్ధకాండము-మొదటి భాగము

## ఎ ని మి ద వ   స ర్గ ము

[ప్రహస్తాదులు తమ బలమును ప్రశంసించుకొనుచు "రామాదు(లను)
జంపి వేసెదము" అని చెప్పి రావణునకు ధైర్యమును జెప్పుట]

అటుపిమ్మట శూరుడు సేనాపతి యగు నీలిమేఘంబులతో
సమానుడైనా ప్రహస్తుండు మఱీ సాహసవంతుడు రాక్షసుడున్
ప్రాంజలితో రావణునకు మ్రొక్కుచు బన్నుగ యీవిధమున బలికెన్!

మహారాజ! యుద్ధములో నీవును మఱి దేవతలను దానవులన్!
గంధర్వులనూ, పిశాచములనూ గలగల బలికెడి పక్షులనూ!
సర్పంబుల నెదిరింపగలవు మఱి సరసత యిరువురి మానవులన్
ఎదిరించుట మఱి జెప్పవలయునా? మది వేసన మఱి జెందకుమా!

యేమఱిపాటున నుంటి మప్పుడును నింపుగ విశ్వాసము తోడన్
వంచింపగ బడితిమి వానరుచే నంచితముగ హనుమంతునిచే!
నే జీవించియు నుండగా నతడు నిర్భయముగ ప్రాణంబులతో
పోజాలడుగద! యంబుధి దాటి పోరాటమునకు రాడుగదా!

సాగర పర్వతంబును నైనా సశైల వన కాననములతో!
ఆవపుల తోడను నున్న భూమినీ యా వానరులును లేకుండన్!
జేసెద! మఱి నన్నాజ్ఞాపింపుము! స్థిరముగ నే దెలుపుచు నుంటిన్!
ఒక్కవానరుని గూడ ధరణిపై చక్కగ బ్రతుకగ నీయనుగా! 4

రజనీచర! కపి మూకలనుండీ రవ్వ గలుగ కుండెడి యటులన్!
రక్షణమునకును నేర్పాటుల నే రయముగ వే జేసెద వినుమా!
నీవుజేసినా యపరాధమునకు నీకు దుఃఖమును రాకుండన్
నేను జూచెదను రాక్షసరాజా! నిజమిది నమ్ముము! నా పలుకుల్! 5

అటుపిమ్మట దుర్ముఖుడను వాడును నంతులేని క్రోధము తోడన్
రావణుతో నిట్లనుచు బలికెనూ రాక్షసు లందఱు వినునటులన్!

మనకందఱికిని యా హనుమంతుడు మహావమానము జేసెగదా!
సహింపరానిది భరింపరానిది సరగున శిక్షింతును వానిన్! 6

పురమునకును నంతః పురమునకును బొలుపుగ జేసిన పరిభవమున్!
హనుమంతుడు జేసిన యీకార్యము నను పతింపగను లేముగదా!
కపిరాజగు నా సుగ్రీవుండును కలిసి వచ్చె కపిసేనలతో
శ్రీమంతుండగు మన రావణుపై స్థిరమతి యెదిరింపగ వచ్చెన్!
ఇది యింకను సహియింపరానిదీ నింపుగ మౌనము వహియింపన్! 7

ఈ ముహూర్తమున నే నొక్కడనే యింపుగ రణమునకును జనీ!
సాగరమందునగాని భీమమగు సరి రసాతలము నందుననూ!
ఆకాశమునందునగానీ మఱి యలరుచు బోయిన వానరులన్!
నివర్తింప జేసెద వారలనూ నిజమిది రాక్షస రాజేంద్రా! 8

అటుబిమ్మట మఱి మహాబలుండును మహాభయంకరు డగు వాడున్!
వజ్రదంష్ట్రిదను రాక్షసు డొక్కడు వసరగ క్రోధమునను గూడీ
మాంస శోణితము రూషితంబునగు మహాభయంకర మైనదియున్
పరిఘను గ్రహించి నటునిటు ద్రిప్పుచు బటుతరముగ నిటులను పలికెన్! 9

దుర్ధర్షులునగు రామలక్ష్మణులు దురముగ సుగ్రీవుడు నుండన్
దీనుడు వార్తాహరుడునైన యా దిక్కులేని హనుమంతునితో
మనకేమి పనీ? తగు వాతనితో? మహావిక్రమము గల మనకున్! 10

ప్రస్తుతంబు నే నొక్కడనే జని పరిఘ హస్తమున ధరియించీ
రామలక్ష్మణుల సుగ్రీవాదుల రణమున నే వధియించెదనూ!
హరి వాహినికిని క్షోభను గూర్చి యలరి వచ్చెదను నిచ్చటికిన్! 11

మహారాజ! నీ విష్టబడినచో మఱియొక వాక్యము దెలిపెదనూ!
ఉపాయకుశలుడు మాత్రము జగతిని యున్నతగతి యాలోచించీ
బలసత్వంబును లేనివాడునై యలరి శత్రువులను నిర్జించున్! 12

కామరూప ధరులగు వారలునూ కార్యశూరులగు వారలునూ!
భయంకరులు మఱి భీమదర్శనులు బటుతర విక్రమ వంతులునూ!

వేలకొలది రాక్షసులు వేగమున వికలబుద్ధి లేకను వారున్
మానుషరూపములను ధరించియును మఱి యా రాముని కడకేగి
వారందఱు సంభ్రమము లేకనూ వనరగ బలుకుదురు గాతన్! 4

నీ యనుంగు తమ్ముడు నా భరతుడు నిజముగ బంపెను నీ కడకున్
సేనను సిద్ధముజేసికొని మఱి స్థిరముగ నీదు సహాయమునన్
వచ్చుచు నున్నాడని దెలుపగనూ మచ్చిక మాతో గబురంపెన్
నందిగ్రామమున నుండి వచ్చితిమి వందన మిదె యని దెలుపవలెన్! 5

అటుబిమ్మట మే మతి శీఘ్రముగా బటుతరమగు శూలంబులనూ!
శక్తి గదా ధారులమై మఱియును చాప బాణ ఖడ్గంబులనూ
ధరించి త్వరితము నచటి కొచ్చెదము విరించి యాశ్చర్యము నందన్!

అటుపై యాకాశంబున నెగురుచు నలరుచు గుంపులు గుంపులుగా
ఆ వానర సేనలపై రాళ్ళను నాయుధములు గురిపించుచునూ!
యమలోకమునకు బంపి వేసెదము యమునకు నతిథులుగా కపులన్!

రామలక్ష్మణులు నీ విధంబుగను రహిజేసిన మన వంచనలో
జిక్కి తపింతురు వానర సైన్యము స్రుక్కుటచే జింతను బొంది
జీవితమును మఱి త్యజింపగలరూ జీవింతుము మన మందఱమున్!

కుంభకర్ణుని కుమారు డంతట కూర్మి బరాక్రమ విక్రముడున్
నికుంభుడను బటు రాక్షసు డంతట నిష్ఠురమగు క్రోధముతోడన్!
లోక రావణుండైన రావణుని లోలత యీరీతిని బలికెన్!
రాక్షసులందఱు వినునట్టులుగా రహి క్రోధాక్షర వాక్యములన్!

మీరందఱునూ రాక్షసేంద్రుతో మిగుల హర్షమున నిటనుండీ!
గాంచుచు నాదగు ప్రబల కార్యముల గాంచుడు నాదగు విక్రమమున్!
నే నొక్కడనే బోయి యచ్చటికి నిర్జరు లందఱు జూడగనూ!
రామలక్ష్మణుల సుగ్రీవాదుల రణమున వధియించెద నేడున్!

అటువిమ్మటనూ వజ్రహనువు నను బటు బల రాక్షసుడును నంతన్
పర్వతంబుతో సమాను డాతడు ప్రబల క్రోధమున నిటు లనియెన్!
నాలుకతోడను చెలివెలు నాకుచు నలుమూలల బరికించుచునూ! 21

మీరందఱునూ రాక్షస వీరులు మీమీ కర్మలు జేయుడికన్!
చింతల వంతల మానుడు మీరలు వింతల జూచుచు గడుపు డికన్!
హాయిగ నృత్యములను మఱి జేయుడు నంతులేని సంతోషముతో!
మధువును గ్రోలుడు మనసు రంజిలగ మదోద్రేకమును బొందు డికన్
నే నొక్కడనే వానర సేనను నిక్కముగా భక్షించెదనూ!
వారందఱి రక్తమును గ్రోలెదను వనరగ మధువును ద్రాగినటుల్! 22-23

నే నొక్కడనే రామలక్ష్మణుల నిక్కముగా వధియించెదనూ!
సుగ్రీవుని మఱి ప్రబల వానరుల సురుచిరముగ భక్షించెదమూ!
హనుమంతుని యాయంగద వీరుని యలరెడి సమస్త వానరులన్
యమపురికిని యతిథులుగా బంపెద యాహ్లాదము గలిగించెదనూ!

(యుద్ధకాండమునందలి ఎనిమిదవ సర్గము సమాప్తము)

* ★ *

# యుద్ధకాండము - మొదటి భాగము

## తొమ్మిదవ సర్గము

[సగర్వముగా మాటలాడుచున్న యా రాక్షసులను వారించి వి
భీషణుడు నీతి వాక్యములను జెప్పుటకు ప్రారంభించుట-రావణుడు దనగ
ములో బ్రవేశించుట]

అటుబిమ్మట యా నికుంభుండునూ నల రభసుండను రాక్షసుడున్
మహాబలుండును సూర్యశత్రువును మానుగ సుప్తఘ్నుండు మఱిన్
యజ్ఞకోపుడును, మహాపార్శ్వుడును మహోదరుండనువాడు మఱిన్
అగ్నికేతువును, రశ్మికేతువును నల రాక్షస వీరులు మఱియున్!

అటుబిమ్మట బలవంతుడు మఱియును నలరెడి రావణ పుత్రుండున్
వజ్రదంష్ట్రుడును, ధూమ్రాక్షుండును వనరగ దుర్ముఖుడను వాడున్
అచ్చటగల యా రాక్షసులందఱు మచ్చికతో బహు నాయుధముల్
పరిఘలు, పట్టిసములు, శూలంబులు ప్రాసంబులు మఱి శక్తులునూ
గండ్రగొడ్డళులు, బాణంబులుగల ఘన ధనుస్సులును, ఖడ్గములున్!

ధరించి మిక్కిలి క్రోధము తోడను దగ రావణుతో నిటులనిరీ!
అగ్నిశిఖలవలె ప్రదీప్తి నొందుచు నలరి యుండిరీ రాక్షసులున్! 1

ఆ రాముని లక్ష్మణుతో గూడిన యల సుగ్రీవుని జంపెదమూ
ఎవనిజేత యీ లంకానగరము తువతువ యగ్నిని గాలినదో!
ఆ దీనుని హనుమంతుని యిపుడే యంతము గావించెదము నిదే!
వానరవీరుల నందఱ నిపుడే వరుసగ వధియించెదము సుమా!

ఆయుధములు గ్రహియించి లేచినా యా రాక్షసులను వారించీ
విభీషణుడు మఱి వారలనందఱ వినయవంతుడై యంజలితో
కూర్చొనునట్టుల జేసి మఱలనూ కూరిమితో నిటులను బలికెన్!

మహావీర! విను నాదు పలుకులను మన్ననతో నతి విజ్ఞతతో
తండ్రీ! ఒకకార్యము దలపెట్టగ నయముగ సామము దానములన్!

భేదో పాయములను నందగ వలె ప్రియముగ యా మూడిటి చేతన్
అలవి గానపుడు మూడిటిచేతను సలరి విక్రమము జూపుటకున్!
దగిన కాలమని బుద్ధిమంతు లిల దగ బలుకుదు రీ లోకమునన్! 8

ఏమరిపాటున నున్న వారు మఱి యిల యరిమూకల జుట్టబడీ
వేదనలోబడి యున్న వారునూ వెస దైవముచే గొట్టబడీ!
దీనావస్థను నున్నవారునూ ధీరత వీరిని శోధించీ
శాస్త్రరీతి మన పరాక్రమములను సాధన జేసిన కార్యములన్!
సఫలమగును గద! తండ్రీ! వినుమా! సర్వము మీకును దెలియుగదా! 9

అప్రమత్తుడును విజిగీషుండును నల బలవీరుడు రాఘవుడున్!
జితరోషుడు మఱి దురాధర్షుడును మతిమంచుడు శ్రీ రఘువీరున్!
ఏ రీతిని యెదిరింప గలమనీ యింవుగ దలచుచు నున్నారూ? 10

నదీ నదములకు పతియును మఱియును నయముగ భయంకరంబైనా
సముద్రమును మఱి దాటి వచ్చినా సరసత యా హనుమంతునియూ!
గమనంబును మఱి మహాబలంబును గతి యీ లోకమునందుననూ!
ఎవడు దెలిసికొను విశదముగా మఱి నెటు లూహించును దర్కమునన్? 11

రాక్షసులారా! శత్రుబలంబును రణ కౌశలములు వీర్యంబున్!
కొలువశక్యమును గానివి తండ్రీ! కూరిమి యోచన లేకుండన్!
అనాదరంబున జూదరాదు సుమ! యాలోచింపుడు విజ్ఞతతోన్! 12

కీర్తిమంతుడగు రాముని భార్యను దురితముగా మన రావణుడున్!
అపహరించి జనస్థానము నందున నలరుచు దెచ్చెను లంకకునూ!
రాముడేమి యపకారము జేసెను రాక్షస రాజుకు బూర్వమునన్!
ఆలోచింపుడు రాక్షసులారా! యంధ క్రోధమును విడనాడీ! 13

మితిమీరిన వర్తనము గలిగినా మీరిన ఖరునీ రణమందున్
రాముడు జంపెను దప్పేమున్నది? రహి యోజింపుడు శాంతమునన్!
ఏప్రాణియు నీ లోకమునందున యిరుకున బడ తన ప్రాణములన్
రక్షణజేయగ వలెను గదా! మఱి శిక్షించుచు దన శత్రువునూ! 14

ఇందుకునిమిత్తము జానకి వలనను గందుట యెందుకు సఖులారా!
సీతవలన యీ యాపద వచ్చెను జింతిపుడు బహు శాంతముగా
అపహరించినా సీతను శీఘ్రము నా రాముని కర్పింప వలెన్!
కలహము జేయుట చేత లోకమున కార్యమేమి యుండును ఫలమున్ 15

వీర్యవంతుడును ధర్మ వర్తనుడు విమల గుణంబులు గలవాడున్!
అట్టి రామచంద్రునితో కలహము యిట్టె నిరర్థకమును గాదా!
జనకసుతను శ్రీరామచంద్రునకు చయ్యన నీయగ వలెను సుమా! 16

గజాశ్వములతో గూడినట్టిదియు గడు రత్నములను గూడినదీ!
పిల్లపాపలను గూడినట్టిదియు ప్రేమాస్పదముల నిండినదీ,
అట్టి లంకనూ యల రాఘవుడును యిట్టె తీవ్ర శరములజేతన్
ధ్వంసముతేయక ముందే వేగము దగ మన్నన గారవములతో
జనక సుతను శ్రీరామచంద్రునకు చయ్యన నీయగ వలెను సుమా! 17

సుఘోరమైనదియును మఱి వినుడో! సులుపుగ యెదిరింపగరానీ!
మహత్తరంబైనది హరివాహిని మానుగ లంకకు వచ్చుటకున్
ముందే ధ్వంసము జేయక ముందే ముదముగ సంధిని జేసికొనీ
జనకసుతను శ్రీరామచంద్రునకు చయ్యన నీయగ వలెను సుమా, 8

రాముని ప్రియ భార్యను జానకినీ రయమున స్వయముగ గొనిపోయీ
అర్పింగవలె రామచంద్రునకు నలరి గారవమునను గూడీ
అటుల గానిచో యీ లంకాపురి యలరు రాక్షసులతో గూడీ
వశించిపోవును రాక్షసులారా! నయముగ యోచన చేయు డికన్! 9

అన్నవగుటజేతను బంధుత్వము నలరుట జేతను నీ రీతిన్
వినయముతో బ్రార్థించు చుంటినీ విమల మతిని జేయుము దీనిన్
హితము సత్యమును నగు నా మాటలు మతిని దలవు నా సహోదరా!
జనకసుతను శ్రీరామచంద్రునకు చయ్యన నీయగ వలెను సుమా!

అన్నా రావణ! నాదు బలుకులను నలరి వినుము నిర్మలమదినీ!
నృపాత్మజుండగు రామచంద్రుడును కృపారహితముగ వేగమునన్
శరత్సూర్య కిరణముల సమానము సరి నవాగ్ర పుంఖములు గలా
సువృతములు మఱి యమోఘంబులును సూది బాణముల వేగముగా
నిను వధించుటకు విడువగలడు సుమ! నిజము దెలిసి బహు మన్ననలన్!
జనకసుతను శ్రీరామచంద్రునకు చయ్యన నీయగ వలెను సుమా! 21

సుఖదర్మంబుల నాశము జేసెడి సూనృతవ్రత! క్రోధమువీడి!
ఆనందంబును మఱియు యశస్సును నలరించెడి శ్రీధర్మమునూ!
సేవింపుము మఱి యనుగ్రహింపుము శ్రీలంకా పురమును నీవున్
సపుత్ర బాంధవులను గూడికొని శాంతమునను జీవింతు మిలన్!
జనకసుతను శ్రీరామచంద్రునకు చయ్యన నీయగ వలెను సుమా! 22

విభీషణుని హితవచనములను విని విలక్షణుండగు రావణుడున్!
అటుబిమ్మట మంత్రుల బరివారము నా రాక్షసులను నట వదిలీ!
అంతఃపురమును ప్రవేశించెనూ యతి కోపముతో మౌనమునన్! 23

(యుద్ధకాండములోని తొమ్మిదవ సర్గము సమాప్తము)

* * *

# యుద్ధకాండము - మొదటి భాగము

## పదియవ సర్గము

(విభీషణుడు అన్నగారి యింటికిబోయి చెడుశకునములను గూ
దెలుపుచూ మఱల యతనికి యుపదేశించుట.)

ప్రాప్తధర్మార్థ నిశ్చయుడునూ భయంకరంబగు కర్మలునూ!
గలవాడగు నా విభీషణుండును గలకల దెలవారుట తోడన్
ప్రాతఃకాలమునందు సంధ్యయును బన్నుగ విరియగ తూరువునన్
అన్నయైన రావణు సదనమునకు నలరి బోయె బ్రియమును గూర్పన్!

ఆ గృహంబు గిరి సముదాయమువలె యలరియుండె యున్నతముగనూ!
గదులన్నియునూ విభజింపగబడి కాంతి వంతములు నైయుండెన్
మహాజనులు నట వాసము జేయుచు మన్నన లందుచునుండి రటన్
అన్నయైన రావణు గృహంబునకు నలరి బోయె బ్రియమును గూర్పన్!

బుద్ధిమంతులను రాగవంతులును బోలుపుగ ప్రధానులును నచటన్
వాసము జేయుచు నుండిరి స్వేచ్ఛగ వనరగ బంధులు సమర్థులున్!
అయిన సైనికులు రాజభవనమును నలరచు రక్షించుచు నుండన్!
అన్నయైన రావణు సదనమునకు నలరి బోయె బ్రియమును గూర్పన్!

మత్తగజంబుల నిట్టూర్పులచే మారుతంబు వ్యాకులితమయెన్
శంఖనాదముల, తూర్య ఘోషముల పుంఖములగు ధ్వనులును మ్రోగన్
కువలయ మంతట వినబడునటులను గూరిమి వినబడుచుండె నటన్!
అట్టి సదనమును బ్రవేశించెనూ యా విభీషణుడు బ్రియమారన్! 4

ప్రమదా జన సంబాధితంబునూ బన్నుగ విశాల మార్గములున్
జన సంభాషణ కోలాహలమును వినబడుచుండెను ఘనముగనూ!
శుద్ధమైన బంగారు బురుజులును సురుచిర భూషణముల తోడన్
అలంకరింపగబడి యుండిన యా నలరెడి రావణు భవనంబున్
అన్నను గాంచి విభీషణుండును నా భవనంబున కేతెంచెన్! 5

గంధర్వుల యావాసము వలెనూ గనిపించుచునూ నుండు నదీ!
మరుత్తులా భవనంబునకును వలె మహోన్నతమునై యుండినదీ
రమ్య సర్ప నిలయంబునకును వలె రత్నసంచయము నిండినదీ
అట్టిభవనమును ప్రవేశించెనూ యన్నను జూడ విభీషణుడున్! 6

మహాద్యుతియుగల విభీషణుండును మానుగ తేజోవిస్తృతమున్!
కిరణంబులుగల యా భాస్కరుడును విరిసిన మహాభ్రమును వేగన్
ప్రవేశించినటు రాజభవనమును బన్నుగ విభీషణుడు బోయెన్!
అన్నయైన రావణునకు హితముమ నలరి బోధజేయుట కొఱకై! 7

సుమహాతేజుడు విభీషణుండును సోదరు విజయము గోరుచునూ!
వేదపండితులు జదువుచున్న యా విమల పుణ్యమంత్రంబులనూ!
ఆ భవనంబును ప్రవేశించి విని యానందము మనసున బొందెన్!
యజ్ఞవిధుల మఱి యర్చనాదులను నమలమైన వ్రత పూజాదుల్! 8

మహాబలుండగు విభీషణుడును మానుగ గాంచెను నచట మఱిన్
దధి పాత్రంబులు నేతి భాండములు దగ కుసుమాదులు నక్షతలున్
సమర్పించి పూజించుచున్న యా సర్వ మెఱిగినా బ్రాహ్మణులన్
మంత్ర వేద విధులైన విప్రులను మఱి విభీషణుడు గాంచె నటన్! 9

మహాబాహువగు విభీషణుండును మానుగ రాక్షస వీరులచే
బూజింపగబడి లోనికి జనియెను బొలుపుగ తన దేజస్సులచే
ప్రకాశించుచును నాసన మందున బన్నుగ యాశీనుండైనా
ధనదానుజుడగు రావణు గాంచెను దలను వంచి వందన మనియెన్! 10

ఆచారంబులు దెలిసిన వాడగు నా విభీషణుడు నేర్పలరన్!
రాజదర్శనమునందు బలుకబడు రమ్యవచనముల బలుకుచునూ!
'జయ! విజయీభవ!' శబ్దంబులతో చక్కని నియమము బాటించెన్!
కనుసైగను రావణుడు జూపినా కనకాసనమున గూర్చుండెన్! 11

విజనమునందున మంత్రుల సన్నిధి విమలుడు విభీషణుండు మఱిన్
మహాత్ముడగు నా రావణుతోడను మహాహితంబును నైనదియున్
హేతు నిశ్చితంబైన వచనమును నీతిని బలికెను నీ రీతిన్! 12

లోకమునందున మంచి చెడ్డలను లోలత గాంచిన యాతండున్
మంచి మాటలను నన్నగారినీ మానుగ పూజించియును మఱిన్
దేశకాలార్థ సంవాదితమగు ధీర వాక్యమును దా బలికెన్!

పరంతపా! ఓ రాక్షసరాజా! బన్నుగ నా మాటలు వినుమా!
సీత వచ్చినది మొదలు నిచ్చటను జేటు గలిగినది రాజేంద్రా!
అశుభంబులు సూచించు శకునములు నంతట గలుగుచు నున్న విటన్!

మంత్రంబుల హోమము జేసిననూ మానుగ యగ్ని జ్వలింపగనూ
స్ఫులింగములు మఱి యెగురుచున్నవీ స్ఫూర్తి దప్పె యా జ్వాలలనూ
జ్వాలలతో ధూమము గలియుటచే జ్వాలలు గాంతి విహీనముగా
గనబడుచున్నవి యన్నా! వినుమా! కాంతి దప్పినవి యగ్నులునూ!

అగ్ని గృహములను, నగ్నిశాలలను నలరు బ్రహ్మ స్థలముల యందున్!
కాలసర్పములు గనబడుచున్నవి కఠిన శబ్దములు జేయుచునూ!
హవ్యములందున బిపీలికాదులు నలరుచు గనబడుచున్నవియునూ!

ఆవుల పాలవి విరుగుచు నున్నవి యల యుత్తమ గజములు గూడన్!
మదములేక నిస్తేజము లైనవి మానుగ యశ్వములును గూడన్
దీనముగా సకిలించుచు నున్నవి నిర్బలమై గనబడు చుండెన్!
పచ్చగడ్డియందును నాసక్తిని బన్నుగ గనబఱచుట లేదూ! 1

ఖరములును మఱి యెంటెలుగూడను కంచర గాడిదలును గూడన్!
ఛిన్నరోమములు గలవై కన్నుల కన్నీళ్ళను నొలుకుచు నుండెన్!
విధానముగ జేసిన జికిత్సయును విఫలముగా గనబడుచుండెన్!
స్వస్థత బొందుట లేదు గదా మఱి స్వభావమున మార్పును లేదూ! 1

క్రూరమైన యా కాకుల మూకలు గుంపులు గుంపులుగా జేరీ
యఱచుచున్నవీ యంతటజేరీ యలరుచు మనపురి యంతటనూ
గృహముల పై భాగముల యందునను కేకలు వేయుచు గూర్చుండున్! 1

మన పురి పై భాగములను గ్రద్దలును మఱి వలయముగను దిరుగుచునూ
వ్రాలుచు నున్నవి భవనంబులపై వరుసగ గుంపులు గుంపులుగా

ంధ్యాకాలములందు నక్కలును సభయంకరమగు కూతలనూ!
మంగళముగా గూయుచున్నవి యలరుచు నగర సమీపములన్! 20

ంసాదులు దిను క్రూర మృగములును మానుగ గుంపులు గుంపులుగా
ర ద్వారములయందున జేరి నయముగ పిడుగుల వంటి ధ్వనుల్
యుచున్నవీ రాత్రిం బవళులు స్థిరముగ యఱుపులు కేకలతో! 21

కమ వీరా! తత్కారణమున వికారమగు నీ విధములగూ
ష్ట నిమిత్తములును గనబడుటను దూరము గావింపగ వలయున్!
ాయశ్చిత్తము జేసికోవలయు బన్నుగ సీతను రామునకున్
ప్పించుటయే బరిహారంబని యలరి దలచు చున్నాడను నే! 22

హారాజ! విను నే నీ మాటలు మానుగ మోహమునను గానీ!
భము వలనను బలుకుచున్ననూ లోలత నుఱి యొక విధమునసూ!
వింపకుమా! కోపింపకుమా! బన్నుగ నా మాటలను వినీ!
క్షసులందఱు సాక్ష్యము దీనికి రయముగ బిలిపింపుము వారిన్! 23

నా జెప్పిన దుర్నిమిత్తములు నిల నాకును మాత్రము గాదూ!
క్షసులకు మఱి రాక్షసస్త్రీలకు రహి యంతఃపుర వాసులకున్!
రములోగల రాక్షసు లందఱు నయముగ గాంచుచు నున్నారూ! 24

విషయంబును నీకు దెలుపుటకు నీ మంత్రులు సందేహమునన్!
ానమూనిరీ మాటాడకనూ మఱి నీ మెప్పున కాశించీ!
విన్నది మఱి కనులజూచినది నిజముగ నీకును జెప్పవలెన్
ందుచేత నే దెలుపుచు నుంటిని విందుగాని యీ వాక్యములన్!
ధాన్యాయముగ కార్యము జేయుము యధాస్థితిని గమనించుచునూ! 25

దరుడగు నా విభీషణుండును సురుచిరమును బహు హితమైనా
ంత్రుల మధ్యను నున్న రావణుని మానుగ సంబోధించుచునూ
ంచి మాటలను బలికెను గానీ మానుగ దుష్టులకును మధ్యన్!
ంచితముగ గూర్చున్న వానికిని మంచి మాట లెటు దల కెక్కున్? 26

రామునితో వైరము గలిగుండుటె రమ్యాసక్తిని గలిగిన యా
రావణుండు హితమును, మహార్థమును రమ్య మృదుత్వము గలిగినదీ!
హేతువులను గూడినది మఱియునూ నీతిని గూడిన వాక్యములన్!
భూత వర్తమానంబుల మఱియును బొలుపగ భావి సుకాలములన్
తగిన వాక్యమును విని రావణుడును దరగని క్రోధము గలవాడై
ఈ విధముగ మఱి బదులు జెప్పెనూ నిష్ఠురగతిని విభీషణుతో! 27

ఎవని నుండి నే భయమును జెందను నివ్వసుధాస్థలి యందుననూ!
రాముడు యేనాటికిని జానకిని రంజిల పొందగ జాలడుగా
ఇంద్రుడు మున్నగు దేవత లందఱు సాంద్రగతిని వచ్చిన గూడన్
రాముడు రణమున నా కట్టెదుటను రమ్యముగా నిలువను గలడా? 28

సుర సైన్యంబును నాశము జేసెడి శుద్ధ వీర విక్రముడు మఱిన్
మహాబలుడు మఱి యుద్ధమునందున మానుగ మహా పరాక్రముడున్!
అయిన రావణుడు నటుల బలుకుచును నలరి హితము బోధించెడి యా
సోదరుడగు నా విభీషణునిపై నాదర మింతయును లేకన్!
పంపివేసెనూ! రావణు డంతట కంపము జెందెడి వాక్యములన్! 29

(యుద్ధకాండములోని 10వ సర్గము సమాప్తము)

* ★ *

# యుద్ధకాండము - మొదటి భాగము

## పదునొకండవ సర్గము

[రావణుడు మఱల మంత్ర గృహమునకు బోవుట మంత్రులు, విభీషణుడు గూడ అచ్చటికి బోవుట]

మైథిలియందున కామము జేతను మఱి మోహంబున బీడితుడై
పాపాత్ముండగు దశాననుండును బన్నుగ దుష్టుల స్నేహమునన్
మంచివారి నిల సన్మానింపక యంచితముగ మానుట చేతన్
బాపకర్మలను జేయుటచేతను బరగ కృశించిన వాడయ్యెన్! 1

అతీత సమయమునందు రావణుడు నామంత్రులతో మిత్రులతో
యుద్ధమునందున జేయగ వలసిన పద్ధతులను మఱి కార్యములన్
ఆలోచింపగ సాగెను నాతడు నాతని మంత్ర గృహమందున్! 2

హేమజాల వితతంబును మఱియును మణి విద్రుమ భూషిత మైనా
వినీతాశ్వములు గలిగినట్టి యా విమల మహా రథమందుననూ!
సమీపించి యా యరదము నెక్కెను సహచరులందఱు వెదలగనూ! 3

రాక్షసులందున శ్రేష్ఠుడైన యా రావణుండు బహు వేగమునన్
మహామేఘ స్వరమును గలిగిన యా మహారథంబున గూర్చుండి!
మంత్రగృహమున యాలోచింపగ మంత్రులతో మఱి మిత్రులతో
బయలుదేరి వెళ్ళెను దశగ్రీవుడు రమ్య రాజవీధుల యందున్! 4

అటుబిమ్మట ఖడ్గములు ధరించిన నలరుచు యోధులు నడువంగన్
సకలాయుధములు ధరించినట్టి సమర్థులగు బహు రాక్షసులున్
రాక్షసరాజుకు ముందు నడిచిరీ రయమున బలుకుచు జయధ్వనులన్! 5

నానా వికృత వేషంబులతో నానా విధ భూషణములతో!
అనేక మందీ రాక్షస వీరులు నా రావణునకు పార్శ్వమునన్
వెనుకభాగముల యందున నడిచిరి విమలములగు స్వనముల తోడన్! 6

అతిరథులగు నా మహారాక్షసులు నతి సుందరమగు రథములపై
మదించినట్టి గజముల పైనీ మఱి క్రీడాశ్వములను నెక్కి
ఆ దశగ్రీవుని వెంట నడిచిరీ యలరుచు జయజయ నాదములన్!

గదా బరిఘ హస్తులును మఱియునూ శక్తి తోమరములను గూడీ
పరశ్వధములును శూల పాణులగు బన్నుగ కేకలు వేయుచునూ!
ఆ దశగ్రీవుని వెంట నడిచిరీ యలరుచు జయజయ నాదములన్!

అటు బిమ్మట యా దశాననుండును నలరి సభకు బోవుచునుండన్!
వేలకొలది వాద్యంబుల ధ్వనియును విపులమైన శంఖధ్వనులన్!
బయలుదేరెనూ మార్గమంతయును విజయ నాదములు ధ్వనియించెన్!

ఆ మహారథము నేమి ఘోషలను నలరుచు సాగెను ముందునకున్
సుందరమైనా రాజమార్గమును నందములను జిందుచు బోయెన్!

రాక్షసేంద్రునీ శిరస్సుపైనీ రమ్య వినిర్మలమైనదియున్!
పాండుర వర్ణము గలిగినట్టి యా ప్రభలను జిమ్ముచు ఛత్రమునూ
పూర్ణచంద్రునికి వలె శోభించెను బొలుపుగ రావణు శిరమునను 1

ఆ రావణు కుడి యెడమ ప్రక్కలను నలరుచు బంగరు సూత్రములన్
పరిశుద్ధంబగు స్ఫటిక సమానము బన్నుగ సుందర చామరముల్
ప్రకాశించుచుండెను రథమందున బాస్కరు ప్రభలను మించుచునూ! 1

భూమిపైని నిలిచిన రాక్షసులును బొలుపుగ యంజలి ఘటియించీ
రథమునందు గల రాక్షసేంద్రునకు రమ్యముగా దలలను వంచీ
నమస్కరించిరి భక్తి శ్రద్ధలను నయముగ జయజయ నాదములన్! 1

ఆ సమయంబున శత్రు మర్దనుడు నతి తేజంబును గలవాడున్!
దశాననుడు రాక్షసులచేత మఱి దగ జయ శబ్దంబుల నందీ!
స్తుతింపబడుచును మంత్రగృహమును సురుచిరముగను బ్రవేశించెన్! 1

సువర్ణ రజితాస్తీర్ణమైనదియు, విశుద్ధ స్ఫటికాంతరములతో
బంగరు వస్త్రము పై భాగమునను బన్నుగ గప్పగ బడియుండెన్!

అటువంటలా విశాలంబులును నా సుందరసభ రక్షింపన్!
సదా కాంతులను దేజరిల్లునది సౌమ్యాకారము గలదియునూ!
విశ్వకర్మచే నిర్మింపగబడి పలసితమగు నా భవనంబున్
మహా తేజాదగు నా దశగ్రీవుడు దానుగ నడుగిడె లోపలకున్ 15-16

ఆ దశాననుడు నా సభయందును మణి వైడూర్య విదారంబున్
ప్రియక మృగము జర్మంబులచేతను నయముగ గప్పగ బడినదియున్!
సోపానాశ్రయములతో గూడినదీ సుందరమగు నా సభయందున్
ఆ రావణుడును నధిష్ఠించెనూ యందటు జయధ్వనులను జేయన్! 17

అటుపిమ్మట నా లంకాధిపుడును నటగల దూతలను బిలిచీ
అధికారంబును జూపుచు బలికెను నా దూతలతో నీ రీతిన్!
గొప్పకార్య మొకటున్నది గావున గొని రండందఱ రాక్షసులన్!
ఏమిజేయుచున్నాడో శత్రువు నెఱుగుదు నంతయు భటులారా!
ఆలస్యం బిక జేయరాదు సుమ నల రాక్షస వీరుల వేగన్!
బిలిచి రండనుచు నాజ్ఞాపించెను పిక్కటమగు నధికారముతో! 18

ఆ దూతలునూ యతని మాట విని యతి వేగంబున బోవుచునూ!
విహారముల యందున్నవారినీ విపుల శయనముల గలవారిన్!
ఉద్యానంబుల విహరించెడి యా యున్నతులగు నా రాక్షసులన్!
ప్రేరేపించుచు బిలుచుచు బోయిరి పెనుకేకలతో వారలనూ!
లంకలోని ప్రతి యింటికి బోయిరి శంకలేక రాజాజ్ఞలచే! 19-20

ఆ దూతలునూ యటుల బిలువగా నలరుచు గొందఱు రాక్షసులున్!
సుందరములునగు రథముల పైనీ సురుచిరమగు నశ్వంబుల పై
మఱికొందఱు యేనుగుల నెక్కియుచు మానుగ కొందఱు నడుచుచునూ!
సభాభవనమును జేర బోయిరీ జాగుజేయకను వేగమునన్! 21

ప్రవేశించి యా రాక్షసులందఱు ప్రభువు పాదములకును మ్రొక్కి
రావణుచే నభినందింపగబడి రమ్యాసనముల గొందఱునూ!
కొందఱు నాస్తరణంబులమీదను కొందఱు నేలను గూర్చొనిరీ! 22

శీఘ్రముగా వచ్చెడి రథములతో స్థిరమగు నవకల యేనుగులున్
బరుగులెత్తెడి వాజుల చేతను బన్నుగ వ్యాపించిన యట్టి
ఆ లంకాపురి యలరుచుండెనూ యతి కిక్కిరిసిన జనములతో!
పక్షులతో నిండిన యాకాశము ప్రకాశించినటు గనిపించెన్!

ఆ రాక్షసులును వాహనంబులను ననేక విధముల యానములన్!
సభాభవనమున ముందున నిలిపిరి జాగు చేయకను వేగమునన్!
సింహంబులు గిరి గుహలయందునను శీఘ్రము జేరిన యట్టులనూ
పాదచారులై యా రాక్షసులును ప్రవేశించిరీ భవనంబున్! 2

ఆ రాక్షసులును రాజశాసనము ననుసరించి సభలో జేరీ
రాక్షసరాజగు రావణాసురుని రహి సమీపమున గూర్చుండీ
దగు విధమున యాలోచన క్రమమున దగ పాల్గొనుటకు వచ్చిరటన్! 2

నిశ్చయించు కార్యములను రయమున నిర్వర్తించెడి మంత్రులునూ!
గుణోపేతులగు విజ్ఞులు మఱియును గూఢమిగల సర్వజ్ఞులునూ!
బుద్ధియె దర్శన సాధనముగ గల బొలుపగ యమాత్యులును మఱియున్
వందలకొలదియు శూరులు వీరులు నెందరొ వచ్చిరి యచ్చటకున్! 2

చేయవలసినా కార్యము వేగము స్థిర నిర్ణయమును జేయుటకై
హేమ వర్ణ మయమగు నా సభకును భీమ భయంకర రాక్షసులున్
అధికారక్రమమును బాటించుచు నలరుచు నట జేరిరి వేగన్! 27

అటుపిమ్మటను మహాత్ముడు నైనా యలరు యశస్వి విభీషణుడున్!
మంచి గుఱ్ఱములు గలదియు మఱియును మానుగ బంగరు వర్ణంబున్!
మంగళప్రదమగు రథమును నెక్కి సంగతిగా అన్నను జేరీ!
రాక్షస ప్రముఖులు నందఱు గూడిన రాజసభను జొచ్చెను వేగన్! 28

అటుపిమ్మట నా విభీషణుండును నలరుచు నా దశగ్రీవునకున్!
తన నామంబును దెలుపుచు నాతడు దగ పాదములకు నటు మ్రొక్కెన్!
తదుపరి శకుడును ప్రహస్తుండునూ దగు విధమున నట్లే జేయన్!

వారివారికిని దగు విధముబుగా వరుసగ యాసనముల నిచ్చి
కూర్చుండగ జేసెను రావణుడును కూర్మితోని తన యనుచరులన్! 29

సువర్ణ నానా మణి భూషణముల సురుచిరముగ యుండిన వారున్!
పట్టువస్త్రములు ధరించి వచ్చిన ప్రబలులైన యా రాక్షసులా
అగురుచందనాదులయు మఱియునూ యలరు పుష్ప మాల్యంబులయూ!
సుగంధములు సభయంతయు వీచెను సురుచిరనుగు బరిమళములనూ! 30

సభాసదులలో నే యొక్కరునూ సరి క్రమశిక్షణ గల వారున్!
గట్టిగ యెవ్వరు బలుకుట లేదూ! కనలి యసత్యము బలుకరుగా!
గట్టిగ యెవ్వరు యఱచుట లేదూ కార్యసాధకులు నందఱునూ!
ఉగ్ర వీర్యమును గలవారందఱు నున్నత తేజము గలవారున్!
వారలందఱును బ్రభువు ముఖంబును వనరగ నుండిరి జూచుచునూ! 31

మహా మనస్వియు నగు రావణుడును మానుగ యా సభయందుననూ!
ఆయుధముల బహు ధరించి యుండిన యభిమానంబును గలయట్టి
మహాబలాఢ్యులు నైన రాక్షసులు మానుగ యా సంఘము నందున్!
వసువుల మధ్యను దేవేంద్రునివలె వనరగ కాంతిని వెలుగొందెన్! 32

(యుద్ధకాండములోని 11వ సర్గము సమాప్తము)

* * * *

# యుద్ధ కాండము - మొదటి భాగము

## పంద్రెండవ సర్గము

[నగర రక్షణాదికము దగు విధముగా జేయవలయుననిం నిద్ర నుండి లేచిన కుంభకర్ణునకు నీ వృత్తాంతము నంతా దెలుపవలెం ననీ, రావణుడు ప్రహస్తుని యాదేశించుట]

ఇటులిప్పు డీ సమితింజయుడైనా నా రావణుడుకు స్థిరముగనూ!
పరిషత్త-తప బారజూచుచును బన్నుగ సభికుల నందఱిసీ!
వాహినీ పతియునగు ప్రహస్తునీ పనరగ యిట్లాజ్ఞాపించెన్!

ఓ సేనాపతి! ప్రహస్తుడా! విను! నగర చతుర్విధ యోధులనూ!
నగర రక్షణమునందు వేగమున జాగరూకులై యుండునటుల్
ఆజ్ఞాపింపుము! వేగము వారిని నాలస్యము మఱి లేకుండన్!

రావణభూపతితుకును ప్రహస్తుడును చక్కగ రాజాజ్ఞను వేగన్!
ప్రహస్తుడు పురి వెలుపలను, లోపలను సర్వబలంబుల నట నిలిపెన్!

ఇటు పిమ్మట నా ప్రహస్తుండును యలరుచు సమస్త బలములనూ
నగర రక్షణము కొఱకును నిలిపి నయముగ రాజేంద్రుని యెదుటన్!
నిలుచుండి ప్రహ వినయము తోడను గూరిమితో నిటులను పలికెన్! 4

బలవంతులవగు నీ సైన్యంబును బరగ పురికి వెలుపల లోనన్!
నిలిపినాను ప్రభు! నీ యాజ్ఞను నే నిశ్చితముగ నెరవేర్చితినీ!
ఏ విచారమును లేనివాడవై యిప్పుడు నీవు నిశ్చింతగనూ!
కార్యము సేయుము! రాక్షసరాజా! కలత నలత లేకుండగనూ! 5

రాక్షసరాజగు రావణాసురుడు రాజ్యహితంబును గోరెడి యా
ప్రహస్తు మాటలు విని మదిలోపల పరమ సుఖంబును గోరుచునూ!
మిత్రుల మధ్యను నీ విధంబుగా మీరిన ధీరతతో బలికెన్! 6

ధర్మ-అర్థ-కామములకు జెందిన దగు కష్టము వేర్పడి నపుడున్!
ప్రియాప్రియములను సుఖదుఃఖములను ప్రీతిని లాభాలాభములన్!

హితాహితంబును దెలిసి కొనుటకును హితాత్మకులు మీ రందఱునూ!
వానిని బాగుగ నిశ్చయింపగా నిర్ణయింపగలవారు మఱి! 7

ఎల్లపుడును మీ రారంభించిన నింపగు నాలోచనతోడన్
నిర్వహించినా నాదు కార్యములు నిర్విక్రమములై సిద్ధించెన్!
ఎన్నడు వ్యర్థము కాలేదు గదా! వెన్ను జూపగను లేమ గదా! 8

ససోమ గ్రహ నక్షత్రంబుల తోడను సరసత మరుత్తులను గూడి!
యుండినట్లుగా దేవేంద్రుడునూ యుండిరి మీరందఱు నాకున్
మీరందఱు నా చుట్టును గలరూ! మీరిన ప్రీతిని స్నేహమునన్
అఖిలైశ్వర్యంబుల పొందెదనూ యలరి మీదు సాయము జేతన్! 9

మిత్రులార! నే మీ కందఱికిని మీరిన వినయము దోడుతనూ
గుర్తుజేయుటకు యత్నించెదనూ కూరిమి తెలియును నందఱికి
కుంభకర్ణునకు మాత్రము దెలియదు గూరిమి నీవిషయంబు మఱిన్
నిద్రయందు నుండుటచే పూర్వము నిఖిల విషయములు నాతనికిన్
దెలుపలేదు మఱి తక్కిన వారికి తెలియును విషయము నంతయునూ! 10

శర్వశస్త్ర ధారులలో ముఖ్యుడు సర్వశక్తి సంపన్నుడునూ!
అట్టి కుంభకర్ణుడు షణ్మాసము అలరుచు నిద్రను నుండెగదా!
ప్రస్తుత మాతడు నిద్రను లేచెను బన్నుగ భుజియించుటకు మఱిన్! 11

రాముని ప్రియురాలైన భార్యనూ రయమున యా జనకాత్మజనూ!
మనరాక్షసులును సంచరించెడీ మానుగ దండక వనినుండీ!
కొనితేబడినది నాచేతను మఱి కనరాకుండగ రామునికిన్! 12

మందగామినీ యగు నా జానకి చందముగా నా శయనమునూ
అధిరోహింపగ గోరుటలేదూ! నాత్మ సుఖంబును గోరకనూ!
మూడులోకముల యందు సీతతో ముదమున సమానురాలైనా
ముదిత గలదనీ భావింపను నే మోదమునను ప్రియ సఖులారా! 13

తను మధ్యయు సుశ్రోణియు, మఱియును శరదిందు నిభానన మఱియున్
హేమబింబనిభ, సౌమ్యురాలు మఱి సుమనోహర రూపము గలదీ!
మయనిర్మితమగు మాయవోలె నా మనసుకు దోచుచు నున్నదియూ! 14

సులోహితంబగు నడుగుభాగములు సుశోభితంబగు మృదుత్వత్వమున్
సుప్రతిష్ఠములు తామ్ర నఖంబులు సుందరమగు పాదంబులునూ!
అట్టి పాదముల గాంచి కామమును నలరి వృద్ధిబొందుచు నుండెన్!

హోమాగ్ని జ్వాలలకు సమానంబు సూర్యకాంతి వలె యుండియునూ
ఎత్తగు నాసిక గలిగియుండియును నింపగు సుందర నేత్రములున్!
గలిగిన జానకి ముఖమును గాంచుచు గానలేక యంధుండనునై
కామంబునకును వశుండ నై తిని కడుదురపిల్లుచు నుంటి నిలన్!

క్రోధమునను సంతోష సమయమున గూడివచ్చు నాలో గూడన్
శోకమునందున సంతాపంబున సుడివలె నను జుట్టుచు నుండున్!
సత్యము వెంటాడుచు నున్నదిగా నిలువనీదు నొకక్షణమైనా!
అట్టి కామమున నిండియుంటినీ గట్టి యాపదయూ నిపు డొచ్చెన్!

శక్తుడైన శ్రీరాముని కొఱకును ప్రతీక్షించుచును నున్నదియున్
ఆయతలోచనములు గల సీతయు నడిగెను వత్సర కాలంబున్!
ఆమె కోరినా యీ శుభవచనము నంగీకారము దెలిపితినీ!
ఆగకుండ బరువెత్తు గుఱ్ఱముగ యా కామము వలనను నేనున్
అలసిపోతినో సఖులారా! మఱి యల మన్మథ వేదనతోడన్ 18-1

బహుసత్త్వంబుల సమాకీర్ణమును నక్షోభ్యంబును నైనదియున్
ఆ సముద్రమును వనౌకసులునూ యల దశరథునీ పుత్రులునూ!
ఎట్లు దాటగలరో మఱి లంకను ఎట్లు ముట్టడింపగ గలరో! 2

అంతియ కాదు సుమా! సఖులారా! వింతగ యొకవానరు చేతన్!
ఎంతనష్టమిల వాటిల్లినదో నంతయు మీకును దెలియుగదా!
కార్యగతులు దెలియగరావు సుమా కర్మగతిని యంతయు జరుగున్
మీ మీ బుద్ధుల ననుసరించియును మిగుల మేలు గలిగెడిదియునూ!
యేమి జేయ దగునో దెలుపుం డిక నింపుగ మీ మీ యోచనలన్! 21

మానవులే మనకేమి భయంబును మఱిలేదు గదా సఖులారా!
అయినను మీరును నాలోచింపుడు! నలరుచు మేధాసంపదనూ!

దేవాసుర యుద్ధంబున నే మఱి దివిజుల నందఱ జయించితిన్!
మీరును గూడను జయించితిరి గద! మీరిన వీర్యమునను సురలన్!

రామలక్ష్మణులు జానకి జాడను రయమున దెలిసీ వారలునూ!
సుగ్రీవాదులతో గూడికొనీ సురుచిరముగ యా కడలికినీ
ఆవలి తీరము జేరికొనిరిగా నలసట యేమియు లేకుండన్! 23-24

సీతను రామున కివ్వకుండగా స్థిరముగ నుండగ గలుగుదుమో!
దశరథాత్మజుల రామలక్ష్మణుల దగ జంపగ గలమో మనమున్!
ఆలోచింపుడు రాక్షసులారా! నలరుచు మేధా సంపదనూ!
ఆలోచించిన విషయంబుల నే నాలోకించెద ధీశక్తిన్! 25

అసురులు దప్ప మరెవ్వరు గూడను నఱ సంద్రము దాటగలేరూ!
కపిసైన్యముతో రాము డే విధము కదిలివచ్చు సంద్రముదాటీ?
కావున నాకే జయము నిశ్చయము కదనము నందున విజయంబున్! 26

కామార్తుండగు నా దశగ్రీవుని కలకలమను వేదనను వినీ!
అసంబద్ధమగు ప్రలాపంబులను యతి కోపంబును జెందుచునూ!
కుంభకర్ణు డీ విధమున బలికెను కూరిమి యందఱు వినునటులన్! 27

సౌమిత్రిని గూడిన యా రాముని చక్కని భార్యను జనకసుతన్!
బలాత్కారముగ దెచ్చు నప్పుడే బాగుగ యాలోచించినచో
యమునానదిలో యమున జేరినటు హర్షంబున నీ చిత్తమునూ
ఒక నిర్ణయముచు బొంది యుండెడిది యొనర దశగ్రీవా వినుమా! 28

రాక్షసేంద్ర! ఓ దశగ్రీవా! విను రమణి జానకిని దెచ్చుటకున్
ప్రారంభమునందే మా తోడను బన్నుగ యోజన జేసినచో!
బాగుండెడిది గదా! రావణ! విను! బన్నుగ కార్యము మించినదీ! 29

దశాననా! యే రాజు న్యాయముగ దగ నిశ్చితమతి యోచనతో
రాజకార్యములు జేయుచుండునో రహి పొందును ఫలితార్థంబుల్!
పశ్చాత్తాపము జెందవలసినా పని యుండదు నా రాజునకున్!
సిందువుగా బరువెత్తి వచ్చెదరు బంధులు మిత్రులు సాయముగా! 30

అనుపాయముచే జేసిన కర్మలు నలరి చెడును విపరీతములై
శుభులుగాని వారిచ్చు హవిస్సులు శూన్య ఫలితములు నిచ్చునటుల్!
ఆలోచన లేకుండ జేసినా యా కార్యంబును జెడిపోవున్! 31

పూర్వ కార్యములు వెనుక జేయునో బొలుపుగ వెనుకటి కార్యములున్
ముందుగ జేయునొ యతడు మందుడును చందముగా మఱి మూర్ఖుడునూ!
నయానయంబులు దెలియని వాడును భయాభయంబులు బీడించున్!
భంగపడును యందఱి ముందుననూ బాధలుబొందును తదుపరియున్! 32

అధికమైన బల మున్నదనుకొనుచు నలరి కార్య చాపల్యమునన్!
చేయువాని లోపముల దెలిసికొని స్థిర శత్రులు లాభంబులనూ
చెందగలుగుదురు క్రౌంచపక్షి మఱి జేసిన ఛిద్రము గనునించి
పక్షులు లాభము నందినట్లుగా బరగ బొందుదురు శత్రువులున్! 33

అప్రతిచింతితమైన కార్యమును నారంభము జేసితివి సుమా!
విషమిశ్రితమగు మాంసము వలెనూ వీరుడైన శ్రీరాఘవుడున్
అదృష్టవశమున జంపలేదు నిను నలరుచుంటివి యీ ధాత్రిన్! 34

ఓ రావణ! విను! ఆ కారణమున వనర సమారబ్ధంబైనా
అప్రతిమమునగు మహాకార్యమును నలరి జేయుదును బరిపూర్తిన్
నీ శత్రువులను నిశ్శేషముగా నిర్మూలనమును జేయుదునూ! 35

నిశాచరా! నీ శత్రువులను మఱి నిర్మూలించెద నిక్కముగా!
ఇంద్రుడైన మఱి సూర్యుడైననూ అగ్నియైన వాయువునైనన్!
వరుణ కుబేరులు నైనను గూడను వనరగ రణమును జేయుదునూ!
తప్పుజేసినా నీ గౌరవమును దగ సరిజేసెద రాజేంద్రా! 36

పర్వతమాత్ర శరీరము గలిగి ప్రబలమైన పరిఘను గలిగి
తీవ్రములైనా కోఱలుగలిగి తీవ్రమైన యఱపులుగలిగి
రణమును జేసెడి నన్నుజూచి మఱి రహి దేవేంద్రుడు భయపడునూ! 37

రాముడు నన్నొక బాణము జేతను రయమున గొట్టియు నతడు మఱిన్
రెండవబాణము బట్టక పూర్వము జెండుచు నాతని శోణితమున్
త్రాగివేసెదను రావణ వినుమా! దగ నా దాహము దీరగనూ!
నిర్భయంబుగా నీవుండుము నిక నిజ రాజ్యంబును జూచుచునూ! 38

దశరథరాముని సంహరించి మఱి దగ నీకును సుఖ సౌఖ్యంబుల్
గలిగించెడి విజయంబు నొసగుటకు గదగి ప్రయత్నము జేసెదనూ!
లక్ష్మణు దోడుత నంతము జేసెద లావు బలాఢ్యుని శ్రీరామున్
వానరవీరుల నందఱ గూడను వనర జంపి తినివేసెదనూ! 39

అన్నా! రావణ! యఖిల సుఖంబుల నలరుచు గ్రీడింపుము నింకన్!
శ్రేష్ఠమైన మద్యములను గ్రోలుము! స్థిర సంతుష్టుడవును గమ్మా!
మనోవ్యధను మది వదిలి సుఖంబును మంచి కార్యములు జేయుమికన్!
రాముని బంపెద యమసదనమునకు రమణి సీత నీ వశమగునూ!
చిరకాలము సుఖ మనుభవింపుమా! చెదరని నా బల వీర్యములన్ 40

(యుద్ధకాండమునందు 12వ సర్గము సమాప్తము.)

* * * *

## పదుమూడవ సర్గము

(సీతను బలాత్కారముగా ననుభవింపుమని మహాపార్శ్వుడు జెప్పగా, బ్రహ్మశాపముండుటచే అట్లు చేయజాలనని జెప్పుచూ రావణుడు తన పరాక్రమమును బ్రశంసించుకొనుట)

కుంభకర్ణు మాటలకు రావణుడు క్రోధించిన వానిగ దెలిసీ!
మహాబలుండగు మహాపార్శ్వుడును మానుగ ముహూర్త కాలమున
ఆలోచించియు నా రావణునీ యరి శాంతమును జేయుటకై
అంజలి ఘటించి యా రాక్షసుడును నభిప్రాయమును బ్రకటించెన్ 1

ఏ పురుషుడు మృగవ్యాల నిషేవిత నింపగు వనమున జేరియునూ
తేనె బట్టులను బొందియు గూడను దేనెను ద్రాగనివాడు నిలన్
మూఢుండనియును దెలుపగ వచ్చును మూర్ఖుండందురు లోకమున 2

శత్రునిబర్హణ! రాక్షసరాజా! సర్వసమర్థుడ వీవు మఱిన్!
నీకు ప్రభువు మఱి లేడుగదా! యీ నిఖిలమందు మఱి యెవ్వండున్
శత్రుశిరములను పాదమునుంచీ సీతను బొందుము గ్రీడింపన్! 3

మహాబలా! ఓ రాజేంద్రా! నిను బన్నుగ నా వాక్యంబులనూ!
బలాత్కారముగ కుక్కుట వృత్తిని బ్రవర్తింపుమూ! వేగ నికన్
ఆక్రమింపుమూ! యనుభవింపుము! యానందింపుము దశాననా! 4

లబ్ధకాముడవు నైన నీకు మఱి లాలితముగ భయ మేముండున్?
అటులైనను నే యపాయమైనను చటుల గతిని మఱి వచ్చినచో
దానికి మఱి రానున్న దానికిని దగ ప్రతిక్రియ జేయగవచ్చున్! 5

కుంభకర్ణుడును మహాబలుండగు శుంభ విక్రముండగు వాడున్
ఇంద్రజిత్తు మాతో గూడుకయును సాంద్రగతిని యని జేయుదుమూ!
వజ్రాయుధమును ధరించినా యా వజ్రిని గూడను యుద్ధమునన్!
ఎదిరించుటకును సంసిద్ధులమూ యింపుగ జయమును సాధింపన్! 5

కార్యకుశలురును ప్రయత్నించెదరు కార్యములను సాధించుటకై
సామదాన భేదంబుల తోడను సాధింతురు తమ కార్యములన్!
ఆ మూడింటనుగాక దండమును నవలంబించుట మంచిదనీ
నా కిష్టము సుమ! రాక్షసరాజా! నయముగ యెవరేమనిన యికన్! 7

మహాబలా! ఓ రాక్షసరాజా! మానుగ యిచటికి వచ్చిన నీ
శత్రుల నందఱ జయింపగలమూ సైనిక యాయుధ బలములచే
సంశయమింతయు లేదుసుమా మఱి సాగింపుము రణమును నీవున్ 8

రాక్షసరాజగు రావణాసురుడు రంజిల్లుచు దన మనసుననూ!
మహాపార్శ్వునీ మాటలు వినుచును మదిని మెచ్చుకొని యిటు లనియెన్!9

మహాపార్శ్వుడా! మానుగ వినుమా! మఱి నా సంబంధించినదీ!
ఒక రహస్యమును దెలిపెద వినుమా! వనరగ పూర్వము జరిగినదీ!
నాకును సంబంధించిన వృత్తము నయముగ తెలుపుచు నున్నాడన్! 10

అగ్నిశిఖను వలె ప్రకాశించెడీ యలరెడి పుంజికస్థలి యనెడీ
అప్సర ననుగని భయపడుచును మఱి యటునిటు నక్కుచు గగనమునన్
బ్రహ్మదేవునీ గృహమునకును మఱి బన్నుగ బోవుట గాంచితినీ! 11

వివస్త్రగా నప్సరస జేయబడి వికృతముగ బలవంతముగా
అనుభవింప బడినది నా చేతను నటుబిమ్మట నామెయు వేగన్!
నలిపివేసినా పద్మలతకు వలె నయముగ రోదించుచును మఱిన్!
పద్మసంభవుని భవనము జేరెను బన్నుగ వేదనతో గూడీ! 12

అప్పుడా విషయమంతయు గూడను నా మహాత్ముడగు బ్రహ్మకునూ
తెలిసినదనుచును భావింతును నే తెలిపె నేమొ యా యచ్చరయున్
అటుబిమ్మట కోపించి వేధయును జటులత నీ విధమున బలికెన్! 13

అద్య ప్రభృతి నే స్త్రీ నైనను నలరుచు బలవత్కారముగా
బొందినచో నీ శిరస్సు పగులును వందల ముక్కలు నగును సుమా!
సందేహము లేదిది నా శాపము మందభాగ్యుడా బొమ్మికన్! 14

ఈ విధముగ నాతని శాపమునకు యిది మత్కృత దుష్కృతమునకున్
ఫలితంబని నే మదిని తలంచుచు బరగ వచ్చితిని లంకకునూ!
ఆ శాపమునకు భయపడి సీతను ప్రసభముగను బలవంతముగా
సుందరమగు నా మృదులశయ్యపై యందముగా నెక్కించుటకున్
భయపడుచుంటిని మహాపార్శ్వుడా! బరగ నాదు వృత్తాంత మిదీ! 15
మహాపార్శ్వ విను! నా పరాక్రమము మహాసాగరము వంటిది సూ!
నా గమనము వాయువువంటిది సుమ! నయముగ రాముడు యెఱుగడుగా!
అందువలననే నా సమీపమును చందముగా వచ్చుచు నుండెన్! 16
గిరి గుహయందున నిదురబోవు నా సింహము నెవ్వడు మేల్కొల్పున్!
కోపించిన మృత్యువునకు వోలెను గూడియున్న వానిని నన్నున్!
లేపుట కెవ్వడు యత్నము జేయును నా పరాక్రమము దెలియదుగా! 17
యుద్ధమందు నే ప్రయోగించెడీ పద్ధతుల మఱి దెలియడుగా!
రెండు నాల్కలా సర్పంబులవలె నిండు పొదుల బాణంబులనూ!
చూడలేదు రాముడు నందులకే చూడ్కి దప్పి గనుటయులేదూ!
అందులకే నన్నెదిరించుటకును కందుగ నిటు వచ్చుచు నుండెన్! 18
వందల సంఖ్యను ధనుస్సునుండీ జిందుచు వెలువడు బాణములన్
ఆ రాముని నే బీడించెదనూ యలరుచు గ్రీడకు వలె నేనున్!
కౌరవులచే బీడించి నట్లుగా కుంజరమును గానన మందున్
అటులే నేనును నా శ్రీరాముని చటులగతిని వేధించెదనూ! 19
మహోన్నతంబగు నా సైన్యముచే మానుగ ప్రాతః కాలమునన్
ఉదయించిన యా సూర్యుడు వేగము నుడుకాంతుల గగనము నందున్
అణచినటుల నే రాముని బలమును యణచివేతు క్షణమందుననూ! 20
సహస్ర నేత్రుడు యింద్రుడుగానీ సాహసవంతుడు వరుణుండున్!
యుద్ధమందు నను గెలువగ జాలరు సిద్ధిని నందగ జాలరుగా
వైశ్రవణునిచే బాలింపగబడి వన్నెలు జిందెడి యీలంకన్!
జయించినాడను బాహు బలంబున జగమెఱుగును నీ సత్యంబున్! 21

(యుద్ధకాండములోని 13వ సర్గము సమాప్తము)

# యుద్ధకాండము - మొదటి భాగము

## ప దు నా ల్గ వ స ర్గ ము

(రాముని బాణములు రాక్షసుల శిరస్సులను ఖండించుటకు పూర్వమే సీతను రామునకు నిచ్చివేయమని విభీషణుడు రామునకు ఉపదేశించుట)

నిర్భయుడును మఱి నిశాచరేంద్రుడు నిరంకుశుడు రావణు బలుకుల్
కుంభకర్ణుని గర్జితములనూ కూరిమి వినియు విభీషణుడున్!
అర్థయుక్తమగు హితమును గూడిన శ్రద్ధాభక్తియు గలిగియునూ
అన్న దశగ్రీవునితో బలికెను నాదరమున గారవముననూ! 1

రాజా! జనకజయను సర్పంబును రమ్యముగా నీ కంఠమునన్
చుట్టబెట్టినా వాడెవ్వడు సుమ! చోద్యము రాక్షసరాజేంద్రా!
విశాలమైనా శరీరమే మఱి విమల సీత యని దలపు మదిన్!
వక్షస్థలమే దీనికి పడగల వైశాల్యముసుమ దశగ్రీవా!
చింతయే విషమ! చిఱునగవే మఱి వింతకోరలని భావింపూ!
పంచాంగుళులే పంచ శిరములని బరగ మదిని భావింపు మికన్! 2

కోరలు, గోళ్లను నాయుధములుగా గూరిమి యుపయోగించుచునూ!
పర్వత శిఖర ప్రయాణవంతులగు బన్నుగ యా వానరవీరుల్!
లంక పైని బడి నాశము జేయక ముందే యా శ్రీరామునకున్
జనకసుతను నర్పింపుము వేగము జరిగిన దానికి జింతిలుచున్! 3

వజ్రోపములును వాయు సమానము వనరగ వేగము గలదియునూ!
శ్రీరామునిచే విడిచెడి శరములు శీఘ్రము రాక్షస యోధులనూ
శిరస్సులను భేదింపక ముందే శీఘ్రము నిమ్మా రాజేంద్రా!
జరిగిన దానికి మది జింతిల్లుచు జనకసుతను రామున కిమ్మా! 4

కుంభకర్ణుడును, నింద్ర జిత్తునూ శుంభవిక్రములు రాజేంద్రా!
మహాపార్శ్వుడుచు, మహోదరుండును నూనుగ నికుంభ కుంభుడునూ
అతికాయుండును నా రామునితో నలరి యుద్ధమున సరిరారూ!
ఎదుట నిలువగను లేరు సుమా! మఱి నింపుగ శ్రీరాముని యెదుటన్! 5

సూర్యునిచేత మరుత్తుల జేతను సూటిగ రక్షణ బొందిననూ!
జీవముతో నుండగ రాముడు నిను జీవముతో విడువడు సుమ్మా!
దేవేంద్రుని యంకమును బొందినను దీరుడైన యా మృత్యువునూ!
రక్షణబొందినగూడ వదలడూ రాముడు ధర్మపరాయణుడూ!
ఆకాశము పాతాళము లందున నటు దాగిన నిను విడువడుగా!

విభీషణుని యా సాధు వాక్యములు విని ప్రహస్తుడును బలికె నిటుల్
భయమన్నది మాకును లేదు సుమా! భయమన్నది యెఱుగము మేమూ!
దేవదానవుల వలనగాని మఱి ధీర విక్రములు నెవరైనా!

యక్షుల నుండియు, గంధర్వుల మఱి పక్షులనుండియు గాని మఱిన్
మహాసర్పముల నుండిగాని మఱి మాకు భయంబును లేదు సుమా!
అట్టి మాకు నా రాజకుమారుడు నల రామునిచే యుద్ధమునన్
భయము గలుగునా విభీషణా! విను! భయము లేదు మా కింతయునూ!

ధర్మార్థ కామముల విషయము లందున దగు స్థిరబుద్ధియు గలవాడున్
రాజు హితంబును గోరెడి వాడును రాజనీతి దెలిసిన వాడున్!
హితముగాని యా ప్రహస్తు మాటలు మితములేని యా గర్జనలన్
విని విభీషణుడు నిటులను బలికెను విమల మహార్థ సువాక్యములన్

ఓ ప్రహస్తుడా! మనరాజును మఱి యొప్పుగ మహోదరుండు మఱిన్
నీవు కుంభకర్ణుండు జెప్పినది నిజముగ జేయుట యన యనగా
అధర్మశీలుడు స్వర్గము బోవుట యనునది యెటు సాధ్యము కాదో!
రాముని జంపుట యనునది గూడను రహి యటులను సాధ్యము గాదూ! ।।

నీచేతను నా చేతను గానీ నిఖిల రాక్షసులచేగానీ!
అర్థవిశారదుడైన రామునీ యలరి వధించుట కానిపనీ!
నావలేని వానికి మహార్ణవము నయముగ దాటుటయును బోలెన్
ఎట్లు శక్యమగునో ప్రహస్తుడా! యెఱుగవు శ్రీరాముని శక్తిన్! 1

ధర్మప్రధానుడు మహారథుండును దగ యిక్ష్వాకుల వంశమునన్
ప్రభవించిన వాడును సమర్థుడును బరగ కార్యముల ప్రవీణుడున్!

అట్టి రాముని సమక్షమందున గట్టి వీరులును దేవతలున్
మూఢులయ్యెదరు రాక్షస వీరా! మోహంబున యెదిరింపకనూ! 12

ప్రహస్తుడా! విను! దీవ్రములైనవి కంక పత్రములు గలవియునూ!
దురాసదములగు రాఘుబాణములు దూరలేదు నీ శరీరమున్!
అందుచేతనే దంభపు మాటలు చందముగా బలికితి విపుడున్! 13

ప్రహస్తుడా రాఘవుడు విడిచినా పన్నుగ వజ్ర సమానములున్
ప్రాణాంతకములు వాడియైన యా బాణంబులు నీ శరీరమున్!
ఛేదింపగలే దందుచేతనే ప్రేలుచుంటివి నీ విటులన్
బడాయి మాటలు బలుకుచు నుంటివి బన్నుగ యంచటి ముందరనూ! 14

శక్రసముండగు దశరథ రాముని సహించుటకు యుద్ధము నందున్
సమర్థుండు రావణుడును గాడూ సరసత యతి బలవంతుడునూ
త్రిశీర్షుండునూ కాదుసుమా! మఱి దీరుగ బహు విక్రముడైనా
కుంభకర్ణుని కుమారుడైన నికుంభుడు గూడను గాదుసుమా!
ఇంద్రజిత్తు మఱి నీవైనను సరి సాంద్రసమర్థులు గారు మఱిన్! 15

దేవాంతకుడును గాని మఱియునూ నరాంతకుడునూ గాని మఱిన్!
అతిరథుండునూ మహాత్ముడైనా యతికాయుండును గాని మఱిన్
వజ్రసమానము నగు సారముగల యా యకంపనుడుగాని మఱిన్
యుద్ధమందు శ్రీరాముని యెదుటను సిద్ధము నిలువగ జాలరుగా! 16

దుర్వ్యసనాలకు లొంగినవాడును దోష స్వభావము గలవాడున్
తీక్షణభావము గలవాడును మఱి దీరుగ యోచన లేకుండన్!
కార్యంబుల మఱి జేసెడివాడును గఠినత్వంబును గలవాడున్!
అట్టిరాజు నతడేమి జేసినా గట్టిగ యెదిరింపగ లేకన్
మీరందఱు గడు మిత్రులైననూ! మీరలు మిత్రులకు వోలెన్
దలలూపుచు నున్నారు మఱియునూ దగయగ్నికి వాయువు వోలెన్!
ఇక రాక్షస వినాశనమువకును నిమ్మగ దారేర్పడు చుండెన్! 17

అనంతమగు ఘన శరీరంబునూ యనంత శిరసులు గలదియునూ!
మహాబలంబును గలదియు మఱియును మహాభయంకర సర్పముచే!
బలాత్కారముగ పరిక్షిప్తంబై బంగబరుపగా నున్నదిటన్!
అట్టిరాజునూ మీ రందఱునూ గట్టిగ విడిపింపగ వలయున్! 1

పూర్ణమైన కామముల బొందెడి బొలుపగు స్నేహితు లందఱునూ!
భయంకరంబగు భూతంబులచే బట్టువడిన మన రాజేంద్రున్
రక్షింపగనూ వలెనుగదా మఱి రహి భూతంబుల వలనుండీ!
బలాత్కారముగ కాపాడగ వలె బట్టి జుట్టు బట్టుక యైనన్! 19

రాముఁడనే యా మహాసాగరము రహి రావణు గప్పుచు నుండెన్!
రాముడనే పాతాళ ముఖంబున రహిబడి పోవుచు నున్నాడుంన్
ఆపదలో నున్నట్టి రాజునూ యరసి వేగ కాపాడవలెన్
నావమునిగి పోకుండగ మీరలు నయముగ రక్షింపగ వలయున్! 20

రాక్షసులకు మఱి యీ పురమునకును రహి రాజేంద్రుని మిత్రులకున్!
నాకు నిష్టమగు వచనంబును నే నయముగ దెలుపుచు నున్నాడన్!
మహారాజు దశరథ పుత్రుండగు మానుగ శ్రీరామునకు దగన్
జనకసుతను నర్పింపగ వలెనూ జరిగినదానికి జింతిలుచున్! 21

శత్రుబలంబును దన బలంబునూ చక్కని బుద్ధిని గ్రహియించీ
అట్లే స్వపక్ష స్థితి క్షయంబునూ యట్లే వృద్ధిని దెలిసికొనీ!
ఆలోచించియు నన్ని విధములను సరి స్వామి హితమును దలచీ!
హితమగు వాక్యము బలుకుచుండునో నీతివిదుడు నతడే మంత్రీ!

(యుద్ధకాండమునందు 14వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# యుద్ధకాండము - మొదటి భాగము

## పదునైదవ సర్గము

[ఇంద్రజిత్తు విభీషణుని మాటలను నధిక్షేపించుట - విభీషణుడు అతనికి సమాధానము జెప్పుట రాముని యనుగ్రహము సంపాదించుటగే యుక్తమని దెలుపుట]

అల బృహస్పతికి సమమగు బుద్ధియు నలరెడి యట్టి విభీషణుడున్
బలికినట్టి యా వాక్యములను విని ప్రబలుడు మఱియు మహాత్ముండున్
ఇమ్మగ రాక్షససేనా ముఖ్యుడు యింద్రజిత్తు నీ విధి బలికెన్! 1

పినతండ్రీ' యిటు లేల బలికెదవు పిరికి దనము మఱి యనర్థముల్
భయబడుచుంటివి యని భావించుచు బాధ నొందుచున్నాడను నే!
మన కులంబునను బుట్టని వాడును మఱి సామాన్య కులంబులలో
వుట్టిన వాడును నీ దృశవాక్యము లిట్టి బలుక డో పినతండ్రీ!
ఈ విధముగ మఱి మాటలాడడూ! యీ విధముగ వర్తింపడుగా! 2

మన కులంబులో రాక్షసులారా! మానుగ బల వీర్యంబులునూ
పరాక్రమము మఱి శౌర్య తేజములు బన్నుగ విక్రమ దీప్తియునూ
లేని వ్యక్తి మా తండ్రి సోదరుడు లీల విభీషణు డొక్కండే
సిగ్గు బడుచునుంటిని సఖులారా! చిన్నబోవుచుంటిని యిచటన్!

పిరికివాడ! మమ్మేల యిట్టులను భీతిని గలుగగ జేయుచునూ'
యడల జేయుచుంటివి భీతిల్లగ యతిశయములు బలుకుచు నిచటన్!
మనుష్య మాత్రులు రాజపుత్రులును మఱి మాకు జయింపగ నెంతా?
మనలో ఒక సామాన్య రాక్షసుడు మానుగ వధించు వారలనూ!
ఎందుకిట్లు భయపెట్టు చుంటివో చందముగా నెఱుగము దండ్రీ! 4

త్రిలోక నాథుండైన యింద్రుడును దీరుగ నాచే ద్రోయబడి!
భూమిపైని బడిపోయినాడు గద భూరి విక్రముదనగు నాచే!
భయపడి దేవత లందఱు గూడను పాఱిపోయిరీ దిక్కులకున్! 5

వికృత స్వరమున యఱచుచున్న యా విమలమైన యైరావతమున్!
బలాత్కారముగ నేలపై బతగ బరగ జేసితిని యానాడున్!
దాని దంతముల నూడ బెఱికితిని దగ దేవతలందఱు జూడన్!
దేవతాగణము బరుగు లెత్తినది దిక్కులు దిశలకు వేగముగన్!

దివిజ గణంబుల గర్వమడచినా తేజుడ, పేరుడ రణమందున్!
ఉత్తములైనా దైత్యుల గూడను నురుకు లెత్తునటు జేసితినీ!
అట్టి మహా విక్రముడ నైన నే గట్టిగ సామాన్యులు నైనా
మనుష్యమాత్రుల నరేంద్రాత్మజుల మానుగ జయించగను లేనా! 7

అటువిమ్మట యింద్రుని సమానుడును నటు నెదిరింప నశక్యుండున్
మహాతేజమును గలవాడును నగు మఱి యింద్రజిత్తు మాటలమా
శస్త్రధారులను శ్రేష్ఠుండైనా సరసత బలికె విభీషణుడున్
మహార్థమునుగల సురుచిర వాక్యము మంజులాక్షరములను గూడి! 8

నాయన నీవిక చిన్నవాడవును నయముగ యాలోచనయందున్!
నిశ్చిత బుద్ధియు లేనివాడవును నిర్ణయములు జేయగలేనీ
అపక్వ బుద్ధియు గలవాడవును అందుచేత నీ విధమునసూ!
ఆత్మవినాశమునకు నీ విట్టుల యర్థములేనీ వాక్యములన్!
బలికిన వాడవు! భాగ్య విహీనత ప్రబలమైన యీశ్వర లీలన్! 9

ఇంద్రజితూ! శ్రీరాముని నుండీ యింపుగ నీ తండ్రికిని నికన్!
గలుగనున్న యాపదను నెఱింగియు గలతలేక యంగీకృతమున్!
తెలుపుచుంటివీ తండ్రీ! మిషచే దీరుగ రావణు పుత్రుడనే
మిత్రుడనే ముఖమును గల శత్రువు మేలిమి గనబడు చుంటివిగా! 10

చంపదగిన వాడవు నీవే సుమ! కంపము జెందెడి బాలుడవూ!
సుసాహసుండవు నగు నిన్నచటికి సురుచిరముగ బిలిచిన దెవరో
మంత్రణంబు జేసెడి వారలలో మఱి గూర్చొన జేసిన దెవరో?
కుటిలబుద్ధి గలిగిన వాడెవడో కూరిమి యాతని గూడ మఱిన్!
చంపదగిన వాడగును సుమా! మఱి యంపదగును సుమ! యమపురికిన్! 11

ఇంద్రజితూ! మూఢుండవు నీవును మందబుద్ధిగలవాడవునూ!
అవినయుండవు నీ స్వభావమును నతి తీక్షణమును నైనదియున్!
అల్పబుద్ధి గలవాడవు నీవును నతి దురాత్ముడవు! మూఢుడవున్!
చెడ్డబుద్ధిగలవాడవు నీవును చెనటివి! తెలియక పోవుటచే
మాటలాడుచుంటివి మఱి నీ విటు మరియాదింతయు లేకయునూ! 12

బ్రహ్మదండ ప్రతిమ ప్రకాశములు బన్నుగ రాముని బాణములున్!
కాంతి కిరణములు గలవియు మఱియును కాలనికాశములగు నవియున్!
యమదండముతో సమానమైనవి యట్టి వాడి బాణంబులనూ!
రాముడు రయమున రణమున నిలచి రమ్యముగా వదులుచు నుండన్
ఎవడు సహింపగ గలవాడు నిలన్! నెవడు నిలువ గలవాడు మఱిన్! 13

రాజా! రత్నములను, ధనంబులను, రమ్య సుభూషణములు మఱియున్!
దివ్యములైనా వస్త్రంబులనూ దీరుగ చిత్రములైన మణుల్!
సీతాదేవిని యర్పింపుము మఱి శీఘ్రము శ్రీరఘురామునకున్
పోయిన శోకము గలవారమునై పొలుపుగ వసింత మందఱమున్! 14

(యుద్ధకాండమందు 15వ సర్గము సమాప్తము)

  

# యుద్ధ కాండము - మొదటి భాగము

## పదునారవ సర్గము

[రావణుడు విభీషణుని దిరస్కరించుట — విభీషణుడు అతనిని విడిచి వెళ్ళిపోవుటకు నిశ్చయించుకొనుట]

సునివిష్టంబును హితమైనదియును సురచిర వాక్యము బలికిన యా
విభీషణునితో రావణాసురుడు విషమ వాక్యముల నిటు పలికెన్!
కాలచోదితంబైన వార లిల గడగి వినరు హితవచనములన్! 1

శత్రువుతో గూడను, సర్పముతో జేరి వసింపగ వచ్చు నిలన్!
ఆశ్చర్యము లేదందురు బెద్దలు నలరి మిత్రునని జెప్పికొనీ
శత్రువుతో మాత్రము నివసింపగ శక్యము గాదందురు బెద్దల్! 2

ఓ రాక్షసుడా! విభీషణా! విను! వనరగ సమస్త లోకములన్
జ్ఞాతుల స్వభావ మెట్లుండెడినో మతిని దెలియు నా కంతయునూ!
ఈ జ్ఞాతులు మఱి యెల్లప్పుడునూ తమ జ్ఞాతుల యాపదలందున్
సంతోషించుచు నుందురు రాక్షస! సరసత్వంబును జిందుచునూ! 3

ప్రధానుండు మఱి కార్యసాధకుడు బరగ ధర్మశీలుడు మఱియున్
ధర్మ స్వభావము గలవానిని మఱి దగ విద్యావంతుని మఱియున్
శూరుడైన యా జ్ఞాతిని జ్ఞాతులు జూచుచుందు రవమానమునన్!
దిరస్కరించుచు నుందురు వానిని దీరుగ వ్యతిరేకించుచునూ! 4

క్రూరులైన జ్ఞాతులు దమ మదిలో కూరిమి భావములను దాచీ
ద్రోహ చింతగలవారై మిక్కలి స్నేహం బింతయు లేకయునూ!
జ్ఞాతికి యాపద వచ్చినప్పుడు మఱి సంతోషించుచు మదియందున్!
ఒకరితో నొకరు జెప్పికొనుచునూ వనరగ సంతస మందుదురూ!

పద్మవనములో పూర్వమునందున బరగ పాశముల ధరియించీ
వచ్చిన నరులను గాంచి యేనుగులు మచ్చికతో బలికిన బలుకుల్!
ఆ శ్లోకంబులు ప్రసిద్ధంబులును నలరి వినగ వచ్చుచు నుండెన్ 6

అగ్ని వలన మనకింత భయంబును నలరి బొందగను లేము మఱిన్!
శస్త్రంబులచే, పాశంబులచే విస్తృతమగు భయమును లేదూ!
స్వార్థ ప్రయుక్తులు క్రూరులైన యా సరసత జ్ఞాతుల కార్యములన్
మనకు భయంబును గలిగించును సుమ! మానసమందున యెల్లపుడున్! 7

ఈ జ్ఞాతులు మనలను బంధింపగ యింపుగ దెలుపుదు రుపాయముల్
సంశయంబు లేదెంత మాత్రమును సాహసవంతులు వినుడు మఱిన్
సమస్తమగు భయముల కంటెను మఱి జ్ఞాతి భయం బది గొప్పదిగా! 8

గోవులయందున సంపదయున్నది కూరిమి జ్ఞాతుల నుండి మఱిన్
భయమున్నది సుమ! స్త్రీలయందునను చాపల్యము దాగున్నదిగా
విప్రుని యందున దపస్సు యున్నది వింతగ యున్నవి లోకమునన్! 9

సౌమ్య! విభీషణ! యా కారణమున సకల లోకముల యందుసనూ
పూజింపగ బడు వాడను నే గద! పురుషోత్తములగు వారలచే!
ఐశ్వర్యంబును నధికారంబును నలరి పొందినా వాడనుగా!
శత్రుబలంబుల నణగ ద్రొక్కితిని సాహస వీర్యంబుల జేతన్!
ఇది జూడగ లేకుంటివి గాదా! యిష్టము లేదుగదా! నీకున్! 10

పుష్కరపత్రము లందుబడిన యా తోయబిందువులు నే రీతిన్
ఆకులతో సంబంధము బొందక నలరుచు స్నేహము నందకనూ!
అనార్యులందున స్నేహము గూడను నంటక ముట్టక యుండు ధరన్!
కావున నీవును నంటక ముట్టక కడుదూరంబున నుంటివిగా! 11

శరత్కాలమున గర్జించిన యా చంచలమగు నా మేఘములున్
ఎంత కురిసినను భూమి దడియుటను నింతయు జరుగదు నిక్కముగన్!
అనార్యులందున స్నేహము గూడను నా విధముగనే యుండు ధరన్!
కావున నీవును నంటక ముట్టక కడు దూరమున నుంటివిగా! 12

మకరందంబును గ్రోలుచున్న యా మధుకరమును యా కుసుమమునన్
ఆసక్తిని మఱి నిలిచియుండదో నా విధముగ నీవును నట్లే!

రామునియందే నిలిచి యుంటిపీ రమ్యముగా విడిచియు నన్నున్
అనార్యులందున స్నేహముగూడను నంటక ముట్టక యుండు ధరన్!
కావున నీవును నంటక ముట్టక కడుదూరంబున యుంటి విలన్!

మధుకరంబునూ బహు నాసక్తిని మమత కాశ పుష్పంబుననూ!
వ్రాలి మధువులను గ్రోలుటకొఱకై వనరగ యత్నించిన గూడన్!
దానికి రెల్లున రసమేమియునూ దగ లభింపనటు లా రీతిన్
అనార్యులందున స్నేహము గూడను నంటక ముట్టక యుండు ధరన్!
కావున నీవును నంటక ముట్టక కడు దూరంబున యుంటి విలన్! 1

ఏ విధమున గజమును ముమ్మందుగ మోదముననను జలకము లాడీ
పైకివచ్చి మఱి తుండము దోడుత బరగ బూడిదను గైకొనుచున్!
తన శరీరమున జల్లుకొనుచునూ తన్మయ మగుచుండును నట్లే!
అనార్యులందున స్నేహము గూడను నంటక ముట్టక యుండుధరన్!
కావున నీవును నంటక ముట్టక కడు దూరంబున యుంటి విలన్! 1

ఓ నిశాచరా! యెవ్వడైన మఱి వనరగ నీ వలె బలికినచో
ఈ ముహూర్తమున వానిని ధరపై నింపుగ లేకుండెడి యటులన్!
జేసెడివాడను ఛీ! ఛీ! కులమును జెఱచినట్టి దుర్మతి వీవున్!
కనులముందు మఱి గానిపింపకుము కదకు బొమ్ము! వే వేగముగన్! 1

రావణుండు నీ విధముగ బలుకగ రమ్య స్వభావము గలవాడున్!
న్యాయము బలుకు విభీషణుండునూ నయముగ గదనూ ధరియించీ!
ఆకాశములోనికి దా నెగిరెను నత డా పలుకుల సహిలపకన్!
ఆతనితోని నలువురు రాక్షసులును నంబరమున నెగిరిరి వేగన్! 17

జాతక్రోధుడై శ్రీమంతుండగు మతిమంతుండు విభీషణుడున్!
ఆకాశములో నిలిచి సోదరుడు నా దశకంఠునితో బలికెన్! 18

అన్నా! నీవును నాకు నన్నవును నను! దూషణము లెన్నయినన్!
జ్యేష్ఠ సోదరుడు పితృసమానుడు నిష్ఠము లేకున్నను మఱియున్

గౌరవింపవలసిన వాడే సుమ! గౌరవింపదగు బూజ్యతనూ!
కానీ నీవన్నవు నయినను మఱి కఱకు బరుష వాక్యంబులనూ
వినజాలను నే సహింపజాలను వేగము బోవుచు నున్నాడన్! 19

కాలంబునకును లొంగిన వారై కర్మగతిని యకృతాత్మకుల్!
హితముగోరి చెప్పిన వాక్యములను వినరుగదా మఱి లోకమునన్!
మంచినిగోరీ నే జెప్పినదీ యంచితముగ వినలేవు గదా! 20

రాక్షసేంద్ర విను! నా వాక్యములను రహి ప్రియవాదులు లోకములో
సులభముగా లభ్యము గాగలరూ చోద్యముగా విని నా మాటల్
అప్రియమైనను హితమును జెప్పెడి యా పురుషులు బహు దుర్లభులున్!
అట్టి సువాక్యము వినెడి వాడునూ యరుదుగ నుందురు నీ జగతిన్! 21

సర్వభూతముల హరించు నట్టీ సరగున యాకాలుని చేతన్!
గట్టగబడి పాశంబుల జేతను గాలగతిని బొందుచునుందన్!
కాలిపోవుచున్నట్టి గృహంబును గదగి యుపేక్షింపగ లేమో!
అటులే నిన్నును నుపేక్షించి మఱి యలరి యూరకుందగ జాలన్! 22

దీప్తపావకాసంకాశములై దీరుగ కాంచన భూషణమై
వాడియైన యా బాణంబులచే వలనొప్పగ శ్రీరాముండున్
నిన్ను రణంబున చంపుచుండగా నే జూడగ జాలను సుమ్మా! 23

శూరులు వీరులు బలవంతులు మఱి సురుచిరమగు నస్త్రములందున్
ప్రయోగింపగా నేర్చిన వారును బరగ కాలమున కట్టబడీ
ఇసుకను గట్టిన యానకట్టలుగ నశింతు రిల దుష్కర్మములన్! 24

అన్నవగుటచే హితమును గోరీ యలరి జెప్పితిని హితంబునూ!
క్షమింపవలయును నన్ను సోదరా! శాంతిగ యుండుము నీ వింకన్!
నిన్ను మఱియు నీ నిశాచరులనూ బన్నుగ యీ లంకాపురినీ
అన్ని విధములను గాపాడుము నిక అలరి బోవుచున్నాడను నే!
నీకు స్వస్తి! మఱి నే లేకుండగ నీవుండుము సుఖములు గలుగన్ 25-26

రాక్షసరాజా! హితమును గోరీ రమ్యమైన నా వచనములన్
నివారింపబడుచున్నవి నీచే నీతివాక్యములు లోకములో
కాలము విపరీతము నగునప్పుడు గతాయువులు నగు వారు నిలన్
మిత్రులుజెప్పిన మంచిమాటలను మీరుచు వినరుగదా! జగతిన్! 27

(యుద్ధకాండములోని 16వ సర్గము సమాప్తము)

★ ★ ★

## యుద్ధకాండము - మొదటి భాగము

### పదునేడవ సర్గము

[విభీషణుడు శ్రీరాముడు యాశ్రయించుటకు బోవుట- అతనికి యాశ్రయ మిచ్చు విషయమునుగూర్చి రాముడు మిత్రులతో, మంత్రులతో ఆలోచించుట]

విభీషణుడు నా రావణుతోడను విమల బరుష వాక్యంబులనూ
పలికి వేగమున బయనము జేసెను బరగ యుదధి తీరంబునకున్!
లక్ష్మణ సహితుండైన రాముని లాలితముగ వీక్షించుటకై
ముహూర్తకాలమునందు జేరెనూ మోదము జెందుచు మనసుననూ! 1

మేరుపర్వతాకారముతోడను మిగుల ప్రకాశము గలిగియునూ
మెఱుపువోలె మఱి యున్నవాడునూ మేఘంబులలో నుండిన యా
విభీషణుని జూచిరి వానరులును విమలమైన భూస్థలినుండీ
ఆశ్చర్యంబును బొందిరి వారలు నా రాక్షసులను గాంచుచునూ! 2

భయంకరంబగు బరాక్రమముగల బన్నుగ నలుగురు సహచరులున్
విభీషణునితో గూడియుండిరీ విమలమైన యా గగనమునన్!

ఆయుధములనూ కవచంబుల మఱి యలరు స్వర్ణ భూషణములనూ!
అలంకరింపగబడి వారలునూ యలరిరి వినువీధిని వారున్! 3

మేఘమువలె మఱి పర్వతంబువలె మిగుల సాహసుండగు వాడున్
వజ్రాయుధ సమ కాంతిగలిగినా వనర వీరుడగు విక్రముడున్!
విభీషణుండు వరాయుధములనూ విమల విభూషణములు గూడన్
ధరించియుండుట వానర వీరులు దగ గాంచిరి గగనము నందున్! 4

దుర్ధర్షుండును వానర ప్రభువును దూరాలోచన గలవాడున్!
వీరవిక్రముండగు సుగ్రీవుడు వినువీధిని వారిని గాంచీ!
ఐదవవానిగ విభీషణునినీ యాశ్చర్యంబున గాంచుచునూ!
వానరోత్తములతో యోజించెను నత్యుత్తమ మగు ధీశక్తిన్! 5

ముహూర్తకాలము నాలోచించీ ముఖ్యులైన వారిని బిలిచీ
హనుమదాద్యులను నటగలవారల నలర బిలిచి సమ్మోదముతో!
వానరోత్తములతో నిటు బలికెను వనర బిలిచి సమ్మోదముతో! 6

సర్వాయుధములను గూడిన వాడై సహచరులారా! వీడెవడో?
నలుగురు రాక్షసులను గూడికొనీ నయముగ వచ్చుచు నున్నాడున్
మీరందఱు జూడుడు! వారలనూ మింటిని గనబడుచుండిరిగా!
మనల వధింపగ వచ్చుచుండిరీ మానుగ సందేహము లేదూ! 7

అంతట వానర శ్రేష్ఠులందఱును నా సుగ్రీవుని మాటవినీ!
సాలవృక్షములు శిలాఖండములు సరసత జేతుల నెత్తికొనీ!
ఈ విధముగ సుగ్రీవుని తోడను నింపుగ బలికిరి ధీరతతోన్! 8

వానరరాజా! సుగ్రీవా విను! వలనొప్పగ వే వేంటనిదే!
అనతి యిమ్మా! యీ దురాత్ములను నలరి జంపెదము మే మిపుడే!
నేలమీద బడిపోవుదు రిప్పుడు నిగిడి యసువులును. బోవంగన్! 9

ఆవలనున్నా సముద్రతీరము నా విభీషణుడు జేరికొని!
ఆ కపి వీరులు మాటలాడుకొను నా సంభాషణముల వినుచున్!
వంగారింతయు లేకుండగనూ గగన మందు నిలిచియు నుండెన్! 10

మహా ప్రాజ్ఞుడగు, మహావీర్యుడగు మానుగ విభీషణుండు మఱిన్!
సుగ్రీవుని మఱి వానరవీరుల సురుచిరముగ నట గాంచుచునూ!
గగనమందు నిలిచియు బహు దృఢముగ కంఠస్వరమున నిటు బలికెన్! 11

రావణుండనే నామము గలిగిన రాక్షసు డొక్కడు గలడు ధరన్!
దుర్వృత్తుడు మఱి రాక్షసేశ్వరుడు దురాచార పరుడును నతడున్
అతని తమ్ముడ! విభీషణుండను నలరు నామమును గలవాడన్! 12

ఆతని జేతను జటాయువును మఱి యలరి జంపగాబడియు మఱిన్
జనస్థానంబుననుండి జానకిని చరచర దెచ్చెను లంకకునూ
వివశురాలు మఱి దీనురాలునగు విమల జానకిని బంధించెన్!
రాక్షసస్త్రీలామెను రక్షించుచు రహి యుండిరి బీడించుచునూ! 13

సీతాదేవిని సాధుమార్గమున శ్రీరామున కర్పింపుమని
ఎన్నోరీతుల జెప్పి జూచితిని విన్నపముల నే జేసితిని!
యుక్తియుక్తములు నైన మాటలను రక్తిని నే బోధించితిని!
మాటిమాటికిని యలరి దెలిపితిని మానుగ సీతను నిమ్మనుచున్! 14

కాలచోదితుండైన రావణుడు కమ్మని నా హిత వాక్యములన్!
ఆయువు మూడినవాడు నౌషధము నంటని ముట్టని విధముననూ!
నావాక్యములను వినక మీదుగా నన్నవమానముజేసె తుదిన్! 15

పరుషవాక్యములు బలికి నన్ను మఱి బరగ దాసునిగ వలె గాంచి!
అవమానించెను నందఱి యెదుటను యనేక దుర్భాషల నాడి!
అందువలన నే బార్యాపుత్రుల చందముగా నట నే వదిలి!
రాముని శరణము బొందుటకై నే నయముగ నిచటికి వచ్చితిని! 16

సర్వలోక సంరక్షకుండునూ సార్వభౌముడగు మహాత్ముడున్
శ్రీరామునకును విన్నవింపుడూ శీఘ్రముగా జని నీ రీతిన్!
విభీషణుండను శేరుగలిగినా వినయ వ్రతుం డిట కొచ్చెనని! 17

అతిపరాక్రమము గల సుగ్రీవుడు నా వచనములను విని వేగన్!
లక్ష్మణుతోడను గూడియున్న యా లలి శ్రీ రఘురాముని తోడన్
సంరబ్ధతతో నిటులను పలికెను చక్కని యుక్తి సుయుక్తులతో! 18

ఊహింపగ బడకను వచ్చిన యా యున్నతమగు సైన్యమునందున్
శత్రువు జొచ్చి యవకాశంబును సారెకు గని యవకాశంబున్
గుడ్లగూబ కాకులను జంపినటు గూరిమితో జంపును గాదా! 19

పరంతపా! వానరుల శ్రేయమును శత్రువు యొక్కయు మంత్రమునన్
వ్యూహమునందును నీతియందునూ బహు విధ చారుల విషయమునన్!
సావధాన చిత్తుడవై యుండుము! సరసత భద్రము గలుగునుగా! 20

ఈ రాక్షసులును కామరూపులును నింపుగ యంతర్ధానమునూ!
పొందగలుగుదురు శూరులు మఱియును బొందుగ కపటోపాయములన్
తెలిసిన వారుగదా! వాతలనూ దీరుగ నమ్మగ రాదుగదా! 21

ఈతడు రాక్షస రాజు రావణుని యింపుగ చారుడునై యుండున్!
మన మధ్యకు మఱి వచ్చి రయమునను మనలో మనకును భేదములన్
కలిగించును సుమ! వించుకంతయును గలుగదు సందేహము నాకున్! 22

బుద్ధి మంతుడగు నితడే స్వయమున బొలుపుగ లోపములను తెలియన్
మనసైన్యమునను బ్రవేశించియును మనలోపములను దెలిసికొని
విశ్వాసము నొందిన నీయందును విపరీతము జేయగ వచ్చున్! 23

శత్రుబలంబులు దప్ప మఱియునూ మిత్రుల యటవీ బలగంబున్!
వంశక్రమమున వచ్చుచున్న యా వంశస్థుల గైకొనదగునూ!
తాత్కాలికముగ భృతిని యిచ్చి మఱి దగ గైకొనబడు బలగంబున్
సమస్తమగు నా బలముల నన్నిటి సరసత స్వీకృతి జేయదగున్! 24

ఓ ప్రభూ! యీతడు స్వభావమున వనరగ రాక్షసుడును గాదా!
అమిత్రుడగు నా రావణాసురుని యలరెడి సోదరుడును గాదా!

శత్రు పక్షమున నుండి వచ్చెనూ మిత్రభావమున నీతనినీ
ఎటుల నమ్మగా వచ్చును రామా! యేవిధముగ చరియించునోకో!

విభీషణుండను పేరుగలిగినా వీడుడు రావణు సోదరుడున్
నలుగురు రాక్షసులను గూడికొనీ నయముగ నీ యాశ్రమమునకై
శరణము నందగ వచ్చినా డిటకు చారుడేమొ మఱి దెలియదుగా!

ఆరావణుడే యీ విభీషణుని యంపి యుండునని దలచెదనూ!
చారునిగా యిటనుండి సర్వమును చక్కగ దెలియుట కొఱకును నై!
నిగ్రహించుటయె దగిన దటంచును నే భావించుచు నున్నాడన్!

దోషరహితుడవు నగు శ్రీరామా! దోషాలోచనలను గూడీ!
రావణు బంపున యీ రాక్షసుడును రయమున నిటకొచ్చియు నుండెన్!
విశ్వాసము జెందిన నీయందున వేడుక మాయా బలములచే
రహస్యముగ మఱి దెబ్బదీయుటకు రయమున నిచ్చటికిని వచ్చెన్! 1

క్రూరుడైన యా రావణాసురుని కూరిమి తమ్ముడు నీతండున్
అందువలన యీతనిని జంపవలె యీతని మంత్రులను గూడన్
తీవ్రమైన దండనలను నిచ్చి దీరుగ బంపగ వలయుసుమా! 2

ఎటు మాటాడగ వలెనో దెలిసిన యింపుగ సేనానాయకుడున్!
ఆ సుగ్రీవుడు మాట నేర్పరియు నా శ్రీరామునితో నిటులన్
బొట్రుబడుచు బలికెను నీ రీతిని దోరముగా మౌనము దాల్చెన్! 3

మహాబలుండగు శ్రీరాముండును మానుగ సుగ్రీవుని బలుకుల్
విని సమీపమున నున్నయట్టి యా హనుమదాదులను బరికించీ!
పలికెను మధుర సువాక్యంబులతో బన్నుగ నట కపులును వినగన్! 3

రావణు సోదరుడగు విభీషణుడు రాకను గూర్చిన వివరములన్
కపిరాజగు సుగ్రీవుని జేతను గమ్మని యుక్తులతో గూడన్!
జెప్పగా బడెను జెప్పిన మాటలు జేరి మీరు విన్నారు గదా! 32

శాశ్వతాభివృద్ధిని గోరెడి యా సమర్థుడగు నా పురుషువిచే
మిత్రులు కష్టములందు నున్నపుడు మీరిన యాపదలందుననూ

ఉపదేశించుట యుక్తము మఱియును నున్న యాపదల దొలగింపన్!
మీరును మది నూహించి దెలుపుడిక మీ మనసులలో నున్నదియున్! 33

అంతట నా విధముగ శ్రీరాముడు జెంతనున్న కపివీరులతో
బలుకగ యచ్చటి వానరవీరులు నలసత్వము లేకుండగనూ
రామచంద్రునకు బ్రియమును జేయగ రమ్యమైన కోరిక తోడన్
ఆదరపూర్వకమైన యోచనల యలరి దెలిసి రీ విధముగనూ! 34

రామా! నీకును మూడులోకముల రహి తెలియనిదియు లేదుగదా!
అన్నియు దెలియును నీకు రాఘవా! యఖిల శాస్త్ర విషయంబులునూ!
అలరు మిత్రులము గావున మమ్మును నడుగు చుంటివీ యీ రీతిన్
నిన్ను నీవు గౌరవ భావముతో నింపుకొనుచు నుంటివి గాదా! 35

శ్రీరఘురామా! సత్యవ్రతుండవు స్థిర బుద్ధియు గలవాడవునూ
ధర్మాత్ముండవు! శూరుండవు మఱి దగ దృఢ విక్రమ వంతుడవూ!
పరీక్షించి కార్యములను జేసెడి ప్రతిభను గలిగిన వాడవునూ!
స్మృతిమంతులడవు స్నేహితు లందఱు మతి నర్పించిన వాడవునూ! 36

ఆ కారణమున మతి సంపన్నులు నలరు కార్యముల సమర్థులున్
అయిన నీదు మంత్రులు నొక్కొకరుగ యభిప్రాయముల యుక్తులుగా
మాటలాడుదురు మధుర వాక్యములు మనసు పప్పి బహు విశదముగా 37

ఈవిధముగ వానరులు బలుకగా నింపుగ నటు మీదటను దగన్!
బుద్ధిమంతునగు నంగదుండు మఱి బొలుపుగ ముందుగ నిటుపలికెన్!
'విభీషణుని మఱి బరీక్షింపవలె' ననుచు బలికె శ్రీరామునితో! 38

శత్రు సమీపమునుండి వచ్చెనూ సహజముగా రాక్షసు దతడున్!
ఆ విభీషణుడు నన్ని విధములను నాలోచింపగ దగువాడే!
సందేహింపగ దగువాడే సుమ! సాధు భావములు జూపిననూ!
తొందరబడి విశ్వసనీయునిగా నందరాదు నాతని నిపుడున్! 39

శఠ బుద్ధులు వమ మనోభావముల సరగున దెలుపరు పైపైకిన్!
మనస్సు నందున దాచుకొనుచునూ మానుగ వర్తించెదరు ధరన్!
అవకాశముగని దెబ్బ దీయుదురు నతల కుతల మగునట్లులుగా!

అర్థానర్థములను గ్రహింపవలె యలరగ నిశ్చయమును జేసీ!
ప్రయత్నము నారంభింపగ వలె ఫలవంతములగు నట్లులుగా!
గుణములున్నచో స్వీకరింపవలె గుణరహితం బగుచో నపుడున్
విసర్జింపవలె నా ప్రయత్నమును విబుధులు మెచ్చగ కార్యములన్!

ఓ రామా! యీ విభీషణునిలో వనర యధిక దోషములున్నన్!
నిస్సంశయముగ విడిచివేయవలె నిష్ఠురగతి వర్తింపవలెన్!
అటులగాక బహుగుణము లున్నచో నాదరింపవలె నిశ్శంకన్!

అటు బిమ్మట నా శరభుడు పలికెను నర్థయుక్తమగు వాక్యములన్
మహాబాహూ! ఓరామా వినుమా! మానుగ నితని బరీక్షింపన్!
గూఢచారి నొక్కనిని బంపవలె కూరిమి నాతని దెలియుటకై! 4

సూక్ష్మ బుద్ధిగల గూఢచారినీ సురుచిరముగ నటకును బంపి!
పరీక్షింప జేయగదగు వారల బరీక్షించి యా పిమ్మటనే
యథా న్యాయముగ స్వీకరింపవలె యరసి మఱల విడువగ దగునూ! 4

అటుబిమ్మట బహు విచక్షణుండును నలరు జాంబవంతుడు నపుడున్!
విషయమునంతను శాస్త్రబుద్ధితో వివరముగా బరిశీలించీ!
గుణవంతంబును దోషవర్జితము గూరిమి నువాక్య మిటు బలికెన్! 4

నీతో వైరము గట్టినట్టి యా నిరంకుశుడు బాపాత్ముండున్?
రావణాసురుని దమ్ముడు గద! మఱి రాక్షసుండు మఱి జన్మముచే!
అదేశ కాలములందు వచ్చెనూ అన్ని విధములను నాతనినీ
శంకింపగనూ వలసి యున్నదీ శత్రుకూటమిని యుండెగదా! 46

పిమ్మట నయాపనయ కోవిదుడును ప్రియవచనముల సమర్థుండున్!
అయిన మైందుడును నాలోచించీ అన్ని విషయముల జాగ్రత్తగా
హేతుయుక్తమగు వాక్యము బలికెను బ్రీతియుక్తముగ రామునితో! 47

నరపతీశ్వరా రామా వినుమా! నయముగ యీతడు రావణునీ!
తమ్ముడుగద! మఱి విభీషణునితో మర్మ మెఱిగి మాటాడవలెన్!
మెల్లమెల్లగా మధుర వాక్యముల అల్లన మెల్లన బలుకవలెన్! 48

నరర్షభా! శ్రీరామా! వినుమా! నయముగ యాతని భావమునూ
యధార్ధముగ మఱి దెలిసికొనగవలె యాతడు దుష్టుండో? కాదో?
సంపూర్ణముగా గ్రహించి యాతని నింపుగ యాతని పోకడలన్
నేమి నిర్ణయము జేయవలయునో నేపుగ యాలోచించుదమూ! 49

అటుబిమ్మట సంస్కారవంతుడును నల మంత్రులలో శ్రేష్ఠుడునూ
హనుమంతుండును లేచి మృదువుగా నర్థవంతమును మదురముగా
అయిన వాక్యముల శ్రీరామునితో నలరుచు బలికెను నీరీతిన్! 50

బుద్ధిచేత ఓ శ్రీరఘురామా! బృహస్పతివి నీ వరయగనూ!
చక్కని వక్తవు! సమర్థుండవును సహజ శాస్త్ర సంపన్నుడవున్! 51

వాద నిమిత్తము బలుకుటలేదూ వనరగ తదితర మంత్రులతో
పోటీ బడుటకుగాని యధికుడను బొలువుగ నే ననుచునుగానీ!
బలుకుట లేదిప్పుడు నాపైనను బన్నుగ యుంచిన మన్ననచే
యదార్ధ వచనము బలికెద వినుమా! యుల్లమునంచు దోచిన రీతిన్! 52

విభీషణుని చే భావికాలముల విమల భావ! జరిగెడి పనులన్!
అర్థానర్థము లన్ని దెలియగా నాతని బరీక్ష సేయవలెన్!
అనుచు బలికిరీ యంగదాదులును వినుము! దానిలో లోపంబున్
గనబడుచున్నది నటుల జేయుటకు గానబడదుగది! విధానమున్! 53

ఆ విభీషణుని యొక కార్యంబున నటు నియమింపగ బడకుండన్!
అతని శక్తియు సామర్థ్యములను సలరి తెలిసికొన జాలముగా!
క్రొత్తవాని నొక మహత్కార్యమున గూరిమి నియమించుట గూడన్
మంచిదికాదని, దోషయుక్తమని మాన్యుగ నామది దెలిపెడినీ! 54

గూఢచారులను బంపవలయునని కూరిమితో నీ మంత్రులలో
కొందఱు సెప్పిరిగాని యిదియునూ కుదురదుగా మఱి యటుసేయన్!

ఎదుటనున్న పురుషుడి రహస్యముల బదునుగ వారలవలన మఱిన్!
తెలిసికొనుట యది మఱి యసంభవము దీరుగ కుదుర దుపాయమునన్! 5

ఆదేశకాలములందు వచ్చెనని యా విభీషణుడు మనకదకున్
జెప్పిరి మంత్రులలో మఱికొందఱు స్థిరముగ నేనును దెలిపెదనూ
ప్రభాపతిని నా దోచిన రీతిని యలరి దెలుప గోరుచునుంటిన్! 56

ఒక్కొక్క పురుషుని జేరి గుణంబును మక్కువ దోషముగా నగునూ!
దోషంబును మఱి గుణముగా నగును దోరముగా నగు స్థితిగతులన్!
దేశకాలములు నివియే యనుచును దీరుగ జెప్పగ వచ్చుగదా! 57

అన్న రావణుని దుష్టత్వంబును నలరు నీదు విక్రమము గని!
ఈ కాలమునకు నీ దేశమునకు నింపుగ నాతడు వచ్చుటయున్
యుక్తమే కదా! శ్రీరఘురామా! యుక్తమే ననుచు మది దోచున్!
ఆతని బుద్ధికి దగినట్లున్నది యా విభీషణుడు వచ్చుటయున్! 58

ఆ విభీషణుడు దెలియగ జాలని యట్టి పురుషులను గొందఱిని!
పంపి యాతనిని బ్రశ్నింపగనూ నింపుగ యాతని వివరములన్
కనుగొనవలెనని మంత్రులు సెప్పిరి కడగి నేను మది యోచింపన్!
గోచరించుచున్నది యొక దోషము గూరిమి దెలిపెద విను మిదియున్! 59

బుద్ధిమంతుడగు పురుషుని యొద్దకు బోలుపుగ యాతని కడకేగీ
వివిధములగు ప్రశ్నలు బ్రశ్నించిన వికృతముగ మది శంకించున్!
అట్టి సమయముల దొరికిన మిత్రుడు సప్రసన్నముగ విముఖుండై
వెడలిపోవునూ తనదారిని దా విఫలమౌను మన యత్నంబున్! 60

ఎదుటివాడు బలికెడి బలుకులలో నిమ్ముగ స్వరమును బట్టియునూ!
తెలిసికొనగ వచ్చును భావములను దీరుగ యాతని లక్ష్యములన్
అయితే యందుకు నెంతో జతురత నలరు నేర్పు యుండగ వలయున్
సాధారణ వ్యక్తులకు మాత్ర మది సాధ్యము కాదది శ్రీరామా! 61

ఆ విభీషణుడు మాట లాడెడి యట్టి సమయమున కపటంబున్
దుష్ట భావములు నున్నట్లుగ మది దోపగ లేదొక మారైనా

అతని ముఖము ప్రసన్నత తోడను నలరుచుండె గడు శాంత గతిన్!
అందుచేత నా కాతని విషయము నందను సంశయ మింతైనా! 62

కపటబుద్ధిగలవాడగు పురుషుడు గడగి యెట్టి శంకయు లేకన్!
మన దాపునకును రాడుగదా మఱి మన స్నేహంబును గోరడుగా
అతని వాక్యముల దోషము లేమీ! నల సంశయమును గనకుంటిన్! 63

అకారము నెంతయు దాచిననూ యది దాచుట శక్యముగాదూ!
అంతర్గతమగు మనోభావముల నెంత దాచినను గూడ మఱిన్
బలాత్కారముగ ప్రకటించును మఱి బన్నుగ మదిలో భావములన్! 64

కార్యవిదులలో శ్రేష్ఠుండవు మఱి కార్య మాచరింపుము వేగన్!
దేశకాలములకును ననుగుణముగ దీరుగ జేసిన కార్యంబున్!
సఫలమగును మఱి ఫలితము నిచ్చును సాధ్యమగును సర్వస్వంబున్! 65

నీవును నుద్యమ శీలుడ వనుచును నిజముగ యాతడు వినియుండెన్!
అన్న రావణుని దుష్ట ప్రవర్తియు గన్నులతో జూచియు నతడున్!
వాలి వధింపగబడి నట్టులు మఱి వనరగ సుగ్రీవుండు మఱిన్
రాజ్యమునకు బట్టాభిషిక్తుడై రమ్య కీర్తి బొందిన యటులన్!
విని విభీషణుడు రాక్షస రాజ్యము విమలకీర్తి నందగ వేగన్
ఆలోచన తోడనె యత డిచటికి యలరివచ్చె శ్రీ రఘురామా!
ఈ విషయముచే నెనను నాతని యింపుగ జేకొన దగును సుమా! 66-67

బుద్ధిమంతులను శ్రేష్ఠుఁడవు మఱి బొలుపుగ దుట్ట విభీషణునీ!
ఋజుత్వమును నే విన్నవించితిని రూఢిగ నామది దోచినదీ!
నే దెలిపిన విషయమును వింటివి నీవే యిక యోచింప దగున్!
మిగిలిన కార్యము నిర్ణయింపుమా మీరిన ఫలితము నందగనూ! 68



(యుద్ధకాండమునందు 17వ సర్గము సమాప్తము)



* ★ *

# యుద్ధకాండము - ప్రథమ భాగము

## పదునెనిమిదవ సర్గము

[విభీషణుని స్నేహమును నంగీకరించుటయే యుక్తమ రాముడు తన నిర్ణయమును దెలుపుట]

శాస్త్రజ్ఞానము గలవాడును మఱి శత్రుమర్దనుడు నగునట్టి
రఘుకుల తిలకుడు రామచంద్రుడును రహి హనుమంతుని వా ములన్!
విని రమ్యముగా ప్రసన్నాత్ముడై విమల వదనమున గనుగొనుచు
తన మదిలోగల యభిప్రాయమును మానుగ దెలిపెను మంత్రులః ! 1

ఆ విభీషణుని గూర్చియు నేనును నలరి బలుకగా వలయుననీ!
భావించుచు నుంటిని కపులారా! బరగ వినుడు! మీరందఱునూ! 2

మిత్రభావమున వచ్చిన వానిని మిత్రునిగా నే గణించెదన్!
అట్టివానిలో దోషమున్ననూ యెట్టి సమయమున విడువనుగా
అటుల జేసినప్పుడు గద విజ్ఞులు నాదరింత్రు! నిందిపరుగా! 3

అనంతరం బా హరిపుంగవుడగు నా సుగ్రీవుడు చతురతనూ!
ఆ శ్రీరాముని వాక్యములను విని యనువదించి యోజించియున
శుభతరమగు వాక్యములను బలికెను సుదుచిరముగ నందఱు వి న్! 4

ఈ విభీషణుడు సుదుష్టుడైను నింపుగ అదుష్టుడైన మఱిన్
మనకేమీ? యిక యిట్టి యాపదను మానుగ యుండిన సోదరునీ
విడిచిపెట్టి యిటు వచ్చినాడు గద! విడువకుండునా మన వారిన్?
ఇట్టివాని మఱి నమ్మరాదు గద ఎట్టి సమయమున యుందైనన్! 5

సత్య పరాక్రముడైన రాముడును సరసత సుగ్రీవుని బలుకుల్
విని యచటను గల యందఱ గాంచీ విమల భావమున నవ్వుచున
పుణ్యలక్షణుండైన లక్ష్మణుని బొలుపుగ గాంచుచు నిటు లనియె! 6-7

సుగ్రీవుడు బలికిన యీ మాటలు సురుచిరంబుగా శాస్త్రములన్
చదువని వారును, బెద్దల సేవను జక్కగ జేయని వారలునూ
పలుకగ జాలరు లక్ష్మణ వినుమా! బన్నుగ నా యీ వచనములన్! 8

ధర్మసూక్ష్మ మొకటున్నది లక్ష్మణ దగ లోకమునను గలయట్టి
క్షత్రియు లందఱిలో బ్రత్యక్షము సర్వలోకమున బ్రసిద్ధియున్!
నాకు తోచుచున్నది యొక విషయము నయముగ యాలోచింపగనూ! 9

ఒకే కులమునకు జెందిన వారలు న్యొద్దిక బ్రక్కను గలయట్టి!
దేశములో నున్నట్టి వారు మఱి దీరుగ శత్రులుగా నుండీ!
దెబ్బదీయుదురు నాపదలను నని ధీరుగ దెలుపుదురు విజ్ఞుల్!
అందుచేతనే విభీషణుండును బొందుగ వచ్చెను నిచ్చటికిన్! 10

పాపాత్ములు మఱి కానివారలును బన్నుగ దత్కులమును జెందీ!
తమ సంబంధము గల వారలనూ తమ హితులను నాదరముగనూ!
గారవించెదరు; రాజులు మాత్రము గారవింపరే విధముననూ!
ఉత్తమ పురుషుని గూడ క్షత్రియులు నుల్లేఖింతురు శత్రువుగన్! 11

అరిబలములలో నుండి వచ్చినా వారిని దమలో జేర్చుకొనన్
ఏ దోషంబులు గలవని బలికి యింపుగ దెలిపితివో యిపుడున్!
ఆ విషయంబున యథాశాస్త్రముగ యలరి దెలిపెదను విశదముగన్! 12

మన మాతని కులమునకు జెందినా హితమంతులమూ కాముగదా!
సహజముగా శత్రుత్వ మేదియును సరసత లేదుగదా మనకున్?
రాక్షసుం డతడు! రాజ్యకాంక్షి మఱి రయమున వచ్చెను నిచ్చటికిన్!
రాక్షసులందున బండితు లుందురు రమ్య సుబుద్ధులు నుండుదురూ!
అందున విభీషణుండు మిత్రునిగ పొందుగ గైకొన దగువాడే! 13

జ్ఞాతులందఱును భయము తోడనూ బ్రీతిలేక యుండెద రెపుడున్!
కలిసిమెలిసి జీవింపగ లేరిక కాంక్షలేక విడిపోవుదురూ!
రావణునుండీ యీ రాక్షసునికి రయమున భయమును గలిగినదీ!

అందుచేతనే యీతని ధ్వనియును జెందుచు నధికముగా నుండెన్
అందున విభీషణుండు మిత్రునిగ పొందుగ గైకొన దగువాడే! 14

నాయన! సౌదరు లందఱు జగతిని నయముగ భరతుని పోలికను
యుందరుగా మఱి కుమారులందఱు నుందరుగా మద్విధముగను
స్నేహితులందఱు నీదు పోలికను స్థిరముగ నుండరు సౌమిత్రీ! 15

రాముని సుమధుర వాక్యములను విని రహి ప్రాజ్ఞుండగు సుబుద్ధిన్!
లక్ష్మణ సహితుండై సుగ్రీవుడు లావుగ యంజలి ఘటియించీ!
రామునితోడను విట్లని బలికెను రమ్యవాక్యములు రంజిలగన్! 17-18

వాక్యజ్ఞుండు కపీశ్వరుండునూ వనరగ యా సుగ్రీవుండున్
వాక్యకుశలుడగు శ్రీరామునితో వవర బలికి మౌనము దాల్చెన్! 19

అటువిమ్మట శ్రీరామచంద్రుడును నల సుగ్రీవుని మాట వినీ!
ఆలోచించియు బహు నాదరమున బలికె నిటుల సుగ్రీవునితో!
ఈ రాక్షసుడును సుదుష్టుడైనను నింపుగ అదుష్టుడైన మఱిన్!
భయము జెందగా పనిలేదు సుమా! భ్రాంతి జెందగా పనిలేదూ!
ఏ విధమైనా యపకారంబును నితడు జేయజాలడు సుమ్మా! 21

హరిగణేశ్వరా! సుగ్రీవా విను! నలరి నేను మది దలచినదో!
ధాత్రిపైనిగల పిశాచంబులను దానవులను మఱి యక్షులనూ!
రాక్షసులను గూడను గోన్రవేలిని రయమున వధింప గలవాడన్! 22

మహాబాహు! శ్రీరామా వినుమా! మానుగ నాదు సువాక్యములన్!
రావణుడే తన గూఢచారిగా రహి విభీషణుని బంపగనూ
వచ్చినా డనుచు దలపుము రామా! మచ్చికతో నా రాక్షసునీ!
నిగ్రహించుటే యుక్తమనుచు నే నిర్మలమతి! మది దలచెదనూ! 17

అనఘా! ఓ రఘురామా! వినుమా! యా రాక్షసుడగు రావణుడున్!
బంపగానె యీ విభీషణుండును కంపము జెందుచు నిటు లొచ్చెన్!
నన్నుగాని, మఱి నిన్నుగాని మఱి నయముగ సౌమిత్రిని గానీ!
చంపుటకొఱకై యిటకొచ్చెను గద! చంచలబుద్ధిని వక్రముగన్!

ఈ విభీషణుడు నా రావణునకు నింపుగ సోదరుడౌను గదా!
అందుచేత యీ రాక్షసునీ మఱి యీతని మంత్రులతో గూడన్!
బంధింపగవలె! బట్టి జంపవలె! బన్నుగ దెలియగ రావణుడున్ 18-19

పావురంబు మఱి శరణు కొచ్చినా బన్నుగ తన శత్రువును మఱిన్!
యథాన్యాయముగ పూజించెను గద! యలరుచు దనదు సుమాంసములన్!
ఆహారముగా బెట్టిన దనుచును నంతట వినుచున్నార మిలన్! 23

వానరశ్రేష్టా! సుగ్రీవా విను! వనరగ తన భార్యను జంపి!
ఇంటికి వచ్చిన యా శత్రువునూ నింపుగ యా పావుర మపుడున్!
వానిని యతిథిగ స్వీకరించె మఱి వనరగ వినయ సుపూజ్యతలన్
పావురమే యటు జేసినప్పు డిక బరగ నన్ను జెప్పగ నేలా? 24

కణ్వమహర్షి సుపుత్రుండును మఱి కడు సువ్రతుడును సత్యమునే
పరమ దైవముగ భావన జేసీ పరమ ఋషియు నగు వాడతడున్!
కండువు ననియెడి వానిచేతనూ నిండుగ ధర్మిష్టములు నగూ!
గాథలు గానము జేసినాడు గద! కడు శ్రద్ధను విను! దెలిపెదనూ! 25

పరంతపా! ఓ రాజా వినుమా! బద్ధాంజలితో గూడికొనీ
దీనత్వంబున ప్రార్థన జేయుచు దీరుగ శరణము జొచ్చిన యా
శత్రువునైనను జంపగరాదూ! క్షమింపగా వలె ధీరతనూ!
క్రూరుం డనియెడి యపకీర్తియునూ కూడి రాకయుండిన రీతిన్! 26

ఇతరుల శరణము బొందినట్టి యా నింపుగ శత్రువునైన మఱిన్
ఆర్తుడైన మఱి గర్వితుడైనా యలరి గావగా వలయు సుమా!
కృతాత్ములగు వారలు దమ యసువుల కినుకలేక యర్పింపవలెన్
శరణార్థిని రక్షింపగా వలయు నరమర లేకను దక్షణమే! 27

శరణమిచ్చినా వాడు భయంబున సహజముగా గోరిక వలనన్!
అజ్ఞానంబునగాని, స్వశక్తిని యార్తుని రక్షింపగ లేకన్!
నిస్సహాయతను బొందినచో మఱి నిఖిల లోకముల యందుననూ!
లోక గర్హితంబగు బాపంబును లోలత జేసిన వాడు నగున్! 28

శరణము బొందినవాడై యార్తుడు నరక్షితుండై దీనముగన్
రక్షింపగబడు వాడు జూడగను రయమున మరణించిన యెడలన్
ఆతడు నాతని సుకృతంబునూ యలరుచు గైకొని పోవునుసూ!
కావున శరణాగతుని రక్షణము గడు సాహసమున జేయవలెన్! 9

ప్రపన్నులను రక్షింపక బోవుట బరగ మహాదోషము గలదూ!
అది స్వర్గంబును నాశ మొనర్చును నది యపకీర్తిని గూర్చునిలన్!
బల వీర్యంబుల నశింపజేయును బలువురిలో దలవంపులగున్!
అభయ మిచ్చి రక్షింపని వాడిల యుభయ లోకముల యందు జెడున్

కండువు జెప్పిన యుత్తమ వచనము నిండుగ సత్యముగా జేతున్!
అటుల జేయుటయు ధర్మసమ్మతము నదియె యశస్సును నిచ్చునుగా
స్వర్గము నిచ్చును ఫలోదయంబును సరసత నిచ్చును భోగములన్!

ఒక్కమారు నెవడైనను వచ్చి నిక్కముగా నీ వాడనని
ప్రార్థించెడి యా శరణార్థిని నే బరగ సర్వ ప్రాణులనుండీ!
అభయ మిచ్చెదను! నతనిని గాచెద! యరయగా నిదియె నా వ్రతమూ!

వానర పుంగవ సుగ్రీవా! విను! వనరగ విభీషణుండైనన్!
వచ్చిన వాడిక రావణుడైనను మచ్చికతో నిటు గొనిరమ్మా!
నే నాతనికిని యభయ మిచ్చెదను నిక్కముగా బలుకుచు నుంటిన్!

ప్లవగేశ్వరుడగు సుగ్రీవుండును బన్నుగ రాముని మాటవినీ!
స్నేహభావమున నిండిన మనసున శ్రీరామునితో నిటు లనియెన్!

ధర్మజ్ఞుండవు లోకనాథుడవు దాక్షిణ్యము గలవాడవునూ!
బలవంతుడవు! సత్పథ మందున బన్నుగ నిలిచిన వాడవునూ!
అయిన నీవు వివిధమున బలుకుట యాశ్చర్యము నేమున్న దిటన్!
పూజింపగదగు సువాక్యంబులను పూజ్యుడ బలుకుచు నుంటివిగా!

నాడు నంతరాత్మయు గూడను మతి నయముగ యట్టి విభీషణుడున్!
మంచివాడనుచు దెలుపుచు నున్నది నంచితముగ నా బుద్ధియునూ!

ఊహావలన మఱి భావము వలనను నూహించిన మీ రందఱునూ!
అన్నిపక్షములనుండి జూడగా నటులె కనఁబడుచు నుండె మఱిన్! 36

ఆకారణమున రాఘవ! వినుమా! యల ప్రాజ్ఞుడు! గుణవంతుడునూ!
ఆ విభీషణుడు నతి శీఘ్రముగా నలరుచు మాతో సముదగునూ!
మన స్నేహంబును బొందినవాడై మనకు సహాయుం డగు గాతన్! 37

అటుబిమ్మట శ్రీరామచంద్రుడును నా సుగ్రీవుని మాట వినీ!
అతడు జెప్పిన రీతిగా నతడు నా పురందరుడు శీఘ్రముగా
పక్షిరాజునగు గరుత్మంతునీ పన్నుగ గలిసిన విధముగనూ!
ఆ విభీషణుని తోడ గలిసెనూ యాదరమున బహు స్నేహమునన్! 38

(యుద్ధకాండములోని 18 వ సర్గము సమాప్తము)

   

# యుద్ధ కాండము - మొదటి భాగము

## పందొమ్మిద సర్గము

[ఆకాశమునుండి దిగివచ్చి విభీషణుడు రాముని పాదములను శరణు జొచ్చుట—రాముడు బ్రశ్నింబగా సతడురావణునకున్న బలమును, గూర్చి చెప్పుట-రాముడు 'నేను రావణుని జంపెదను' అని ప్రతిజ్ఞజేసి విభీషణుని లంకా రాజ్యమునందు నభిషిక్తుని జేయుట—విభీషణుని అభిప్రాయము ప్రకారము రాముడు సముద్రుని సహాయముగోరుచు, దీక్షబూని, సముద్రతటముపై గూర్చుండుట]

శ్రీరాముడు మతి యభయ మిచ్చెనూ స్థిరముగ నట్టి విభీషణుకున్!
రావణానుజుడు, మహాప్రాజ్ఞుడును రహి విభీషణుడు బిమ్మటనూ!
వంశీసవాడై భూమిని గాంచెను నింగినుండి దన మిత్రులతో! 1

ధర్మాత్ముండగు విభీషణుండును దగ సంతసమును బొందుచునూ
భక్తులైన దన యనుయాయులతో బమ్నగ యాకాశము నుండీ
డిగిశ్రీరాముని పాదపద్మముల దీరుగ నేలను స్పృశియించెన్! 2

అటుపిమ్మట నా విభీషణుండును నా నల్వురు ననుయాయులతో
రామచంద్రునీ పదములపై బడె రమ్యముగా నంజలి తోడన్!
ధర్మయుక్తమును యుక్తి యుక్తముగ దగినది మహదానందమునూ!
గలుగజేయు వచనములను బలికెను గరుణ గలుగ శ్రీరామునికిన్! 3

రావణు దమ్ముడు విభీషణుండను! రామచంద్ర! నే నాతనిచే
అవమానింపగబడితిని రామా! నాదరింతువని వచ్చితినీ!
సకలప్రాణులకు రక్షకుండవని సాటిలేని వీరుండవనీ!
నిన్ను నేను శరణము బొందితిని నీరజాక్ష! నను బ్రోవదగున్! 4

లంకాపురినీ పరిత్యజించీ శంకలేక యిటు వచ్చితినీ
బంధుమిత్రులను, సర్వసంపదలు బన్నుగ నాచే విడువబడెన్!
నాదు రాజ్యమును నాదు జీవితము నాదు సుఖంబులు సర్వమునూ!
నీపైనే యాధార పడినవీ నిక్కముగా నను బ్రోవదగున్! 5

విభీషణుని యా వాక్యములనువిని విమల హృదయుడగు రాఘవుడున్!
సాన్త్వన వచనములను బలుకుచునూ సరసత నేత్రంబుల తోడన్
త్రాగుచున్నవాడును వలె రాముడు దగ బలికెను నీ విధముగనూ!
లంకను గలిగిన రావణు బలమును బొంకముగా దెలుపుము వేగన్!
మహావీరు లెవరో మఱి దెలుపుము మూనుగ వీరులు నెవరెవరో! 6-7

అక్లిష్ట కర్మణుడగు శ్రీరాముడు నటుల బలుకగా రాక్షసుడున్!
రావణాసురుని సమస్త బలమును రహి దెలుపుట ప్రారంభించెన్! 8

రాజపుత్ర! ఓ దశరథరామా! రావణు బలమును దెలిపెదనూ!
బ్రహ్మదేవుని వరదానములను బన్నుగ యాదశ గ్రీవుండున్!
గంధర్వోరగ పక్షి గణములకు గడగి యెట్టి ప్రాణులు నైనా
రావణాసురుని జంపగజాలవు రహి యీ భూమండలమందున్! 9

దశగ్రీవుని దర్వాతి వాడు మఱి దగ నాకంటెను జ్యేష్ఠుండున్!
మహావిక్రముడు మహాతేజుడును మహావీర్యమును గలవాడున్!
కుంభకర్ణుడను వాడు యుద్ధమున కుంభివి చుట్టగలాడు మఱిన్!
దేవేంద్రుని యెదిరింపగ జాలెడి ధీరుడు బలమును గలవాడున్! 0

దశగ్రీవుని సేనాధిపతియ నగు దగ బ్రహస్తునీ గూర్చి మఱిన్
వినియే యుందువు రామచంద్ర! మఱి వీరవిక్రముడు యుద్ధమునన్
కైలాసంబున జరిగినట్టి యా ఘనతరమగు సమరము నందున్!
మణిభద్రుని యోడించినాడు గద! మూనుగ లోకము గీర్తింపన్! 11

ఉడుము చర్మమును బ్రేళ్ళదొడుగులుగ యురుతర యాయుధముల తోడన్
భేదింపగ శక్యంబుకాదు మఱి భేదింపగ నలవియు గానీ
కవచము శరీరమున ధరియించి కదనమందు చాపముతోడన్!
నిలిచినచో నాతడు గనబడడూ నిలిచినట్టి ప్రతివీరులకున్! 12

శ్రీమంతుండగు నింద్రజిత్తునగా శీఘ్రము నగ్నిని హోమమునన్
దృప్తిబఱచి మఱి యగ్నిదేవునీ దివ్యశక్తులను సాధించి

అంతర్ధానముజెందిన వాడై వింతగ యుద్ధము జేయుమతిన్!
సుమహద్వ్యూహములందున సైతము శూరత శత్రుల వధియించున్! 13

మహోదరుండును మహాపార్శ్వుడును మానుగ యకంపనుడు మఱియున్!
మహాయోధులును మహాబలాఢ్యులు మానుగ సంగ్రామము లందున్!
లోకపాలురగు నింద్రాదులతో లోలత సములగు వారు మతిన్
వీరందఱు సేనాధిపతులుగద! వీరుడైన దశగ్రీవునకున్! 14

కామరూపములు గలవారును మఱి గడగి రక్తమాంసాదులనూ!
భుజించు వారలు లంకాపురినీ భూరి సంఖ్యలో గలరు నుమా!
పదివేల కోట్లరక్కసులు లంకలో బన్నుగ నుండిరి వసించుచున్! 15

రాక్షసరాజగు రావణాసురుడు రాక్షసులను మఱి గూడికొనీ
లోకపాలురను దలపడి పోరీ లోలత వారివి యోడించెన్!
ఇతర దేవతలు వచ్చి యుద్ధమును బీతినొదిలి యని జేసియునూ!
పరాజయంబును బొందిరి వారలు బాహుబలంబున రావణుచే! 16

రఘు సత్తముడగు రామచంద్రుడును రహి విభీషణుని మాట వినీ!
సమస్తమును మది యాలోచించీ సార్వభౌముడగు రాము డనెన్! 17

విభీషణా! రావణుడు శౌర్యమున విపుల పరాక్రమ కార్యములన్
పూర్వము జేసిన ఘనకార్యములను బూనికతో బలికితి విపుడున్!
వానినన్నిటిని యధాపూర్వకము వరుసగ యర్థము గైకొంటిన్! 18

విభీషణా! నే రావణాసురుని విపుల బలాఢ్యుడు నింద్రజితున్!
సేనాపతియగు నా ప్రహస్తునీ శీఘ్రము నేలను బడవేతున్!
నిన్ను లంకకును రాజును జేసెద నిజముగ బలికెడి మాట యిదీ! 19

రసాతలంబును బ్రవేశించినను రావణాసురుడు బరుగిడుచున్!
పాతాళంబున బ్రవేశించినా బ్రహ్మదేవునీ లోకమునన్!
దాగికొనిన మఱి శరణుజొచ్చినా దగ విడువను బ్రాణంబులతో! 20

సపుత్ర జన బాంధవులతోడ మఱి సహజ శత్రువగు రావణునీ
సమరమునందున వధింపకుండగ సరి నే బోనిక యయోధ్యకున్
ఒనరగ ముప్వురు దమ్ములపైనీ యొట్టు బెట్టుకొను చున్నాడన్! 21

ధర్మాత్ముండగు విభీషణుండును దగ శ్రీరాముని మాటవినీ!
శిరమువంచి యంజలి ఘటియించీ శీఘ్రము నీ రీతిని బలికెన్! 22

లంక ముట్టడించుట యందును మఱి శంకలేక యా రాక్షసులన్!
వధియించుటయందును శ్రీరామా! వనరగ సాయము జేయుదునూ!
శత్రుసైన్యమున బ్రవేశించి మఱి శత్రువులను దునుమాడెదనూ! 23

విభీషణుని మాటలకు రాఘవుడు విమల హృదయుడై నాతనినీ
గాఢముగా గౌగిలిని జేర్చికొని కరమున బిలిచీ లక్ష్మణునీ
సముద్రజలమును గొనితెమ్మనుచును సరగున బలికెను నాతనితో! 24

సౌమిత్రీ! విను! బుద్ధి శాలియగు సమ్మతి విభీషణుని యింకన్
అభిషేకింపుము రాక్షసరాజుగ నా జలంబుతో శీఘ్రముగన్
నే బ్రసన్నుడను! నగుదును లక్ష్మణ! బుట్టి కార్యమును జేయగనూ! 25

రామచంద్రునీ యాజ్ఞను గైకొని రయమున కపివీరుల మధ్యన్
సముద్రజలముల గొనిదెచ్చియు మఱి సమస్తమగు పరిచర్యలతో
ఆ విభీషణుని రాక్షస రాజుగ యభిషిక్తునిగా జేసెనుగా! 26

శ్రీరాముని యా యనుగ్రహంబును శీఘ్రము గలుగుట గనుగొనుచున్!
వానర వీరులు బిరబిర నలుచుచు వరుసను జయజయ ధ్వనితోడన్
'బాగు! బాగు!' అని ప్రశంస జేసిరి బహువిధంగుల యా రఘువీరున్! 27

హనుమంతుడు సుగ్రీవుండును మఱి యా విభీషణుని గనుగొనుచున్!
మహాతేజమును గల కపివీరులు మన మందలమును గూడికొనీ
అక్షోభ్యంబగు వరుణాలయమును నలరి దాటుటది యెటు లనుచున్!
రావణు తమ్ముడు విభీషణుని మఱి రయమున యడిగిరి కపివీరుల్! 28

నదీ నదములకు బతియగునట్టి నయముగ వరుణాలయమునకున్
ససైన్యంబుతో షేరుకొందమూ సంబరబడుచును నందఱమూ!

సముద్రమును మఱి దాటు విట్టులో సరసత యుపాయ చతురతలన్
అట్టి యుపాయము దెలుపు విభీషణ! నిట్టె దాటగను సంద్రమునూ! 29

ఆ విధముగ యా వానరవీరులు నలరుచు బలుక విభీషణుడున్!
అల్లన బలికెను కపివీరులతో మెల్లన మది యోజించి మఱిన్!
రామచంద్రు డీ మహాసంద్రమును నయముగ శరణము నందినచో
దాటగలము నీ మహాసముద్రము దగ చోద్యముగా దిది మఱియున్! 30

అప్రమేయమగు నీ మహోదధియు యల సగరునితో ద్రవ్వబడెన్!
పుడమిని ముంపక యుండునటులనూ పూనికతో శాసింప బడెన్!
అల సగరునికీ బంధువైన యీ యఖిలేశ్వరుడగు రామునికిన్!
సాయము జేయును రామ కార్యమును సాగించును నిర్విఘ్నముగన్! 31

అటువిమ్మట నా సుగ్రీవుండును నా విభీషణుని మాట వినీ
చటులగతిని యా వానర సేనయు సరసత గల యాస్థలమునకున్
సలక్ష్మణుండగు రాముని యొద్దకు సరగున యరుదెంచియును మఱిన్! 32

విపులగ్రీవుడు సుగ్రీవుండును విమల విభీషణు బలుకులనూ!
శుభవచనములను విన్నవించెనూ శూరులు గపివీరులు వినగా
ఉదధిని రాముడు నుపాసింపవలె చెదరక మది బ్రార్థింపవలెన్
సంద్రము మనకును దారి నిచ్చునూ సరసత లంకకు జేరగనూ! 33

స్వభావంబుచే ధర్మ శీలుడగు సార్వభౌముడగు రామునికిన్!
విభీషణుడు దెలిపిన యా పలుకుల విమలభావమున మది దలచెన్!
ఆ మాటల మది నాదరించుచూ యా లక్ష్మణు సుగ్రీవులతో
చిఱునవ్వును జిందుచు శ్రీరాముడు జిత్త మలరగా నిటు లనియెన్! 34-35

సౌమిత్రీ! విను యీ విభీషణుని చక్కని పలుకులు నచ్చినవీ!
సుగ్రీవుడు మఱి పండితుండునూ సురుచిరముగు లోకజ్ఞుడునూ!
మంత్ర విశారదుడవు మఱి నీవును మానుగ మహా సమర్థుడవున్!
మీ యిద్దఱు మఱీ నిర్ణయింపుడిక నిశ్చయ బుద్ధిని కార్యంబున్! 36

రామచంద్రు డిటు బలికిన బిమ్మట రయమున లక్ష్మణ సుగ్రీవుల్!
వీరు లిద్దఱును నముదాచారము విమల భావమున బొంగుచునూ!
మధురవాక్యముల మనసు రంజిలగ మధురాక్షరముల నిటు లనిరీ! 37

పురుషోత్తమ! ఓ రామా! వినుమా! పూనికతో నీ సమయమునన్
శుభప్రదంబును సుఖావహంబును సురుచిరమగు నీ కార్యంబున్!
విభీషణునిచే బలికిన వాక్యము వీనుల విందును జేయుగదా!
మాకు మాత్ర మిష్టము గాకుండున? మన కందఱికిని సమ్మతమున్! 38

భయంకరంబును వరుణ నివాసము భవ్యమైన యీ సాగరమున్!
సేతుబంధనము జేయకుండగా స్థిరముగ యింద్రుని గూడికొని!
సురాసురులు గూడను యీ లంకను సురుచిరముగ జొరలేరు కదా!
సంద్రముపై సేతువు నిర్మింపగ చక్కని యోచన జేయు మికన్! 39

శూరుడు విభీషణుని పలుకులనూ సురుచిర కార్యము జేయుమికన్!
అలస్యంబును జేయరాదు గద! నాలస్యంబును విషమ మగున్!
సైన్యముతో లంకాపురి జేరగ చక్కని వీలును గల్పింపన్!
ఆదేశింపుము! వరుణ దేవునీ యాలంకను మఱి జేరుటకున్! 40-41

లక్ష్మణ సుగ్రీవుం పలుకులనూ లాలితముగ విని రాఘవుడున్!
ఆ మహోదధికి సన్నిధి యందున యలరుచు కుశలును బఱచుకొనీ!
వేదియందునను నగ్నిజ్వాలవలె విమల మతియు నగు రాఘవుడున్!
శయనించెనుగా శేషశాయి వలె సకల దేవతలును వీక్షింపన్! 42

(యుద్ధకాండములోని 19వ సర్గము సమాప్తము)

* * * *

## యుద్ధకాండము - మొదటి భాగము

### ఇరువదియవ సర్గము

(శార్దూలుడు జెప్పగా రావణుడు శుకుణ్ణి సుగ్రీవుని యొద్దకు దూతగా బంపుట—వానరులాతనిని బీడించుట—రాముని యనుగ్రహముచే నతడు ఆ యాపద నుండి బైటబడుట—సుగ్రీవుడు రావణునకు బ్రత్యుత్తరము నిచ్చుట—మఱల వానరులు నతనిని బంధించి బీడించుచుండగ రాముడు వారించుట )

అటుబిమ్మటనూ వీర్యవంతుడును చటుల పరాక్రమ వంతుండున్
శార్దూలుండను రాక్షసుండు మఱి చయ్యన వచ్చియు వేగమునన్!
వ్యూహంబులుగా నిలువబడినదియును నున్నతుడగు సుగ్రీవునిచే
జాలింపగ బడు వానరసేనను బన్నుగ గాంచెను జోద్యముగన్!

దుర్మతియగు నా రావణాసుని దుష్టబుద్ధియగు రాక్షసుడున్!
ఆ చారుండును నవ్యగ్రుండై యాకపి సేనను దిలకించీ!
అన్ని వైపులను బరిశీలించీ దిన్నగ లంకాపురి కేగీ!
రాక్షసరాజగు రావణుతోడను రయముగ బలికెను నీ రీతిన్! 2

అగాధమైనది యప్రమేయమును నా సుగ్రీవుని సైన్యంబున్!
కపుల యొక్కయును, భల్లూకంబుల విపులమైన యా సైన్యంబున్!
రెండవ సముద్రమా యనునట్లుగ నిండుగ యున్నది రాజేంద్రా!
లంకాపురినీ సమీపించినది శంకలేదు సంద్రము దాటన్! 3

దశరథపుత్రులు, నుత్తములును మఱి దగిన రూప సంపన్నులునూ!
మహాద్యుతిని గలవారు మఱియునూ మానుగ సోదరులును నైనా!
రామలక్ష్మణులు సీత జాడనూ రయమున బొందిన వారగుచున్
మహాసాగరము సమీపించి యును మానుగ నిలిచియు నున్నారూ! 4-5

మహారాజ! విను! నా సైన్యంబును మానుగ దిక్కుల నన్నిటినీ!
పది యోజనముల విశాల దేశము బన్నుగ యాక్రమణము జేసీ

విడిసియున్నదీ యావలి తీరము విస్తృతమగు సాగరమువలెన్
ఈ సత్యంబును గ్రహించవలయును నింపుగ శీఘ్రము వే వెంటన్! 6

నీ దూతలు గూడను మఱికొందఱు నిశ్చల మతితో నటకు జనీ
తెలిసి కొనుటపంచిరి రాజేంద్రా! తేట తెల్లముగ విషయంబున్!
సామదాన భేదోపాయములను సరనత పరిష్కరింపవలెన్!
నాల్గవ దగు దండో పాయమునకు నయముగ యవకాశము లేదూ! 7

రాక్షసరాజగు రావణాసురుడు రహి శార్దూలుని వచనములన్!
విని వ్యగ్రుండై తన ప్రయోజనము వినిశ్చతుండై యా వెంటన్!
అర్థవిదులలో పరమశ్రేష్ఠుడగు నాతకు రాక్షసుతో ననియెన్! 8

రాజగు నా సుగ్రీవుని యొద్దకు నయముగ వే వెంటనె బొమ్మా!
నాదు వచనముల యథారీతిగా నా సందేశము వివరింపూ!
శ్రేష్ఠమైన మృదుమధుర వాక్యముల చిత్తశుద్ధితో నిర్భయతన్
నా వచనముగా నిట్లుల దెలుపుమా! నయముగ బటుతర వాక్యములన్ 9

మహారాజ! ఓ సుగ్రీవా! విను! మానుగ యుత్తమ కులమందున్
జన్మించితివీ! మహాబలుండవు! ఋక్షరజన్సు కుమారుడవున్!
నీ వీ యుద్ధము జేయుట వలనను నీ కే లాభము లేదుగదా!
అనర్థమును మఱిలేదు హరీశా! యరయగ సోదరుడవు నాకున్! 10

ధీమంతుండగు రాజపుత్రుని ధీర వనిత యా జనకసుతన్!
అపహరించితిని! చెఱబట్టితినీ! యందువలన మఱి నీకేమీ?
సంబంధము గలదో మఱి తెలియదు సహజముగా యోజించినమా!
తిరిగి పొమ్ము మఱి కిష్కింధకునూ దీరుగ నీ వొచ్చిన దారిన్! 11

లంకాపురిలో బ్రవేశించు టధి సాధ్యముకానీ కార్యమిదీ!
సురలు, కిన్నరులు, గంధర్వులునూ సురుచిరముగ మఱి యక్షులునూ
ప్రవేశింప జాలరు సుగ్రీవా! ఇన్నిగ బహు యత్నించిననూ!
నరులు, వానరులు బ్రవేశించుటది నమ్మదగని బలుకులు గాదా! 12

రావణాసురుడు బంపినట్టి యా రజనీచరుడగు శుకుండునూ!
పక్షిరూపమును దాల్చి వేగమున బన్నుగ యాకాశంబునకున్!
నెగురుచు బోయెను సుగ్రీవునకును నిశాచరేంద్రుడు బలికిన యా
సందేశంబును వినిపింపగనూ చక్కగ బోయెను సంద్రముపై! 13

రజని చరుడగు నాశుకుండునూ రయమున సంద్రము పైపైనీ!
పయనించుచు బోయెను బహుదూరము బరగ నిలిచి గగనమునందున్
నిలిచియుండి సుగ్రీవుని తోడను బిలిచి పలికె యీ విధమునగనూ! 14

దురాత్ముడగు నా రావణాసురుడు దోరముగా జెప్పిన బలుకుల్
సుగ్రీవునితో దెలిపె శుకుండును సుమారముగ గగనమునుండీ!
అంతలోనె వానరులు నింగినీ పంతముదోడుత యాశుకునీ
రెక్కలూడ బెరుకుటకును మఱియును దిక్కు బాపుటకు కపివీరుల్!
శుకుని వాపునకు బోయిరి వారలు శూరులైన యా కపివీరుల్! 15

సకల ప్లవంగము వీరు అంతటను సరగున ప్రసభముతోడ శుకున్
గగనమునుండీ క్రిందికి ద్రోసియు గలగల నాతని బట్టుకొని!
ముష్టి ఘాతముల తోడ నా శుకుని మోదమునను వేధించి రటన్! 16

కపివీరులు నా నిథమున శుకునీ కలతగలుగ వేధింపగనూ!
ఏడుచుచు శ్రీరామునితో బలికెను నార్తుడ ననుచును బిగ్గఱగా!
శ్రీ రఘురామా! యార్తుల నెవ్వరు చిత్రముగా బాధింపరుగా
వానరవీరుల వికోధింపుమా! వధ జేయకు డనుచును సన్నున్! 17

ప్రభువు నభిప్రాయంబును దెలుపక బన్నుగ తన యిచ్ఛా రీతిన్
పలుకు బలుకునో యట్టి దూత మఱి ప్రభువు బలుకనీ మాటలనూ!
ఎవడు బలుకునో యట్టి దూతయును నింపుగ జంపగదగు వాడున్! 18

అంతట రాముడు శుకరాక్షసునీ నా వచనము, బరిదేవితమున్!
వినివెంటనె శాఖామృగ రాజగు విమల భావుడగు సుగ్రీవున్!
ఇతరులు నగు గపివీరుల తోడను నిటుల బలికె జాలిని గలుగన్!
'శుకుడు దూత! వానిని వధింపకుడు! సురుచిరముగ వదులుడు వానిన్! 19

హరివీరులచే భయము లేదనుచు సభయము బొందిన వాడగుచున్!
లఘుపత్రములను గలిగిన వాడై లలి శుకరాక్షసుడు మఱియున్
అంతరిక్షమున నిలిచినవాడై చెంత నిలిచినా సుగ్రీవున్
గని యీ విధమున బలికెను నాతడు గద్గద స్వరమున భయపడుచున్! 20

మహాపరాక్రమ వంతుడవును మఱి మహాసత్త్వ సంపన్నుడవూ!
ఓ సుగ్రీవా! లోకరావణుడు నొప్పుగ యీ రావణుతోడన్
ఏమని నేను సమాధానంబును నింపుగ దెలుపుదు సుగ్రీవా! 21

అటుబిమ్మట నా మహావీర్యుడును నట్టి ప్లవంగాధిపుడైనా
మహావిక్రముడు నా సుగ్రీవుడు మానుగ నిర్భయతతో నపుడున్
రజనీచరుడును గూడబారి మఱి రహి శుద్ధుండగు నా శుకుతో
బలికె నిటుల కపి వీరులు గాంచగ బటుతరమగు వాక్యంబులనూ! 22

ఓరావణ! విను! వధార్హుండవూ! యొప్పగ మిత్రుండవు గావూ!
జాలి జూపవలసినవాడవునూ సరసత నా కుపకారంబున్!
జేసినవాడవు గాదుగదా మఱి వాసిగ యిష్టుండవు గాదూ!
శ్రీరామునకును బరమశత్రువుగ స్థిరముగ నుంటివి దశగ్రీవా!
ఆకారణమున వాలికి వలెనూ! సకలబంధువులతో గూడన్!
జంపదగినవాడవు నీవు సుమా! క్షమింపదగు వాడవు గావూ! 23

రజనీచరేశ! నీ కుమారులను రయమున నీ బంధువుల మఱిన్
నీజ్ఞాతులతో నిన్ను గూడ మఱి నిశ్చయముగ నే జంపెదనూ!
మహాబలముతో కలిసినచ్చి నే మానుగ నీ లంకాపురినీ
లంకావాసుల నందఱ జేయుదు శంకలేక భస్మంబు నిలన్! 24

ఓరజనీచర! మూఢమతీ! విను! యొప్పుగ మహేంద్రుతో గూడీ!
సర్వదేవతలు రక్షించిననూ చావునిద్ధమూ! యిక నీకున్!
అంతర్ధానము నొందిన గూడను వింతగ సూర్య పథంబునకున్
బోయిన గూడను బాతాలమునకు బొలుపుగ జేరినను గూడన్
శివుని పాదపద్మముల దాగినను స్థిరముగ విడువగబడవు సుమా!

సోదరుడగు నా కుంభకర్ణుతో శూర పరాక్రము! నీవు మఱిన్
రామబాణమున హతుడ వయ్యెదవు రహి రాక్షసమూకల గూడి! 25

ఇట్టి నన్ను రక్షించెడివారలు నిట్టె లేరు ముల్లోకములన్
రాక్షసులను మఱి పిశాచంబులను రహి గంధర్వులు నసురులునూ
రక్షింపగనూ జాలరెవ్వరును శిక్షించును నిను రాఘవుడున్!

జరావృద్ధుడగు జటాయువును మఱి జంపినావుగద! నిర్దయతన్!
విశాలాక్షియగు జనకనందినిని పాశవికముగా దెచ్చితివీ
జేసినట్టి యా మహాపరాధము వాసిగ దెలియుట లేదుగదా!
రామలక్ష్మణులు దగ్గఱ నుండగ రహి యా సీతామహలక్ష్మిన్!
ఏల దొంగిలింపగలేదో మఱి నిల భీరుండవు హీనుడవున్!

మహాత్ముండు మఱి మహాబలుండును మానుగ దేవతలకు గూడన్!
ఎదిరింపగ జాలనివాడు సుమా! మది భావింపపు మూర్ఖతనూ!
ఆ రఘువీరుడు నెట్టివాడో మఱి యాలక్ష్మణునీ విక్రమమున్
నీ ప్రాణములను హరింపగలడూ నిజముగ నమ్మము నిశాచరా!

అటులిమ్మాట వానర శ్రేష్ఠుండును జటుల బరాక్రమవంతుడునూ!
యైన యంగదుడు సుగ్రీవునితో నలరుచు నీ విధమున బలికెన్!
మహాప్రాజ్ఞ! ఓ సుగ్రీవా! విను! మానుగ దూతయు గాదితడున్
గూఢచారిగా దోచుచునుండెను గూరిమి రావణు బంటు వలెన్!

నిలిచియుండి గగనంబున వీడును నిఖిల సైన్యమును గాంచుచునూ!
మన బలమెంతో జూడబడినదీ! మానుగ వీనిని వేవేంటన్!
బంధించుట యుక్తము లంకకునూ బన్నుగ బోవక యుండగనూ!
వధించుటే మఱి యుక్తం బనియును వసరగ నేమది దలచెదనూ!

అటులిమ్మాట సుగ్రీవుని యాజ్ఞను నా శుకరాక్షసు క్రుద్ధుచునూ!
వానరవీరులు నెగురుచు దముకుచు నయముగ యనాధువలె నచటన్!
విలపించెడి యా శుకుని బట్టుకొని వేగము బంధించిరి వారున్!

చండ స్వభావము గల వానరులును దండింపగ మఱి బంధింపన్
సంప్రీతుండై శుకు డంతట సారస నేత్రుడు మహాత్ముడున్!
దశరథాత్మజుడు శ్రీరఘురాముని దయను గోరి బిగ్గఱ యఱచెన్! 33

నాదు రెక్కలును బలాత్కారముగ నాథ! యూడ బెరుకుచు వీరున్
నాదు నేత్రములు టీకివేయగను నయముగ యోజించుచును మఱిన్!
నన్ను వధింపగ జూచుచుండిరీ నాథ! నన్ను గాపాడు మిదే!

అటుల గానిచో నా జీవితమున యలరి జేసినా పాపములన్
నేను బుట్టినా రాత్రి మొదలుకొని నేను జచ్చినా నిశి వఱకున్
నీవు బొందెదవు! రామా! వినుమా! నీకు సంక్రమించును సుమ్మా!

రావణు మాటలు జెప్పవచ్చితిని రయమున సుగ్రీవునకు మఱిన్
అంతట శ్రీరఘు రామచంద్రుడును నా శుకు బరివేదనను వినీ!
దూతగ వచ్చిన వానిని జంపుట దురితము గలుగును నని బలికీ!
వానరులాతని జంపకుండగా వదరగ జేసెను నా రీతిన్! 36

(యుద్ధకాండమందు ౨0వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# యుద్ధకాండము - మొదటి భాగము

## ఇరువది యొకటవ సర్గము

(తాను ప్రార్థించినను సముద్రము మార్గమివ్వక బోవుటచే రాముడు కోపించి బాణసంధానము జేయగా సముద్రము క్షోభ జెందుట)

సముద్రతీరము నందు దర్భలను సముచిత రీతిని బఱచుకొనీ.
మహోదధికి యంజలి ఘటియించీ మానుగ ప్రాఙ్ముఖుడై యతడున్
సర్వ సమానమునైన బాహువును సరసత దలగడగా జేర్చి
సముద్రతీరము నందు శయనించెను సమస్త కపివీరులు గాంచన్! 1

మణికాంచన కేయూరంబులునూ మానుగ ముత్యపు దండలునూ!
అలంకారములచే స్పృశింపబడి యలరెడి దన బాహువు నపుడున్!
దలగడగా జేసియు రఘురాముడు దాపసివలె యట శయనించెన్!

చందననాగరువు సుగంధములచే సుందరకాంతుల గూడికొనీ
బాలసూర్య ప్రభలను నొప్పెడి యా లలితారుణ చందనములచే
ఉపశోభితమై యుండునట్టి యా యున్నతమగు నా బాహువునూ
దలగడగా జేసియు రఘురాముడు దాపసివలె నట శయనించెన్!

పూర్వమందు శయనంబు నందునను బొలుపుగ జానకి శిరస్సుచే
నుపశోభితమై యుండెడి బాహువు నున్నత గంగా జలములచే
నిషేవితంబగు దక్షక తనువును నిర్మలగతి యుండెడి రీతిన్
తలగడగా జేసియు దనబాహువు దాపసివలె యట శయనించెన్! 5

దీర్ఘంబును మఱి యుగ సంకాశము దీరుగ సంగ్రామము నందున్!
శత్రువులకు శోకము గలిగించీ మిత్రులకును సంతోషమునూ!
భూమండలమున నాశ్రయంబునూ భూరి ప్రతాపము గలదియునూ!
అట్టి బాహువును నా శ్రీరాముడు నిట్టె దలగడగ జేసికొనెన్! 6

మహా సమర్థుడు, మహాబాహువును మానుగ బాణములను వరుసన్
విడుచుచున్న యా ధనస్సుచేతను విమలత కాయలుగాచిన యా

దక్షిణ బాహువు, మహాబరిఘతో దగ సమానమును నైనదియున్
గోసహస్రమును దానము జేసిన కూరిమి ధన్యంబైనదియున్!
అట్టి బాహుపును దలగడ జేసి యారాముడు దన మది దలచెన్!

ఈ మహోదధిని దాటుటయైనా నింపుగ జరుగగ వలయు మఱిన్!
మరణమునైనను నందగ వలయును మానుగ యీ తీరము నందున్!
అని దృఢముగ మది సంకల్పించి యథాశాస్త్రముగ నియమములన్!
బాటించుచు నా సముద్రతీరము బన్నుగ మునివలె శయనించెన్! 7,8,9

నియమంబుల బాటించుచు రాముడు నిర్మల మతియై మునివోలెన్!
కుశలు బఱచినా మహీతలంబున కూరిమి నిదిరించుచు నుండెన్!
మూడు రాత్రులును గడిచిపోయినను రాడుగదా! యా సముద్రుడున్! 10

నయజ్ఞుండు మఱి ధర్మవత్సలుడు నయముగ శ్రీరాముడు నచటన్!
మూడు దినంబులు శయనించియు నట మోదముతో నా సముద్రునిన్
నుపాసించెనూ ధర్మనిష్ఠతో సుగుణ వంతుడురాఘవుడున్ 11

నియమవంతుడగు శ్రీ రఘురాముడు నిర్మలమతి బూజించిననూ
మందబుద్ధియగు నా సముద్రుడును చందముగా శ్రీరామునకున్!
ధన రూపంబును జూపగ లేదూ! తగ ప్రార్థనలను వినలేదూ! 12

అటువిమ్మట శ్రీరామచంద్రుడును చటుల కోపమున యుగ్రుండై
రక్తలోచనుండై దాపునగల రహి శుభలక్షణు లక్ష్మణుతో
ఈ రీతిని బలికెను రాఘవుడును నిలపై బరుండి పరుషముగా 13

ఈ సముద్రుడును దాను స్వయముగా నింపుగ రాడుగదా యిటకున్!
ఎంతగర్వమూ! యహంకారమును సుంత సీనడుగా ప్రార్థననూ!
సత్పురుషులలో గలిగిన శాంతీ సరసత యోర్పు ఋజుత్వములన్
ప్రియవాదిత్వము నీ గుణంబులను ప్రియముగ గుర్తింపగలేరూ!
అట్టి యున్నతంబగు గుణంబులను నా గుణములు లేనట్టి జనుల్
సామర్థ్యము లేనట్టి వారిగా సరనత భావింతురు జగతిన్! 14

ఆత్మ ప్రసంసను జేసెడి వానిని నలదుష్టుని దౌర్జన్య మతిన్,
బరుగులెత్తు వానిని, దండమునూ ప్రయోగించు మానవుని యిలన్
సత్కరించెదరు నల్పు లెపుడునూ సత్పీలుని దలపరు వారున్! 5

సౌమిత్రీ! విను! యీలోకంబున సామముచే కీర్తిని నందన్
సాధ్యముగాదుగదా! యశస్సునూ శక్యము గాదుగదా! పొందన్!
సంగ్రామంబున విజయము నందను సాధ్యముగాదూ! యీ ధాత్రిన్! 5

సౌమిత్రీ! యీ మహోదధిని గల సకల మకరముల శరములచే
భేదించెద నిపుడే గను లక్ష్మణ! ఛేదించెద జల జంతువులన్!
మరణించిన జంతువులను గూడుక మారిపోవు నీ సంద్రంబున్!
అలల తెరలు లేకుండగ బోపును నా హోరును నాపెద నిపుడున్!

లక్ష్మణ! జూడుము! నీ మహోదధివి లావగు సర్పంబుల మఱియున్
మత్స్యంబుల బహు విశాలమైనా మానుగ శరీరముల నన్నీ
నీటి యేనుగుల తొండంబులనూ నిరవధికముగా ఖండింతున్!
నీరు నిలుచునటు జేసెద జూడుము! నిర్మలమగు నొక కొలను వరెన్!

శంఖంబులు. మఱి ముత్తెపు జిప్పలు సకల మీన మకరంబులచే
నిండినట్టి యీ మహాసంద్రమును ఖండితముగ శిక్షించెదనూ!
మహాయుద్ధమును జేయుదు నిప్పుడు మానుగ రణమున సముద్రునీ
యెండిపోవునటు జేసెద జూడుము! దండింతును నా శరములచే!

క్షమతో గూడిన నన్ను గాంచి మఱి సరసస్నేహమును జూపడుగా!
ఈ సముద్రుడును మహాగర్వమున నిలలో నాసరి లేదనుచున్!
అసమర్థునిగా నను భావించీ నలరుచున్నవా డీతండున్!
ఇట్టివాని విషయమున క్రమంబును నిట్టె జూపగా రాదుగదా! 21-2

సామోపాయముచేత సాగరుడు సరసరీతి గనబడడు గదా!
సౌమిత్రీ! చాపము గొనితెమ్మా! సర్పసమానము లైనట్టి
బాణంబులనూ గొనిదెమ్మిచటకు భవ్యమైన యా శరములచే
శోషింపగ జేసెదను సముద్రుని శోచనీయమగు స్థితి గలుగన్! 2

కోపించిన నే నిపుడు లక్ష్మణా! కూరిమి నా బాణంబులచే
క్షోభింపగ మఱి శక్యముగాని స్థిరమగు నీ యుదధిని మఱిన్
క్షోభింపగ జేయుదును లక్ష్మణా! తీరమునందలి నియమంబున్
సహస్రోర్మికలచే వ్యాకులమగు సముద్రమును హద్దులు లేనీ
ఎడారిగా జేసెద సౌమిత్రీ! కడు భీకరులగు దానవులున్!
నిండినట్టి యీ మహారవంబును నెండినట్టి బీడును జేతున్! 25 24

ఇటుల బలికి యా రఘువీరుండును జటుల కోపమున గాంచుచునూ!
ధనుస్సు హస్తమువను ధరిల్లియును దగ క్రోధంబుననేత్రములన్
బెద్దవి జేయుచు నా శ్రీరాఘవప్రళయకాల యగ్నికి వోలెన్
ప్రజ్వలించుచుండెను దీరం . బరులు జూడ శక్యముగాకన్! 25

భయంకరంబగు చాపముబట్టి భవ్యములగు బాణంబులచే
గంపింపగ జేయుదు జగత్తురూ గడు భీతియు గలిగెడిరీతిన్!
దేవేంద్రుడు వజ్రాయుధంబునూ దీరుగ విసిరిన విధముగనూ!
ఉగ్రములగు శరముల రాఘవుడును వనరగ విసిరెను సంద్రముపై! 26

తేజస్సులచే జ్వలించుచుండిన దీరుగ వేగము గలిగిన యా
శ్రేష్ఠంబులునగు బాణంబులునూ స్థిరవాసములగు సర్పములున్
భయపడునట్లుగ జలముల లోనికి బన్నుగ ప్రవేశ మొందినవీ! 27

మీనంబుల ధ్వని తోడను మఱియును మిగుల మకరముల ధ్వని తోడన్!
మారుతరవమున గూడికొనిన యా మహాసముద్రపు జలధ్వనియున్!
మహా ఘోరముగ వినబడుచుండెను మానుగ భూమ్యాకాశములన్! 28

వెనువెంటనె యా సముద్ర మంతయు విస్తృత సముద్ర సంఘముచే
జ్వలించుచుండెను శంఖంబులచే సరిగప్పగబడి నటులుండెన్!
వెనుకకు బోయెడి తరంగములతో విలవిలలాడెడి జలజీవుల్
పొగలు బొగలుగా విరిసెను సంద్రము వినువీధియు ధూమము గప్పెన్! 29

ప్రజ్వలించు ముఖములు గలిగియు మఱి ప్రజ్వలించు నేత్రంబులునూ!
గల సర్పంబులు దరంగములపై గడు దేలుచు వ్యధ జెందినవీ!

పాతాళంబున నివసించెడి యా బల్లిదులగు దానవులు మఱిన్!
వ్యధను బొందిరి విపుల వేడిమిని వేదన నందిరి భరింపకన్! 0

సర్పంబులతో మకరంబులతో నయముగ భయంకరంబైనా
తరంగంబులును పైకి లేచినవి దగ వినుపీదిని ముట్టుచునూ!
... పర్వతము మందరగిరి వలె సంధ్యారుణ మేఘంబులుగా
పైకి లేచినవి యా తరంగములు ప్రబలు ప్రబలుగా నెగురుచునూ! 1

వెనుకకు బోయెడి తరంగములతో విపులమైన ధ్వని గూడికొనీ!
ఉరగాలు, రాక్షసులును, భయంబునను నురుక్కులైత్తు వారలుగలదీ!
మకరంబులు మఱి జలజంతువులును మానుగ ప్రదికి మీదగుచున్!
కల్లోలములతో నిండిన దగుచును గలుషితమాయెను సంద్రంబున్!

అంతట లక్షణ లక్ష్మణుండు మఱి చెంతజేరి యరిసూదనునీ
ఉగ్ర వేగమును గలవాడును మఱి యురువర చాపము లాగెడి యా
శ్రీరామునితో వద్దు! వద్దనుచు స్థిరముగ బలుకుచు హస్తమునన్
రాముని ధనుస్సు బట్టుకొనెను మఱి రయమున బ్రార్థించెను నిటులల్!

ఈ విధముగ యీ సముద్రజలముల నీ విధి నశింపజేయకనూ!
మహావీరుడవు నీ కార్యంబును మానుగ సిద్ధిని జేసికొనన్!
దనివారవును దగ దీ కార్యము దానవులును మెచ్చరు దీనిన్
శివ ద్వేదులు గ్రోధమునకు వశులై భావింపరుగా నిట్టి పనిన్!
ప్రాణుల దత్పురుషుల వృత్తిని బన్నుగ గాంచుము రఘువీరా!

అంతరిక్షమున నంతర్ధానము నలరియుండి యా దేవతలున్!
'వద్దు! వద్దు' అని వనరగ బలికిరి గట్టిగ వినబడ రామునకున్!
'ఎంత కష్టమొచ్చెను' నని దమలో జింతజేసి రా దేవఋషుల్! 3

(యుద్ధకాండమునందు 21వ సర్గము సమాప్తము)

★ ★ ★

# యుద్ధకాండము - మొదటి భాగము

## ఇ రు వ ది రెం డ వ స ర్గ ము

[సముద్రుని యనుమతిచేత నీలుడు నూఱుయోజనముల సేతువును నిర్మింపగా రాముడు సేనా సహితుడై సముద్రమునుదాటి అచ్చటి సేనను నిలుపుట]

అటుబిమ్మట శ్రీరామచంద్రుడును అల మహోదధిని గూర్చి యిటుల్
భయంకరంబగు వాక్యము బలికెను బంచభూతములు భయమందన్!
ఓ సముద్రమా! పాతాలముతో వనరగ శోషింపగ జేతున్!
పంచభూతములు సకల దేవతలు నంచితముగ జూడగ నిన్నున్! **1**

ఓ సముద్రమా! నా బాణంబుల వనరగ నీ యుదకంబులనూ!
కాల్చి వేయుదును! జలజంతువులను ఘనమగు మకరంబుల గూడన్!
అపుడు నీదు యుదరంబు నందునను నలరు బరాగము జనియించున్!
ధూళి ధూసరము దోడను నిండును ధూమము జైకెగురుచు నుండన్! **2**

ఓ సముద్రుడా! నా చాపముచే వనరగ విడువగ బడినట్టి!
బాణవర్షమున బాట యేర్పడును భవ్యమైన నీ గర్భమునన్!
వానరులందఱు దాని సాయమున వనరగ బోదురు బాదములన్!
ఆవలి దీరము లంక దాపునకు నల రావణునీ దునుమాడన్! **3**

దానవాలయం బైన సంద్రమా! నను బరిశీలించియు గూడన్!
నా పౌరుషమును గుర్తింపవు గద! నాదు బరాక్రమమును గూడన్!
సంతాపంబును బొందెద విప్పుడు వింతగ జగమంతయు జూడన్! **4**

మహాబలుండగు రామచంద్రుడును బ్రహ్మదండమును సమానమున్
బాణముపై బ్రహ్మాస్త్రము గూర్చి బన్నుగ దానిని ధనుస్సుపై
సంధించియు మఱి లాగెను వేగము సకల వానరులు గనుగొనగన్! **5**

ఆ శరాసనము రాముని జేతను నలరి లాగగా వెనువెంటన్!
భూమ్యాకాశంబులు బద్దలునై బొరలినటులుగా గనిపించెన్!
పర్వతములు గంపించి నటులుగా బన్నుగ కనిపించెను యచటన్!

అట్టి సమయమున లోకమంతయును నిట్టె దమస్సులు గప్పికొనెన్!
దిక్కులు దక్కెను బ్రకాశంబులును జుక్కలు మొలిచెను గగనమున!
నదులు సరస్సులు క్షోభను జెందెను నక్షత్రములును గతి దప్పెన్!

చంద్ర సూర్యులును నక్షత్రంబులు సాంద్రముగా దమ గమనంబున్!
నడ్డముగా దిరుగుచు నడుమచునూ విడ్డూరముగా గలిసికొనెన్!
గగనము సూర్యుని కిరణంబులచే కాంతులు మందముగా నుండి!

అధికముగా జీకటుల జేతనూ యావరింపబడి యుండె నటన్!
మండుచున్న యా ఉల్కలతోడను నిండెను గగనంబంతయునూ!
అంతరిక్షమున యతుల స్వనంబుల వింతగ నిర్ఘాతంబులునూ!
బయలుదేరినవి ప్రళయకాలమున బన్నుగ గలిగెడి దృశ్యములున్! 8-9

దివ్యములగు నా వాయు పంక్తులను దేజముతో వీచిన నచటన్!
ఆ సమయంబున నా వాయువులును నలరి మేఘముల జిమ్ముచునూ!
చెదురునట్లుగా జేయుచున్నవీ బెదురు నటుల బహు పక్షులనూ!
వృక్షంబులు మఱి విఱుగునట్లుగా సృష్టించెను బక్రతి నంతన్! 10

ఆ వాయువులను శైలాగ్రములను మహావేగమున దాకుచునూ!
విరిచి వైచెనూ నేలను గూల్చెను విచ్చలవిడి చెలరేగుచునూ!
ఆకాశంబున గలిసికొనీ మఱి యతి ఘన ధ్వనులను గూడికొనీ
వైద్యుతాగ్నులను విడిచిన నచటను వనరగ యా యగ్నులు వేగన్!
పిడుగులుగా మారెను జిత్రముగా వడివడి నేలను బై పడగన్! 11

కంటికి గనబడు ప్రాణు లన్నియును కలకలరవమున బిగ్గఱగా!
యఱచెను కంటికి గనబడనట్టి నల బిశాచములు గూడ మఱిన్!
భయంకరంబగు ధ్వనులను జేసెను బాధను గూడిన గొంతుకనూ! 12-13

బిడుగులచే బీడింప బడుచునూ బీతిని యుద్వేగము గూడీ
బండుకొనెను ప్రాణులు ధరిత్రినీ నిండిన వ్యధనూ గదలకనూ! 14

అటుబిమ్మట యా మహాసముద్రము నట యుదకముల దరంగములన్!
మహాసర్పములు మహారాక్షసులు మఱి ప్రాణులతో గూడిన యా
వరుణాలయమును భయంకరంబగు వాయువేగమును గలదియు నై
ఆ వేగంబున జలముల దాకిడి నటు యోజనమును దూరంబున్
లంక వైపుదాటెను దీరంబున శంకలేక యా గాలికినీ!
రామాదులుగల చోట యోజనము రహి లోపలికిని బోయెనహా! 15

అమిత్రఘ్నుడును శత్రుమర్దనుడు నా శ్రీ రఘురాముడు మఱియున్!
దూరముగా బరుగిడిన యుద్ధతుని తీరముగా నా సంద్రముపై
బాణ ప్రయోగము జేయలేదు మఱి బన్నుగ ధర్మాతిక్రమమున్! 16

అటుబిమ్మట యా సంద్రమునుండీ యాసాగరుడును శీఘ్రముగా
మేరుపర్వతమునుండి భాస్కరుడు మేలిమి బంగరు కాంతులతో
ఉదయించిన రీతిని సముద్రుడును నుదయించెను జలముల మధ్యన్! 17

స్నిగ్ధమునగు వైడూర్య సమానుడు స్నిగ్ధ స్వర్ణ భూషణములునూ!
గలిగినట్టి యా సముద్రు డంతట కాంతులీను ముఖముల తోడన్!
విరాజిల్లు నా పన్నగములతో సరాసరిని రాముని కదకున్!
వచ్చి గనబడెను గ్రుచ్చి కౌగిలిని మచ్చికతో నిటు మాటాడెన్! 18

రత్నమాల్య, రత్నాంబర ధరుడును పద్మపత్రముల సమానమున్
నగునేత్రంబులు గలవాడును మఱి యలరు సకల పుష్పంబులతో
గూర్చిన మాలను శిరస్సుపైనీ కూరిమి ధరియించిన వాడున్!
తప్త కాంచనాభరణంబులతో దగ సొగసుల మీరిన వాడున్!

తన నుండియు బుట్టిన రత్నములను దగ ధరియించిన వాడు మఱిన్!
అనేక విధముల ధాతుమండితము నల హిమ శైలము బోలుచునూ!
అలరియుండినా వాడును మఱియును నల కౌస్తుభమును బోలినదీ
ఏకావళినీ మధ్యమందుగల యింపుగ కౌస్తుభ మణికి దగన్!

పాండుర ప్రభలను జిందుచుండినా పన్నుగ యా గోకావళినీ
వక్షస్థలమున ధరించు వాడును వనరగ దిరిగెడి తరంగముల్
గలవాడును మఱి మేఘ వాయువుల గదలికచేతను వ్యాకులుడున్!
అలదేవతలకు సమాన రూపము గలిగినట్టి వాడును మఱియున్
అనేకవిధముల రూపంబులుగల నల గంగా సింధువు నదియున్!
ప్రధానంబుగా నదుల తోడనూ బన్నుగ గూడినవాడు మఱిన్!
నదుల ప్రభువునూ వీర్యవంతుడును నయముగ యా సాగరుడు మఱి
సమీపించి శ్రీరామ చంద్రునీ చక్కగ ముందుగ శ్రీరామా!
అనుచు బిలిచి యంజలి బద్ధుండై ధనుసు ధరించిన రామునితో!
సాగరు డిటు బలికెను వినయముతో సరసవాక్యముల మధురముగా!! 4

సౌమ్యుడవగు శ్రీరామా! వినుమా! సరసరీతి యీ భూమియునూ!
వాయువు నాకాశము జలంబునూ యలరు జ్యోతియును నైదు నిలన్
శాశ్వత మార్గము నాశ్రయించునూ స్వభావమును వీడవు నెపుడున్!
స్వభావ మేదో దానిని విడువక దాటకుండు దమ మార్గంబున్! 5

అగాధమైనా వాడను రామా! యలరి దాట శక్యముగానీ
వాడనుగా నుండుటయే గద! నా వనరగ స్వభావము నిలలో!
లోతులేని వాడగుట వికారము లోలత దెలుపుచు నున్నాడన్!
తమ తమ ధర్మంబుల వర్తించుట దగునని విజ్ఞుల మాటగదా! 6

పార్థివాత్మజా రామా వినుమా! బన్నుగ నక్రాకులమైనా
జలమును మఱి నే నెన్నడయిననూ సరసరీతి కామము వలనన్!
లోభమువలనను, భయము వలననూ లోలత రాగముచే గానీ!
స్తంభింపగ జేయను శ్రీరామా! సరిగీతను నే దాటనుగా!

శ్రీ రఘువీరా! యే విధముగ మఱి స్థిరముగ బోగలవో యటులన్
నేర్పాటును నే జేసెద వినుమా! నింపుగ కపివీరులు బోవన్
బాటకు స్థలమును నిర్ణయించెదను బరగ సహించెద నంతయునూ!
జలజంతువు లపకారము సేయక యలరి యుండునటు సేయుదునూ!

అటులిమ్మట శ్రీ రామచంద్రుడును నా వరుణాలంగమును గూర్చి
యిటులబలికె ఓ సముద్రమా! విను నింపుగ యీ బ్రహ్మాస్త్రంబున్
వ్యర్థముకాదు గదా మఱి దెలుపుము! సిద్ధము నెటు జేయగ వలయున్?
ఏదేశమునను నే ప్రదేశమున వింపుగ ప్రయోగమును జేతున్? 29

మహాతేజమును గల మహోదధియు మహాత్ముడగు రాముని మాటల్!
విని యా మహాశరంబును గాంచి విమల హృదయమున నిటు లనియెన్!30

శ్రీరామా! నీ వీ లోకముననుస్థిరమగు కీర్తిని బొందితివో!
ఆవిధముగ 'ద్రుమకుల్య' మనియెడి యపురూపంబగు యశస్సునూ!
పొందినట్టి బహు పుణ్యతరంబగు అందమైన యొక ప్రదేశమున్
ఇచటికి యుత్తరమున గలదు సుమా! నింపుగ నా కది బహుప్రియమున్!

అ ప్రదేశమున యుగ్రదర్శనులు నట దుష్కర్మలు జేయుచునూ!
యుండెడివారలు పాపాత్ములునూ నురుతర బలాఢ్యులును నైనా!
అభీరులును మఱి దస్యువులును నట యలరుచు నాదు జలంబులనూ
త్రాగుచునుండిరి శ్రీరామా! యది దగ నే నహింప జాలనుగా! 30-31

పాపకర్ములగు బాపాత్ములచే బన్నుగ వారల స్పర్శలనూ
సహింప జాలకయుంటిని రామా! శరమును విడువుము వారలపై!
అమోఘమగు నా బ్రహ్మాస్త్రంబును నలరను వ్యర్థము గానిదిగా! 33

మహాత్ముడగు నా సాగరు వాక్యము మానుగ విని రఘువీరుండున్!
సాగరుండు దన వ్రేలిని జూపగ జ్వలించుచుండెడి బాణమునూ!
ఉత్తరదిశగా వదిలెను రాముడు యుర్వి కంప మొందెడి యటులన్!
రాముని బాణము వ్యర్థము గాదను రహి లోకంబున యుక్తిగదా! 34

వజ్రము తోడను బిడుగు తోడనూ! వసరగ కాంతులు గలిగిన యా!
బాణ మెచట బడవేయ బడినదో యట్టి స్థలము నంతకుముందూ
మరుకాంతారముగా ప్రసిద్ధినీ మానుగ బొందెను లోకమునన్
ఎడారి యగు నా యడవి యంతయును నింపుగ వనభూమిగ మారెన్!35

అంతట రాముని బాణాగ్రముచే వింతగ పీడింపగ బడినా!
అట్టి భూమినుండియు బిడుగుకువలె గట్టి శబ్దమును వినవచ్చెన్!
బాణముచే ఛేదింపబడిన యా బన్నుగ యట్టి ప్రదేశమునన్!
జలము జిమ్మె పాతాళమునుండీ బిలబిల పై పై కేతెంచెన్! 36

అప్పుడచట యేర్పడిన కూపమే అంతట వ్రణమను నామమునన్!
బహు ప్రసిద్ధి నొందెను లోకంబున బన్నుగ రాముని దయవలనన్!
సంద్రమువలె యా కూపమునుండీ సతతము జలములు పైపైకిన్
ధారలుగా మఱి యవిచ్ఛిన్నముగ దగ నట బ్రవహించుచు నుండున్! 37

ఆ ప్రదేశమున రామబాణమును నలరుచు బడి చీల్చుటచేతన్
అవధారణ శబ్దంబు పుట్టెనూ యతి భయంకరముగా నపుడున్!
ఆబాణంబును నా రఘువీరుడు నటుల ప్రయోగింపగ వేగన్!
ఆ దస్యులు నుపయోగించిన యా నల కూప తటాకాదులలో
ఉదకమంతయును నెండి పోవునటు సదయను సాగరుపై జూపెన్! 38

మూడులోకముల మరుకాంతారము ముదమున విఖ్యాతం బయ్యెన్!
దశరథాత్మజుండు, బండితుండు మఱి యమర విక్రముడు రాఘవుడున్!
ఆటగల కూప తటాకాదులనూ నటుల యెండి బోవగ జేసీ
యా మరుకాంతారమునకు రాముడు నలరి కరుణతో వరమిచ్చెన్! 39-40

శ్రీరాముని వరదానము జేతను స్థిరముగ మరుకాంతారమునూ!
పశు పక్ష్యాదుల కనుకూలముగా బరగ రోగములు లేనిదిగా!
ఫలమూలంబులతో, దేనెలతో బన్నుగ నిండిన వనములతో,
బహుక్షీరంబులతో, సుగంధముల బహు వివిధౌషధులను గూడీ!
విలసిల్లెను నా ప్రదేశ మంతయు విమలమైన తరులను లతలన్
ఈ విధియుత్తమ లక్షణములతో నింపుగ మరుప్రదేశంబున్!
మంగళకరమగు మార్గంబుగ నది మారిపోయె బన వాసముగా! 41-42

తదనంతరమును నా కుక్షియునూ దగ్గమైన బిమ్మటను మఱిన్
నదీ భర్తయగు నా సముద్రుడును నయముగ శాస్త్రజ్ఞుడునైనా
శ్రీరామునితో బలికె నీ విధము స్థిరవాక్యంబుల మోదమునన్! 43

సౌమ్య హృదయ! ఓ రఘురామా! సరసత నా పలుకులు వినుమా!
శ్రీమంతుండగు నలుడను జేకున స్థిరముగ కపివీరుడు గలడూ!
సుగ్రీవుని సేనను గల దతడును సురుచిర భావ సువిక్రముడున్!
విశ్వకర్మకును ప్రియ తనయుండును విమల వరంబుల దా బొందెన్!
విశ్వకర్మతో సమాను డతడును వివిధ శిల్ప కళలందు సునూ! 44

మహోత్సాహుండగు నీ కపివీరుడు మానుగ నా పై సేతువునూ!
నిర్మించును కపిసేన యంతయును నీరధి దాటును వేగముగా
నే ధరించుదును నా వారధినీ నిర్మలమతి నా దృఢశక్తిన్!
ఈతని తండ్రెటులో మఱి నాకును యీతని గూడను నటు జూతున్! 45

సముద్రు డావిధి బలికి వేగమున చయ్యన యంతర్ధానమునన్!
నిష్క్రమింపగా వానర వీరుడు నిరుపమ ప్రజ్ఞా నిధియైనా
నలుడు లేచి బలశాలియైన యా నయముగ రామునితో బలికెన్! 46

నాదు తండ్రి సామర్థ్యము నందీ నయముగ మకరాలయమందున్
విశాలమగు సేతువు నిర్మించెద విజ్ఞులు నాశ్చర్యము నందన్!
ఈ సముద్రుడును జెప్పిన దంతయు నింపుగ సత్యము రఘువీరా!
తండ్రి యిచ్చినా వరదానమునను దగ నిర్మించెద సేతువునూ! 47

భయంకరంబగు మహాసాగరుడు బన్నుగ సగరుని పుత్రులచే
వృద్ధిబొందినను, దండభయమునను శ్రద్ధగ సేతువు జూడగనూ!
లోతులేని యా సముద్రభాగము లోలత రామునకును జూపెన్! 48

మందర పర్వతమందు శిల్పియును సుందర సుకళా నిపుణుండున్!
విశ్వకర్మ నాతల్లితో ననియె విమల వాక్యముల మధురముగా!
దేవీ! నాతో సమానుడైనా ధీరుడైన దనయుడు బుట్టున్!
సకల కళా నిపుణుండు మఱియునూ సర్వశాస్త్రముల బరిచితుడున్!
అనుచు విశ్వకర్మయును వరంబును నలరి యిచ్చె నా జననికినీ! 49

విశ్వకర్మకును నౌరసపుత్రుడు! విశ్వకర్మతో సమానుడన్
నీ సముద్రుడును నిపుడు దెలుపగా నింపుగ స్మరణకు వచ్చినదీ!

ఈ సాగరుడును జెప్పిన దంతయు నినవంశోత్తమ నిజము సుమా!
అడుగకుండగా నాత్మ గుణంబుల యలరి దెలుప సరిగాదు సుమా!
అందువలననే మౌనము దాల్చితి చిందులాడకను గర్వమునన్! 50

ఈ సముద్రమున సేతువుగట్టగ నింపుగ సామర్థ్యము గలదూ!
తండ్రియిచ్చినా వరదానమునను దగ నిర్మాణము జేయుదునూ!
అందుచేత కపివీరు లందఱును ముందున కొచ్చి యిపుడిపుడే!
సేతువు గట్టగ ప్రయత్నంబునూ సేయగ వలయును శ్రీరామా! 51

అటుబిమ్మట శ్రీరాముని జేతను నంపబడిన హరిపుంగవులున్!
వందల కొలదియును, వేలకొలదియును జిందుచు గంతులు వేయుచునూ
వానరవీరులు సంతోషముతో వనరగ బోయిరి వేగముగా
మహారణ్యముల మహాగిరులకును మానుగ శిలలను దెచ్చుటకున్! 52

నగ సంకాశులునగు కపివీరులు నయముగ నలువైపులనుగలా
పర్వతములనూ మహావృక్షముల బన్నుగ విరిచిరి వేగముగన్!
వాని నన్నిటిని సాగరతీరము వనరగ జేర్చిరి కపివీరుల్!
రామకార్యమని మదిలో దలచుచు రామ! రామ! యని బాడుచునూ! 53

అంతట రాముని యాజ్ఞ చేత మఱి వింతగ యా కపివీరులునూ!
పర్వతంబులను వృక్షంబులనూ బన్నుగ విరిచిరి వేగముగన్!

సాల యశ్వ కర్ణంబుల జేతను సరగున ధన వృక్షంబులచే
వెదుళ్ళజేతను, కుటజ వృక్షముల విమలార్జున, దాలంబులచే
తిలక, బిల్వ వృక్షంబుల జేతను, తినిశ సప్త పర్ణంబులచే,
కర్ణికార వృక్షంబుల జేతను గాంతు లీను చూతంబులచే
అశోక వృక్షంబులచే నుదధిని వనరగ నింపిరి కపివీరుల్! 54-55

ఆ హరి సత్తము లా వృక్షంబుల నలరుచు మొదళ్ళ తోడుతనూ!
మొదళ్ళులేనివి యైన వృక్షముల ముదమున యింద్ర ధ్వజములుగా
పైకి నెత్తికొని పోయిరిగా యట బరగ యుదధి తీరంబునకున్! 56

ప్లవంగ వీరులు నా యరణ్యమున బన్నుగ యా యా ప్రాంతములన్!
దానిమ్మల యా తరుల పొదలునూ తాల నారికేళంఖులనూ!
విభీతకంబుల, కరీర తరువుల విమల వకుల నింబంబులనూ
అనేక విధముల దరువులు దెచ్చిరి యా సాగర తీరంబునకున్! 57

మహాకాయులును, మహా వీర్యులును మానుగ యాకపి వీరులునూ!
యేనుగు అంతటి బండరాళ్ళనూ నింపుగ గిరి పర్వతములనూ!
బెకలించియు యంత్రంబుల ద్వారా చకచక దెచ్చిరి యొడ్డునకున్! 58

హఠాత్తుగా ప్రక్షిప్య మానమై అల పర్వతముల వృక్షములన్
జలధి నీరములు పైకి లేచినని విలవిల నాకాశంబునకున్!
అచటనుండి మఱి క్రిందికి బడుచును నటు నిటు వ్యాపించెను మఱియున్!

అన్ని వైపులను బడెడి వృక్షములు యాగిరి పర్వత శిఖరములున్!
ఆ సముద్రమును క్షోభపెట్టినవి యలలు దెరలు పై కెగయుచునూ!
కొందఱు వానరవీరులు నచ్చట కొలత దారములు బట్టుకొనీ
నూఱు యోజనము అంత దూరమును వేఱువేఱుగా నిలిచి రటన్! 60

నద నదీ పతి యగు సముద్రమున నలుడు మధ్యమందున నిలిచీ!
మహా సేతువును నిర్మించెను నట మహా వానరుల సాయమునన్!
ఘోరకర్మలును గల కపివీరులు మీరిన శక్తిని సంభ్రమునన్
మహా సేతువును గట్టుచుండిరీ మానుగ నలు నాధ్వర్యమునన్! 61

కొందఱు కపివీరులు నట నుండిరి కూర్మి సూత్రములు గట్టిన యా
దండంబులు మఱి గ్రహించుచును మఱి కొందఱు శిలలను నొకచోటన్!
ప్రోవు జేయుచుండిరి మఱి మోయుచు గావు గావుమని యఱచుచునూ! 62

మేఘంబుల వలె పర్వతముల వలె మిలమిల లాడెడి వానరులున్!
వందలకొలదియు, వేలకొలదియుచు సందడిగా యాకపివీరుల్!
రాముని యాజ్ఞను శిరమున దాల్చుచు తయమున తృణ కాష్ఠంబులచే
సేతువునకు గల కొన్ని భాగములు స్థిరముగ గట్టుచు నుండి రటన్! 63

వృక్ష ప్రాగ్ర భాగంబుల తరులను బూనికతో నటకును దెచ్చి!
సేతువు నప్పట గట్టుచునుండిరి స్థిరముగ కొందఱు వానరులున్!
దానవ సన్నిభులగు మఱి కొందఱు దగ గిరి పర్వతములవంటి
పాషాణంబుల గ్రహించి మూపున బరువులు దీయుచు నుండి రటన్! 64

మహాసంద్రమున విసరివేయబడు మహాశిలల శబ్దంబులునూ!
పర్వతముల బడవేయు చుండెడి బటుతరమగు నా స్వనములునూ
తుముల వ్యాకులంబైన ధ్వనులతో దోరముగా నిండెను నచటన్! 65

ప్రహృష్టులును మఱి గజ సంకాశులు ప్లవంగవీరులు వేగముగన్
మొదటి దినంబున యా సేతువునూ మోదమునను నందఱు గలిసీ!
పదునాలుగులా యోజనంబులను బన్నుగ గట్టిరి నాతురతన్! 66

ఆ విధముగనే రెండవ దినమున యతుల భయంకర శరీరముల్
గలిగినట్టి యు మహావీరులును కాంతులు జిందెడి కపివీరుల్
ఇరువది యోజనముల సేతువునూ నింపుగ గట్టిరి నీరధిపై! 67

ఆ విధమున మూడవ దినముననూ యతికాయంబులు గలిగిన యా
వానరవీరులు తొందరబడుచును వనరగ యా నీరధిపైనీ!
ఇరువది యొక్కటి యోజనంబులను నింపుగ గట్టిరి సేతువునూ! 68

అటు పిమ్మట బహు వేగవంతులును బటుతరముగ తొందర బడుచున్
ఆ కపివీరులు నాల్గవ దినమున నలరుచు నుత్సాహము తోడన్
ఇరువది రెండగు యోజనంబులను నింపుగ గట్టిరి సేతువునూ! 69

ఆ విధముగనే యైదవ రోజున నలరుచు శ్రీఘ్రము కార్యములన్!
జేయునట్టి యా కపివీరులచే స్థిరముగ యావలి తీరంబున్
జేరునట్లుగా నిరువది మూడూ స్థిరమగు యోజనముల నపుడున్
సేతువు నిర్మించిరి కపివీరులు భీతిలేక సంద్రము వలనన్! 70

వానర శ్రేష్ఠుడు శ్రీమంతుడును వనరగ బలవంతుడునైనా
విశ్వకర్మ తనయుడు నా నలుడును విమలమతిని తన తండ్రి యెటుల్!

కట్టెడివాడో యా విధముగనే కలతలేక నీ రఘుపైని!
సేతువు నిర్మించెను దేవతలును శ్రీకరముగ కీర్తింపగనూ! 71

మకరంబులకును నివాసమైనా మానుగ వరుణాలయమందున్
నలునిచేత నిర్మింపబడిన యా విలక్షణంబగు సేతువునూ!
అంబరమున స్వాతీ మార్గమువలె యతి ప్రకాశమున వర్తిల్లెన్! 72

ఆటువిమ్మట గంధర్వుల తోడను నా దేవతలును సిద్ధులునూ!
పరమఋషులు నా యద్భుత దృశ్యము బరమాశ్చర్యంబగు దానిన్!
చూడగోరికను గలవారగుచును గాఢముగా మనసున దలచీ
వచ్చి నిలిచిరీ గగనమునందున మచ్చికతో పూవులు రాల్పన్! 73

దశ యోజనముల విస్తీర్ణంబును దగ శత యోజన యాయతమున్
గలిగిన యా సేతువు నిర్మింపగ గడు దుష్కరమగు కార్యంబున్!
గంధర్వులు, దేవతలును గాంచిరి సింధువుపై యా సేతువునూ!
ఆనందంబును నాశ్చర్యంబును నలరి పొంది రా క్షణమందున్! 74

దూరముగా దుముకుచు కపివీరులు తోరముగా బహు దగ్గరగా!
దుముకుచు మఱి గర్జనలు జేయుచును విపుల మతుల సంతసమందన్!
సకల భూతములు నచింత్యమైనది సహింపరానిది యద్భుతమున్!
రోమాంచంబును గలిగించునదీ రూఢిగ నీటను నిలిచిన యా
సేతుబంధనము గాంచి మనసునను నతి యాశ్చర్యము నందిరి వీ! 76

మహా తేజమును గలిగినట్టి యా మహావీరులగు వానరులున్!
వేయికోట్ల సంఖ్యను గలవారలు విమల సాగరము పై వేగన్!
సేతు బంధనము గట్టుచు బోయిరి శ్రీకరముగ యావలి యొడ్డున్! 77

విశాలమును సువృత్తమైనట్టిది విమల శోభలను గూడినదీ!
సుభూమియును మఱి సుసమాహితమును సుందరమగు నా సేతువునూ!
సాగర మధ్యమునందు పాపిడిగ చక్కని శోభను గూర్చె నటన్
బాగు! బాగు! అని బలికిరి సురలును బన్నుగ కిన్నెర గంధర్వుల్! 78

అటువిమ్మట యా విభీషణుండును ననుయాయులతో గూడికొనీ!
గదాపాణియై శత్రు సైన్యమును గఠినముగా శిక్షింపగనూ!
సంద్రము నావలి యొడ్డున నిలిచెను సమదోత్సాహము గూడికొనీ! 79

అటువిమ్మట యా సుగ్రీవుండును చటుల బరాక్రమము దయినట్టి
మహాత్ముడగు నా శ్రీరామునితో మమతను బలికెను నీరీతిన్
మహావీర శ్రీరామా! వినుమా! మకరంబులకు నివాసమిదీ!

ఈ సముద్ర మతి విశాలమైనది నింపుగ హనుమంతుని పైనీ!
ఆరోహింపుము! లక్ష్మణ మూర్తియు నంగదు భుజముల పైని మఱిన్
నధిరోహించుచు మీ రిద్దఱునూ నా కాశంబున బోదు రికన్! 80-81

లక్ష్మణ సహితుండగు శ్రీరాముడు లలిత మానసుం డగువాడున్!
ధర్మాత్ముండగు రామచంద్రుడును దగ సుగ్రీవునితో గూడీ!
ధనస్సు జేతను ధరించి యాతడు దగ యా సేతువు పై నిలిచీ
ముందు భాగమున బయనము జేసెను వింధుగూర్చ కపివీరులకున్! 82

కొందఱు వానర వీరులంతటను చందముగా సేతువుపైనీ
మధ్య భాగమున బయనము జేసిరి మానుగ కొందఱు పార్శ్వమునన్
మఱి కొందఱు జలములను దుముకుచును మఱి ఈదుచుండిరి వికలముగా!
మఱల మార్గమును బొందుచు వేగము మానసమున సంతసముననూ!
గగనమార్గమున గొందఱు బోయిరి గరుత్మంతునీ బోలుచునూ! 83

నీరధి దాటెడి హరి వాహినిచే నిరవధికంబును భీమంబున్!
మహత్తరంబగు శబ్దము జేతను మానుగ భయంకరంబైనా
సముద్ర ఘోషను గప్పివేసెనూ! సకల భూతములు భయమందన్! 84

నల సేతువుచే దీరము దాటిన నయముగ యా హరి వాహినినీ!
మహాత్ముడగు నా సుగ్రీవుండును మానుగ నిలిపెను నచ్చోటన్!
అధికమైన ఫల మూలంబులనూ యధికోదకములు గలచోటన్!
అలినిపోయినా కపివీరులకును యలసట దీరెడి గలచోటన్! 85

అంతట సురలును సిద్ధుల తోడను చెంత చారణుల గూడికొని
మహా ఋషులతో బరమాద్భుతమును మానుగ దుష్కర మైనదియున్!
రాముడు జేసిన ఘన కార్యంబును రయమున గాంచియు వెనువెంటన్
శ్రీరాముని దగ్గరగా జేరి శీతల పవిత్ర జలములతో
వేలువేలుగా నభిషేకించిరి శమల వాక్యముల బలుకుచునూ! 86

నరదేవా! శ్రీరామా! వినుమా! నయముగ శత్రుల జయింపుమా!
ససాగరముతో మేదిని యంతను సరసముగా బాలింపు మికన్!
అనుచు బలుకుచును సురగంధర్వులు నఖిల రాజ సంఘము జేతన్
ఆదరింపబడినట్టి రామునీ యతి గారవమున దేవతలున్
బూజించిరి మఱి పుష్ప వర్షమున పూర్ణాంజలులను ఘటియించి! 87

(యుద్ధకాండములోని 22వ సర్గము సమాప్తము)

   

# యుద్ధకాండము - మొదటి భాగము

## ఇరువదిమూడవ సర్గము

[రాముడు లోకవినాశ సూచకములైన శకునములను లక్ష్మణునకు జూపుట - లంకపై ఆక్రమణమును జేయుట]

శకునంబుల నెఱిగిన తత్త్వజ్ఞుడు సకలము దెలిసిన రాఘవుడున్!
పుష్కలమిత్రములగాంచి రాముడును దురపిల్లుచు సంతాపమునన్
సౌమిత్రిని హృది కౌగలించుకొని సారసాక్షు డిటులను బలికెన్! 1

సౌమిత్రీ చల్లని యుదకంబుల సారవంతమగు ఫలములనూ!
గలిగిన వసతుల నివాసమునకును గడు నాదరమున గ్రహియించి!
ఇట్టి మహా సేనా సముదాయము గట్టిగ విభజించుచు మఱియున్
వ్యూహములను నిర్మించెద మిప్పుడు యూహలు జెదరగ శత్రులకున్! 2

లోకక్షయమును జేయనదియు మఱి లోలత భయంకరంబైనా
వీరులైన భల్లూకములకునూ వీరులు వానర, యసురులకున్!
నశింపజేయుటకును గారణమగు నయముగ భయంకరంబైనా
ఆపదవచ్చిన రీతిని మనసున నగబడుచున్నది సౌమిత్రీ! 3

వాయువు లల్లదె కలుషితంబులునై వనరగ దూళిని మిశ్రితమై
వీచుచున్నవి వసుంధరయునూ విమలత్వంబును బోనాడీ!
కంపము జెందుచు నున్నది గనుమా! గదులుచుండె గిరిశిఖరంబుల్
మహీరుహంబులు నేలను బడుచును మానుగ నున్నవి యంతటనూ! 4

రాక్షసులకువలె భయంకరములును రహి క్రూరములగు మేఘములున్!
బరుష ధ్వనులను బలుకుచున్నవి బన్నుగ శోణిత బిందువులన్!
ఉదకంబులతో గురియుచు నున్నవి సదయమతీ! లక్ష్మణ వినుమూ! 5

రక్తచందనము సమానమైనా రమ్య సంధ్యలవి దారుణమై
భయంకరముగా గనబడుచున్నవి పలు విధంబులగు కాంతులతో!

ప్రజ్వలించు నా సూర్యుని నుండీ బరగ యగ్ని పిండంబులునూ!
రాలుచునున్నవి భూతలంబునను కాలిన కొఱవుల రీతిగనూ! 6

అన్నివైపులను క్రూరమృగంబుల నతి దీనములగు స్వరములనూ
మహాభయంబును గలిగించుచును మాటి మాటికిని దీనతనూ!
ఆదిత్యునకును నెదుఱుగ నిలిచీ నఱచుచునున్నవి సౌమిత్రీ! 7

లోకక్షయమగు సమయమునందున లోలత యుదయించిన రీతిన్
కృష్ణ రక్త కాంతులతో చంద్రుడు గ్రుశించినటు నగుబడు చుండెన్!
రాత్రులందు భాసుర కాంతులనూ రమణీయతలను విడనాడి
భయమును గలుగగ జేయుచుండెనూ ప్రకాశహీనుండై రాత్రుల్! 8

లక్ష్మణ! నిర్మలమగు సూర్యునిలో బీషణమును మఱి హ్రస్వమునూ!
క్రూరంబును, ప్రశస్తము కానిది కుదురుగ యెఱ్ఱని గూడు మఱిన్
విలిచియున్నదీ గనుమా లక్ష్మణ! నిర్మల మండలమున మధ్యన్!
నల్లని మచ్చయు గనబడుచున్నది నయముగ కాటుక రేఖవలెన్! 9

మహా పరాగముజేత తారలును మానుగ నక్షత్రములు మఱిన్
గప్పబడినవై యున్నవి జూడుము! గాంతి హీనమై యన్నియునూ!
లోకంబునకును మహాప్రళయమును లోలత రానున్నది యనుచున్!
జెప్పుచున్నదా యనునట్లున్నది జూడుము లక్ష్మణ! దశదిశలున్! 10

కాకులు, డేగలు మఱియు గ్రద్దలును గడుక్రిందుగ మఱి యెగురుచునూ!
సంచరించుచుండెను గనులక్ష్మణ! యంచితముగ నక్కలు గూడన్!
మహాభయంకరమైన ధ్వనులనూ మానుగ యమంగళము లైనా
ధ్వనుల నడే మఱి జేయుచున్నవి దగ శాపంబుల విధముగనూ! 11

వానర రాక్షస వీరులు విడిచిన వనరగ పర్వతముల తోడన్
శూలంబులతో ఖడ్గంబులతో కోలిన కళేబరంబులతో
భూమియంతయును రక్తమాంసముల బురద యగునుగద! నతిత్వరతో! 12

సమస్తమగు వానర వీరులతో చయ్యన యిపుడే శీఘ్రముగా
రావణుండు బరిపాలించెడి యీ రమ్యమైన లంకాపురినీ
ముట్టడించెదము నల రాక్షసులను మట్టు బెట్ట నతి శీఘ్రముగా! 1

మనోహరుడు సంగ్రామదర్శణుడు రమ్య ప్రభువు శ్రీరాముండున్!
నటుల బలికి ధనువును ధరియించీ నా లంకాముఖుడై వేగన్!
ప్రయాణ మాయెను కపివీరులతో బన్నుగ ముందుగ నడుచుచునూ! 1

విభీషణునితో, సుగ్రీవునితో వీరులైన కపివీరులునూ!
సింహనాదములు జేయుచు గంతుల శీఘ్రముగా బరుగుల తోడన్
బలవంతుల రాక్షసుల వధింపను శిలల దరుల చే ధరియించీ! 1

మహావీరులగు నా కపివీరులు మానుగ శ్రీరఘు వీరునకున్
సంతోషము గలిగించుట కొఱకై వింతవింత పనులను జేయన్!
ఆ రఘురాముడు సంతోషించెను నా కోతుల చేష్టలను గనీ!
ఆనందించెను నా రఘువీరుడు నల సౌమిత్రిని గూడికొనీ! 1(

(యుద్ధకాండములోని 23వ సర్గము సమాప్తము)

  

## యుద్ధకాండము - మొదటి భాగము

### ఇరువదినాల్గవ సర్గము

[రాముడు లంకశోభను వర్ణించుచు, సేనను వ్యూహములుగా నిలువుమని లక్ష్మణుని ఆదేశించుట—అంతవఱకు బంధింపబడియున్న శుకుణ్ణి విడువగా అతడువెళ్ళి రావణునకు రాముని సైన్యశక్తిని గురించి వర్ణించి చెప్పుట—రావణుడు దన బలమును బొగడుకొనుట]

వ్యవస్థితంబగు నా కపిసైన్యము వనరగ శ్రీరాముని గూడీ!
శుభకర నక్షత్రములను గూడీ సుందర శారద మాసమునన్!
పున్నమి చంద్రుని గూడినట్లుగా బొలుపుగ నుండెను రాజిలుచున్! 1

మహాసాగరము దేజము గలిగిన మానుగ యా హరిసైన్యముచే
పీడింపగబడి యా వసుంధరయు భీతిని భయబడుచున్నదియై
చలియించెను గిరి పర్వతంబులను చక్కని యడవులు, గ్రామనులతో! 2

అటుబిమ్మట యా వనౌకసులునూ వనరగ లంకాపురి నుండీ!
మిగుల వ్యాకులంబును, రోమాంచము మీరిన భేరీ మృదంగముల్
యలరునట్టి ధ్వనులను వినిరప్పుడు నపురూపంబగు రణధ్వనులున్! 3

హరియూథపులును యా ధ్వనులను విని యఱచుచు సంతసమున యవుడున్!
అట్టి ఘోషణము సహింపకను వే యిట్టె యంతకంటెను మిగులన్
ధ్వనులను జేసిరి గగనము సహితము కదిలి ప్రతిధ్వని జేయంగన్! 4

గర్వించిన యా వానరవీరులు గగనంబున యుఱుముల వోలెన్
ధ్వనించుచుండిన యా ఘన స్వనముల దగ యా రాక్షసులును గూడన్
పని మదియందున భీతిని జెందిరి వితర్కించుచును విజయంబున్! 5

చిత్ర విచిత్ర పతాకంబులతో శ్రీకరమగు ధ్వజముల తోడన్!
ప్రకాశించు నా లంకానగరము బస్సుగ గాంచుచు మనసుననూ!

బాధనొందు చిత్తము దోడుతనూ పరమ వేదనను బొందుచునూ
జనకనందనను మదిలో దలచుచు గనులయందు నీరును నింపెన్!

మృగశాబాక్షియు నైన జనకసుత దగ్రక్రోధోజ్జ్వల యరుణమునౌ
యంగారక గ్రహ యాక్రమణముచే యదలిపోవు రోహిణి వలెనూ
యాక్రమింపబడె యా రక్కసుచే నచ్చట యా నగరమునందే
బంధింపగబడి యుండెగదా యని బన్నుగ రాముడు చింతించెన్! 7

వీరుడైన యా శ్రీరాముడునూ వికలత నొందియు దీర్ఘముగా
ఉష్ణముగా నిట్టూర్చి లక్ష్మణుని నొప్పుగ నాతని బరికించీ!
తత్కాలంబున హితమగు వచనము దగ బలికెను నీ విధముగనూ! 8

సౌమిత్రీ! గను విశ్వకర్మచే సరస రీతి గగనము నందున్
మనస్సుచేతను నిర్మించెనో యన మానుగ నున్నది చిత్రముగా
ఆ లంకాపురి యాకాశంబును నంటుచున్నదా యనునట్లున్
గనబడుచున్నది గనుమో లక్ష్మణ! గడు విస్మయముగ దోచు మదిన్! 9

పూర్వకాలమున నిర్మింపగబడె పొలుపగు నీ లంకాపురియున్
అత్యున్నతములు నగు భవనంబులు నలరియుండె లక్ష్మణ! గనుమా!
విష్ణుపదంబగు నాకాశంబును విమలమైన తెల్లని కాంతుల్!
గల మేఘంబులు గప్పబడిన యటు గనబడుచున్నది కన్నులకున్! 10

ఈ లంకాపురి యనేక విధముల నింపుగ బక్షుల స్వనములతో
పుష్పములే ఫలములుగా గలిగిన పొలుపగు మల్లియ పూలతలన్!
పుష్పించియు శోభాయమానముగ గుప్పున మధుర సువాసనలన్
చిత్ర రథోద్యానంబుల దోడను చిత్రము! సుందర వనములతో
నగరోద్యానంబుల గను లక్ష్మణ! నయముగ ప్రకాశమగు రీతిన్! 11

ఈ నగరోద్యానంబుం యందున యింపుగ మత్త విహంగములున్
విహరించుచునున్నవి గను లక్ష్మణ! విమల ధ్వనులను వృక్షములన్!
భ్రమరంబులునూ పుష్పంబులలో బన్నుగ నిదురించుచు నుండెన్!
కోకిల ధ్వనులను గూడియున్నదీ కూరిమి వృక్షము లందుననూ! 12

దశరథ కుమారుడైన దాశరథి దగ సౌమిత్రిని గాంచుచునూ
ఈ రీతిని పలికెను నటు బిమ్మట నింపుగ శాస్త్రము నందుననూ!
చూపబడిన విధమున శ్రీరాముడు స్థిరమగు గరుడుని వ్యూహమునూ
సేనను విభజన జేసి నిలిపెసూ స్థిరముగ నాయకులను గూడన్! 13

వీర్యవంతుడును దుర్జయుండునూ విమల నీతి మంతుండును నౌ
అంగదుండు నీ సైన్యమునుండీ సంగతిగా దన సైన్యమునూ
తీసికొనియు, నీలునితో గలిసీ దీరుగ గరుడాకారముతో
నుండినట్టి యీ వ్యూహము నందున యుండ వలెను వక్షస్థలమున్! 14

ఋషభుండను వానర నాయకుడును విషయంబును దా తెలిసికొనీ
తన వానర సముదాయము తోడను వానర వాహినితో గలిసీ!
దక్షిణ పార్శ్వంబున నుండగవలె దగ రక్షించుచు సైన్యమునూ! 15

మద గజమునకు వలె దుర్ధర్షుండును మహావీర్యుడగు నగువాడున్!
గంధమాదనుడు వానర సేనకు గదలక స్థిరుడై యుండవలెన్!
ఎడమ వైపునను యధిష్ఠింపవలె యింపుగ తన సేనలగూడి! 16

నేను లక్ష్మణుని తోడను గలిసీ యిమ్ముగ రణ సంసిద్ధుడనై
శిరోభాగమున నిలిచి యుండెదను స్థిరముగ శరముల నొదులుచునూ!
జాంబవంతుడును, సుషేణుండునూ! వేగదర్శియను మహాత్ములున్!
ఈ మువ్వురు భల్లూక నాయకులు నింపుగ కుక్షి ప్రదేశమునన్!
నిలిచియు రక్షించెదరు సైన్యమును నిలిచియుండి తమ సైన్యముతో! 17

తేజస్సులతో గూడిన వరుణుడు దీరుగ పశ్చిమ దిక్కుననూ!
రక్షించెడి విధమున మనవారలు రక్షింతురు గాతను! మఱియున్!
కపిరాజగు మన సుగ్రీవుండును కదలక సేనకు పుచ్ఛమునన్
నిలిచియుండి తన సేనలతోడను నిశ్చితముగ రక్షించెడినీ! 18

సువిభక్తంబగు మహా వ్యూహములు సురుచిరముగ గలదియు మఱియున్
మహాబలాఢ్యులు కపివీరులచే మానుగ రక్షింపగ బడుచున్

నుండినట్టి యా వానరవాహిని నిండినట్టి మేఘంబులతో
ఆకాశము వలె ప్రకాశించెనూ యాశ్చర్యము గలిగెడి రీతిన్! 1

వానరు లంతట గిరి శిఖరంబుల వనరగ మహా మహీరుహముల్
హస్తములందు గ్రహించి యుద్ధమున యరి వీరుల మర్దింపగనూ!
గోరుచున్నవారై కపివీరులు గూరిమి జేరిరి యాలంకన్! 20

ఈ లంకను గిరి శిఖరంబులచే నిమ్ముగ పిడికిళ్ళను గానీ,
ఏసిరి వేసెదము జిమ్మివేసెదము విలవిల లాడగ రక్కసులున్!
అని మనస్సులను ననుకొని రంతట నా సమయంబున గపివీరుల్! 21

అటుదిమ్మట నా మహావీర్యుడును నా శ్రీరాముడు నీ రీతిన్
సుగ్రీవునితో సాదు మార్గమున సురచిరముగ యీ విధి బలికెన్!
సైన్యమంతయును విభజింపగబడి సకలరీతి వ్యూహంబులుగా!
గావున యా శుకు విడిచిబెట్టుమా! కనికరంబు మది గలుగంగన్! 22

మహాబలుండగు వానరేంద్రుడును మానుగ రాముని వచనములన్!
శ్రీరఘురాముని యానతి వలనను శీఘ్రము రావణు దూతయునూ
యైన శుకుని విడిపింపగ జేసెను నలరి పొమ్మనెను దన ప్రోవన్! 23

వానరవీరులచేత బీడితుడు వనరగ రాముని వచనములన్
విడిపింపగ బడినట్టి యాశుకుడు గడు జింతా భరితుం డగచున్!
రాక్షసాధిపుని యొద్దకు జేరెను రయమున వికృతరూపుండై 24

రావణుండు బరిహాసము తోడను రయమున యా శుకు గనుగొనుచున్!
ఆతని వికృతరూపము గాంచుచు నాతనిలో నీవిధి బలికెన్!
నీపక్షములను గట్టివేసిరా? నిను దండించియు పక్షములన్
విరిచివేసిరా? శత్రుల జేతిని కకము జిక్కాగా లేదు గదా! 25

పిమ్మట భయసంవిగ్న మానసుడు చెమ్మటలును గ్రమ్మగ మేనన్!
అప్పుడా శుకుడు రాక్షసరాజగు నా రావణు నానతి నందీ!
ఉత్తమమగు వాక్యములను బలికెను చిత్తమందు భక్తియు గలుగన్!

రాక్షసేంద్ర! ఓ రావణ! వినుమా! రమ్యమైన నా వచనములన్
సాగరంబు నుత్తరతీరమునకు సరసరీతి నే బోయితినీ!
మృదువగు వచనములను గూడుక నే సదమల మతి బ్రతిమాలుచునూ!
నీ సందేశము నంతయు దెలిపితి పీసమంత దోసము లేకన్! 26-27

నను జూడగనే యా కపివీరులు నయముగ క్రోధోద్రేకమునన్!
పైకి యెగిరి నను ముట్టడించిరీ బాహువులను వే జాచుచునూ!
ముష్టిఘాతముల నను బీడించిరి మోదమింతయును లేకయునూ
నా పక్షములను బీకివేయుటకు నయముగ ప్రారంభించిరిగా! 29

రాక్షసాధిపా! యా వానరులును రమ్య భాషలాడరు వారున్!
వారి విషయమున ప్రశ్నించుటయును పసరగ యవకాశము లేదూ!
ఆ వానరులును కోతి స్వభావులు సతి తీవ్రత గలవారు మఱిన్! 30

విరాధ కబంధ బహు రాక్షసులను నిలవల నేలను గూల్చియునూ!
ఖర రాక్షసునీ జంపినవాడగు చరచర యా రఘువీరుండున్!
సుగ్రీవునితో గూడినవాడై సుందరి జానకి గలచోటన్!
వచ్చినాడు! ఓ రావణ వినుమా! మచ్చికతో విను! నా మాటల్! 31

అట్టి రాఘవుడు సాగరమందున నిట్టె సేతువును నిర్మించీ!
లవణాంబుధిని దాటి సేనతో లలిత హృదయు డా రాఘవుడున్!
మహారాక్షసుల దృణీకరించీ మానుగ ధనువును జేఁబూనీ!
నిలిచెయుండె నాతని తమ్మునితో నిర్భయ వానర సంఘముతో! 32

పర్వత మేఘ సమానములైనా భల్లూకంబుల వానరులా
సంఘంబులచే నేర్పడినట్టి సహస్ర సంఖ్య యనీకములున్
భూమియంతయును గప్పుచు నున్నని భూరి మహోదధికిని వోలెన్! 33

రాక్షసవీరుల సైన్యంబునకును రహి వానర సైన్యంబునకున్!
ఈ రెండింటికి దేవదానవుల నిమ్ముగ సైన్యంబులకు వలెన్!
సంధిలేదుగద! ఓ రాజేంద్రా! సమరము దప్పదు రెండిటికిన్! 34

ప్రాకారంబును దాటి శత్రువులు బన్నుగ రాగలరింక సుమా!
శీఘ్రము నొక కార్యమును జేయుమా! స్థిరముగ మనసున యోజించి
ఆ సీతను శ్రీరామున కిమ్మా! యలత లేక యిల నుండెదవూ!
లేదా రణమును రామున కిమ్మా! మోదముతో జేయుము నొకటి! 35

శుకుని మాటలను విని రావణుడును వికల మానసుండై వేగన్!
రోషయుక్త నయనంబుల తోడను రూక్షమైన జూపుల తోడన్!
కాల్చివేయుచున్నాడా యనునటు గనుచు బలికె నీ విధముననూ! 36

దేవదానవులు గంధర్వులునూ దీరుగ నా కెదురును నిలిచీ!
రణభూమిని యుద్ధమును జేసినా రయమున సమస్త లోకములన్!
నుండి భయంబును గలిగిన గూడను ఖండితముగ దెలిపెద నిదిగో!
సీతను రామున కర్పింపను నే భీతిని నొందను రామునకున్! 37

వసంతఋతువున మత్తభ్రమరములు వరుసను బూచిన వృక్షముపై
శీఘ్రముగా బయనించి నట్లుగా శీఘ్రముగా నా బాణములున్
ఆ శ్రీరాముని పైబడునో మఱి యానందింతునొ యెపుడు మఱిన్! 38

శోణిత దిగ్ధాంగములు గలిగినా శూరుడైన యా రఘువీరున్!
నా కార్ముకమున నుండి వెడలినా నయముగ జ్వలించు బాణములన్!
ఏ దినమున బీడించెదనో కద! యెపుడు నొవ్వజేయుదునొ మఱిన్! 39

ఉదయించెడి యా దివాకరునివలె ఉన్నత నక్షత్రంబులయా
మహస్సులను హరియించినట్లుగా మానుగ సైన్యముతో గూడి
ఏ దినమున బీడించెదనో కద! యెపుడు నొవ్వ జేయుదునొ మఱిన్
ఆతని వానర సైన్యము నంతయు హరియించెద నే శీఘ్రముగన్! 40

సాగరంబు వంటిది నా వేగము, సర్వలోక మెఱుగను దీనిన్!
ఘనముగు వాయువు వంటిది బలమును కల్లగాదు నా వచనంబుల్
రాము డెఱుంగడు నాదు విక్రమము రహి యా విషయము దెలియకనే
రాముడు రణమును జేయుట కొఱకై రయముగ వచ్చుచు నుండె నిటన్

విషమును గూడిన బన్నగములవలె నింపగు నా బాణంబులనూ!
అంబుల పొదిలో నున్న సంగతియు నా రామునకును దెలియదుగా
రణరంగంబున జూడగ లేదూ! రమ్యమైన నా శరములనూ!
అందుజేతనే రాముడు రణమును బొందుగ చేయగ నిటు వచ్చెన్! 42

ఆ శ్రీరాముడు పూర్వమెన్నడును ననిలో నాబల వీర్యములన్
జూడగ లేదుగదా! యందులకే జూడగ యిటు వచ్చుచు నుండెన్!
నేను యుద్ధమున శత్రు సేనయను నిర్భయ రంగస్థలమందున్!

బాణములను కోణంబులచేతను బ్రవాదితంబగు జ్యా ధ్వనులన్
వ్యాకులంబు మఱి భయానకంబును వనరగ దీనాలాపములన్
ధ్వనులతోని మఱి నిండి సట్టిదియు దగ నా బదునగు బాణములా
మొదళ్ళ ధ్వనియును గూడినదై నా ముదముగ నాదు ధనుస్సనెడి
వీణను నే బ్రమోగించెదసుమ్మా వీరుల హృదయము జెదరగనూ! 44

వేయి నేత్రములు గల దేవేంద్రుడు వీరుడైన వరుణుడు గానీ!
యముడుగాని మఱి కుబేరుడైనను నలరి మహా యుద్ధమునందున్
నన్నెదిరింపగ జాలరుగా మఱి నయముగ బాణాగ్నుల చేతన్!
అపజయంబులను దిరిగి బోవుదురు నాపదలందున జిక్కుచునూ! 45

(యుద్ధకాండములోని 24 వ సర్గము సమాప్తము)

* * * *

# యుద్ధ కాండము - మొదటి భాగము

## ఇఱువదియైదవ సర్గము

[రావణుడు శుకసారణులను గూఢచారులుగా వానరసేనలోనికి జంపుట-విభీషణుడు వారిని గుర్తించి పట్టుకొనుట-రాముని యనుగ్రహము జేత విడువబడి, వారలు రాముని సందేశముతో లంకకుబోయి, రావణునకు వినిపించుట]

దశరథాత్మజుడు శ్రీ రాఘవుడును దగ సైన్యముతో గూడికొనీ!
మహాసముద్రమును దాటిన బిమ్మట మానుగ శ్రీమంతుండైనా!
రావణాసురుడు మంత్రులైన యా రహి శుక సారణులను బిలిచీ
ఈ రీతిని బలికెను మది జెదరగ నిమ్ముగ యేకాంతంబుననూ! 1

సాగరంబుపై సేతు బంధనము దగ నే నమ్మను నే విధమున్!
ఎటుల దాని నిర్మాణము జరిగెనొ బటుదరముగ నే దెలియనుగా
ఆ కపి సైన్యం బెంతయున్నదో యలరి దెలియ వలయును ముందున్! 2

మీరిద్దఱునూ కనబడకుండగ మిగుల సావధానము తోడన్!
ఆ కపిసైన్యమునందు జొచ్చి మఱి యా సేనా పరిమాణమునూ!
వారల విక్రమమును యాకపులను వరుసను ముఖ్యులు నెవరెవరో!
రాముని మఱి సుగ్రీవుని యెక్కుయు రహి మంత్రులునూ యెవరెవరో!
ఎవరు ముందుగా వర్తించెదరో నింపుగ తెలియగ వలయు సుమా!

ఏ వానరులును విక్రమమందున యెవరు శూరులో దెలియవలెన్!
సలిలార్ణవమున సేతుబంధనము సరసత నిర్మించిరి యెటులో!
మహాత్ములగు నా వానర వీరుల మానుగ నివేశ మెటులెటులన్
నిర్మింపగ బడెనో గనుగొను డిక నిర్మలమతి యా రామునియూ!
యుద్యమమును, వీర్యమును, శూరతను నొప్పుగ దెలియగ వలయుసుమా!

వారి యాయధములను బరికరముల వారి యోచనల దెలియవలెన్!
ఆ లక్ష్మణుని యుద్యమంబునూ నాయుధముల మఱి విక్రమమున్!

యథాస్థితిని మఱి దెలియగ వలయును తథాస్థితిని దెలుపగ వలయున్!
మీ మీ మేధా శక్తులతోడను మిగుల తెలియవలె నంతయునూ! 3-7

మహాత్ముంగు నా వానర వీరుల మానుగ సేనాపతి యెవరో!
ఎవరు నడుపుదురో వారల నందఱ నింపుగ బహు క్రమశిక్షణతో
యథార్థముగ నంతయు గ్రహించుంచీ నతి శీఘ్రముగా రావలయున్! 8

ఈవిధముగ యాజ్ఞాపింపగ బడి యిమ్ముగ శుకసారణు లపుడున్!
ఆ రాక్షసులును గపి రూపములను నలరి ధరించియు వేగముగన్!
వానర సైన్యము నందు జొచ్చిరీ యొనరగ యెవరికి దెలియకనూ! 9

వానర సైన్యము నందు జొచ్చినా యొప్పగ యా శుక సారణులున్
అచింత్యంబునూ, రోమాంచమునూ యంతులేని యాకపిసేనన్
లెక్కించుటకును నూహించుటకును శక్తిలేక యుండిరి వారున్! 10

పర్వతాగ్రముల యందున గొందఱు బన్నుగ సెలయేరుల యందున్!
కొందఱు సముద్ర తీరము నందును గొందఱు వనముల యందుననూ!
కొందఱు నుద్యానంబుల యందును కొందఱు దాటుచు సంభ్రమునన్
కొందఱు దాటిరి యా సముద్రమును కొందఱు దాటగ నుండి రటన్!

కొంత సేన యట నిలుచుచు నున్నది కొంత సేన యట నిలిచినదీ!
భయంకరంబగు ధ్వనియు గలిగినది బరగ మహాబలమును గలదీ!
అక్షోభ్యంబగు తద్బలార్ణవము నా రాక్షసులును గనుగొనిరి!
ఊహింపగ లెక్కింపగ లేకను నొనరగ భ్రమ జెందిరి వారున్! 11-12

మహాతేజమును గల విభీషణుడు మఱియొక రూపము నుండిస యా!
శుకసారణులను గ్రహించి యాతడు సురుచిరముగ వారల బట్టీ
రామచంద్రునకు నప్పగించెనూ రయముగ రాక్షసలు ననుచున్ 13

పరపురంజయా! శ్రీరఘురామా! బన్నుగ వీరలు రాక్షసులున్!
రాక్షసేంద్రునీ మంత్రులు వీరలు రహి శుక సారణు లనువారల్!
లంకనుండి చారులుగా వచ్చిరి శంకలేక మఱి యింతయినా
శిక్షింపగ దగు వారలు వీరలు శిక్షింపుము! వీరిని వేగన్! 14

వారిరువురునూ రాముని గాంచీ వ్యథజెందుచు హృదయము నందున్
బాధబడుచు జీవితము నందునను బరగ యాశ త్యజియించుచునూ!
రెండు జేతులను జేర్చి దోసిలిని నిండుభక్తితో నిటు లనిరీ! 15

సౌమ్యమూర్తి! శ్రీరఘువీరా! విను 'సరసరీతి మా వచనములన్
మేమిద్దఱమును శుకసారణులము మేము రావణుని మంత్రులమూ!
ఈ సైన్యంబును బరీక్షింపగా నిమ్మగ వచ్చితి మిచ్చటికిన్!
బలదర్పమ్ముల వ్యూహ రీతులను బరగ దెలియగా మము బంపెన్! 16

దశరథాత్మజుడు సర్వ భూతముల దగ హితమును గోరెడి వాడున్!
అట్టివీరుడగు రామచంద్రుడును నిట్టి వారి మాటలను విని!
చిఱునవ్వును జిందుచు వారలతో జెలగి నీ విధమునను బలికెన్! 17

సర్వ బలంబును జూడబడినదా? చక్కగ మమ్ముల గనినారా?
యథోక్తముగ మీ పని నంతటినీ యాసక్తిని బూర్తిగ నంతన్!
ముగించినారా? యింకేమైనను మోదమునను గనుగొన వలెనా?
పూర్తియైన మఱి స్వేచ్ఛా పథమున బోవచ్చును మఱి మీ రింకన్! 18

మీరింకను జూడగ దలిచినచో మిగులక జూడగ వచ్చు సుమా!
కావలసినచో మా విభీషణుడు కలిసి వచ్చు మీతో గూడన్!
అంతయు మఱలను మీకును జూపును సుంత మిగులకను యుండగనూ!
భయములేదు మీకును రవంతయును బాధపెట్టు వారును లేరూ! 19

పట్టువడిన యందులకును మీరలు బాధజెందగా బనిలేదూ!
జీవితంబుపై భయంబు లేకను స్థిరమతులై యుండుడు మీరున్!
ఆయుధములు లేకను నటులొంగిన యా దూతలు మఱి సైనికులున్!
జంపదగిన వారలు గాదు గదా! కంపిత గాత్రులు నగువారిన్! 20

విభీషణా! విను! నెల్లప్పుడునూ విడువక శత్రుల బక్షంబున్!
బాధించెడి వారును మఱి చారులు బరగ మారు వేషంబులతో!
నున్నయట్టి యీ శుకసారణులను విన్నపమును జేసెడి వారిన్!
విడిచిపెట్టుమా! వేగ వారి నిక విమల యార్ద్రభావము తోడన్! 21

రాక్షసులారా! దూతలార! మఱి రయమున లంకాపురి జేరి!
రాక్షస రాజగు రావణు తోడను రాజిల నాదగు వచనములన్!
యథారీతిసీ తెలుపుడు మీరలు విధానమున నే బలికి నటుల్! 22

ఏ బలంబులను సమాశ్రయించి నిమ్మగు నాదగు వైదేహిన్
అపహరించినావో రావణ! విను! యాబలంబుతో, బంధులతో!
స సైన్యములతో గలిసిరమ్మ్మ! వే సకలాయుధములతో గూడన్!
యథాకామముగ జూపుము బలమును యా విక్రమమును వీర్యములన్! 23

రేపటి యుషోదయంబున రావణ! రివ్వున నా బాణంబులచే
ప్రాకారంబులతోను మఱియునూ బన్నుగ ముఖద్వారంబులతో
గూడినట్టి యా లంకాపురినీ కూరిమ రాక్షస సైన్యంబున్!
తీవ్రమైన నా శరజాలంబున దీరుగ శిక్షించెద సుమ్మీ!
దర్శింపుము! నా పరాక్రమంబుమ దగ జూడుము! నా వీర్యంబున్! 24

రావణ! రేపటి ప్రభాతమందున రయమున దేవేంద్రుడు యనిలో
అసురులపై వజ్రాయుధంబునూ యలరి వదిలినటు నే గూడన్!
సైన్య సమేతుడనై నీపైని సహజ భయంకర క్రోధంబున్
విడిచెద సుమ్మా జూచుకొమ్మికను! విమల తేజమును, విక్రమమున్! 25

శ్రీరామునిచే బలుకబడిన యా స్థిరమగు వాక్యములను వినుచున్!
ఆ శుక సారణ రాక్షసు లిరువురు నమల ధర్మమం దాసక్తిన్!
గలిగినట్టి యా దశరథ తిలకుని జెలగి జయింపుము శత్రువులన్!
'జయ!' 'విజయీభవ!' యనుచు బలుకుచును చయ్యన లంకాపురి జేరి!
ఆ దశ కంఠునితో నిటు బలికిరి నాత్మయందు గంపితు లగుచున్! 26-27

రాక్షసేంద్ర! ఓ రావణ! వినుమా! రయమున విభీషణుడు మమ్మున్!
గుర్తుబట్టి మమ్ములను బట్టుకొని క్రూరరీతి జంపగ బోవన్!
అమిత తేజుడగు రాఘవేంద్రుడును నలరి గాంచి మము నతి కరుణన్!
విడిపింపగ జేసెను మము రావణ! వినుము! మాదు మాటలు వింకన్! 28

లోకపాలురకు సములగు వారలు లోలిత విక్రమ శూరులునూ!
అస్త్రశస్త్రముల ప్రయోగింపనూ యతి ధీమంతులు నగువారున్!
దశరథాత్మజులు శ్రీరాముండును దగ శ్రీమంతుడు లక్ష్మణుడున్!

విభీషణుండును విమల తేజుడును వీర మహేంద్రునితో సముడున్!
అల సుగ్రీవుడు నీ నలువురునూ యలరి యుందురో యొకచోటన్
ప్రాకారంబులు, ముఖద్వారంబులు బరగ యున్న లంకాపురినీ!
పెల్లగించి మఱి యొకచోటునకును నల్లన నిల్పగ గలవారున్!
అట్టి సమర్థులు నా నలువురునూ యిట్టె వానరుల మాటేలా? 31

ఆ శ్రీరాముని రూపంబును మఱి యాతని యాయుధములు జూడన్!
అత డొక్కడే మన లంకాపురి యందఱ రాక్షసులను గూడన్!
సంహరింప గలవాడు రావణా! సంహరింపు సకలము లంకన్!
తక్కిన ముప్వురు మహావీరులును చక్కగ నట యుందురు నంతన్! 32

రఘువీరులు శ్రీరామలక్ష్మణులు రహి నా సుగ్రీవుని జేతన్!
రక్షింపగ బడుచుండునట్టి యా రమ్యమైన యా సేనలనూ
సురాసురులు, యక్షులు, గంధర్వులు సురుచిరముగ దేవేంద్రుడునూ!
కలిసివచ్చినా రణరంగమునకు గాంచ లేరు మఱి విజయంబున్! 33

ఇప్పుడిప్పుడే యుద్ధము జేయగ నిమ్మగ సిద్ధముగా నున్నా!
మహాత్ములగు వానర సైన్యములో మానుగ వానర యోధులునూ!
ఉత్సాహముతో నుండిరి రావణ! యుట్టిట లూగుచు నుండి రటన్!
రామునితోడను సంధిజేసుకొను రహి జేయుము మైత్రిని వేగన్!
జనకనందినిని రామున కిమ్మా! సంధి జేసికొను రామునితో! 34

(యుద్ధకాండములోని 25వ సర్గము సమాప్తము)

   

## యుద్ధకాండము - మొదటి భాగము

### ఇరువదియాఱవ సర్గము

[సారణుని వచనములను విని రావణుడు వానర సైన్యమును జూచుటకు ప్రాసాదముపైకి నెక్కుట—యావానరులను జూపుచు వారి పరాక్రమాదులను వర్ణించి జెప్పుట]

సారణుచే నభిభాషితంబైన సహజము, తథ్యము లైనట్టి
పిరికితనంబును లేని మాటలను ప్రియముగ విని యా రావణుడున్!
సారణుతో నీ విధమున బలికెను సహజమునగు దన ధోరణితో! 1

దేవతలును, దానవులును, యక్షులు దిరముగ కిన్నెర గంధర్వుల్!
అందఱు గలిసియు నను నెదుర్కొనిన యఖిల లోకముల నుండియునూ
భయము వచ్చినను జనకనందనను బన్నుగ నే నర్పింపను సూ! 2

సౌమ్య! సారణా! యా కపివీరులు సహజముగా బీడించుటచే
భయపడి నీ విటు బలుకుచు నుంటివి బన్నుగ సీతను వదులుమనీ!
శ్రీరామున కర్పింపు మనుచునూ శీఘ్రము సంధిని సేయుమనీ! 3

నన్నే శత్రువు సమరము నందున నయముగ యోడింపగ గలడూ?
రాక్షసప్రభువును, సర్వలోకముల శిక్షల నేడ్పించిన వాడున్!
శ్రీమంతుడగు రావణాసురుడు శీఘ్రము బరుషములను బలికీ!

అటుబిమ్మట నా దశకంఠుండును చటుల వానరుల సైన్యంబున్!
జూడవలయునని కోరికతోడను సురుచిర హిమ పాండుర మైనా!
ఎంతో యెత్తును గలిగినట్టి యా వింతయైన ప్రాసాదంబున్ !
నెక్కి జూచె దన మంత్రులతోడను చిక్కని వానర సైన్యంబున్! 4-5

శుకసారణులను గూడి రావణుడు సురుచిరముగ కపిసైన్యంబున్
గాంచి క్రోధ మూర్ఛితుడై నతడును చంచల సముద్ర తీరమునన్
పర్వతముల నదులను వనములనూ ప్లవంగములతో నంతయునూ

సంపూర్ణముగా భూమి యంతయును సరసత నిండిన యట్టులుగా
గాంచె రావణుడు గపిసైన్యంబును యంచితముగ సౌధమునుండి! 6

రాక్షసరాజగు దశగ్రీవుండును రయమున యంతంబును లేని
సహింపశక్యముగాని యట్టి యా సాహస బలమును గనుగొనుచున్
సారణ రాక్షసుతో నీవిధినీ సరగున బ్రశ్నించెను నిటులన్! 7

వీరియందు నే వానరవీరులు విపుల బలాఢ్యులు ముఖ్యులునూ
ఎవ్వరు శూరులు? నెవ్వరు ధీరులు? నెవ్వరు రణరంగము నందున్
ఉత్సాహముతో నుందురు వారణ? యొప్పుగ ముందుకు వచ్చెదురో?
వారల నందఱ బేర్కొనుము యిప్పుడు వలనొప్పగ నే వినవలయున్! 8

ఎవరిమాట విను నా సుగ్రీవుడు నిమ్ముగ యూధప నాయకులన్
ఎవరెవ్వరు? వారల నందఱనూ యింపుగ దెలుపుము నికమీదన్!
ఈకపివీరుల బ్రభావ మెట్టిది? యీవిషయంబును నంతయునూ!
పూసగ్రుచ్చినటు దెలుపుము నాకును బొలుపుగ యంతయు విశదముగా! 9

అటుబిమ్మట యా సారణుండునూ యా వానర ముఖ్యుల వేగన్!
వనౌకసులలో నెవరు ముఖ్యులో వనరగ శూరులు నెవరెవరో?
ప్రశ్నించిన యా రాక్షసేంద్రునకు బ్రకాశమున యిటులను బలికెన్!
తాను జూచినా విన్నవానినీ దగ దెలిపెను నీవిధముగనూ! 10

ఏ కపివీరుడు లక్షమందితో నింపుగ దనచుట్టును నుండన్!
లంకను గాంచుచు నలుచుండెనో శంకలేక దారుణ ధ్వనితో!
ముఖద్వారంబులు, ప్రాకారంబులు ముదమున శైలంబులతోడన్
వనములతోడను. యరణ్యములతో వనరగ లంకా నగరంబున్
ప్రతిధ్వనించుచు నున్నదో యాతడు బన్నుగ నీలుం డనువాడున్!
ఆవీరుడు సేనానాయకుడును సతడే సమస్త కపులకునూ!
ప్రభుసుగ్రీవుని సేనకు ముందఱ బన్నుగ నిలుచుండెను నతడున్! 11-12-13

అతడే యంగదుడను వానరుడును నతడే వాలికి సుపుత్రుడున్!
బాహువులను పైకెత్తికొనుచునూ పాదములను భూమిని దట్టి!

లంక కభిముఖుండై కోపముతో శంకలేక యేతెంచెడినో!
పర్వత శిఖరముతో సమానుడును బద్మ కింజిల్క సన్నిభుడున్!
మాటిమాటికిని దోక గదల్చుచు మానుగ ధ్వనులను జేసెడినో!
యా ధ్వనిచేతను దశదిశ లన్నియు నలరి ధ్వనుల మఱి జేసెడినో!
వానరరాజగు సుగ్రీవునిచే వనరగ యభిషేకింపబడీ
వానర రాజ్యము నంతటికిని మఱి వనరగ యువరాజితడు సుమా!
అతడే! యంగదుడని బిలిచెదరూ! యఖిల వానరుల సంఘంబున్!
రాక్షసేంద్ర! నిను బిలుచుచు నుండెను రయమున రణమును సలుపగనూ!

వాలికి సదృశ పుత్రుడు రాజా! వనరగ యా సుగ్రీవునకున్
ప్రేమపాత్రుడగు బుత్రుడు సుమ్మా! ప్రియముగ గాంచును నెల్లపుడున్!
దేవేంద్రునికై వరుణదేవుడును దీరుగ పరాక్రమించినటుల్
రాముని కొఱకై యా యంగదుడును రహి పరాక్రమించుచు నుండెన్! 18

రాముని హితమును గోరువాడునూ రమ్య వేగమును గలవాడున్!
హనుమంతుండదిగో! గను రావణ! యనంత శక్తియు గలవాడున్!
ఉదధిదాటి జానకిని గనుటయును నొప్పుగ నీతని వలన గదా!
జరిగిన దంతయు నీకును దెలియును సర్వశక్తి బల యుక్తుండున్! 19

వీర్యవంతుడగు నా యంగదుడును విపుల బలాఢ్యులు వానరులన్!
అనేక సంఘములను దనతోడుత యలరి వెంటగొని వచ్చుచుసూ!
సమరమునకు నిను బిలుచుచు నుండెను సన్నద్ధుండై రణమునకున్!
నిను మర్దింపగ వచ్చుచునుండెను నిశ్చయమును యోజింపు మికన్! 20

వాలికుమారుని యనుసరించునును వనరగ నలుడను వానరుడున్!
మహాసైన్యమును దా గూడుకొనీ మానుగ యంగదు వెనుకగనూ!
నిలిచి యుండెనూ గనుమో రావణ! నిలిచి నన్ను బరిమార్పగనూ!
సేతు హేతువుకు కారణ మితడే సేతువు నిర్మించిన దితడే! 21

చందనవనమున నివసించెడి యా యందమైన వనముల యందున్!
వేయికోట్ల యెనిమిదిలక్షలుగా వికటమైన వానరవీరుల్!

శరీరంబులను బిగబట్టుచునూ ఘోర సింహ నాదంబులతో
గర్జించుచునూ యున్నవా రదిగో! విజృంభించుచు నట నుండిరిగా!

నలునివెంట యా వచ్చెడివారలు నయముగ వీర పరాక్రమములున్!
అతిభయంకరులు నెదిరించుటకును నలవి గానివారలు సుమ్మా!
తన సైన్యముతో నీ నలవీరుడు దగలంకను మర్దించుటుకున్!
అభిలషించు చున్నాడు రావణా! నాలస్యం బింతయు లేకన్! 22-23-24

అలరి రజిత సంకాశుడు మఱియును నతిచపలుడును, నగువాడున్!
భీమపరాక్రముడు, బుద్ధిమంతుడును విమల కీర్తియును గలవాడున్!
శ్వేతుండను వానరుడు శీఘ్రముగ శ్రీ సుగ్రీవుని యొద్దకునూ!
బోయి సేనకును మధ్యను బోవుట బొలువుగ సేనను జీల్చుచునూ!
పాయలుగా జేయుచు సైన్యములకు బరగ సంతసము గూర్చుచునూ!
తన స్థానమునకు బోవుచుండెనూ దగ శ్వేతుండను వీరుండున్! 25-26

పూర్వకాలమున గోమతీ నదీ పొలుపుగ తీరము నందుననూ!
అనేక విధముల వృక్షంబులతో నలరు రమ్య పర్వతమొకటీ!
సంరోచనమని బిలుతురు దానిని సరసత లోకమునందు జనుల్
కుముదుండను సేనా నాయకుడును కూరిమి బాలించుచు నుండెన్!

లక్షలకొలదీ వానరవీరులు శిక్షితులై యాతని యందున్
వినయవిధేయత జూపుచుండిరీ విమల భక్తితో నుండిరటన్!
అతడే యీతడు కుముదుడు గనుమా! యనేక లక్షల సైన్యముతో
ముందు నడుచుచుండెను నాతడు గను జిందుచు దనవాలము తోదన్!

చండవిక్రముడు నదీను డాతడు సాహసవంతుడు నతడు సుమా!
సంగ్రామంబును గోరుచు నాతడు సకలసైన్యమును దీసికొనీ
లంకను మర్దించుటకై నాతడు బొంకముగా వచ్చుచు నుండెన్!

రాజేంద్రా! గను సింహసమానుడు రమ్య కపిల వర్ణమువాడున్!
దీర్ఘ కేసరములను గలవాడును దీరుగ నిబ్బృతి నేత్రములన్!
లంకను గాల్పగ జూచుచుండెనా శంకలేక యనునట్లుండెన్!

అతడే రంభుండను యూధపుడును నలదు కృష్ణగిరి సహ్యములన్!
వింధ్యపర్వతము సుదర్శనంబుల విడువక దన బరివారముతో
వసించుచుండును, భయంకరులునూ వనరగ తీవ్ర పరాక్రములున్!
కోటీముప్పది లక్షల కపులను గూరిమి దనతో దీసికొని
తమ తేజస్సులతోని లంకనూ దగ నాశనమును జేయుటకై
ముందు నడుచు చుండెను గను మల్లదె రంభునిసాహసవిక్రమునీ!31-31-33

రాజేంద్రా! గను! చెవులను గదుపుచు రయమున మాటికి మాటికినీ!
అవులించుచున్నాడో యాతడు నలదు మృత్యువుకు భయబడదూ!
యుద్ధభూమినీ వదలడు శత్రుల యుద్ధము నందున బరిమార్చున్!

రోషము జేతను బ్రకంప మొందుచు భీషణముగ యద్దము దిరిగీ
చూచుచుండెనో వాలమ్ముద్రిప్పుచు జోద్యముగా బెనుశబ్దములన్!
జేయుచుండెనో యాతడు శరభుడు శ్రీకరముగ నాల్వైయమునన్!
వసించుచుండును నిర్భయు డాతడు వనరగ బహుబల శాలియునూ!
మహాతేజమును గలవాడతడును మానుగయూధపనాయకుడున్!34-35-36

రాజేంద్రా విను! నితని సేనయును రహి విహారులను నామముతో
లక్షా నలుబది వేల మందితో లావగు వానర వీరులతో
వచ్చినాడు మఱి లంకను గూల్చగ మానుగ తన సైన్యముతోడన్!
వారందఱు బహు శౌర్యవిక్రములు వనరగ బాహు బలాఢ్యులునూ! 37

మహామేఘమును వలె నాకాశము మానుగ గప్పుచు నున్నాడో!
సురలమధ్య యా దేవేంద్రుడు వలె సురుచిరముగ కపివీరులలో!
మధ్య నిలిచియున్నాడో యాతడు మఱి పనసుండను వాడు సుమా!

అతని సైన్యము యుద్ధము గోరుచు నలుచుచుండుటను గనుగొనుమా!
భేరిధ్వనివలె వినబడుచున్నది భీకర మేఘపు ధ్వనికివలెన్!
అతడు నిత్యము యుద్ధమందునను గతి దప్పక బోరాడుచుమా!

శత్రుమర్దనుడు యూథపు నేతయు మిత్రుడు సుగ్రీవున కతడున్!
పారియాత్ర పర్వతము నందునను బరగ వసించుచు నుండుసదా!38-39-40

వేఱువేఱు యూథములుగ నేర్పడి జేరిన యా కపి సేనలకున్!
యాబది లక్షల యూథపు నేతలు నింపుగ యాపనసుని వేడ్కన్!
సేవించుచు నున్నారు రావణా! చేతోమోదము నందుచునూ! 41

అదిగో జూడుము దీరము నందున యలరు సముద్రమువలె గడులూ!
ఆ సేనకు యజమానుండును మఱి యల దుర్ధర పర్వతము వలెన్!
నున్నవాడొ మఱి యతడే వినతుడు భిన్న ప్రకృతియు గలవాడున్!
ఉత్తమమగు వేణానది తీర్థము మత్తుగ ద్రాగుచు నచటచటన్!
సంచరించు చుండునొ యాతడు మఱి సంచిత యూథప నాయకుడున్!
అఱువది లక్షల ప్లవంగ వీరులు నాతనితో బయనింపగనూ!
వచ్చినాడు మఱి యుద్ధము సేయగ మచ్చికతో తన సైన్యముతో!42-43-44

క్రధనుండను వానర వీరుండును గనిపించుచు నుండెను నదిగో!
బలవంతులునగు వానర వీరులు బలయుతములునగు యూథములన్
యథారీతి వేఱుగ జేయుచునూ తథారీతి వారలనుండీ!
నిను యుద్ధంబును జేయుటకొఱకై నిర్మలగతి బిలుచుచు నుండెన్! 45

గైరిక ధాతువు వంటి శరీరము కాంతులు జిందెడి వాడు మఱిన్
బలదర్పితుడును తేజోశాలియు బన్నుగ గవయుండను వాడున్!
మహావీరుడును, బహుబలశాలియు మానుగ వానరు లందఱినీ
కాదు! బొమ్మనుచు కదము ద్రొక్కుచును గడుగ్రోధమునను జ్వలించుచున్
నిను నెదిరించుటకై వేగముగా జను దెంచుచు నున్నాడదిగో! 46

డెబ్బది లక్షలమంది వానరులు నుబ్బుచు నా గవయుని సతమూ!
సేవించుచు నుందురు రాజేంద్రా! శీఘ్రము వారలతో గూడీ!
నీతో రణమును సేయగ వచ్చెను నిర్ణీతంబగు లక్ష్యముతో
నీ లంకను నిను మర్దింపగనూ నిలిచి యున్న వానిని గనుమా? 47

వీరులైన యీ యూథ నాయకులు ధీరులు యూథపు నాయకులున్
శ్రేష్ఠులైన వారిని నెదిరించుట జేతకాని పని రాజేంద్రా!
ఎదిరింపగ శక్యమును గాదు మఱి నిమ్మగ గుణింప లేము సుమా!
వేఱు వేఱుగా యూథంబులలో విభజింపగ బడి యుండి రిటన్! 48

(యుద్ధకాండమందు 26వ సర్గము సమాప్తము)

* * * *

## యుద్ధకాండము - మొదటి భాగము

### ఇఱువది యేడవ సర్గము

(సారణుడు రావణునకు నాయా వానరవీరుల పేర్లను దెలిపి వారల విక్రమమును వర్ణించుట)

రాముని కొఱకై పరాక్రమించుచు రహి తమ జీవితముల గూర్చి
లక్ష్యములేనీ యూథనాయకుల విషయములన్నియు దెలిపెదనూ!
కనుగొను మల్లదె యూథనాయకుల గడు విక్రమముల దెలిపెదనూ! 1

ఘోర కర్మములు జేయువాడు మఱి కూరిమి బారల దోకయునూ!
ఎఱుపు, పసుపు, బహుశ్వేత వర్ణముల నింపుగ బారల పొడవుగనూ
రోమంబులతో సూర్యకిరణములు బ్రోపుజేసినటు లున్నవియో!
అతడు హరుడును వానరవీరుడు నాతడు బహుబల విక్రముడున్! 2-3

హరీశ్వరుండగు సుగ్రీవునకును నాశ్రితులగు బహు కింకరులున్
వందల కొలదియు వేలకొలదియును సందడిగా వచ్చిన వీరున్!
లంకను బలముగ నాక్రమింపగా శంకలేక యుత్సాహముతో!
వృక్షంబులు, శిలలెత్తి బట్టుకొని కక్షతోని సంరంభముగా
సీతని వెనుకను వచ్చుచు నుండిరి నిమ్మగ లంకను మర్దింపన్! 4

నల్లని ధారను మేఘంబుల వలె నల్లని గాటుక రూపమునన్
గనిపించెడి వానరులను గనుమా! వినిపించెడి ధ్వనులను వినుమా!
భల్లూకంబులు! బల విక్రములును బహు బలాఢ్యులు యుద్ధమునన్!
లెక్కింపగ శక్యంబును గాదూ! పిక్కటిల్లు భల్లూకములన్!
మఱియొక సముద్రతీరము వలెనూ మానుగ కనిపించును వారల్! 5-6-7

కొందఱు పర్వత గిరి శిఖరములను గొందఱు సమతల దేశమునన్!
మఱికొందఱు నివసించుచుందురూ మానుగ నదులను తీరములన్!
భయంకరులు మఱి పరాక్రమవంతులు బన్నుగ పోరుకు సిద్ధంబై
వీరందఱు మఱి నిను నెదిరింపగ వేగము వచ్చుచు నుండి రిటన్!

మహారాజ! వీరల మధ్యముననను మహా భయంకర నేత్రములన్!
జూచు వారికిని భయమును గొలుపుచు జూడ శక్యము గాడితడున్!
మేఘంబులచే చుట్టబడిన యా మేఘుడు పర్జన్యునికి వలెన్!
కనిపించెడి వా డల్లదె ధూమ్రుడు గల భల్లూకములకు నెల్లన్!

ప్రభువు మఱియు యూథప నాయకుడును బరాక్రముడు రిపు మర్దనుడున్!
నర్మదా నదిని నీరము ద్రావుచు నయముగ తీరములందుననూ!
గిరిశ్రేష్ఠంబగు ఋక్షవంతమును మఱి వసించు స్వేచ్ఛా రీతిన్! 8-9

పర్వతంబుతో సమానుడైనా బన్నుగ వానిని గనుగొనుమా!
ఆతడు ధూమ్రుని సహోదరుండును నతి బలవంతుడు విక్రముడున్!
రూపమందు ధూమ్రునికి సమానుడు రోష విక్రమము అందుననూ
అన్నకంటె మఱి మీరినవాడును జెన్నుగ బరాక్రమము నందున్!

అదిగో! గను! గనిపించుచు నుండెను నలరు జాంబవంతుడు సుమా!
ఎన్నో భల్లూకముల నేతలకు జెన్నుగ నాయకు డితడు సుమా!
అతుల పరాక్రమ వంతుడు, వీరుడు, నమిత తేజమును గలవాడున్!
పెద్దల యడుగుల జాడల నడుచును పెద్దలందు వినయము జూపున్!
యుద్ధములందున శత్రు మర్దనుడు సిద్ధిని విజయము లందుకొనున్! 10-11

ధీమంతుండగు జాంబవంతుడును దేవాసుర యుద్ధము నందున్!
దేవేంద్రునకును సాయము జేసి ధీరత విజయము జేగూర్చెన్!
అనేక వరముల బొందినాడుగద! యాసురరాజగు యింద్రునిచే!
అరితేరినా వీరుం డీతడు నతిబలవంతుడు శ్రేష్ఠుండున్! 12

రాక్షస పిశాచములతో సములును రహి రోమంబుల గూడికొని!
అమిత దేజమును గలవారును మఱి యతి విపులాకారంబులనూ
గలిగి యీతవ సైన్య యోధులును గదిలి పోవుదురు నెటకైనన్!
పర్వతములపై నెక్కి శిఖరముల బన్నుగ కదిలించుచును మఱిన్
క్రిందికి ద్రోయుచు నుందురు మృత్యువు కందరు;భయపడ రింతయునూ!

రాజేంద్రా! గను! క్రోధముతోడను రహి సంభ్రమమున నెగురునటుల్
కనిపించెడి యాయూధపు వీరుని గనుచున్నారదె కపివీరుల్
యూధనాయకుల కందఱికిని మఱి యూధనాయకుడు దంభుడనే
సేనా నాయకు డాతని గనుమా! సిరివిలసిల్లెడి యింద్రునకున్!
దన బలంబునను సాయము జేయును దగ రణంబునను నపుడపుడున్!

యోజనదూరము నందునున్న యా భాజనమగు బర్వతమునకున్
పార్శ్వ భాగమున యానుకొనుచునూ బన్నుగ సేవించెడి వాడున్!
విశాలమగు శారీర భాగమును విలసిల్లగ యూర్ధ్వంబునకున్
బోవుచున్నదో అట్టివాడు మఱి పొలుపుగ సమస్త కపులకునూ!
పితామహుండో, యపజయ మెఱుగని భీకర శత్రువులను నైనన్!
కదనంబున యోడించెడి వాడో, కనలక దేవేంద్రుని గూడన్
అని యెదిరించియు నపజయ మెఱుగని యలరు పరాక్రము డాతండున్
సంనాదనుడను వానరు డాతడు సహింప డాతడు శత్రుపులన్
చతుష్పాద జంతువులను గానము సహజమైన యాతని రూపున్! 19

పరాక్రమించెడి యతని విక్రమము బన్నుగ యింద్రుని సమానమున్
సంనాదనుడును జన్మించెను మఱి సరసత గంధర్వ స్త్రీకిన్
అగ్నివలన మఱి బుట్టువు గలిగెను నగ్నివోలె దేజస్సులతో
వెలుగుచున్నవా డదిగో! జూడుము! వేల కాంతులను జిమ్ముచునూ! 20

రాక్షసరాజా! గనుమా! యాతడు రమ్య పరాక్రమ వంతుండున్!
శ్రీమంతుండును బలవంతుండును శీలవంతుడును వినయుండున్
అకత్థనుండగు వాడును వీరుడు నా క్రథనుని యూథప నేతన్
ఏ పర్వతమున వైశ్రవణుండును నింపుగ విహరించుచు నుండున్,
అనేక కిన్నెర వాసయోగ్యమును ననేక గిరులకు రాజైనా!
ఆ కైలాసపు పర్వతంబునను నానందముతో వసియించున్
అట్టి క్రథనుడును సైన్యము తోడుత యిట్టి వచ్చె నిను మర్దింపన్!

వేయికోట్ల వానరుల గూడికొని వెలవులేక నిలిచెను గనుమా!
అతడే క్రథనుడు నాత డొక్కడే నలరుచు దన సైన్యముతోడన్
లంకాపురినీ జయింప వలెనని శంకలేక వచ్చుచు నుండెన్

వానర యూథపులకు ప్రభువును మఱి వనరగ గర్జించెడి యతడున్
ప్రమాథినామముతో విలసిల్లును బన్నుగ వానర నాయకుడున్!
వానరులకు మఱి యేనుగులకునూ వనరగ యుండిన వైరమునూ!
పూర్వవైరమును మదిని దలంచుచు బొలుపుగ గజముల నాయకులన్!
భయబెట్టుచు గంగా ప్రాంతంబున పన్నుగ కమ్మని తీరములన్
వసించుచుండును బర్వతగుహలను వాసముజేయును స్వేచ్ఛగనూ!
వృక్షములను బీడించుచు మఱియును గక్షను గజముల నడ్డుకొనున్!

ప్రమాథి యను నీ వానరనేతయు బన్నుగ గంగా తీరమునన్!
హిమవత్పర్వతమందు జరించును విమలమైన ప్రాంతము లందున్!
ఉశీర బీజంబను పర్వతమున యున్నత మందరగిరి యందున్
ఆశ్రయించి యుండును నెల్లప్పుడును యల స్వర్గంబున శక్రువలెన్!
ఆనందముతో వసించుచుండును అలరు శ్వేతకాంతుల గిరులన్! 27

బలముజేత మఱి పరాక్రమముచే బన్నుగ గర్విష్ఠులును మఱిన్
బాహుబలముగల వారును, వీరులు బహు గర్జించెడి వారలునూ
వేయిలక్షలా మంది వానరులు విపుల బలాఢ్యులు నగువారున్
అతనివెంట నుండిరి గను రావణ! యలరి రణమునకు సిద్ధంబై! 28

ఈతడు ప్రమాధి! యూధనాయకుడు నెదిరింపగ శక్యము గానీ
వానర వీరులకును నాయకుడును వనరగ మహాబలాఢ్యుండున్! 29

గాలికి యెగిరెడి మేఘంబునువలె గనబడుచుండిన వాడతడే
ప్రమాధి యనియెడి పేరుగలిగినా ప్రసిద్ధుడైనా వాడతడే!
ఎగుర గొట్టబడి యరుణభాసమగు దగ వివర్తమానం బగుచున్
అధికమైన యే పరాగమున్నదొ యచట మిగుల బలశాలురునూ!
అదియే ప్రమాధి సేనావాహిని యదియే ప్రమాధి సైన్యంబున్! 30-31

అసిత ముఖులునూ, నతిభయంకరులు నటగను! లక్షల సంఖ్యలతో
కొండముచ్చులవె! సేతువు దాటీ చండ విక్రముడు గవాక్షునీ
కొండముచ్చులా నాయకు డతడూ! మండితముగ చుట్టును జేరీ
లంకను మర్దించుటకై యల్లదె శంకలేక సింహముల వలెన్
గర్జనజేయుచు నున్నవారదే గాంచుము! వారల నర్చితిన్! 32-33

మహారాజ! వానర నాయకులను మానుగ యతిశ్రేష్ఠుండు మతిన్
కేసరి యను సేనానాయకుడును భాసమానమగు రూపంబున్!
సర్వకాలముల ఫలముల నిచ్చును సకలమైన పుష్పంబులతో!
విరాజిల్లు చుండునొ, తుమ్మెదలను విపుల నాదములు వర్ధిల్లన్!
సూర్యుడు ఏ పర్వతమును నిత్యము సురుచిర ప్రదక్షిణము సేయున్
దేని కాంతిచే మృగములు, పక్షులు దీరుగ బంగరు కాంతులతో
ప్రకాశించునో, మహాత్ములును మటి బన్నుగ యాగిరి చరియలనూ!
విడువకుందురో, సర్వకామముల గడు ప్రియంబునను నిచ్చెడినో,
వృక్షంబులు ఫలములతో నిండియు విపుల శాఖలను గూడికొనీ!
ఏ గిరియందున మధువుల నొలుకుచు నింపుగ మోదము గూర్చెడినో
అట్టి మేరుపర్వతము నందునను యలరుచు నివసించుచు నుండున్!

అట్టి మేరు పర్వతము నందునను యఱువదివేలకు పైబడినా!
బంగరు పర్వతములుగల వచ్చట రంగుగ సింగారంబులతో!
వాని మధ్య నొక పర్వతమున్నది నపురూపము నది జూచుటకున్
రాక్షసులకు మధ్యన నీకును వలె నలరియుండు నది శ్రేష్ఠముగన్
అచ్చటగల యంతిమ గిరి యందున స్వేచ్ఛను వసింత్రు కపివీరుల్!

కొందఱు నల్లగ కొందఱు దెల్లగ కొందఱు నెఱ్ఱని ముఖములతో!
తేనె రంగుగల శరీరములతో దీరుగ నుందురు రాజేంద్రా!
తీక్షణమగు కోరలు గలిగియునూ దీరుగ గోళ్లే యాయుధముల్!
సింహంబులవలె పెద్దపులుల వలె జేరగ శక్యము గాదు మతిన్!
నాలుగేసి దంతములను గూడుక నయముగ యగ్ని సమానులునూ!
ప్రజ్వలించు సర్పముల సమానులు బన్నుగ గజముల సమానులున్.
వీరి వాలములు నతి దీర్ఘములై విమల కాంతులను జిమ్ముచునూ
గిరి సమానమగు నాకారంబుల కెవ్వన కేకలు వేయుచునూ

అలరుచు నుందురు వీరి గమనమును నతిభీకరముగ కనిపించున్!
వీరి నేత్రములు బచ్చగ నుండును వీరి భయంకర చూపులతో!
లంకను గాల్చుచు నున్నారా? యని పొంకముగా మది కనిపించున్!38-42

మహారాజ! శతబలియను నాతడు మానుగ బొందెను విఖ్యాతిన్!
వీర్యవంతుడును విక్రమతేజుడు విమల స్వభావము గలవాడున్!
వానర వీరుల మధ్యను నిలిచియు వరలగ యున్నా డతడతడే!
జయమును గోరుచు బ్రతినిత్యమునూ బన్నుగ సూర్యుని బూజించున్!
ఆతడొక్కడే సేనల గూడుక యలరుచు లంకను మర్దింపన్
అభిలషించు చున్నాడదె గనుమా! యాదిత్యుని శక్తిని బొందీ! 43-44

విక్రాంతుడు బలవంతుడు శూరుడు విమల బుద్ధిమంతుడు మతిన్!
తన పౌరుషమున నిలిచిన వాడును దగ నమ్మకమును గలవాడున్!
శతబలియను కపి వీరు డాతడే నతిప్రియమును శ్రీరామునకున్
జేకూర్పగ తన ప్రాణము సైతము శీఘ్రము నర్పింపగ నుండెన్! 45

గజుడు, గవాక్షుడు, గవయుడు, నలుడును గాంతివంతుడగు నీలుండున్!
ఒక్కొక వానరవీరుడు దనలో లెక్కకు మించిన యోధులతో
గూడియుండిరీ తీరమంతయును గూరిమి సంద్రము వోలె నటన్! 46

శీఘ్రము పరాక్రమంబును జూపెడి వ్యాఘ్ర సమానులు కపివీరుల్
వింధ్య పర్వతంబున నివసించెడి సంధ్యారుణ కాంతుల వారున్

ఎందఱెందరో! గనుమో రాజా! సండడి జేసెడి వారలనూ!
లెక్కబెట్టుటకు సాధ్యము గాదూ! వక్కాణించుచు నుంటి నిదే! 47

మహారాజ! ఈ వానరులందున మానుగ సందఱు బలాఢ్యులే!
అతి ప్రభావమును గలవారు సుమా! నందఱు స్వయం ప్రకాశులునూ!
పర్వతముల సమమగు దేహంబులు బన్నుగ గలవారేను సుమా!
క్షణకాలంబున ధరపై గలిగిన సర్వ పర్వతము లన్నిటినీ
చెల్లాచెదురుగ ధ్వంసము జేసీ జేయగ నందఱు సమర్థులే! 48

(యుద్ధకాండములోని 27వ సర్గము సమాప్తము)

* * *

## యుద్ధకాండము - మొదటి భాగము

### ఇఱువది యెనిమిద సర్గము

సుగ్రీవుని మంత్రులు, మైందద్వివిదులు, హనుమంతుడు, రామ లక్ష్మణులు, విభీషణుడు సుగ్రీవుడు- వీరందఱిని గూర్చి చెప్పి, శుకుడు వానరసైన్యము సంఖ్యను జెప్పుట)

అటు బిమ్మట యా శుకుడు సారణుని యావచనంబుల నన్నిటినీ
సమస్తమగు నా వానర సేనను సరసత జూపుచు వినయమునన్
రాక్షసాధిపుని రావణు గాంచీ రమ్యముగా నీ వాక్యములన్
బలికెను మదిలో భీతియు లేకను బన్నుగ యదార్ధ వచనములన్! 1

మహారాజ! యా మదించినట్టీ మహా గజములకు వలెను మఱిన్
గంగాతీరము నందు నిలిచినా సంగతి మఱ్ఱి చెట్లవలెన్!
హిమవత్పర్వత మందు నిలిచినా యమల మద్ది వృక్షముల వలెన్
నిలిచి మనకు నా గనబడునట్టీ వలనొప్పగ యా వానరులున్! 2-3

ఎదిరింపగ శక్యమునుగాదు మఱి మది దిలకింపుము వారలనూ!
బలవంతులు మఱి కామరూపులును బరగ దైత్య దానవ సములున్!
యుద్ధములందున దేవ పరాక్రమ సిద్ధులు వివరింపగ నేలా?

ఇరువదొక్కటగు కోట్ల సంఖ్యతో నీ వానరులును గలరు సుమా!
వేయి శంకువుల సంఖ్యను గూడుక యీ వానరులును గల రిచటన్!
నూరు వృందముల గపి వీరులతో నుండెను నిచ్చట రణమునకున్! 4

దేవతలకు మఱి గంధర్వులకును దీరుగ బుట్టిన వారలునూ!
కామరూపములు ధరింపగలిగిన భీమరూపములు గలవారున్!
సుగ్రీవునకును సచివులు వీరును సురుచిర యోజన గలవాడున్!
కిష్కింధాపురమందు నుండెదరు కోశాధిపతిని గొల్చుచునూ!

దేవ రూపముల వంటి రూపములు దీరుగ కవలల వలెనున్నా!
వారలు మైందుడు మఱియు ద్వివిదుడును వనరగ రణ రంగమునందున్
సమానులెవ్వరు లేరు సుమా మఱి సాటిరారు దేవతలైనా
అతుల బరాక్రమవంతులు వారలు ననంత దోర్బల విక్రములున్! 6

అజునిచేత మఱి యాజ్ఞను నందీ యమృత పానము జేసిన యా
యీ యుభయులునూ తేజోవంతులు నిమ్ముగ విక్రమ మార్తాండుల్!
వారిని జూడగ లంకానగరిని వనరగ రక్కసు లందఱినీ
మర్దించుటకును గోరుచుండి నటు మానుగ కనబడుచుండిరిగా! 7

రాక్షసేంద్ర! గను మదోదకంబును రహి స్రవించు కుంజరము వలెన్!
నిలిచియున్న కపివీరుడు నల్లదె విలసితుండు! గంటివి నీవున్!
కోపించినచో నాతడు నుదధిని కూర్మి క్షోభదెట్టును మఱియున్
అశోక వనమున నున్న జానకిని యలరి జూచినది యతడు సుమా!
నిన్నుగూడ మఱి జూచినాడు గద! సన్నిధానమున సభయందున్!
పూర్వము జూచిన యీ వానరుడే పొలుపుగ మఱలను నిపు డొచ్చెన్! 8-9

ఎవనిచేత సాగరము దాటబడి నిమ్ముగ సీతయు గాంచబడెన్!
హనుమంతుం డని యందురు నితనిని యరయగ లోక ప్రసిద్ధుంతున్

కేసరికివి మఱి జ్యేష్ఠ పుత్రుడును, భాసమానుడును బండితుడున్!
వాయుపుత్రుడని ఖ్యాతియు గలదూ! వాయువేగమును గలవాడున్! 10

కపిశ్రేష్ఠుండును నీ హనుమంతుడు కామరూపమును గలవాడున్!
బలము, రూపమును గలవా డితడును బన్నుగ సతతము వాయువులా!
యడ్డులేని గమనము గలవాడును నంతరిక్ష యానము మఱియున్
గలవా డతడును నీకును దెలియును గతమున సంద్రము లంఘించెన్! 11

బాలుడుగా నున్నట్టి సమయమున బన్నుగ యా హనుమంతుడునూ!
ఫలాదులను భక్షించు మాత్రమున బరగ నాదు క్షుధ దీరదనీ
సూర్యుని యాహారముగ బొందగను సురుచిరముగ మదిలో దలచీ
మూడువేల యోజనములు బోయెను మోదముగా నాకాశముపై
బలదర్పితుడై సూర్యుని వైపుకు బరగ గ్రహింపగ బోయెనుదా! 12-13

దేవతలును, ఋషులును, రాక్షసులును దీరుగ యేమాత్రము గూడన్
ఎదిరింపగ మఱి శక్యముగానీ యిమ్ముగ యా రవి బింబమునూ!
జేరకుండగనె యుదయాద్రిని బడి స్థిరముగ బొందెను గాయములన్! 14

శిలాతలంబున బడిన యా కపికి స్థిరముగ గడ్డము నొకవైపున్!
కొంచెము విరిగెను, అందుచేతనే యంచితముగ బహు దృఢమైనా!
గడ్డము గలిగిన యా వానరుడును గడు దృఢమగు హను గలుగుటచే
హనుమంతుండని బిలువగ సాగిరి యఖిల జనులు నా వానరునీ! 15

ఈ కపి యథార్థ వృత్తాంతంబును నింపుగ వింటిని దశాననా!
ఆ ప్రజనంబులు దెలిపిరి నాకును నాతని గుఱించి వివరముగా
బలముగాని రూపంబునుగానీ, ప్రభావంబు గూర్చియుగానీ,
పూర్ణముగా వర్ణించి జెప్పుటకు బొలుపుగ సాధ్యము గాదనుచున్! 16

ఈత డొక్కడే తన తేజముతో నింపుగ లంకను మథింపగన్
అభిలషించుచున్నాడు రావణా! యాత్మయందు నుత్సాహమునన్
ఎవనిచేత యంటింప బడినదో యీ లంకను నిపుడును గూడన్

-మండుచున్నదో యారకుండగను చండ విక్రముడు నా తీరున్
ఎటుల మఱచిపోతివి? నీ మదిలో బటు బలవంతుని హనుమంతున్! 17

శ్యామ వర్ణ దేహము గలవాడును విమల పద్మ నేత్రంబులునూ
గలిగినట్టి యా రామచంద్రుని గనుము! రావణా! యల్లడుగో!
యా హనుమంతుని ప్రక్కను నిలిచెను నాతడె! శ్రీరఘు వీరుండున్!
శూరుండును నిక్ష్వాకు వంశమున సురుచిరముగ యతిరథుడు మఱిన్!

ఎవనియందు ధర్మము జలింపదో ఎవడు ధర్మమును ద్యజింపడో!
వేదవేత్తలను శ్రేష్ఠుండాతడు వేదం బెఱిగినవాడు మఱిన్!
బ్రహ్మాస్త్రంబును నెఱిగిన వాడును బాణంబులచే గగనంబున్
బ్రద్దలు జేసెడి సామర్థ్యంబును బన్నుగ యీ భూమిని గూడన్!
జీల్చివేయగల సామర్ధ్యంబును స్థిరముగ గల దా రామునకున్!

ఆతని క్రోధము మృత్యుసమానము నాతని విక్రమమును గూడన్
శచీ భర్తయగు శక్రుని తోడను సరిసమానమని యందు రిలన్!
అతని భార్యయగు సీతాదేవిని యపహరించి దెచ్చితి వీవున్!
జనస్థానంబున నుండి దెచ్చితివి జనులందఱు నిను నిందింపన్!
శ్రీరాముడు నల్లదె గను! రావణ! స్థిరముగ రణరంగమునందున్!
నీతో రణమును జేయుటకొఱకై నిలిచియుండె నీ రాకకునై! 18-21

రాముని దక్షిణ పార్శ్వము నందున రమ్య శుద్ధ స్వర్ణము వోలెన్
కాంతిగలాడును, విశాలవక్షము క్రాంతి స్వభావము గలవాడున్!
తామ్రాక్షుండును, నీల కుంచితములగు కేశములును గలవాడున్!
లక్ష్మణు డనియెడి పేరుగలాడును లావగు భుజముల శౌర్యుండున్!
సోదరునకు ప్రియహితమును జేయగ యాదరమును గలవాడు మఱిన్!
నీతియందు మఱి యుద్ధము నందును నిర్భర కుశలుడు నాతండున్!
ఆయుధ ధారుల యందు శ్రేష్ఠుడును నఖిల విద్యలను జతురుండున్! 22-23

కోపంబును గలవాడు మఱియునూ కూర్మి దుర్జయుడు దశాననా!
బుద్ధిమంతుడును బలవంతుడును బూర్ణపురుషుడగు రామునకున్!

దక్షిణబాహువు, బయట జరించెడి దగ ప్రాణంబని బలుక దగున్!
నిను జంపుటకై నిలిచియుండె నదె విన్నుతింపగ కపు లందఱునూ! 24

రాముని నిమిత్తమై తన ప్రాణము రమ్యమైన దన జీవితమున్!
బరిత్యజించును సర్వసుఖములను బన్నుగ త్యజించి వని కొచ్చెన్!
రణమునందు రాక్షసుల వధింపగ రమ్యోత్సాహము జూపుచునూ!
నిలిచి యుండె చాపమును ధరించియు నిశితమైన శరజాలముతో! 25

శ్రీ రఘురాముని సవ్యపక్షమున స్థిరముగ నిర్భయముగ నిలిచెన్!
రక్షోగణ పరిరక్షిప్తుండై మఱి రావణ! నీకును విరోధియై
యున్నవాడు నీ తమ్ముడే సుమా! యన్న యనక యభిమానంబున్
వీడి రామునకు దోడై నిలిచెను విమలుడు రాజు విభీషణుడున్! 25

శ్రీమంతుండును రాజ రాజైన శీలవంతుడగు రామునిచే
లంకా రాజ్యమునకు నధినేతగ శంకలేక యింతయుగూడన్!
అభిషిక్తుండై నిన్ను గూర్చి మది యలవిగాని కోపము తోడన్
రణముసేయ సిద్ధముగా నుండెను దహి తన మంత్రులతో గూడన్! 27

సమస్తమగు వానర నాయకులకు సార్వభౌముడగు వాడు మఱిన్!
అమిత తేజమును గలవాడును మఱి యమిత బలాఢ్యుం డగువాడున్
వానరవీరుల మధ్యను నిలిచిన యనంత విక్రమ డగు వాడున్!
అతడే సుగ్రీవుడు వానరపతి యతడొక గిరివలె గనిపించున్!

హిమవత్పర్వతమునకు వోలెనూ విమల తేజమును గిర్తులచే
బలముచేత కపివీరుల కంటెను బన్నుగ యతిశయ తేజముతో
ప్రకాశించుచున్నాడో యతడే బన్నుగ కిష్కింధా గుహలో
తన సేనానాయకులను గూడక డగ వసించునో నిర్భయతన్
అతడే యీ సుగ్రీవుడు రావణ! యతడొక గిరివలె గనిపించున్!

వంద పద్మములు గలదియు మఱియును నందమైన సొగసులు గలిగి
దేవమనుష్యుల విజయ లక్ష్మియును దీప్తిగలిగినది దివ్యమునూ!
స్వర్ణమాలనూ గనుమో రావణా! సుగ్రీవుని హృదయము నందున్!

శ్రీరాఘవుడును వాలిని వధించి వరుసగ యా మాలను మఱియున్
తారను యతనికి బ్రసాదించెనూ దగ మఱి యా కపిరాజ్యంబున్!
సుగ్రీవునకును నను‌గ్రహించెను సురలు మెచ్చగను బ్రసిద్ధిగన్!
ఆ సుగ్రీవుని గనుమా రావణ! యా కపివీరుల మధ్యమునన్! 28-32

వంద లక్షలోక కోటియంచునూ చందముగా బలుకుదురు విదుల్!
లక్షకోట్లు ఒకశంకు వనుచునూ లావుగ బలుకుచు నుందురుగా! 33

వేయిశంకువులు మహాశంకువని విజ్ఞులు బల్కుచు నుందురిలన్!
వేయి మహాశంకువులు వృందమని విమల మతులు దెలిపెదరు నిలన్
వేయి వృందములు మహావృందమని విజ్ఞులు దెలుపుచు నుందురిలన్
వేయి మహా వృందములు బద్మమని వేయి పద్మములు లోకమునన్
మహా పద్మమని దెలుపుదు నుందురు మహాపద్మములు వేయియునూ!
ఖర్వం బని యును దెలుపుచు నుందురు ఖర్వంబులు మఱి వేయియునూ
మహాఖర్వమని దెలుపుచునుందురు మహా ఖర్వములు వేయియునూ!
సముద్రమని యును దెలుపుచు నుందురు సముద్రములు మఱి వేయియునూ
ఒక ఓఘంబని దెలుపుచు నుందురు ఓఘంబులు మఱి వేయియునూ
మహాఓఘమని దెలుపుచు నుందురు మానుగ గణితజ్ఞులును భువిన్!34-38

సముద్రంబుతో సమానమైనా సరసత వానర సైన్యంబున్!
రాముని యొద్దను గలదు రావణా! రణమునకును సిద్ధము గమ్మా!
బలపరాక్రమము గలిగిన వాడును బరగ మహా సైన్యంబులనూ
గూడినవాడగు కపిరాజగు నా కూరిమి సుగ్రీవుడు మఱియున్!
విభీషణునితో సుంత్రుల తోడను వినువీధిని తారల వోలెన్!
రణరంగమునకు వచ్చుచు నుండెను రక్కసి మూకను జండాడన్!

ఆ సుగ్రీవుని వెంటను మఱియును నతి బలవీరులు వానరులున్!
వేయికోట్ల మఱి నూరుశంకువులు వేయి మహాశంకువులు మఱిన్!
నూఱువృందములు, వేయి సంఖ్యగల మహావృందములు నరుదెంచెన్!
నూఱుపద్మములు, వేయి పద్మములు, నూఱు ఖర్వములు సముద్రముత్
మహౌఘమును మఱి కోటి సంఖ్యగల మహౌఘములు మఱి యరుదెంచెన్!

ాగరంబుతో సమానమైనా సైన్యముగలదా పీరునకున్
)పై సంగ్రామంబు సేయుటకు నిలిచియుండె రణరంగమునన్ 43

ప్రజ్వలిత గ్రహ సమానమైనా బన్నుగ వచ్చిన కపిసేనన్
{నుమో రావణ! రాక్షసేంద్ర విను! గలుగునట్లు విజయంబు మఱిన్!
ఁరులనుండి మఱి పరాభవంబును బరగ గలుగకుండెడి నటులన్
మోచన జేయుము నీ ధీశక్తిని యాచన జేయుచు నుంటి నిదే! 44

(యుద్ధకాండమునందు 28 వ సర్గము సమాప్తము.)

★ ★ ★

## యుద్ధ కాండము - మొదటి భాగము

### ఇఱువది తొమ్మిదవ సర్గము

[రావణుడు శుకసారణులను నిందించి వారిని సభనుండి బంపి
ేయుట-అతడు గూఢచారులను బంపగా రాముని యనుగ్రహముజేత వారు
ానరుల బాధనుండి బయటపడి లంకకు దిరిగి వచ్చుట]

ఁకుని జేత జూపగబడినట్టి శూరుడైన యా రాఘవునీ!
శ్రీరాముని కుడిభుజమును నైనా స్థిరుడగు లక్ష్మణ దేవరనూ!
ాపున నిలిచిన దన తమ్ముండగు దగ విభీషణుని బొడ గాంచెన్!
ఁకల కపిస్తోమమునకు ప్రభువగు సార్వభౌముడగు సుగ్రీవున్! 1

ఁలవంతుండగు వాలి కుమారుడు బల్లిదుడగు నంగదు గాంచెన్!
ఁహాపరాక్రమ శాలియునైనా మానుగ హనుమంతుని మఱియున్
ఁర్జయుడగు నా జాంబవంతునీ దూరాలోచన గలవారిన్!
ఁషేణునీ మఱి కుముదుని నీలుని బన్నుగ వానర శ్రేష్ఠుండున్!
ఁలుని, గజుని మఱి గవాక్షునీ గనె నయముగ నట శరభుని గనియెన్!

మైందుని ద్వివిదుని మానుగ గాంచి మది స్వల్పము దిగులును జెందీ!
జాతక్రోధుడై రావణు డంతట భీతిజెంద శుక సారణులున్!
నిందించెను సతి గటు వాక్యముల స్పందింపగ వారల మనసుల్! **2**

అధోముఖులునై నమస్కరించిన యా శుక సారణులను గూర్చి
రోష గద్గదంబగు వాక్యములను భీషణ క్రోధము జూపుచునూ!
పరుషముగా నీ విధమున బలికెను బన్నుగ లంకాధీశుండున్! **6**

ఆశ్రయించి జీవించు మంత్రులకు నిగ్రహ ప్రగ్రహ సమర్థుడున్!
రాజునెదుట నిలబడి యప్రియమగు రమ్య రహిత వాక్యము నెపుడున్
బలుకరాదు బద్ధతి యిదిగాదా! పామర జనులకు దెలియు నిదీ!
మీకు దెలియదా? మీరిన విజ్ఞులు వికల మొందెనా మీ మనసుల్! **7**

మీరిద్దఱునూ యప్రస్తుతమును మీరిన బలుకులు బలికితిరీ!
ఏ సందర్భము లేక పోయినను నెవ్వరు మిము ప్రశ్నింపకనూ!
యుద్ధమునకు వచ్చిన శత్రువునూ యుద్ధము బుట్టిన చందమునన్
స్తుతి శ్లోకములను బలుకుట యుక్తమ? మతి చలించెనో మీ కిపుడున్! **8**

ఆచార్యులు, గురువులు, వృద్ధులయును నలరిజేసి నా సేవలవీ!
వ్యర్థములాయెను గద! సఖులారా! యర్థములేని మాటలనూ!
రాజనీతి శాస్త్రములను జక్కగ రహి బఠింపగా లేదేమో!
పఠించినను మఱి గ్రహింపలేదుగ బన్నుగ వాని సారంబుల్! **9**

శాస్త్రములను మఱి గ్రహించి గూఢను సరియగు నర్థములను మీరున్!
గ్రహింపలేదో! యజ్ఞానమనే కఠిన భారమును నెత్తుకొనీ
మోయుచు నున్నారో యిక మీరలు మోసమాయె! మీ బ్రతుకులకున్!
మూర్ఖులైన మీరలతో గూడుక ముదమున నుంటిని యని యనగా
అది కేవలమును నదృష్టమే గద! యలరి జీవమున నుండుటయున్! **10**

శాసించెడి నా జిహ్వయొక్కటియె సరగున శుభా శుభంబులనూ
యివ్వగలిగెడి శాసకుండ నే నొవ్వజేయుటది యుక్తంబా?
శాసకుండనగు నాదు కట్టెదుట, సరస వచనములు బలుకకనూ!
బరుషవాక్యములు బలికితి రిప్పుడు భయము లేద మృత్యువు వలననన్? **11**

అగ్ని స్పర్శ గలిగినను వృక్షములు నడవులందు జీవించియునూ
బ్రతుకవచ్చునేమో గాని మఱి ప్రబల రాజదండము జేతన్!
స్పృశింపబడి మఱి బ్రతుక లేరుగా శిక్షింపగబడు నపరాధుల్! 12

పూర్వము జేసిన యుపకారమునకు బొందుగ నా మది కోపంబున్!
మృదుత్వమును బొందినది కావునను మోదముతో నుండిరి యింకన్
శత్రుపక్షమును బ్రశంసించెడి శాత్రవులనుగా గణియించి
ఈ పాపాత్ముల జంపెడివాడను! నిమ్మగ నా ఖడ్గము జేతన్ 13

ఎదుట నుండి దూరముగా బొండిక యెదుట బడకుడీ! యెన్నటికిన్!
గతమున జేసిన యుపకారంబుల యతిని దలచి జంపుటలేదూ!
నాపై స్నేహము లేని మిమ్ములను నయముగ కృతఘ్నులని మదిలో
భావింతును నే మీరిద్దఱునూ బన్నుగ మరణించిన యటులన్! 14

రావణాసురుని యాజ్ఞను బొందీ రహి బలికిన యా బలుకులన్
శుకసారణులును సిగ్గును బొందిరి వికలము నందిరి హృదయములన్!
రాక్షసేంద్రునీ కనుల గాంచుచును రహి జయ శబ్దము బలుకుచునూ!
వెడలిపోయిరీ యచ్చటి నుండీ కదలి యంచులకు దెరల వలెన్! 15

నిశాచరుండగు దశాననుండును నిరాశతో గడు వేగముగన్!
దాపునగల యా మహోదరునితో దగ యీ విధి యానతి యిచ్చెన్!
గూఢచారులను బ్రవేశ పెట్టుము గూర్మిని నా యెదుటను నిపుడున్!
వారలతో బహు కార్యమున్నదీ బరగ బొమ్ము వారల బిలువన్! 16

మహోదరుండును గూఢచారులను మానుగ వే యాజ్ఞాపించెన్!
అటుపిమ్మట యా గూఢచారులును నా రాజాజ్ఞను గైగొనుచున్
అతి త్వరితంబున వచ్చి యచటికిని యంజలి ఘటించి వినయముగా
జయ శబ్దంబుల బలుకుచు వచ్చిరి 'జయీాభవా?' యనుచును వారున్! 17-18

అటుపిమ్మట యా రాక్షసాధిపుడు నా రావణుడును త్వరితగతిన్!
శూరులు మఱి విశ్వాసపాత్రులును సురుచిర ధీరులు నగువారున్!

భయములేని వారైన వారలను బాగుగ ప్రశంస జేయుచునూ!
గూఢచారులగు వారలతోడను గూరిమి నీ విధమున బలికెన్! 19

రాముడెట్టి తన ప్రయత్నంబులను రహి జేయుచు నుండెనో మఱియున్
నాలోచనలను నంతరంగికులు నలరి యుందురో వారలనూ
సానుభూతితో గలియుచు రెవ్వరొ సహకారంబును జేయుదురో!
పరీక్షింపగా బయలు దేరుడూ! బటు వేగంబున నచ్చటికిన్! 20

రాముడెటుల నిదురించు చుండునో! రహి మేల్కాను చుండునొ నదియున్
ప్రస్తుత మేమియు జేయుచుండెనో విస్తృతముగ మఱి సకలంబున్!
అన్ని విషయములు దెలిసి రావలెను నలరి నేర్పుతో జతురతతోన్! 21

బుద్ధిమంతులగు ధరాధిపతులును బూని గూఢచారుల ద్వారా
శత్రువులను మఱి దెలిసికొనుచునూ, శాత్రవులను బరికించుచునూ!
దెలిసికొన్నచో వారల రణమున దీరుగ స్వల్ప ప్రయత్నమునన్!
ఓడింపగ వచ్చును యుద్ధంబున యొప్పగ విజయము సమకూరున్! 22

ఆ చారులు బహు ప్రహృష్టులై మఱి అటుల జేసెదము! నని బలికి
శార్దూలుండను రాక్షసు నొక్కని సరగున దమ ముందుంచుకొనీ!
రాక్షసరాజుకు ప్రదక్షిణంబును రయమున జేసిరి వినయమునన్!

అటుబిమ్మట యా గూఢచారులును చటుల బరాక్రమ వీర్యునికిన్!
మహాత్ముడగు నారాక్షసేంద్రునికి మానుగ యంజలి ఘటియించీ
లక్ష్మణ సహితుండైన రాముడును లాలితముగ యుండిన యట్టీ
ఆ ప్రదేశమును బోయిరి వారలు నలరి బరీక్షింపగ వారిన్! 24

గూఢచారులును ప్రచ్ఛన్నముగా గూరిమి సువేల బర్వతమున్!
దాపునగల యా రామలక్ష్మణుల దగ సుగ్రీవ విభీషణులన్
వానర సేనను గూడి యున్న యా వనరగ రాజకుమారులనూ
కనులను గాంచిరి గూఢచారులును కాంక్షదీర దర్శించియునూ! 25

గూఢచారులగు నా రాక్షసులును గూడిన సేనను జూడగనే
భయముజేత మఱి వ్యాకులురైరీ బన్నుగ బోజూచిరి తిరిగి!

ఇంతలోను నా రావణు తమ్ముడు వింతగ గాంచె విభీషణుడున్!
గూఢచారులను రక్కసు లందఱు క్రూరుడైన శార్దూలు మఱిన్! 26

రాజగు విభీషణుని యొద్దకునూ రహిజేరిరి యా రక్కసులున్!
విభీషణుండును భయపెట్టెను మఱి వికృత రూపుడగు శార్దూలున్!
'ఈ రాక్షసు డతి పాపాత్ముండ'ని యిమ్ముగ వానరవీరులతోన్!
బలుకుచు నా శార్దూలుని శీఘ్రము బాధింపగ జేసెను వేగన్! 27

శార్దూలుని యా వానరు లందఱు జంపుచుండగా రాఘవుడున్!
వారించెను మఱి జంపకుండనూ వలనొప్పగ గాచెను వానిన్!
క్రూరస్వభావములేని రాఘవుడు గూర్మి యితరులగు రక్కసులన్!
విడిపింవగ జేసెను దయతోడను విమల-స్వభావము వికసింపన్! 28

విక్రమ వంతులు వానర వీరులు విపుల విక్రమము దోడుతనూ
ఆ రాక్షసులను బీడన జేయగ యలత కలత మది జిందుచునూ!
స్పృహ గోల్పోవుచు నిట్టూర్పులతో సహనము గోల్పోవక వారున్!
లంకను జేరిరి రావణాసురుని శంకలేక రోదనతోడన్ 29

గూఢచారులై యెల్లప్పుడునూ గూరిమి వెలుపల దిరుగుచునూ!
మహావీరులగు నారాక్షసులును మానుగ రావణు దరిజేరి!
రాముని సైన్యము విధమును దెలిపి రహి సువేల గిరి సమీపమున్!
మోహరించి యున్నది యని దెలిపిరి మోహము భ్రాంతిని వదులుమనీ! 30

(యుద్ధకాండములోని 29వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# యుద్ధకాండము-మొదటి భాగము

## ము ప్ప ది య వ  స ర్గ ము

[శార్దూలుడు వానర సైన్యములో నున్న ప్రముఖవీరులను గూర్చి రావణునకు దెలుపుట]

అటువిమ్మట యా గూఢచారులును నలవిగాని సైన్యము తోడన్!
సువేలగిరియందున్న వాడనుచు జోద్యముగా కపివీరులతో!
ఆ శ్రీరాముడు నిలిచినాడనుచు నాలంకేశ్వరునకు వేగన్!
తెలియగ జెప్పిరి తేట తెల్లముగ దీరుగ వానర వీరులనూ! 1

ఆ దశగ్రీవుడు మహాబలము గల యా శ్రీరాముడు వచ్చెననీ!
వేలకొలది వానర వీరులతో విపులమైన వారధి గట్టీ!
లంకా నగరము వెలుపల నుండీ శంఖనాదమును జేసెననీ!
చారులచే విని రాక్షసేంద్రుడును చయ్యన కొంచెము దిగులందీ!
శార్దూలునితో నిటులను బలికెను సరసరీతి వచనంబులతో! 2

ఓ నిశాచరా! రాక్షసేంద్ర! విను వసరగ నీదు శరీరంబున్!
రంగుమారినది! మార్పుజెందినది సంగతి వివరింపుమ్ము మాకున్
గనబడుచుంటివి దీన వదనమున కన్నుల కాంతియు గనబడదూ!
కోపించిన శత్రువులకు నీవును గూరిమి జిక్కగ లేదుగదా! 3

ఆ దశాననుడు నటు బ్రశ్నింపగ యాశార్దూలుడు వ్యాకులుడై!
ఆ రాక్షస శార్దూలునితో నిటు నంజలిఘటించి మందముగా!
ఆతని దోడుతను నిటులను వలికెను నదురుచు బెదురుచు వణుకుచునూ! 4

ఆకపి వీరులతో భాషింపగ యలవి గాదు! ఓ దశాననా!
సంప్రశ్నించెడి యవకాశంబును సరసముగా దొరుకదు మనకున్!
పర్వతసములగు వానర వీరులు బన్నుగ మార్గము లన్నిటినీ
అన్నివైపులను బరిరక్షించుచు నలరి యుండి రట కపివీరుల్! 5

క్రమవంతులు బలవంతులు మఱి వీర్యవంతులగు వానరులన్!
ముని రక్షణలో నుండిన యా రహి వానర వీరుల నచటన్!
రీక్షించుటకు శక్యముగాదూ! బన్నుగ చారుల వలన నికన్
దిరింపగ శక్యంబును గాదూ మది నూహింపగ లేముగదా! 6

కపి సేనను బ్రవేశించి మఱి యలరి బరీక్షింపక ముందే
రు నన్ను గుర్తించిరి రావణ! వరుసను మిమ్ముల నందఱినీ!
భీషణుని మంత్రులచే నేనును వికటముగా బంధింప బడీ!
నేక విధముల బరీక్షించిరీ యలరి పీడనల జేయుచునూ! 7

ంకాళ్ళను, బిడికిళ్ళ దోడుతను మోదంబున దంతంబులతో!
రచేతులతో గొట్టుచు దన్నుచు నలరుచు బీడించుచు నన్నున్!
న్యము మధ్యను నూరేగించిరి సరసవాక్యములు బలుకుచునూ!
ండ్లికొడుకనుచు బెను కేకలతో బిడిగ్రుద్దులు గ్రుద్దుచు నన్నున్! 8

రా విధమున యూరేగించుచు వరుసగ యా సేనలమధ్యన్
క్తముచే నా సర్వాంగములును రమ్యమైన మోదుగ వోలెన్!
ంచిన వృక్షముగా నటులుండెను స్ఫూర్తి దప్పె నా యింద్రియముల్!
ముని యొద్దకు ననుగొని పోయిరి రమ్య గీతికలు బాడుచునూ! 9

హరి వీరులచే మఱి నేనును నలరి జంపగను బడుచుండన్!
ంజలితో నే యాచించితినీ యా శ్రీరాముని గాంచుచునూ!
మునిచే రక్షింపగ బడితిని రమ్య గుణార్ణవ ధామునిచే
వ వశంబున జీవము దోడను ధారుణి నుంటిని రాజేంద్రా! 10

శ్రీరాముడు బర్వతములచే నలరు శిలలచే, వృక్షములన్!
హార్ణవంబును నింపి వేసెనూ మానుగ కపివీరులు దాటన్!
యుధములు ధరియించినవాడై నల లంకా ద్వారము నందున్!
ంచియున్నవాడదె శ్రీరాముడు బిలుచుచుండె నిను రణమ్మునకున్ 11

హా తేజుడగు రామచంద్రుడును మానుగ నన్నట వదులుమనీ
వర వీరులతోని జెప్పి మఱి వదలగ జేసెను మఱి నన్నున్!

గరుడ వ్యూహముగ యేర్పడినట్టి కడలి వోలె గపివీరులునూ!
లంక వైపునకు వచ్చుచుండిరీ శంకలేక రణమును జేయన్! 12

రాముడు ప్రాకారంబు దాటి మఱి రయముగ వచ్చెడి లోపుగనే!
యేకతరంబగు గార్యము సేయుము నిమ్ముగ లంకను గాపాడన్
సీతనైన మఱి యిచ్చివేయుమా స్థిరముగ యింజలి ఘటియించీ
యుద్ధమునైనను జేయుము రావణ! యిద్ధరిత్రి నిను బొగడగనూ! 13

రాక్షసాధిపుండైన రావణుడు రహి శార్దూలుని వాక్యములన్!
విని మనస్సుచే నా పరిస్థితిని విపులముగా నూహించుకొనీ!
శార్దూలునితో నీవిధి బలికెను చయ్యన కపివీరుల యందున్!
ఎవరు బలాఢ్యులొ! యెవరు వీరులో నిమ్ముగ దెలియగ గోరుచునూ! 14

దేవదానవులు గంధర్వులునూ దీరుగ నా కెదురును నిలిచీ
రణభూమిని యుద్ధమును జేసినను రయముగ సమస్త లోకములన్!
నుండి భయంబును గలిగిన గూడను ఖండితముగ దెలిపెద నిదిగో!
సీతను రామున కర్పింపను నే భీతి నొంద నా రామునకున్! 15

మహాతేజమును గల రావణుడును మాటలాడి యీ విధముగనూ!
మఱల బలికె శార్దూలినితో నిటు మౌనముద్రనూ విడనాడీ!
ఆసైన్యములో శూరులు వీరులు నలరెడి వానరు లెవరెవరూ?
శార్దూలా! వానర సైన్యంబును సరి బరీక్ష జేసితివి గదా! 16

సువ్రత! సౌమ్యుడ! శార్దూలా! నిను! చూచి వచ్చినా సైన్యమునన్!
దురాసదులునగు వానరు లెవరో! దోర్బలులగు వా రెవరెవరో!
ఎట్టిప్రభావము గలవారో మఱి? యెట్టి వీర్యవంతులో వారున్?
ఎవని పుత్రులో? నెవని పౌత్రులో? నెవవి బంధువర్గము వారో?
విషయ మంతయును నీవు జూచినది విశదము జేయుము శార్దూలా! 17

వారల బలాబలంబుల దెలిసీ వరుసను నా విషయము నందున్!
ఏమిజేయవలెనో యోజించెద యిమ్ముగ నిర్ణయమును జేతున్!

రణరంగమునకు వచ్చిన వారిని రహి దప్పక లెక్కింపవలెన్
శత్రుజాడలను దెలియవలయు గద! చారుల వలనను ప్రభు వెప్పుడున్! 18

అటువిమ్మట లంకాధీశునిచే నటుల బలుకబడగా వినియున్!
ఉత్తమ చారుడు నగు శార్దూలుడు సత్య వచనములు బలుకుటకున్
ఉపక్రమించెను రావణు నెదుటను నూహించుచు దా గాంచినది! 19

రాక్షసేంద్ర విను! నేను గాంచినది రహి దెలిపెద వానర సేనన్!
ఈతడు ఋక్షరజస్సు బుత్రుడును నిల సుగ్రీవుండను వాడున్!
జయింప శక్యముగాని వాడు సుమ! చతురుడు రణరంగము నందున్!
రాజా! యిచ్చట గద్దదు బుత్రుడు రమ్య విక్రమము గలవాడున్
జాంబవంతుడను బేరు గలిగినా సాంబమూర్తి వలె దేజుండున్! 20

ఈతడు గద్గదు మఱియొక పుత్రుడు నిమ్మగ ధూమ్రుండను వాడున్!
నితడు బృహస్పతి కుమారుడును మఱి నీతిమంతుడును నుదారుడున్
కేసరి యందురు నితని పుత్రుడే కీర్తిమంతు హనుమంతుడునూ!
ఆ హనుమంతుడె రక్కసు లందఱి యలరి వధించెను నొంటరిగా! 21

వీర్యవంతుడును, ధర్మాత్ముండును విపుల విక్రమము గలవాడున్!
యముని కుమారుడు సుషేణు డనియెడి సౌమ్య మానసుడు నిటగలడూ,
సోమాత్మజుడగు దధిముఖుండునూ శూరుడు వానరు డిట గలరూ
పైజెప్పిన వారందఱు గూడను బహు విక్రములును రణమందున్! 22

వేగదర్శి, సుముఖుండు, దుర్ముఖుడు వీరలు, దుర్ధర్షులును మఱిన్!
స్వయంభువుడు దా స్వయముగ భువిలో సృజన మొనర్చెను మృత్యువుగా!
మృత్యుదేవతకు బుత్రులు వీరలు సత్యము దెలుపుచు నుంటి నిదే! 23

స్వయముగ సేనకు నధిపతియైనా సాక్షాత్ యగ్నికి బుత్రుండున్!
నీలుండనియెడి పేరుగలిగినా నిఖిలము జయింప గలవాడున్!
హనుమంతుండని ప్రసిద్ధి జెందిన నతడు వాయు పుత్రుం డిచటన్!
గలడు రావణా! లంకను గాల్చి కలత దెచ్చినా వా డితడున్! 24

శక్రుని మనుమడు దుర్ధర్షుండును విక్రమ తేజుడు, యువకుడునూ!
అంగదుండు గల డిచ్చట రామా! భంగము జేయును శత్రువులన్!
అశ్వని దేవతలకును బుట్టినా యక్షయ బలవంతులు నైనా
మైంద ద్వివిదులు నిచ్చట గలరూ మహాశక్తి వంతులు వారున్!

వైవస్వతునీ పుత్రులు వీరలు వనరగ కాలాంతకులు మఱిన్!
గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు గంధమాదనుడు నైదుగురున్!
ప్రళయకాల ధర్మునితో సములును రణమునందు దుర్ధర్షులునూ! 25- 6 27

యుద్ధము జేయుటకై మఱి యిచ్చట సిద్ధముగా నుండిరి వీరల్!
కోట్లకొలదిగా నుండిరి రావణ! ఈ రిమి రాముని సన్నిధినీ!
శ్రీమంతులునూ, దేవపుత్రులును స్థిరముగ వారల సంఖ్యలనూ!
దెలుపగ జాలరు! రాక్షసేంద్ర! విను దీరుగ వారల వివరములన్! 27

సింహమువంటి యవయవములతో శ్రీవిలసిల్లెడి దేజుండున్!
యువకుండును మఱి దశరధ పుత్రుడు యుద్ధమందు విజయుం డెపుడున్!
ఖరదూషణులను జంపిన వాడును సురలు నుతింపగ దగువాడున్!
ఆతడే శ్రీ రఘువీరుడు రావణ! యతడే శ్రీరాముడు వినుమా! 28

విరాధునీ మఱి కబంధు రాక్షసు విక్రమమున గూల్చెను గాదా?
ఆ రాక్షసులును యముని సమానులు నలరు శౌర్యవంతులు గాదా!
వారిని గూల్చిన రామచంద్రుడును వలనొప్పగ యీ లోకములో
సాటిలేని మఱి మేటి వీరుడని సకల జనులు బొగడగ వింటిన్! 29

జనస్థానంబున యున్న రాక్షసుల చయ్యన జంపిన వీరుడహా!
ఆ శ్రీరాముని గుణ గణంబులను నలరు విక్రమము శౌర్యంబున్!
దెలుపగ గలిగిన మనుజుడు లేడూ! దిరముగ లోకము నందుననూ! 30

ఎవని బాణ మార్గంబును బొందీ యింద్రుడు సైతము ప్రాణముతో
జీవింపగ జాలడొ! ఓ రావణ! భావింపుము నా సౌమిత్రిన్!
మాతంగములను మహాగజము వలె మాసుగ లక్ష్మణుడును గూడన్
ఇచ్చట గలడు సుమ! రాముని ప్రక్కన నింపుగ దక్షిణ భుజమువలెన్!

శ్రీ భాస్కరునికి నాత్మ సంభవుడు శ్వేతుండును, జ్యోతిర్ముఖులున్!
నిచట గలరు, వరుణుని కుమారుడును నిచట హేమకూటుడు గలడూ!
విశ్వకర్మ పుత్రుడు వీరుండును విమలుడు నలుడను వాడు మఱిన్
వసువుల కుమారుడును విక్రముడును వనరగ వేగము గలవాడున్!
దుర్ధరుడను వా డిచ్చట గలడూ! దుష్కర శత్రుల బరిమార్చున్! 32-33

రాక్షసులకు మఱి వరిష్ఠుండునూ రమ్యాలోచన పరుండునూ!
నీదు భ్రాతయును విభీషణుండును నిర్మల బుద్ధిని రామునితో
జెలిమిజేసి రాముని హిత మందున జేరియుండె వానరులందున్!
లంకానగరము ముట్టడింపగా శంకలేక నిలిచెను యచటన్! 30

సువేల పర్వత సమీపమునగల శూర వీర వానరబలమున్
అంతయు నివరించితిని రావణా! యింతయు మిగులక యుండగనూ!
ఏమి జేయవలెనో మఱి యిటుపై యేమాలోచన జేసెదవో!
శేష కార్య భారంబంతయునూ స్థిరముగ నీ జేతను గలదూ!

(యుద్ధకాండమునందు 30వ సర్గము సమాప్తము)

   

# యుద్ధకాండము - మొదటి భాగము

## ముప్పది యొకటవ సర్గము

(రావణుడు రాముని మాయా శిరస్సు కల్పించి తీసికొనివచ్చి సీతకు జూపి యామెకు దుఃఖమును గలిగించుట)

అటుపిమ్మట యా గూఢచారులును నక్షోభ్యంబగు సేనలతో
రాముడు లంకకు సమీపంబునను రహి సువేల బర్వతముననూ!
నిలిచి యుండినటు లంకేశ్వరునకు నిఖిలము దెలిపిరి వినయముగా!
రామలక్ష్మణుల శౌర్య ప్రతాపము రహి కపివీరుల విక్రమమున్! 1

రావణు దంతట మహాబలముతో రాముడు వచ్చుట దెలిసికొనీ
గూఢచారులును జెప్పిన దంతయు గూరిమి విని హృదయము నందున్
శోకోద్వేగము గలిగినవాడై సచివులనందఱ వే బిలిచీ
ఈ రీతిని బలికెను వారలతో నిమ్ముగ గద్గద స్వరముననూ! 2

ఆలోచిందెడి సమయ మొచ్చినది యాప్తమిత్రులారా! మాకున్!
మంత్రులు, సచివులు, మిత్రులందఱును మానుగ రాక్షసు లందఱునూ!
సావధాన చిత్తముతో నందఱు చయ్యన వత్తురుగాక! యికన్! 3

అతని శాసనము నాలకించియును నందఱు మంత్రులు వేగముగా!
వచ్చి రచటకును నటుపిమ్మటనూ మచ్చికతో నా రావణుడున్!
సచివులైన యా రాక్షసవీరుల చక్కని యాసనముల నిచ్చి!
సమాదరించీ యాలోచించెను సరస వాక్యములతో నపుడున్! 4

దుర్ధర్షుండగు దశాననుండును దూరాలోచనలను జేసి!
వచ్చిన యాపదలను వివరించెను వనరగ జేయగ వలసినదీ!
ఆలోచించెను మంత్రులతోడను నటుపిమ్మట వారల నంపి!
స్వగృహమందున ప్రవేశించెనూ స్వర్గతుల్యమగు భవనమునన్! 5

మహా మాయగల రావణాసురుడు మానుగ నటుపిమ్మట నతడున్!
మహాబలుండును, మాయావిదుడగు మఱి విద్యుజ్జిహ్వును గూడి!

మైథిలియుండిన ప్రదేశంబునకు మానుగ వచ్చెను నాతనితో
జనకసుతకు వ్యథ గలిగింపగనూ! జానకి మనసును కలచుటకున్! 6

ఆ రావణుడును మాయలు దెలిసిన యా విద్యుజ్జిహ్వుని తోడన్
మధురముగా నీ విధమున బలికెను మాటలు వేగము దటబడగా!
జనకుని కూతురు జానకి నిప్పుడు సరగున మోసము జేసెదనూ!
మాయజేత మోహింపజేసెదను మాటలేల? నీపును గనుమా! 7

ఓ నిశాచరా! రాముని యొక్కయు వలనొప్పగ మాయా మయమున్!
శిరస్సు మఱియును బాణంబులతో శీఘ్రము చాపము దేతెమ్మా!
నీ మాయల నిట ప్రయోగింపుమా! నిజముగ సీతయు నమ్మునటుల్! 8

ఆ దశాననుడు నటుల బలుకగా నా విద్యుజ్జిహ్వుడు వేగన్
'అట్లే!' యనుచును బలుకుచు నాతడు నలరి మాయచే వేవెంటన్!
రాక్షసేంద్రుడును జెప్పిన రీతిని యా శ్రీరాముని శిరస్సునూ!
ధనుర్బాణములు దెచ్చి జూపెనూ దగ తన మాయా శక్తులచే!
రావణుండు మది సంతోషించెను రమ్యమైన యాభరణంబున్!
బహూకరించెను నా రాక్షసునికి బహువిధముగ గీర్తించుచునూ! 9

మహాబలుండగు రాక్షసేంద్రుడును మానుగ దశాననుడు వేగన్
సీతాదర్శన లాలసుం డగుచు శీఘ్రముగా నడుచుచు వేగన్!
అశోకవనమును బ్రవేశించెనూ నాలోకించుచు బ్రకృతినీ! 10

అటుపిమ్మట యా ధనజానుజుడును నా రావణుడును నట గాంచెన్!
దీనురాలు శోకమునకు దగనిది దీరుగ యధోముఖము గలదీ!
శోకంబునకును వశురాలై నది యశోకవనమును బొందినదీ!
మహీతలంబున గూర్చొని యున్నది మఱి భర్తను ధ్యానించునదీ!
అట్టి జానకిని జూచె రావణుడు గట్టిగ యడుగులు వేయుచునూ! 11-12

అటుపిమ్మట యా సమీపంబునను నా సీతకు చుట్టును జేరి!
భయంకరంబగు రాక్షసస్త్రీలును బన్నుగ రక్షించుచు నుండన్
ఆ రావణుడును సీత సమీపము నలతి దూరమున నిలిచి మఱిన్

ఆనందంబగు వార్త యన్నటుల యా జానకికిని దెలుపుచునూ
ఈ విధముగ బలికెను రావణుడును నింపుగ చిఱునవ్వును జారన్! 13

మంగళప్రద! నే నెంత వేడినను సంగతి నామాటను వినవూ!
ఎవనియాశ్రమము నంద దలచితివొ నిమ్ముగ ఖర సంహారకుడున్!
ఆ నీ భర్తయు శ్రీరఘురాముడు అనిలో ద్రుంపగ బడినాడూ!
నన్నాదరము జేసినావు గద! యిన్నినాళ్ళు బీడించుచునూ! 14

అన్నివిధములను నీదు మూలమును భిన్నము జేసితి భేదించీ!
దర్పమంతయును నఱచివేసితిని దరిజేరగ లేవింక మఱిన్!
అంతులేని దుఃఖమున జిక్కితివి నుంత శాంతి లేకుండగనూ!
అందుకనే నా భార్యవుగమ్మా! యిందువదన! సుఖమును నందన్! 15

మూఢురాల! యీబుద్ధిని విడుమా! మూర్ఖాలోచనలను విడుమా!
మృతునితోని నీవేమి జేసెదవు? మతి జలింపకుము ప్రియురాలా!
మంగళప్రద! నాభార్యవు గమ్మా! యంగన! నా భార్యలపైనీ!
ఆధిపత్యమును వహింపు మింకను నందఱు నిను గీర్తింపగనూ! 16

అల్ప పుణ్యమును గలదానా విను! విపుల కోరికలు గలదానా!
మూఢురాల! పండితమానిని విను! మోదమునను నే దెలుపునదీ!
భయంకరంబగు వృత్రాసురవధ భవ్యమైన కథ యెట్టిదియో!
నీదు భర్తయగు రాముని వధయును నే దెలిపెద విను మంతయునూ! 17

ఆ నీ భర్తయు నా శ్రీరాముడు నల సుగ్రీవుని గూడికొనీ!
వానరసైన్యముతోని వచ్చెనూ వనరగ నను జంపుట కొఱకై
అల సంద్రమునకు సమీపమునకును నలరి వచ్చినా దట సుదతీ! 18

అటుబిమ్మట యా దివాకరుండును నస్తమింపగా రాఘవుడున్!
గొప్పదైన వానరసైన్యముతో కూరిమి సాగర తీరమునన్!
విడిదిజేసి దా విశ్రమించెనట విమల శిలాతల మందుననూ! 19

అటుబిమ్మట యా మార్గమధ్యమున యలసటగొని యా తీరమునన్!
విదుతించిన యా వానరసేనను విదురించిన యా రాఘవుని

ముందుగాను నా గూఢచారులును బొందుగ నంతయు గని పెట్టీ
అందజేసిరీ వార్త లన్నియును జందముగా నా సేనకునూ! 20

ప్రహస్తుడను సేనానాయకుచే బన్నుగ సేనయు నడుపబడెన్!
రామలక్ష్మణులు నున్న ప్రదేశము రయముగ జేరిరి రాక్షసులున్!
అర్ధరాత్రి యందున నా సైన్యము నలసట బొందిన వానరులన్!
హతము జేసిరీ యందఱ నచ్చట జితుక జేసిరీ వానరులన్! 21

రాక్షససైన్యము బట్టిసములతో రయమున బరిఘలు, చక్రములన్,
పెద్దచక్రములు ఋష్ఠులతోడను పెనుదండంబులు, బాణములున్!
ఇతరమైన యాయుధముల తోడను నతి తీవ్రములగు శూలములన్!
మెఱయుచున్న ముద్గరములు, యష్టులు వరలు దోమరములును, ప్రాసల్
ముసలంబులు మఱి యెత్తిబట్టుకొని మోదంబున కపివీరులపై
బడునట్లుగ చండాడిరి వారిని బలువిధముల జంపిరి వారిన్! 22-23

అటుపిమ్మట బహు హింసకుడైనా యల ప్రహస్తుడును శీఘ్రముగా
ఘన ఖడ్గంబును జేతబుచ్చుకొని గనరాకుండగ యెవ్వరికిన్!
శ్రీరాముని శిరసును ఖండించెను శీఘ్రము దెచ్చెను నిదిగిదిగో!
అడ్డంకులు మఱి లేకుండగనూ ఖడ్గముచే ఖండించె నిదే! 24

దైవవశముననుా రాక్షసు లెఱిగీ దగ విభీషణుని గూడ మఱిన్
బట్టుకొనిరి మఱి బంధించిరిగా బట్టు దప్పి పోకుండగనూ!
లక్ష్మణుండు మఱి కపివీరులతో వీక్షించుచు మఱి దిక్కులనూ!
పాఱిపోయెనూ పరుగులు దీయుచు ప్రాణంబులు రక్షించుకొనన్! 25

సీతా! విను ప్లవగాధిపుడైనా భీతిలేని యా సుగ్రీవున్!
కంఠంబును రాక్షసులు విరిచిరీ కనికరమింతయు లేకుండన్!
హనుమంతుని గడ్డమును బట్టుకొని అటునిటు నూపుచు దిట్టముగా
బగులగొట్టి మఱి జంపివేసిరీ ప్రబలరాక్షసులు వే వేగన్! 26

అటుపిమ్మట మోకాళ్ళు దొడుతను నటులేచెడు వానర వీరున్!
జాంబవంతునీ జంపివేసిరీ జృంభిత రాక్షసు లంతటనూ!

బహుపట్టిసముల గొట్టగ బడుచును పాదపంబు వలె బడెను ధరన్!
నిర్భయముగ నా రాక్షస వీరులు నిరసించిరి యా వానరులన్! 27

ప్రౌఢవగు శరీరములు గలవారును బొందుగ శత్రు వినాశకులున్!
మైందుడు ద్వివిదుడు వానర శ్రేష్ఠులు మఱి నిట్టూర్చుచు దెబ్బలచే!
రుధిరముచే బరివృతులై వారును రోదన జేయుచు నుండగనూ!
నడుముల మధ్యకు నఱుక బడిరిగా గడు దీర్ఘములగు ఖడ్గములన్!28-29

పనసుడు కోసిన పనసపండువలె బడినేలను నేడ్చుచు నుండన్!
దరీముఖుడు నారాచబాణముల దగ భేదింపగబడె నతడున్!
గుహలోబడి యున్నాడు జానకీ! కూరిమి స్పృహయును లేదిపుడున్
మహాతేజమును గలవాడును నగు మానుగ కుముదుడు ననువాడున్
నఱుచుచుండగా బాణంబులచే నలరి జంపబడినా డతడున్! 30-31

రాక్షసులందఱు జేరి యంగదుని రహి యనేక బాణంబులచే
భేదింపగబడి యింద్రుని మనుమడు జెదిరిపోయి తన యంగదముల్!
నేలనుబడగా రక్తసిక్తమై విలవిల దపించుచును నుండెన్! 32

అట శయనించిన వానరు లందఱు చటుల గజంబుల, రథములచే
మేఘంబుల మఱి వాయువేగములు మీరుచు మర్దించిన యటులన్!
మర్దింపగబడి వానరవీరులు మానుగ పొడిపొడి యగు నటులన్! 83

రాక్షసులంతట దరుముచుండగా రయమున యా వానరు లపుడున్
సింహంబులు మఱి తరుముచుండగా శీఘ్రము గజములు బోవునటుల్
భయబడుచును మఱి పారిపోయిరీ బరగ వెనుకకును గనకుండన్! 34

రాక్షసులందఱు దరుముచుండగా రహి కపివీరులు బరుగిడుచున్!
సాగరమందున బడిరి కొందరట వేగముగా నీదుచు మఱియున్
గగనములోనికి యెగిరిపోయిరీ కాంతిని దప్పిరి కొందఱునూ!
ఆ కపివీరులు, భల్లూకములును నదురుచు బెదురుచు వేగముగన్
వృక్షంబుల మఱి యాశ్రయించిరీ వీరత్వంబును విడనాడీ! 35

కృత నేత్రములు గలరాక్షసులును వేలకొలదీ కపివీరులనూ!
గరతీర ప్రదేశములందున సలలితముగ పర్వతములనూ
నములయందున గుహలయందునను వరుసను గూల్చిరి వానరులన్!
రిపోవు వారలను బట్టుకొని బరగ వధించిరి నిర్దయతన్! 36

విధముగ కపిసేనను గూడిన నిమ్ముగ నీ భర్తయు గూడన్!
ంపబడెను సుమ! సైన్యముదోడుత దంపబడెను రణరంగమునన్!
తని రక్తమున దడిగానున్నది యులరిన పరాగ ధ్వస్తమునూ!
ట్టి శిరస్సును దెచ్చి చూపెదను నిట్టె దైన్యమును నొందకుమా! 37

టుబిమ్మట యా రాక్షస ప్రభువగు నారావణుడును వెనువెంటన్!
తాదేవియు వినుచుండగ మఱి శీఘ్రముగా నొక రాక్షసితో
రీతిని బలికెను నెమ్మదిగా నిమ్ముగ కపటపు వాక్యములన్! 38

వనిచేత రాఘవుని శిరస్సును నిమ్ముగ రణరంగమునుండీ!
వ్యయముగ దేబడెనో మఱి వానిని సాహస కర్మము గలవానిన్!
క్షసుడైనా విద్యుజ్జిహ్వుని రయమున నిచటికి గొనిరమ్మా!
త గాంచు రాఘవుని శిరస్సును శీఘ్రము గన్నీ రొలుకుచునూ! 39

ంతట వచ్చెను విద్యుజ్జిహ్వుడు నా రాఘవునీ శిరస్సుతో!
నస్సుతోడను నచటికి వచ్చెను దాశరథివి యని బలుకుచునూ!
గసా ప్రణామములను జేసి మఱి జేరి నిలిచె రావణు నెదుటన్! 40

టుబిమ్మట యా రాక్షసేంద్రుడును జటులాకారము గలవాడున్
ద్ధనాలుకయు గలవాడును మఱి వద్ద నిలిచినా వాడునగూ!
క్షసుడైనా విద్యుజ్జిహ్వుని రహిగాంచుచు నిటులను బలికెన్
నకి వినుచుండగ బలికెను మఱి చాటు కపట వాక్యంబులనూ! 41

ద్యుజ్జిహ్వా! రాఘవు శిరమును వేగముగా జానకి యెదుటన్!
దర్శింపుమా! బాగుగ జూపుము! భర్తను గాంచును పడతి యిటన్!
మతాలు దనభర్తకు గలిగిన దీనావస్థను బరికించున్!
త్యావస్థను జూచును గావుత చింతించును గన్నీ రొలుకున్! 42

రావణు మాటలు విని రాక్షసుడును రయమున ప్రియ దర్శనమైనా
అట్టి శిరస్సును జానకి యెదుటను నిట్టి యుంచి కడు శీఘ్రముగా
అంతర్ధానము జెందెను నాతడు నగుబడకుండగ యెవ్వరికిన్! 43

'మూడులోకముల ప్రసిద్ధమైనది మోదముగను ధనుసును గనుమా!
ఇదిగో! జూడు' మటంచు రాక్షసుడు నిమ్మగ లంకాధీశుండున్!
ప్రకాశించు నా ధనుస్సు పట్టుక బడవేసెను జానకి యెదుటన్! 44

నారికట్టినా శరాసనం బిదె వారిజాక్షి! నీ రామునిదే!
రాత్రియందు నా మానవు జంపీ రమ్యహస్తుడగు ప్రహస్తుడున్
రాముని శిరస్సు దెచ్చినాడు సుమ రమ్యముగా నీకును జూపన్! 45

విద్యుజ్జిహ్వుడు దెచ్చినట్టి యా వికృతమగు రాముని శిరసున్!
శరాసనంబును యా రావణుడును సాధ్వి, తపస్విని పుణ్యవతీ!
సీతముందు బడవేసి బలికెనూ! జిరకాంక్షయు మఱి ప్రజ్వరిలల్!
'నీవు నాకు వశురాలవు గమ్మా! నీరజాక్షి!' యనుచును బలికెన్! 46

(యుద్ధకాండమునందు 31వ సర్గము సమాప్తము)

  

## యుద్ధకాండము - ప్రథమ భాగము

### ముప్పది రెండవ సర్గము

(రాముని శిరస్సును, శరాసనమును గాంచి సీత విలపించుట— ఇంతలో నెవరో దూత వచ్చి, యేమో దెలుపగా, రావణుడు నచ్చటినుండి వెడలిపోవుట)

ఆ సీతయు నా కృత్రిమ శిరసును నా కార్ముకమును గనుగొనుచున్!
పూర్వము హనుమంతుండు దెలిపినా బొలుపుగ సుగ్రీవుని గూర్చి!
ఆ సంబంధము మదిని స్మరించుచు నా రావణుడును జెప్పినదీ!
సుగ్రీవాదుల విషయము దెలుపుట గ్రుక్కెను మదిలో వేదనతో!

భర్తృ సదృశమునగు నేత్రములను బున్నగ ముఖ వర్ణంబు గనీ!
ముఖము, కేశములు, లలాటంబునూ మోహనమగు చూడామణినీ!
కనుగొని నిజమగు భర్తృ ముఖం బని కలతజెంది వేదన తోడన్!
దుఃఖముతో గోరింక పక్షిలా దుఃఖించెను నా కమలాక్షీ!
ఈ యాపదలకు గారణమైనా యిమ్ముగ కైకను నిందించెన్! 1-3

కైకేయీ! నీ మదిలో కోరిక సకలము సిద్ధించినది గదా!
కులవర్ధనుడగు నా రఘువీరుడు విలయము నొందిన వాడుగదా
కలహస్వభావము గల నీ చేతను గలహము మాత్రము మిగిలినదీ!
కులమంతయు నశియింప జేసితివి నేరిమి నీ పంతము దీరెన్! 4

పూజ్యుడైన శ్రీరామచంద్రునకు బూని నారచీరల నిచ్చి
నాతోగూడను వనికి బంపితివి నయముగ వనముల మధ్యకునూ!
అపకారము నీకేమి జేసెనో యరయ లేము గద! కైకేయీ! 5

తపస్వినియు మఱి బాలయునగు నా తరుణి సీత యిటు బలుకుచునూ!
కోపమాత్రయై గడగడ వణుకుచు వేదనతో మది గూడికొనీ!
ఖేదించిన కదళీవృక్షము వలె శీఘ్రము ధరపై బడిపోయెన్!
దార్చెడి వారును లేరుగదా! యొనరగ ధైర్యము జెప్పగనూ! 6

13)

ఆయతేక్షణయు నా జానకియును నటుమీదట క్షణకాలంబున్!
ఊరడిల్లి చేతనమును బొందీ యొనరగ శిరస్సు దగ్గఱకున్!
పోయి యిట్లు విలపించెను జానకి బొగులుచు గన్నీరొలుకుచునూ! 7

మహాబాహూ! వీరవ్రత! మనువ్రత! మహా శౌర్యమును గలవాడా!
అయ్యో! నే మరణించితి రామా! యాశలేదు జీవితముననూ!
నీదు జివరిదశ జూచుచు నుంటిని నిఖిలేశ్వర! విధవను నైతిన్! 8

భార్యదోషముననే మునుముందుగ భర్తయు మరణించును ననియున్!
లోకములో బెద్దలు జెపుచుందురు లోకరీతి యిటులుండగనూ!
సువృత్తంబునూ గలిగిన రామా! సుఖకరముగ నే నుండగనూ!
నాకంటే ముందుగ మరణించీ నన్ననాథగా జేసితివీ! 9

మహాదుఃఖమును బొందినట్టి నను మానుగ రక్షింపగ దలచీ!
ప్రయత్నించితివి! యా యత్నములో బన్నుగ మరణించితివి గదా! 10

లేగదూడపై వాత్సల్యంబును రాగముగల ధేనువుకు వలెన్!
అత్తయైన కౌసల్యా దేవియు నరయ దూడ లేకుండునటుల్
చేయబడిన గోవునకును వోలెను జేసినారు గద! నిన్నిపుడున్! 11

దీర్ఘమైన యాయుర్దాయమునూ దీరుగ గలదని జ్యోతిష్కుల్!
దెలిపినారుగద! వారల మాటలు దీరుగ యసత్యమై యిపుడున్!
అల్పాయుర్దాయమును బొందితివి హతుడ వైతివీ రఘువీరా! 12

నయశాస్త్రంబును దెలిసిన వాడవు నయముగ నీకును దెలియకనూ!
నిదురయందు మృత్యువును బొందితివి! నీచులైన యా దుష్టులచే!
ఉపాయంబులను దెలిసినవాడవు వూహ కందనీ కష్టములన్
దాటుటకును మఱి సముద్రుండవును దాటలేదు మఱి యెందుకనీ? 13

ప్రాజ్ఞుడవైనప్పటికిని గూడను ప్రబల కారణంబుల జేతన్
ప్రజ్ఞ నశించినదై మఱి నీవును బరగ నిద్రలో మునిగితివీ!
మృతిని జెందితివి! సర్వభూతముల స్థితి లయ కారణమును నైనా
కాలము నిను పరిపక్వము జేసియు కలుపుకున్నదీ తనలోనన్! 14

మలలోచనా! రఘుకుల తిలకా! కాలరాత్రిచే నీ విధమున్
ాదురాలు మఱి భయంకరంబునగు మృత్యుదేవతయు నా విధమున్!
'గలించుకొని గొనిపోయినదీ కాలగతిని యేమననచ్చున్?
న్నెడ బాపి గొనిపోయినదీ నిన్ను నీదు ప్రాణంబులనూ! 15

ుహాబాహూ! ఓ పురుష శ్రేష్ఠుడ! మానుగ నన్నిటు దిగవిడచీ!
సుంధరను ప్రియురాలిగ జేకొని వనరగ కౌగిలిలో జేర్చి
యనించితివి గదా! రఘురామా! సరసముగా నిదురించుచునూ! 16

వీరా! కాంచనభూషితమును వనరగ ప్రియమైనది నాకున్!
ధనుస్సు మఱి నీకును ప్రియమును నీ వెల్లపుడును నా ధనుసున్!
ంధ పుష్ప మాల్యంబుల తోడను గమనీయంబగు నక్షతలన్!
ాజించెడి వాడవు రఘురామా! పూర్ణ భక్తి శ్రద్ధల తోడన్! 17

నహాత్మా! ఓ శ్రీరఘురామా! యలరుచు స్వర్గము నందునమా!
ామగారునగు దశరథరాజును మానుగ గలిసెద విపుడు మఱిన్
కల పితృదేవతలను గూడను సరసత గాంచుచు నుండెదవూ!
ురదృష్టరాలిని రఘురామా! దూరముగా నుంటిని నీకున్! 18

్వర్గలోకమున నక్షత్రమువలె స్వయముగ ప్రకాశమును జేయన్
ొప్ప కర్మమును జేసినావు గద! కూరిమి నీదగు రూపమునన్!
డు రాజఋషి పుణ్యవంతమగు నిర్మల వంశంబును వదిలీ
ముపేక్షించుచుంటివిగాదా మఱి యూహకందనీ విధముననూ! 19

ాజా! బాలుడవైన నీచేత బరగ బాలనై యున్నపుడున్!
ుహచారిణిగా స్వీకరించితివి నహజబంధువుల మధ్యమునన్!
ార్యనైన నను జూడవెందుకని? బన్నుగ మాటాడవదేలా?
పతిభాషింపవు బదులు జెప్పవూ? బలువిధముల నే దుఃఖింపన్! 20

ామా! పాణిని గ్రహించు వేళను రమ్య ప్రతిజ్ఞను జేసితివీ!
సీతో గలిసియె జీవించుదునూ! నీతో ధర్మాచరణంబున్

జేసెద' నంచును బ్రతిన జేసితివి చిరకాలంబున క్రిందటనూ!
ఆ ప్రతిజ్ఞ మఱి స్మరింపు రాఘవ! యలరి ననుగూడ గొనిపొమ్మా! 21

సకలజీవులను శ్రేష్ఠుండవు మఱి సాధు పురుషుడవు రఘురామా!
ఏకారణమున విడిచిపోతివి? యే లోకమునకు రఘురామా!
నన్ను విడిచి యీ లోకమునుండీ నయముగ బోతివి పరమునకున్! 22

మంగళప్రదమగు నలంకారముల శృంగారంబగు నీ తనువున్!
ఏ శరీరమును బరిష్వంగమున నింపుగ కౌగిలి జేర్చికొనీ!
యుండెడిదాననొ! యా శరీరమును ఖండంబులుగా జేసికొనీ!
మాంసభక్షకములైన మృగంబులు మఱి భక్షించుచు నుండెగదా! 23

పరిపూర్ణములగు దక్షిణలును గల బన్నుగ యగ్నిష్టోమంబుల్!
యాగంబులు మఱి జేయవలయునుగద! యాగంబులు మఱి జేయకనూ!
సంస్కారంబును నొందకుండగను సకల యాగములు జేయకనూ!
మరణించితివది యెందులకో మఱి మానుగ యెవరికి దెలుపకనూ! 24

శోక లాలసయు నగు కౌసల్యాసతి శోకము మిక్కిలి నొందు నికన్!
ప్రవాసమును బొందిన ముప్వురిలో బన్నుగ నొక్కరు నయోధ్యకున్
వచ్చుట మాత్రము గనగలదు సుమా వచ్చిన లక్ష్మణు గాంచుచునూ! 25

ఆ కౌసల్యాసతి బ్రశ్నింపగనూ నా లక్ష్మణుడును వివరించున్!
అర్థరాత్రి సమయంబున రాముని యాతని మిత్ర సుసైన్యంబున్!
రాక్షససైన్యము సంహరించెనని రయమున దెలుపును దుఃఖముతో
అడలి యడలి రోదించును నామెయు కదలి యలలు ధ్వనియించునటుల్!26

ఓ రఘురామా! నిద్ర నున్న నిను నొనరగ జంపగ బడినటుల్
రక్షోగృహమున నేనుండినటుల్ రయముగ విని కౌసల్యయునూ!
గుండెబ్రద్దలై పోవును రామా! మండెడి యగ్నుల శిఖల వలెన్
జీవింపదు నొక క్షణమైనా యిక భావించుచు నిను నను గూడన్! 27

అనఘుండును మఱి పార్థివాత్మజుడు నా రఘువీరుడు విక్రముడున్
నా శ్రీరాముడు ననార్య యగు నను నందుకొనగ సంద్రముదాటి

గోష్పదమందున మరణించెను గత! క్రూర రాక్షసునిచేత మఱిన్
రావలనను గద యింత జరిగినది నయముగ యీకథ యంతయునూ! 28

స్వకులపాంసిని నగు నను రాముడు వికృతముగ యజ్ఞానముచే
నను వివాహమును జేసికొనియెనూ నయముగ శివధనుసును విఱిచి!
ఆర్యపుత్రుడగు శ్రీరామునకును నతని భార్యయే మైథిలియే!
మృత్యు దేవతగ పరిణమించెనూ సత్యముగా లోకమునందున్! 29

సర్వాతిథులను సత్కరించెడి సార్వభౌముడగు రామునికిన్
పిరిపత్నియై యుండియు గూడను వికలముగా దుఃఖించుచునూ!
నుంటి ననగ నేనేదో పూర్వము జంటల నే నెడబాపితినో!
ఉత్తమ మగు గన్యాదానమునకు ర క్తి యడ్డుగా నిలిచితినో: 30

దశాననా! క్షిప్తముగా నన్నును దగ శ్రీరామునిపై నుంచీ
వధింపజేయుము! భర్తను భార్యను వలనొప్పగ జేయుము నొకటిన్!
భర్తను భార్యను గలిపి శ్రేష్ఠమగు బన్నుగ మంగళ ప్రదమైనా
కార్యము జేయుము! బుణ్యము గలుగును! ఘన కీర్తియు గలుగును నీకున్!

దశాననా! నాశిరస్సు మఱియును దగ శ్రీరాముని శిరస్సునూ!
ఆశ్రీరాముని శరీరమును మఱి యటులే నా కాయము గూడన్!
గలుపుము! మహాత్ముడగు నా భర్తను గలిసిపోయెదను నాకముకున్! 32

ఆయతేక్షణము నగు నా జానకి నల తన భర్త శిరస్సు మఱిన్!
శరాసనమునూ మాటికి మాటికి సరిజూచుచు దుఃఖించుచునూ!
విలపించెను నీ రీతిగ బలుకుచు సలలితముగ గోరింక వలెన్! 33

ఆ సీతయు విలపించుచుండగా అట్టి సమయమున నొకభటుడున్
నమస్కరించుచు నచ్చటి కొచ్చెను నతి వినయంబున యంజలితో! 34

ఆభటుండు మహరాజుకు 'జయ'మని మాననీయ మభివాదములన్!
జేయుచు నను గ్రహింప జేసికొని సేనాపతి యగు బ్రహస్తుడున్!
వచ్చెననుచునూ విన్నవించెనూ! మన్నికతో వినయంబుననూ! 35

మహారాజ! మంత్రులలో గూడను మానుగ ప్రహస్తుడును వచ్చెన్!
నీదర్శనమును గోరుచు వచ్చెను నిను రమ్మనుచును నను బంపెన్!
క్షమాన్వితుండవు! మహారాజ విను! సరగున రాజ్యంబును గూర్చి
అత్యయికంబగు కార్యమున్నదీ యాలస్యము లేకుండగనూ!
దర్శింపుము వారిని శీఘ్రముగా ద్వారపాలకుడ మన్నింపూ! 36-37

ఆ రాక్షస భటు వాక్యంబులని యారావణుడును వేగముగన్!
అశోకవనమును సీతాదేవిని యచట విడిచి బహుత్వరితగతిన్
మంత్రుల జూచుటకై బోయెను మఱి మాట-మంతి మాటాడుటకున్! 38

ఆతడు మంత్రులతో జర్చించియు నాత్మకృత్యమును యోజించీ
సభలో రాముని విక్రమమును విని సరసత యాసమయము నందున్
జేయదగిన కార్యంబులు జేసెను శీఘ్రముగా మంత్రుల తోడన్! 39

ఆరావణుడును నశోకవనమును నటు విడచిన బిమ్మట వేగన్!
అశిరస్సు, మఱి యా యుత్తమమగు నా మహాశరాసనము మఱిన్
అంతర్థానము నొందెను వేగము నతి విచిత్రముగ యచ్చటనూ! 40

ఆరావణుడును భయంకరంబగు నతివిక్రములగు మంత్రులతో
రామునితో జేయగ యుద్ధంబును రహి సంబంధిత కార్యములన్!
విషయములన్నియు చర్చలు జేసెను వేగముగా నిర్ణయములనూ! 41

కాలసదృశుడు రాక్షసాధిపుడు గడు క్రూరత నా రావణుడున్!
అవిదూరస్థితులైన మంత్రులను నల సైన్యాధిపులను గూడీ!
ఈవిధముగ వలికెను నాతండును నిమ్మగ కర్కశ వాక్యములన్! 42

దండముతో భేరీలను గొట్టుడు! చండ ధ్వనులను మ్రోగగన్!
నా సైన్యంబుల నన్నిటి బిలువుడు! నయముగ నా యానతి చునియున్!
కారణంబు మఱి దెలుపగ వలదూ కయ్యమునకు నని బలుకకుడూ! 43

అటువిమ్మట యా దూతలు వేగము నా రావణు యానతి రీతిన్!
ఆసమయంబున శీఘ్రము తోడను నలరుచు ఘన సైన్యంబులనూ!
దెచ్చి రావణుని తోని బలికిరీ చెచ్చెఱ సైన్యము వచ్చెననీ!
రణమును గోరెడి యా రావణునకు రమ్యముగా దెలిపిరి దూతల్! 44

(యుద్ధకాండయందు 32వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

## యుద్ధ కాండము - మొదటి భాగము

### ము ప్ప ది మూ డ వ స ర్గ ము

["ఇది రాముని శిరస్సుకాదు, రావణుడు మాయచేత కల్పించినది" అని చెప్పి సరమ సీతాదేవిని ఓదార్చుట—రాముడు సముద్రమును దాటి వచ్చినాడు—అతడు జయించుట తథ్యము—అనికూడ సరమ దెలుపుట]

అటువిమ్మట సీతకు ప్రియసఖి యగు నలరు సరమయను రాక్షస స్త్రీ
భ్రమనుజెందినా వైదేహిని గని బన్నుగ మనసున వగజెందీ!
ఇష్టురాలునగు సీతాదేవిని యిమ్ముగ సమీపమునకు జనెన్! 1

మృదుభాషిణియగు సరమా దేవియు సదయ హృదయమున వేదనతో!
రాక్షసేంద్రుచే మోహబెట్టబడి రాలు గఱుగ దుఃఖించెడి యా
జనకసుతను దరిజేరి కరుణతో వినయ వాక్యముల నోదార్చెన్! 2

దశగ్రీవునిచే నియమింపగ బడి దగ సీతను రక్షించుటకై
సామక్రోశ, ధృఢవ్రత యగు సరమను సరసత యా వైదేహియునూ!
తన సఖిగా స్నేహంబును జేసెను దన యాత్మీయత బెంపొందన్! 3

సఖురాలగు నా సరమ రాక్షసియు సఖి స్పృహ దప్పుట గనుగొనియెన్!
పాంసుపరాగము నందు దొరలుచును పైకిలేచినా జానకియున్

పరాగంబుచే గప్పబడిన యా బరగ యూడు గుఱ్ఱము వోలెన్
ఉష్ణశ్వాసిని సరమయు గాంచెను జెన్నుగ యామెను నోదార్చెన్! 4

సఖురాలగు నా సరమాదేవియు చారుశీల సీతాదేవిన్!
స్నేహము దోపగ ప్రీతివాక్యముల స్నేహాక్షరములతో బలికెన్!
వైదేహీ! మది యూరడిల్లుమా! వసరగ వ్యధ మతి జెందకుమా! 5

జడుప స్వభావము గలవానా! విను! బన్నుగ నీవును బలికిన యా
మాటలు వింటిని! రావణుండునూ మానుగ బలికిన మాటలనూ!
శూన్యమైన యాకాశమునుండీ సురుచిరముగ నే వింటిసఖీ!

నీమీదను గల యనురాగముచే నిలడు హృదయ సౌజన్యముచే
రావణునుండీ భయమును వీడీ రమ్యముగా వింటిని చెలియా!
విశాలాక్షి! నీమీద నాకుగల విమలమైన స్నేహము జేసన్
రాక్షసేంద్రుని భయమును లేదూ! రహి సుపాయమును సహింతు నే! 6-7

మైథిలి విను! నా రాక్షసేశ్వరుడు మానుగ దేవి నిమిత్తంబై
సంభ్రాంతుండై నిష్క్రమించెనో చాటుగ! నే దెలిసితి సఖి!
వెలుపలికిని నేబోయి దెలిపితిని వేగముగా వారిని వలనన్! 8

పవిత్రాత్ముండగు రాముని విషయము వదితముగా రాత్రిని బోయీ!
యాక్రమించుటది యసంభవము సుమ! నదియు శక్యమును గానిపనీ!
పురుషశ్రేష్ఠుడగు రాముని జంపుట బూర్తిగ యసంభవము గాదా!
అసంబద్ధమగు విషయము లివి సుమ! యిలరి నమ్మదగినవి గావూ! 9

సురలను శ్రేష్ఠుండైన యింద్రుచే సురలు రక్షణను బొందు విధిన్!
రామునిచే రక్షింపబడుచునూ రహి పాదప యోధులునైనా!
ఆ వానరులను జంపుట గూడను వదియును శక్యముగాదు సుమా!
సుగ్రీవాదులు మహా విక్రములు శూరులు వీరులు దుర్జయులున్! 10

దీర్ఘ వృత్త భుజములు గలవాడును దీరుగ శ్రీమంతుడు మతిన్!
మహోరస్కుడును, ప్రతాపుండునూ మహాధన్వి గుణవంతుడునూ!

చక్కని యవయవ నిర్మాణంబును చతురుడు, ధర్మాత్ముండు మఱిన్
భూమియందు గీర్తిని గలవాడును స్ఫూర్తి విక్రమము గలవాడున్ 11-13

ఎల్లపుడును మెలకువతో మెలగుచు వల్లగాని శత్రుల నుండీ
తనను దాను మఱి యితరులగూడను దగ రక్షించెడి వీరుండున్!
సోదరుడగు సౌమిత్రిని గూడుక సురుచిరముగ నుండెడివాడున్
గుణీనుండునూ నీతి శాస్త్రమును గూరిమి దెలిసిన వాడు మఱిన్!

పరబల సేనా సముదాయంబులను బరగ సంహరించెడి వాడున్!
నూహింపగ మఱి శక్యముగానీ యున్నతుండు బలపౌరుషముల్!
గలవాడును మఱి వీర్యవంతుడును క్రాంతి కాంతి గల శ్రీరామున్
వధింప జాలరు! వధింపలేదూ! యెప్పగ యుండెను జీవించీ!

అయుక్తమగు బుద్ధియు, కర్మబునూ యాత్మవంచనయు గలవాడున్!
సర్వ భూతములకును విరోధియును సాక్షాత్ భయంకరుడు నైనా
మాయా స్వభావములను గలిగినా మానుగ యా రావణు జేతన్
ఇచట నీదు విషయంబు నందునను నిమ్మగ మాయను జూపబడెన్! 14

నీదు దుఃఖమును దొలగిపోయినది నిర్మలమతి విను! వైదేహీ!
సమస్తమగు శుభములు కల్యాణీ! సరగున గలుగగ యున్నవిగా!
విజయలక్ష్మి సేవించుచు నున్నది విమలమైన ముఖకమలంబున్!
నీకు ప్రియంబును గలుగగ నున్నది నిర్మలమతి! విను! దెలిపెదనూ! 15

రాముడు వానరసేనను గూడుక రయమున వచ్చెను వైదేహీ!
సాగరమును దాటెను సేనలతో సరసత వారధి గట్టి మఱిన్!
సాగర దక్షిణ తీరమునందున సఖియరో! విడిదిని జేసెనుగా! 16

సిద్ధించిన యా ప్రయత్నంబుగల స్థిరుడగు లక్ష్మణు గూడికొనీ
యున్నత రాఘవు జూచితి నే సఖి! యున్నత సాగర తీరమునన్
కలిసియున్న యా సేనల జేతను గాపాడగబడి యుండె నటన్! 17

శీఘ్రగమనమును గల రాక్షసులను శీఘ్రముగా రావణు డంపెన్!
రాముని వార్తలు దెలియజేయుటకు రహి చతురులునగు చారులనూ

'రహి కపి వీరులతో గూడికొని రాముడు సంద్రము దాటెననీ!
వార్తలు దెచ్చిరి యీ చారులునూ వనరగ రణమిక దప్పదనీ 18

విశాలాక్షి! ఓ వైదేహీ! వినుు! విరసమైన యా వార్త వినీ
దశగ్రీవుండును సంభ్రాంతుడై దగ మంత్రులతో గూడికొనీ!
మంతనంబులను జేయుచు నుండెను ఇంత పరిస్థితి యెదిరింపన్! 19

ఈ విధమున యా సరమాదేవియు నిమ్ముగ వైదేహిని గూడీ
మాటలాడుచుండిన సమయంబున మతి ఘోరమునగు శబ్దంబున్!
వినిపించెను; సైనిక బృందమునూ వేగ సమాకృత మగునపుడున్
గలిగెడి భైరవ నాద మచ్చటను గలుగుట వారికి వినిపించెన్! 20

మధురభాషిణియు సరమాదేవియు మానుగ జానకితో గూడీ
మాటాడెడి యా సమయమందునను మానుగ దండ ప్రహారములన్!
భేరీధ్వనులను జేయుటయును వినె భీకర రణశబ్దంబులనూ!
విని జానకితో నీ విధి బలికెను విమల వచనముల సరళముగన్! 21

భయ స్వభావము గలదానా విను! ప్రబలమైన భేరీ రవముల్
యనికిని యోధులు సిద్ధమగుటకై నలరుచు జేసెడి నట్టి ధ్వనుల్!
తోమర నిస్వన గంభీరమునగు దోరముగా బేరీ ధ్వనులన్
వినుమా జానకి! యుద్ధ యత్నములు వివరించెద నే గాంచినవీ! 22

మద మాతంగములను సైనికులును మానుగ సిద్ధము జేసి మఱిన్
సరదములకు గుఱ్ఱములు కట్టబడి యతి వేగముతో రాక్షసులున్!
వేలకొలది ప్రాసములు ధరించియు వేగముగా దురగము లెక్కి
కనబడుచును న్నారు జానకీ! కదనంబునకును సిద్ధంబై! 23

అశ్వ యోధులదె వేలకొలదిగా నలరి రణమునకు సిద్ధంబై!
తురగంబుల నెక్కిన యోధులదే దోరముగా నాక చోటికినీ!
వచ్చి జేరుచున్నారు జానకీ! వనరగ జల ప్రవాహములన్!
సముద్రంబు వలె గనబడుచున్నది సరసిజాక్షి! యాశ్చర్యముగన్!
సైన్యంబులచే రాజమార్గములు సరగున నింపగ బడుచుండెన్! 24

ఆయుధములు, డాలులు, కవచంబులు నా దశగ్రీవుని వెంట జనూ!
అరదంబులు, నశ్వములు, గజములును నలరి మహోత్సాహము గూడి!
యున్న బలీయులునగు రాక్షసులును నెన్నో విధముల రంగులతో!

కూడిన కాంతిని బ్రసరణ జేయుచు గూరిమి వెడలుచునుండి రటన్!
ఆ కాంతియు మఱి గ్రీష్మము నందున యడవుల గాల్చెడి యగ్నివలెన్
నున్నది జూడుము జనక నందినీ! యున్నత కాంతులు జిందుచునూ, 27

ఘంటల యొక్కయు నిర్ఘోషంబును గదిలెడి రథముల నిస్వనముల్!
వినుమా జానకి! సకిలించెడి యా వికృత యశ్వంబుల హేషల్!
వినబడుచుండిన దూర ధ్వనులను వినుమా జానకి వరుసగనూ!

ఉద్యతాయుధంబుల హస్తంబుల యురవడి ద్రిప్పుచు శూన్యమునన్!
రాక్షసేశ్వరుని సేనావాహిని రయమున బోవుచు వేగమునన్!
తుముల వ్యాకులము, రోమహర్షణము దోరముగా గలిగించుచునూ!
భయంకరమునగు రణము జరుగునని భావన గలుగుచు నుండె మదిన్!22

శోకంబును నశియింప జేసెడి సురుచిర జయలక్ష్మియు నిన్నున్!
సేవించుచు నున్నది రాక్షసులను శీఘ్రము భయమును వ్యాపించెన్!
అదైత్యులందున యింద్రుని వలెనూ నలరు కమల పత్రాక్షములన్
నలరు భర్త జితక్రోధుండును మఱి యంచిత్య పరాక్రమవంతుడునూ!
ఆ శ్రీరాముడు రావణాసురుని యలరు యుద్ధమున వధియించి
నిన్ను నంద గలడో జానకి విను! నిర్మలమతి! సంతసమందన్! 30-31

విష్ణు సహితుడగు శత్రుమర్దనుడు విమల శచీ భర్తకు వోలెన్
లక్ష్మణ సహితుండైన రాముడును లలి భీషణ విక్రమమునన్నూ!
రాక్షసులను నిర్మూలింపును సుమ! రావణు వేగము మర్దించున్!
నిన్ను నందగలడో జానకి విను! నిర్మలమతి! సంతస మందన్! 32

శత్రువు జయింప బడిన బిమ్మటను సరసత గోరిక తీరునటన్
వచ్చిన రాముని యంకమునందున మచ్చికతో నుండగ నిన్నున్!
కన్నులార గాంచెద ప్రియసఖియా! గల నా కోరిక దీరగనూ! 33

ఓ జానకి నీ భర్తను జేరి యొనరగ కౌగిలి యందుననూ!
యతనిజేత లాలింపబడుటయును యాతురతను నే గాంచెదనూ!
విశాలమగు రాముని వక్షస్థల విమలమైన భాగమునందున్!
ఆనందాశ్రువులను రాల్చెదవు యాశ లన్నియును దీరగనూ! 37

ఓ సీతా! ఓ జనకనందినీ! యొప్పుగ శ్రీరాముని చేతన్
అనేక మాసములను నటులుండిన యా జఘనము నందుండిన యా
యేకవేణినీ సరిజేయును సుమ నింపుగ హర్షము గలుగంగన్! 35

ఉదిత పూర్ణచంద్రుని శోభలు గల సదయుని రాముని శ్రీముఖమున్
గాంచి పన్నగియు కుబుసము విడిచిన గతి నీవును దుఃఖము వలనన్!
అశ్రుధారలను విడువగలవు సుమ! యతని హృదిని శిరమును జేర్చి! 36

సుఖార్హుండు నగు నా శ్రీరాముడు సుధృచిరముగ వేగంబుగనూ!
రణము నందు నా రావణాసురుని రయమున వధించి వైదేహీ!
ప్రియురాలవునగు నిన్ను గూడుచును ప్రీతిని బొందును నిక మీదన్! 37

సువర్షంబుచే సమాయుక్తమగు సుశ్యామలమగు ధాత్రి వలెన్!
సస్యముతో గూడిన పొలమును వలె చక్కని మల్లియ దీవెవలెన్!
మహాత్ముడగు నా శ్రీరామునిచే మానుగ కూడిన దానవునై
అతనిచేత యాదరణ బొందుచును యానందంబును నందెదవూ! 38

ఓ దేవీ! యే సూర్యుడు గిరివర మొప్పుగ మేరువు జుట్టుచునూ!
హయమునకును వలె మండలంబుగా నలరి దిరుగుచుండునో యట్టి
దివాకరుని శరణంబును బొందుము! దీరుగ యభ్యుదయము గలుగన్
అతడే గద! కారణము ప్రజలకును నలరు వెలుగునకు జీకటికిన్! 39

(యుద్ధకాండమందు 33వ సర్గము సమాప్తము)

★ ★ ★

## యుద్ధకాండము - మొదటి భాగము

### ముప్పది నాలుగవ సర్గము

[సీతాదేవి కోరగా రావణుడు ఏమి చేయుచున్నాడో సరమ తెలిసి కొని వచ్చి సీతకు జెప్పుట]

అటువిమ్మట యా జనక నందినియు నటు దుఃఖము మది బొందియునూ
సరమాదేవీ వాక్యంబులచే సంతోషంబును బొందియునూ
అట్టి జానకిని కాలిన భూమిని యలరి నీటితో దడిపినటుల్!
యిటుల బలికి మహదానందంబును చాటు రీతి సరమయు బలికెన్! 1

కాలంబును నెఱిగినదియు మఱియును కర్తవ్యంబును దెలిసినదీ!
చిఱునవ్వున మాటాడు సరమయును సీతకు హితమును జేయుటకై
మది కాంక్షించుచు నా సమయంబున మానిని సీతకు నిటులనియెన్!

అసితేక్షణ! ఓ జనకనందినీ నలరి యెవరికి గనబడకన్!
నేను బోయి రాముని సన్నిధికిని నిర్మలముగు నీ వార్తలనూ!
నీ క్షేమంబును రామచంద్రునకు నిజముగ దెలిపియు రాగలనూ! 2-3

ఆధారంబును లేని గగనమున యలరి బోయెదను వైదేహీ!
శీఘ్రమైన నాగమనంబును మఱి శీఘ్ర తరంబగు వేగమునూ!
అనుసరించుటకు నలవియు గాదూ యల వాయువునకు గూడ మఱిన్!
అల వినతా తనయుండును గానీ యనుసరింపగా లేరు సుమా! 4

ఈ విధముగ బలికెడి యా సరమా నిమ్ముగ వాక్యములను వినియున్!
పూర్వ శోకమున గూడిన సీతయు బొలుపుగ మృదువుగ నిటు బలికెన్!
నీ వాకాశములోనికి మఱియును నిశ్చయముగ పాతాళంబున్!

నరుగ గలవు మఱి నా నిమిత్తమై నలత బొందకను ప్రియ సఖియా!
ఎంత కష్టమగు కార్యము గూడను నింత యలసటయు లేకుండన్!
జేసెదవని నే నెఱుగుదు సఖియా! చింతవంత లేకుండగనూ! 6

మత్ప్రియమును జేయగ దలచినచో మానుగ స్థిరమగు బుద్ధియునూ!
గలిగినచో వేగము ప్రియ సఖియా కదలుము రావణు దగ్గఱకున్!
ఏమి చేయుచున్నాడో యాతడు యెట్టి కార్యమును జేయుచునూ!
ఎట్టి ప్రయత్నములను నున్నాడో యిట్టె దెలిసి రావలెను సఖీ! 7

మాయా బలమును గలవాడును మఱి మానుగ క్రూరుడు! దుష్టుడునూ!
శత్రువులను రోదింప జేసెడీ సహజ నీచ గుణముల వాడున్!
వారుణి ద్రాగిన వానికి వెంటనె వనరగ భ్రమయును గలిగినటుల్!

నాకును భయమును గలుగుచు నున్నది నయముగ దుష్టుని చేష్టలనూ!
ఏ రాక్షస స్త్రీలును నిత్యంబును నిమ్మగ రక్షించుచునుండీ!
కాపాడుచు నున్నారో వారలు కపట క్రూరమగు జేష్టలచే
మాటి మాటికిని మాటల జేతను మఱి భయపెట్టించుచు నుండెన్!

ఉద్విగ్నంబగు మనసుతోని మఱి యూహకు నందని శంకలచే
యుండిన దానను! నా మనస్సునూ నిండిన స్వస్థత లేదిపుడున్
స్వస్థముగా మఱి శాంతియు లేదూ! సఖియా! యశోక వనమందున్!
యుండియు గూడను రాక్షసు వలనను నిండు భయంబున నే నుంటిన్ 10

అతనికి సంబంధించిన విషయము యాతని వృత్తాంతం బెద్దియునూ
ఉన్నచో మఱియు దాసిని నాకును విన్నవించినను సాంతముగా
నా విషయంబున యనుగ్రహంబని నయముగ నే భావింతు సఖీ! 11

మృదుభాషిణి యగు సరమయు గూడను మది దుఃఖించెడి వైదేహిన్!
బాష్ప పిక్లబంబైన ముఖంబును బన్నుగ దుడుచుచు దన చీరన్!
వేదన బాపుచు ధైర్యము జెప్పుచు విమల వాక్యముల నిటు లనియెన్! 12

ఓ జానకి నీ యభిప్రాయమటు నొనరగ మదిలో నుండినచో
ఆ కారణమున బోవుచు నుంటిని యా దశగ్రీవుని కడకు నిదే!
మైథిలి! శత్రువు యభిప్రాయమును మానుగ దెలిసియు వేగముగా
తిరిగి వచ్చెదను నీకడకును నే దీరుగ విషయ సమగ్రతతో! 13

టుల బలికి యా సరమా దేవియు నిమ్ముగ దశగ్రీవుని కడకున్!
యు మంత్రులను గూడిన రావణు బొలుపుగ సంభాషణములనూ!
రి మంతనము లన్నియు వినియెను వనరగ రహస్యముగ నుండి! 14

షయ జ్ఞానమును గలిగిన సరమయు, నిపుణయు, సమర్థురాలును నౌ
సరమయు రావణుని నిశ్చయము నాతని యాలోచనములనూ!
ని వేగముగను మఱలి వచ్చెనూ వినిపింపగ జానకి కపుడున్! 15

శోక వనమును బ్రవేశించియును నా సరమయు బహు వేగముగన్!
ష్ట పద్మయగు శ్రీలక్ష్మికి వలె బన్నుగ యుండిన జానకినీ!
ర్శించెను నా సరమాదేవియు దగ వినయంబున యంజలితో!
రమ కోసమే నిరీక్షించుచును సతి సీతాదేవియు నుండెన్! 16

రిగి వచ్చినా ప్రియభాషిణి యగు దీరుగ సరమను శీఘ్రముగా
తాదేవియు స్నేహ పూర్వకము శీఘ్రము గౌగిలి జేర్చుకొనీ!
సనమును నిచ్చెను యాదరమున యతి స్నేహము సువ్యొంగగనూ! 17

హ నిచ్చట సుఖముగ యాసనమున యిమ్ముగ గూర్చొను దానవునై
హరుడు మఱియును గుటిలాత్ముండును దురాత్ముండు నగు రావణునీ!
శ్చయంబునూ, యాలోచనలను నిర్చయముగ యంతయు నిపుడున్
లియజేయుమా! తేటతెల్లముగ దీరుగ యంతయు వివరముగా! 18

పమానయగు జానకి సతియును వివరముగా నిటు బ్రశ్నింపన్!
ంత్రి సహితుడగు రావణు సన్నిధి మానుగ తా విన్నది యంతన్!
మస్త సంభాషణము నంతయును చారుశీల సరమయు దెలిపెన్! 19

దేహీ! నిను విడుచుట కొఱకై వనరగ రావణు దల్లియునూ!
కని పలికెను నీతి వాక్యముల కఱకు గుండెగల రావణుతో
ంత్రులలో వృద్ధుడు నవిద్ధుడును మానుగ యుత్తమ వాక్యములన్!
కసుథను బోధించిరి వారలు నిర్మల మధుర సువాక్యములన్! 20

నుజేంద్రుండగు రామచంద్రునకు మానుగ యభి సత్కృతి తోడన్
థిలి నర్పించుట బహు శ్రేయము మఱి యాలోచింపుము! నీవున్!

జన స్థానంబున జరిగిన విషయము విని యుంటివి గద! నీవు మఱిన్!
రాము డెట్టి పరాక్రముడో దెలుపగ రమ్య నిదర్శనమును గాదా! 21

హనుమంతుడు వారాసి దాటుటయు యలవిగాని పని యది గాదా!
సీతను గాంచుట, లంకను గాల్చుట స్థిరమగు నిదర్శనములు గాదా!
ఈ భూలోకమునందు నే నరుడు నిమ్మగ రణరంగము నందున్!
రాక్షసులను మఱి వధింపగలడూ? రావణ! మానుము వైరమునూ! 22

వృద్ధులైన మంత్రులును దల్లియును వివరముగా నీ విధమునసూ!
యెంతగాను బోధించిన గూడను సుంత వినడుగా రావణుడున్!
ధనమునందు నాసక్తిని గలిగిన దగ లోభియు ధనసంపదనూ!
యెటుల విడువజాలడొ! యటులే నిను విడువజాలకున్నాడు సఖీ! 23

మైథిలి వినుమా! యో రావణుడును మానుగ యుద్ధము నందుననూ
మరణము నొందక నిన్ను విడుచుటకు మఱి గోరుట లేదిది నిజమూ!
మంత్రి సహితుడగు రావణు క్రూరుని మదిలో గూడిన నిశ్చయమూ!
తల్లి జెప్పినా, మంత్రులు దెలిపిన మానుగ మూర్ఖుడు వినడు గదా! 24

ఈ కారణమున మృత్యువు సందున నిమ్మగ యాసక్తియు గలిగీ!
ఈ యాలోచన మృత్యువు కొఱకే యింపుగ గలిగిన దాతనికీ!
రణమున సదుస్త సైన్యము దోడను రహి మరణించిన బిమ్మటనే
నిను విడుచును మఱి భయము జేతనూ నిను విడ సిద్ధము లేడు సుమా! 25

అసితేక్షణ! ఓ జానకి వినుమా! యలరి నాడు ప్రియ వాక్యములన్!
రణమువందు నిశితములగు శరముల రావణుని వే వధియించీ!
అన్ని విధములను సుఖముల గూర్పను నా యయోధ్యకు మఱి నిన్నున్
గొనిపోగలడు సుమా! శ్రీరాముడు జానకి! యిది నిజముగ జరుగున్! 26

అంత లోపలను సమస్త సేనల వింతగ ధ్వని వినిపింపగనూ!
భేరీ ధ్వనులును వినిపించెను మఱి భీకర శబ్దంబుల తోడన్!
ధరణీ తలమును గంపింపగనూ దారుణ శబ్దము వినిపించెన్! 27

ఆ వానర సేనా శబ్దంబును నట విని లంకను గల యట్టి
రావణు భృత్యులు దేజంబును మఱి రహి వారల ధైర్యంబులునూ
శమించి పోయెను దైన్యము జేతను నయముగ వారల చేష్టలునూ!
దైన్య పరీతములగు చేష్టలతో దగ నుండిరి నిశ్చేష్టులునై!
రాజు జేసినా యపరాధమునకు రహి లంకాపురి వాసులునూ!
తమ శ్రేయస్సును గోలుపోయిరీ తమ జీవన సౌభాగ్యంబున్!

(యుద్ధకాండమునందు 34వ సర్గము సమాప్తము)

* * *

## యుద్ధకాండము - మొదటి భాగము

### ముప్పది యైదవ సర్గము

[మాల్యవంతుడు లంకలో గనబడుచున్న దుఃశకునములనుగుఱించి జెప్పి, రామునితో సంధి జేసుకొనుమని రావణునకు బోధించుట.]

మహా బాహువును బరపురంజయుడు మానుగ దశరథ తనయుండున్!
ఆ శ్రీరాముడు శంఖధ్వనితో నలరెడి భేరీ నాదములన్!
ఆ రావణునీ మద మడగింపగ యా లంకా పురమున కొచ్చెన్! 1

అటుబిమ్మట యా రాక్షసేశ్వరుడు నా రావణుడును నా ధ్వనినీ!
విని ముహూర్తకాలమున ధ్యానమున విగత చేష్టుడై మంత్రులనూ!
వీక్షించెను మఱి క్రోధపూర్ణుడై వికల మానసుండై బిదపన్! 2

అటుబిమ్మట నా మహాబలుండును నలరు జగత్సంతాపుండున్!
క్రూరుడు మఱి రాక్షసరాజయినా యా రావణుడు క్రోధముతో!
అచ్చటగల మంత్రులతో బలుకుచు నా సభయంతయు ధ్వనింపగన్!
నా మంత్రుల నిందించుచు బలికెను నలరు క్రోధమగు వాక్యములన్! 3

ఆ శ్రీరాముడు నా సాగరమును నలరి దాటుటయు విక్రమమున్
బల పౌరుషములను నతిశయోక్తిగా నలరి దెలుపుటయు నే వింటిన్!
రణమునందు నా సత్యపరాక్రమ రాముని బలమును దెలిసియునూ!
తూష్ణీభావముతో నన్యోన్యము దోరముగా గనుచును మీరున్!
నున్నారను విషయంబును గూడను జెన్నుగ నాకును దెలియు సుమా! 4-5

అటుబిమ్మట నా సుమహాప్రాజ్ఞను నల మాతామహుడును నైనా!
మాల్యవంతుడను రాక్షసుండునూ మానుగ రావణు వచనములన్!
విని యీ రీతిగ వలికె నాతడును విమల నీతి వచనంబులనూ! 6

ఏ నరేంద్రు డిల విద్యలయందును నిమ్ముగ వినీత శిక్షణయున్!
బొందినాడొ మఱి నీతిశాస్త్రమును నంది యనుసరించునొ వానిన్!
చిరకాలము నైశ్వర్యము లందును చిరకాలము బాలించు భువిన్
శత్రువులను వశమందు నుంచుకొను శాత్రవ భీతియు లేకుండన్! 7

కాలముచే శాత్రవులను గూడీ సంధి జేసికొనునో మఱియున్
విరోధమును మఱి జేయుచుండునో వికల మానసుండును గాకన్!
అట్టి రాజు దన పక్షంబునకును గట్టి యభ్యుదయమును బొందున్!
మహదైశ్వర్యంబుల సాధించును మానుగ దనదు సుకార్యములన్! 8

శత్రువుకంటెను దుర్బలుండు మఱి సమానమగు బలమును గానీ!
నున్నయపుడు దన శత్రువుతోడను నొనరగ సంధియు జేయవలెన్!
అవమానింపగ రాదు సుమా! మఱి యాతని మన్నన జేయవలెన్!
దానే శత్రువుకంటె యధికముగ దగ బలీయునిగ యుండినచో
విరోధమును గొనసాగింపగ వలె విజయము నొందగ నాతనిపై! 9

ఆ కారణమున దశాననా! విను! నా రామునితో సంధియునూ!
జేసికొనుట మంచిది యనుచును నే స్థిరముగ దెలుపుచు నుంటి నిదే!
ఏ సీతను నందగ శ్రీరాముడు నిమ్ముగ వచ్చెనొ దండెత్తి!
ఆ సీతను నా శ్రీ రామునకును నలరి యిమ్ము! సత్కృతితోడన్! 10

సమస్తమగు దేవతలు, ఋషులునూ సరి గంధర్వులు యక్షులునూ!
రాముని విజయము గోరుచు నుండిరి రహి నీ యపజయమును గూడన్!
శ్రీరామునితో విరోధంబునూ జేయకుమా! ఓ దశాననా!
యిష్టపడుము! మఱి సంధి జేసికొను గష్టము దేకుము లంకకునూ! 11

భగవానుండును బితామహుండగు బ్రహ్మదేవుడును బూర్వమునన్!
దేవతలయు, నసురుల బక్షంబులు దీరుగ సృజియించెను రెండున్!
ధర్మా ధర్మంబులు రెండును మఱి దగవారలనూ గూడికొనీ
యుండుననియు శాసించెను బ్రహ్మయు నిండుగ దన శాసనమందున్! 12

మహాత్ములగు దేవతల బక్షమున మానుగ ధర్మము యుండుననీ!
వినబడుచున్నది రావణ! వినుమా! గనగా నధర్మ పద్ధతులున్!
అసురుల యందున రాక్షసులందున యలరి యుండునని వినగబడున్! 13

ధర్మంబును మఱి యధర్మంబునూ దగ మ్రింగునొ యెపుడో నపుడున్!
కృతయుగంబు నావిర్భవించు మఱి నీతి నిలుచు నీలోకమునన్!
అధర్మంబు మఱి నా ధర్మంబును నటు మ్రింగునొ యెపుడో నపుడున్!
కలియుగంబు మఱి బ్రవర్తించునూ విలయమగును ధర్మంబులునూ! 14

అందుచేత లోకంబు నందునను నలరి చరించెడి ధర్మంబున్!
నశింపగను జేసితివి రావణా! నయముగ యధర్మమును గూడన్!
స్వీకరించితివి స్వయముగ రావణ! చేటువచ్చె కులమున కంతన్!
అందున శత్రులు మనకంటెను మఱి జెందుచు నుండిరి బలముగనూ! 15

నీవు జేసినా ప్రమాదంబునను నిలకడ నొంది యధర్మంబున్
మన రాక్షసులను మ్రింగుచునున్నది మానుగ వృద్ధియు నొందుచునూ!
సురలకు ననుకూలంబై మఱియును సురల పక్షమును వేగమునన్!
వృద్ధిని బొందించుచు నున్నది సుమ! శ్రద్ధగ బరికించిన దెలియున్! 16

విషయ భోగముల నాసక్తుడవై వికృతగతి నీవేమేమో!
చేయుచున్న చేష్టలను గనుచును స్థిరసంకల్పులు మహాత్ములున్!
అగ్నికల్పులగు ఋషులకు గూడను నతిభయంబు గల్పించితివి! 17

ప్రజ్వలించు నగ్నులకును బోలెను బన్నుగ ఋషుల ప్రభావంబున్!
ఎదిరింపగ శక్యంబు గానిదీ మది నూహింప నశక్యంబున్!
భావితాత్ములగు వారి మనస్సులు బహు పవిత్రములు దపస్సుచే!
ధర్మంబును బెంపొంద జేయగా దగ యాసక్తియు గలవాడున్!
ఈ ద్విజులును యజ్ఞములు జేయుచును నిమ్ముగ యగ్నుల హోమములన్!

జేయుచు నుందురు యథావిధిని మఱి స్థిరవాక్యములగు వేదములన్!
బఠించుచుందురు రాక్షసులను మఱి బన్నుగ దిరస్కరించుచునూ!
వేద ఘోషలను జేయ రాక్షసులు వేగముగా గ్రీష్మము నందున్!
మేఘంబులవలె పారిపోవుదురు మెఱుపు దీవెలను బోలె నటన్! 18-19-20

అగ్నికల్పులగు ఋషుల యొక్కయును నగ్నిహోత్రముల లేచిన యా
ధూమంబులు దశదిశల వ్యాప్తమై ధూర్తులైన యారాక్షసులన్!
సుతేజస్సులను హరించు రావణ! సురుచిరమగు నా శక్తులచే! 21

పుణ్యమైన యజ్ఞములను జేయగ పూర్ణమైన నియమంబులతో
ఆ యా దేశములందు ఋషులునూ యలరి జేయు దపసుల జేతన్!
రాక్షసులందఱు దపించిపోదురు రయమున యగ్నుల ధూమములన్! 22

దేవదానవుల యక్షుల నుండియు దీరుగ భయమును లేకుండన్
వరముల గొంటివి! దశాననా మఱి బన్నుగ విక్రమ వంతులునూ!
మహావీర్యులును సగు మానవులును మానుగ గోలాంగూలములున్
భల్లూకంబులు వానరులును మఱి బన్నుగ గర్జించుచు నుండెన్! 23-24

అనేక విధముల యుత్పాతంబులు నదేక విధ దుశ్శకునంబుల్!
ఘోర విషయములు గనబడుచున్నవి గూలుచు పశువులు, బక్షులునూ!
సమస్తమగు రాక్షస సంతానము సకల రాక్షసుల బలంబునూ
వినాశంబు మఱి బొందుననుచునూ విగతమగుచు నుండెను మదిలో! 25

పరుషమైన గర్జనలను జేయుచు బహు వికృత రూపంబులతో
భయంకరంబగు మేఘంబులునూ బన్నుగ లంకాపురి యందున్
శీష్ణరక్తమును వర్షించుచునూ యుష్ణ వాయువులను వీచెన్! 26

గజములు, నశ్వంబులును నేడ్చుచును గన్నీటిని మఱి ధారలుగా
గొలుకుచునున్నవి దిక్కులన్నియును ధూళి రేగుచున్నటులుండెన్!
గజాశ్వములు మఱి దుమ్ముగొట్టుకొని కాంతి చెడినవై కనిపించున్
పూర్వమువలె యుత్సాహము తోడను బొలుపుగ కనిపించుట లేదూ! 27

మాంసంబులు దిను క్రూరమృగంబులు మాచుగ నక్కలు గ్రద్దలునూ!
భయంకరముగా నఱచుచు నున్నవి బన్నుగ దుఃఖము దోడుతనూ!
లంకలోపలను బ్రవేశించియును శంకలేక యుద్యానములన్
పంపులు గుంపులుగా జెరుచునూ ఘోషిల్లుచు నున్నవి యటనూ! 28

నల్లని యాకారముగల స్త్రీలును బెల్లున కేకలు వేయుచునూ!
ప్రతికూలముగా మాటలాడుచును బ్రవేశించి గృహముల యందున్!
ఆభరణంబులు దొంగిలించుచునూ నట యెదుటను నిలబడువారై
తెల్లని దంతంబులు గనబడునటు దీరుగ పకపక నవ్వుచునూ!
కనిపించుచు నుండిరి కలలందున కమ్మని చల్లని రాత్రులలో! 19

దేవతలకు నర్పించిన బలులను దీరుగ కాకులు గాకుండన్!
శ్వానంబులు మఱి దినుచున్నవిగద! సరసత దప్పిన కార్యంబుల్!
కపిల గోవులకు ఖరసంతానము గలుగుచు నున్నవి దశాననా!
ముంగిసలకు మఱి మూషికంబులును రంగుగ జనించు చున్నవిగా! 30

మార్జాలంబులు బులుల తోడనూ మానుగ పందులు కుక్కలతో
కిన్నరులును మఱి రాక్షసు లచ్చట క్రీడలు సలిపిన యట్లుగనూ!
రాక్షసులును మఱి మనుష్యులును నట రమ్యముగా గ్రీడించునటుల్
కనిపించుచు నుండిరి కలలందున కమ్మని చల్లని రాత్రులలో! 31

పాండురములు మఱి రక్తపాదములు బన్నుగ గలిగిన కపోతముల్
కాలచోదితములై విహరించుచు గగనము నంతయు గప్పుచునూ!
రాక్షస వినాశమును సూచించుచు రమ్యముగా నెగురుచు నుండెన్!
ఇవియన్నియు యపశకునంబులు సుమ! యివి సూచించును నాపదలన్! 32

గృహములలో గల గోరింకలునూ కూర్చి యితర పక్షులచేతన్!
జయింపబడి నీచీ కూచీతీ చయ్యన రోదన శబ్దములన్!
చుట్టబెట్టుకొని సముదాయముగా నిట్టి ధరణి బడునుంటెనుగా! 33

సమస్తంబునగు మృగ పక్షులునూ సరి సూర్యునకును నెదురుటన్!
మోరనెత్తి మఱి యేడ్చుచు నున్నవి మోసమేదొ మఱి జరిగినటుల్!
భయంకరుండును, వికృత రూపుడును బరుషుడు, ముండుడు నగువాడన్!

ధూమ్రవర్ణమున నున్నవాడునూ ఘోరము మృత్యువు కాలుండున్!
సాయం ప్రాతః కాలము అందున సకల రాక్షసుల గృహములునూ!
అన్వేషించు నున్నవాడు గద! యందఱి కనులను గనబడుచున్!
ఇవియే గాకను దుశ్శకునంబులు నింకను గనబడు చున్నవిగా! 34-35

రాముని మనుష్య సంబంధమునను రమ్య రూపమును ధరించినా
విష్ణువుగా మా హృదయము అందున విమలముగా దలచెద మెపుడున్!
దృఢ విక్రముడగు నా రఘురాముడు ధీరుడు నరశ్రేష్ఠుండు మఱిన్
సాధారణమగు మనుష్య మాత్రుడు సహజముగా మఱి కాడుగదా!

సముద్రమందున బరమాద్భుతమగు సాంద్ర సేతువును నిర్మించెన్!
నరేంద్రుడగు శ్రీ రఘువీరునితో నయముగ సంధిని జేయుమికన్!
జేయదగిన కార్యమును దెలిసికొని జేయదగినదియు నిర్ణయమున్
జేసి, భవిష్యత్ కాలము నందున శ్రేయస్కరమును బొందుమికన్!36-37

శ్రేష్ఠులైన మంత్రులలో శ్రేష్ఠుడు శ్రేయస్కరమగు బుద్ధియునూ!
గలిగియు నుత్తమ బౌరుషంబునూ బల వీర్యంబులు గలవాడున్!
మాల్యవంతుడును రావణు దోడుత మానుగ యీ విధమున బలికి
ఆతని ముఖ వర్ణంబును గనుచును యతని భావముల గనుగొనుచున్!
ఆతని వైపు నొక మారు గాంచుచును నట గూర్చుండెను మౌనముగా! 38

(యుద్ధకాండమందు 35వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# యుద్ధకాండము - మొదటి భాగము

## ముప్పదియారవసర్గము

[రావణుడు మాల్యవంతుని యుపదేశంబును దిరస్కరించుట—నగర ద్వార రక్షణమునకై మంత్రులను నియోగించి గృహములోనికి బోవుట]

దుష్టబుద్ధి గల రావణాసురుడు దోషయుక్త కాలంబునకున్!
వశమును బొందినవాడై శీఘ్రము వరియించెను మృత్యువు నతడున్!
మాల్యవంతుడును బలికినట్టి యా మధుర హితమునగు వచనంబున్!
సహింపలేదూ! కాదు పొమ్మనెను సరస వాక్యముల వినలేదూ! 1

ఆ రావణుడును గ్రోధవశుండై నల ముఖమున భ్రుకుటిని గూర్చి
క్రోధమువలనను గనులు ద్రిప్పుచును కూడిన మాత్సర్యము తోడన్!
మాల్యవంతునీ నిరాకరించుచు మండిపడుచు నీవిధి బలికెన్!
పర పక్షంబున బ్రవేశించితివి పరమ హితంబని బలుకుచునూ!
పరుషముగా బలికిన మీ పలుకులు బన్నుగ నాచెవి కెక్కవుగా! 2-3

రాముడు మానవమాత్రుడు సుమ్మా! రహి దీనుడు, వంటరి వాడున్!
వానరులను మఱి యాశ్రయించెనూ వరుసగ యడవుల దిరుగుచునూ!
తండ్రిచేత విడువగబడి యాతడు దగ వన వాసము జేయుచునూ!
యున్నవానినీ సమర్థుండునని నొప్పగ యెటు భావింపదగున్? 4

రాక్షసకోటికి యీశ్వరుండనూ రహి దేవతలకు భీకరుడున్
అట్టి నన్ను బహు బరాక్రమంబుల నిట్టె విరాజితుడను నన్నున్!
తక్కువ గుణములు గలవానిగా దలచుచుంటివీ నిక్కముగన్!
ఏ కారణమున దలచుచుంటివీ? యెందుల కిటు భావించితివీ? 5

సజాతీయుడగు వీరుని విషయము సహింపలేకనా! యనూయనో!
శత్రువుమీదను బక్షపాతమున శౌర్యము లేకను గ్రుంగుటనో?
నిన్నేమియు గోపముతో బలుకక మిన్నకుండుటయు గారణమో?
యీ విధముగ బరుషముగా బలుకుచు నిమ్ముగ యుంటివి యవి దలతున్! 6

శాస్త్ర తత్త్వమును దెలిసినవాడును సహజ పండితుడు నగువాడున్!
వెనుక నుండి ప్రోత్సాహము లేకను వినుతి కెక్కినా పదస్థునీ
ఈరీతిని మఱి బరుష వాక్యములు నిమ్మగ మాటాడున జెపుమా? 7

పద్మహీన యగు శ్రీలక్ష్మికివలె బన్నగ యుండిన యాసీతన్
వనమునుండి నే దీసుక వచ్చితి వరించి యామెను బెండ్లాడన్!
ఆ రఘురాముని భయము వలన నే యలరి యిచ్చుటయు నెందులకూ? 8

కొన్ని దినములను జూడుము! రాముని కూరిమి తమ్ముని లక్ష్మణునీ
వానర సమూహముల గూడిన యా వనరగ యా సుగ్రీవు మఱిన్!
వధించి వేసెద! నా ప్రతాపమును వనర దేవతలు స్తుతియింపన్! 9

ఆ దేవతలును రణరంగంబున యలరి ద్వంద్వ యుద్ధమునందున్
నిలువజాలరో! యట్టి రావణుడు నిలువక పోవున యుద్ధమునన్!
నెటుల భయబడును నా మానవునకు నిమ్మగ వానర కోటులకున్? 10

రెండుముక్కలుగ విరిగి బోవుదును ఖండములైనను నా తనువున్!
నీవు బలికినా విధమున యెవనికి నిలిచి విధేయత జూపనుగా!
ఇది నాలో గల సహజ దోషమూ! యిది నా సహజ స్వభావంబున్!
దాట శక్యమును గానిది వినుమా! బాటను వీడను నాదు మదిన్! 11

దైవ వశంబున రాముని జేతను డగ సాగరమున సేతువునూ!
కట్టినంత మాత్రమున మనంబున యిట్టి భయము జెందగ నేలా?
ఆశ్చర్యంబును నంద దగినదీ యబ్బురంబు మఱి లేదుగదా! 12

వానర సేనను గూడివచ్చినా వచ్చిన రాముడు మఱి దిరుగన్!
ప్రాణంబులతో మఱలి పోడుగద! బన్నగ జీవము గలవాడై!
ప్రతినజేసి మఱి దెలుపుచు నుంటిని బరగ సత్యముగ నిది జరుగున్! 13

ఈ విధముగ సంరబ్ధ భావమును యిమ్మగ బలికెడు రావణునిన్!
గోపించిన వానినిగా మదిలో గూరిమి దలచుచు నా తండున్!
మాల్యవంతుడును సిగ్గును బడుచును మఱి మాటాడక యటులుండెన్! 14

ల్యవంతుడుచు నా రావణుని మానుగ యాశీస్సుల జేతన్!
యి! విజయీభవ!' యను వాక్యములను జయము గోరుచును దగురీతిన్!
భినందించుచు నాజ్ఞ దీసికొని యల దన గృహమునకును బోయెన్! 15

ంతట రాక్షసుడైన రావణుడు జెంతకు బిలిచి మంత్రులతో
ంతనములు సాగించెను వారలు చింతనంబులును గ్రహియించెన్!
ర్తవ్యంబును నిర్ణయించెనూ కాతర భావము లేకుండన్!
ంకాపురికిని రక్షణమునకును లావగు నేర్పాటులు జేసెన్! 15

ూర్వ ద్వారమున బ్రహస్తు డనియెడి దోరముగా సేనాపతినీ!
యమించెను దక్షిణ ద్వారముననుు నిఖిల పరాక్రమ వీరులనూ.
హా పార్శ్వుని మహోదరుని మఱి మహాబలుల వే నియమించెన్! 17-18

టుబిమ్మట బశ్చిమ ద్వారముననను ననేకమాయలు గలిగిన యా
నేక రాక్షసులను గూడిన యా నలరు బుత్రుడగు నింద్రజితున్!
లిపెను బశ్చిమ ద్వారము నందున నిఖిల శత్రువుల నెదిరింపన్! 17-18

ంకాపురి కుత్తర ద్వారంబున వంకలేని శుకసారణులన్!
యమించియు మంత్రులతో బలికెను నిరవధికంబగు గర్వముతో!
నేను గూడ నచ్చటికి బోయెదను నిఖిల శత్రువుల జెండాడన్!' 19

రాక్రమవంతుడు వీర్యవంతుడును విరూపాక్షుడును రాక్షసునీ!
క్రమవంతులు నగు రాక్షసులను జక్రము వలె సైన్యముమధ్యన్
్యూహరూపమున నిలిపెను నచ్చట యుూహకు నందని విధముననూ! 20

వణు డీ విధమున లంకాపురి రక్షా విధానమును నియమించీ!
నాశకాలము దాపురించుటను వికృత కార్యములను జేసీ!
ృతకృత్యుండైనట్లు భావమున మతిస్థిరుడై యా రాక్షసుడున్! 21

పుర రక్షణమును జేయుటకొఱకై పుష్కలమగు నేర్పాటులనూ
ఆజ్ఞాపించియు నటు పిమ్మట మఱి యలరి మంత్రులను బొమ్మనెనూ!
మంత్రిగణముచే జయాశీస్సులను మానుగ గైకొని తరువాతన్!
అఖిల భోగముల నిలయమైన దన యంతఃపురము బ్రవేశించెన్! 42

(యుద్ధకాండములోని 36వ సర్గము సమాప్తము)

* * * *

## యుద్ధకాండము - మొదటి భాగము

### ముప్పది యేడవ సర్గము

(లంకా రక్షణమునకు రావణాసురుడు జేసిన యేర్పాటులను గుఱించి విభీషణుడు శ్రీరామునకు దెలుపుట - లంకాద్వారములను నాక్రమింపుడని శ్రీరాముడు వానరసేనా నాయకులకు దెలుపుట)

నరరాజగు శ్రీరామ చంద్రుడును నయముగ వానర ప్రభువైనా
సుగ్రీవుండును, వాయుకుమారుడు శూరవరుడు హనుమంతుండున్!
భల్లూకంబులకును రాజయినా బరగ జాంబవంతుండు మఱిన్!

రాక్షసుడగు నా విభీషణుండును రహి యంగదుడును లక్ష్మణుడున్!
శరభుండను వానరుడు మఱియునూ సహ దాయాదుల గూడిన యా
సుషేణుడును మఱి మైందుడు ద్వివిదుడు శూరుండగు గజుడును మఱియున్
గవాక్షుండు, గుముదుడు మఱి నలుడును నయముగ పనసుడు కపివీరుల్!

శత్రుదేశమును బొందిన వారై సరసత యొకచోటను జేరి
లంక నెటుల సాధింపగ వలెనో శంకలేక యా రావణునీ!
ఎటుల జయింపగ వలెనో యనుచును బటు యోచనలను జేసి రటన్!1-2-3

రావణుచే బాలింపగ బడెడీ రహి లంకాపురి యిదియె సుమా!
అసురులు, నరగులు, గంధర్వులునూ యల దేవతలకు గూడ మఱిన్!
పర్జయమైనది జొరరానిదియునూ దోర్బల రాక్షస నిలయమదీ! 4

కార్యసిద్ధికై కడు శీఘ్రముగా కార్య నిర్ణయము జేయుడికన్!
ఆలోచింపుడు! నన్ని విషయములు సాలోచనముగ వివరముగన్!
రాక్షసాధిపుండైన రావణుడు రహి యీలంకాపురి యందున్
నిత్యము నిట వసియించుచు నుండును నిఖిలము గాంచుచు బహు శ్రద్ధన్! 5

అటుబిమ్మట వారలు నా విధమున యాలోచన జేయుచు నుండన్!
రావణు దమ్ముడు విభీషణుండును రమ్య వచనముల నిటు పలికెన్!
గ్రామ్య పదంబులులేని పూర్ణమగు గడు నర్థముగల వాక్యములన్! 6

నా యమాత్యులగు అనలుడు, పనసుడు నయముగ సంపాతియు బ్రమతీ!
లంకాపురి జవి మఱలివచ్చిరీ శంకలేక యన్నియు గాంచీ!
వారందఱు పక్షుల రూపములను బన్నుగ ధరియించిరి మఱియున్!
శత్రుసేనలను బ్రవేశించిరీ శత్రుల వ్యూహములన్నియునూ
యేర్పాటుల మఱి గాంచి వచ్చిరీ యిమ్ముగ రావణు యత్నములన్! 7-8

ఓ రఘువీరా! దురాత్ముండు నగు నొప్పుగ రావణు యత్నములన్!
వారు తెలియజేసిరి జూచినదీ వారుగన్నదియు నా లకంకన్
ఆ మంత్రులు దెలిపిన విషయములను యథాతథముగా దెలిపెదనూ!
సావధానముగ విను! శ్రీరామా! సచివులు దెలిపిన దంతయునూ! 9

ప్రబలుడైన యా ప్రహస్తుండునూ బన్నుగ తూరుపు ద్వారమునన్!
మహావీర్యులగు మహాపార్శ్వుడును మహోదరుండను రాక్షసులున్!
దక్షిణ ద్వారము వద్ద నుండిరీ దగ రక్షించుచు నాలకంన్! 10

రావణాత్మజుడు నింద్రజిత్తునూ రహి పట్టిసములు, ఖడ్గములన్!
ధనుస్సులును మఱి శూల ముద్గరము దారుణ యాయుధముల గూడి!
అసంఖ్యాకులగు శూరుల తోడను నలవిగాని బలముల తోడన్!
పశ్చిమ ద్వారము నందు నుండెనూ బన్నుగ లంకను రక్షింపన్! 11

మంత్ర విదుండగు దశాననుండును మఱి శస్త్రములను ధరించినా!
వేలకొలది రాక్షసులను గూడుక విపుల బలంబులతో గూడన్!
స్వయముగ ఉత్తర ద్వారమునందును కయ్యము జేయగ నిలుచుండెన్!
అతడు నాతని బరివారంబును నతి దీనతతో గనిపించెన్ 12-13

విరూపాక్షుడను రాక్షస వీరుడు విమలమైన శూలంబులనూ!
ఖడ్గంబులు ధనుసులు ధరించినా ఘన సైన్యముతో గూడికొనీ!
సేనామధ్యము నందు నుండెనూ చెదరక బెదరక ధీరతనూ! 14

నా సంబంధమునైన మంత్రులును నయముగ యీ విధ విషయములన్!
సేనా నివేశములను వ్యూహముల శీఘ్రముగా జని యచ్చటనూ
మఱల దిరిగి వచ్చిరి యిచ్చటకును మానితమగు నా యాజ్ఞలనూ!

రణమున బరాక్రమములను జూపెడి రథికులు బది వేలును మఱియున్
గజముల నధిరోహించి యోధులును గలరట రామా! పదివేలున్!
రెండు వేల మందియు నశ్వికులును దండి విక్రములు గలరు మఱిన్!
బలవంతులు మఱి క్రూర పదాతులు బన్నుగ కోటికి పైగలరూ!
ఈ నిశాచరులు నందఱు రావణు నిష్టులు, ప్రియముగువారు సుమా! 16-17

ఓ రఘురామా! యీ రాక్షసులను నాకొక్క రాక్షసునకు మఱియున్!
పదిలక్షల బరివారము నుండును బన్నుగ యుద్ధము జేయుటకున్!
సహాయకులుగా నుందురు రణమున సరసత వారి యధీనతనూ! 18

మహా బాహువగు విభీషణుండును మంత్రులచే జెప్పగ బడినా
విషయమంతయును లంకయందు గల వివిధ వార్తలును దెలియునటుల్!
ఆ శ్రీరామునకును దెలిపియు మఱి నటు బిమ్మట యా మంత్రులనూ
రామచంద్రునకు జూపెను వారల రహి యసత్యమును గాకుండన్! 19

శ్రీమంతుండగు విభీషణుండును శీఘ్రము లంకాపురియందున్!
గలిగిన వార్తల రామచంద్రునకు చెలగి తనదు సచివుల తోడన్!
తెలియబరుపగా జేసియు మఱియును దీరుగ ప్రియమును గూర్పగనూ!
మఱల విభీషణు డీ విధి బలికెను మర్మముగా శ్రీరామునితో! 20

రాక్షసేంద్రుడగు రావణాసురుడు రహి కుబేరుపై రణమునకున్!
బోవునపుడు మఱి రాక్షస సైన్యము బొందుగ యఱువది లక్షలునూ
జయనమైరి, వారందఱు గూడను బన్నుగ పరాక్రమము జేతన్!
ధైర్యము జేతను, దేజస్సులనూ విపుల బలాధిక్యము జేతన్
దుర్మార్గుండగు రాక్షసేంద్రునకు విరాజిల్లుదురు దగిన విధిన్! 21-22

శత్రుబలము వర్ణించినందులకు క్షమియింపుము నను రఘువీరా!
నీకును గోపము దెప్పించుటకై నిఖిలము దెలిపితి నీ రీతిన్!
అంతియగానీ భయపెట్టుటకును వింతగ దెలుపగ లేదు సుమా!
పరాక్రమముచే సురలను సైతము బరగ జయింప సమర్థుడవున్! 23

ఆ కారణమున వానర సేనను వరుసగ వ్యూహములను జేసీ!
రథ గజ తురగ పదాతి దళములను రహి గలిగిన యా రావణునిన్!
ఆ దశాననుని మథించి వేతువు నాలస్యం బింతయు లేకన్! 24

రావణు దమ్ముడు విభీషణుండును రణధీరుడు శ్రీరామునకున్!
ఈ విధంబుగను బలుకుచు నుండగ యిమ్ముగ శ్రీరాముడు వినియున్!
శత్రు సమూహము నెదుర్కొనుటకును సరసముగా నీవిధి బలికెన్! 25

లంకా నగరము తూర్పు ద్వారమున శంకలేక నీలుండు మఱిన్!
బహు కపివీరుల గూడినవాడై ప్రహస్తు రాక్షసు నెదిరించీ!
యుద్ధము జేయగ వలయు సుమా! మఱి సిద్ధము గమ్మని దెలుపు మిశన్!

లంకాపురి దక్షిణ ద్వారంబున శంకలేక యంగదుడు మఱిన్!
బహు సైన్యమును గూడినవాడై మానుగ విక్రమమును జెలగన్!
బహు పార్శ్వునీ, మహోదరుని నిల మఱి యెదిరింపగ వలయు సుమా!27

పవనాత్మజుడును నప్రమేయమగు బన్నుగ యాత్మయు గలవాడున్!
హనుమంతుడు బహు కపివీరులతో విమతింపగ సురలును గూడన్!
పశ్చిమ ద్వారంబును బీడించియు బన్నుగ లంకాపురి జొచ్చెన్! 28

దైత్యదానవుల సముదాయములకు దగ మహాత్ములగు ఋషులకునూ!
విప్రకార ప్రియుడైన వాడునూ వికలుడు క్షుద్రుడు, నీచుడునూ!
వరదానములను బలాన్వితుండును వనరగ ప్రజ బీడించుచునూ!
సర్వలోకముల సంచరించుచును సాటిలేని మేటిని యనుచున్
అట్టి దశగ్రీవుని వధింతునని యరమరలేకను స్వయముగనే
వధింప వలెనను దృఢ నిశ్చయమును వనరగ జేసితి నిదివఱకే

కావున లక్ష్మణు సహితుండనునై కడు బలములతో గూడికొని
రావణుడుండెడి యుత్తర ద్వారము రయమున బీడించుచు నేనున్!
ఉత్తర ద్వారము లంక జొచ్చెదను చిత్త ప్రతిజ్ఞయు నెఱవేరన్! 29-30-31

బలవంతుండగు సుగ్రీవుండును బరగ జాంబవంతుండు మఱిన్
రాక్షసేంద్రుడగు రావణు దమ్ముడు రహి విభీషణుండును నలరన్
మధ్యనున్న సైన్యములో నుందురు మానుగ సర్వము గనుగొనుచున్! 32

ఆహవ మందున వానరు లెవ్వరు నలరి మానవుల రూపంబున్!
ధరింపగూడదు వానరులారా! దగ దెలుపుచు నుంటిని యిదియే!
ఈ యుద్ధంబున కపిసైన్యంబున యిదియే గుర్తుగ తెలియవలెన్! 33

మనవారందఱు గపివీరులుగా మానుగ నుండుట చిహ్నముగా!
నుండును మఱి ఘనదేజోవంతుడు దండి వీరుడగు లక్ష్మణుడున్!
నేను మఱియు నా విభీషణుండును వినయవంతులగు నాతని యూ
నలుగురు మంత్రులు నేడుగురము మఱి నయముగ మనుష్య రూపములన్!
రణరంగంబున శత్రుబలముతో రణము జేసెదము వినుడింకన్! 34-35

మతిమంతుండును ప్రభువును నైనా మానుగ యా రఘు వీరుండున్!
విభీషణునితో బలికి యీ విధము విమల సువేలా బర్వతమున్!
సుందరమగు నాచరియను గాంచీ నందములను బరికించుచునూ!
లంకను జాగుగ పరిశీలింపగ శంకలేక యా పర్వతమున్
అధిరోహింపగ బుద్ధిని నిలిపెను అధికంబగు నాసక్తి మదిన్! 36-37

౦ బిమ్మట యా మహాత్ముండునూ యధిక ధైర్యమును గలవాడున్!
ఘువీరుడు మహాసేనచే నలరుచు సమస్తమగు ధాత్రిన్!
౦ వేయుచును సంతోషించుచు నలరి శత్రువుల మదయింపన్!
వైపు జనియెను శ్రీరాముడు శంకలేక నిసుమంతయునూ! 38

(యుద్ధకాండములోని 37 వ సర్గము సమాప్తము)

★ ✸ ★ ★

## యుద్ధకాండము - మొదటి భాగము

### ముప్పది యెనిమిదవ సర్గము

[రామలక్ష్మణులు వానర ముఖ్యులతో గలిసి సువేల పర్వతము రోహించుట]

క్ష్మణానుగతుడైన రాముడును లాలిత సువేల గిరి నెక్కన్
యించి మది దగ యనుచరుడును నిర్మలుడగు సుగ్రీవునితో!
జ్ఞుండును, ననురక్తుండును దగ నిశాచరుడు మంత్రజ్ఞున్!
స్త్ర విధిని యెఱిగినవాడును మఱి సకలము నెఱిగిన విభీషణున్!

మధురమునగు బరమ వాక్యమున సదయాక్షరముల నిటు పలికెన్!
లకొలదియు ధాతువులను మఱి యందమైనదీ పర్వతమున్!
సువేల పర్వతము నెక్కెదము నిమ్మగ ప్రకృతి గనుగొనుచున్!
రాత్రికి యిట విశ్రమించుదము నింపుగ విశ్రాంతిని గొనుచున్! 3

త్మతగు నా రావణాసురుడు దూరాలోచన లేకుండన్!
మరణము గోఱకే నా భార్యను దగ యపహరణము గావించెన్!
ంబును, సచ్చరితము, కులమును దగ బరిశీలింపక మదిని

నీచమైన రాక్షస బుద్ధిని యీ నీచకార్యమును దా జేసెన్!
అట్టి రావణుని నివాసమైనా యీ లంకను బొడగాంచెదమూ! 4-5

నీచుడైన యెవ్వని యపరాధము నిఖిల రాక్షసుల వధ యందున్
కారణ మాయెనొ యట్టి రాక్షసుని గల నామంబును వినబడగన్!
కోపము గలుగుచు నున్నది మదితో క్రోధంబును గలుగుచు నుండెన్! 6

కాలంబునకును వశుడై యొక్కడు కర్మ బాపమును జేయంగన్!
అతడు జేసిన యపరాధమునకు నా కులమంతయు ఫలితముగా
నశించు మఱి పలుబాధల నొందును నయముగ యపకీర్తియు నొందున్! 7

రావణు నందున గోపము గలిగిన రాముడు పైవిధమున బలికి!
విచిత్రమగు చరియలను గలిగినా విమల సువేలా పర్వతమున్!
సమీపించి శ్రీరామచంద్రుడును సరసత నెక్కెను గిరిపైకిన్! 8

విక్రమ రతుడగు లక్ష్మణుండునూ విమల సావధానము దోడన్!
బాణముతో గూడిన ధనస్సునూ బన్నుగ హస్తములను నెత్తి!
రాముని వెనుకను ననుసరించుచును రయమున బోయెను నడుచుచునూ!
అతని వెనుకను సుగ్రీవుండును నాతని మంత్రులు, నావెనుకన్!
విభీషణుండును బోయిరి నడుచుచు విమల సువేలా గిరిపైకిన్! 9

హనుమంతుండును నంగదుండునూ యల ద్వివిదుండును మైందుండున్
గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు, గంధమాదనుడు, బనసుడునూ!
కుముదుడు, హరుడును, జాంబవంతుడును కూరిమి రంభుడు, సుషేణుడున్
ఋషభుడు, దుర్ముఖుడును, శతబలియును భీషణులగు వానరవీరుల్!

ఎందఱెందరో వాయువేగమును జెందెడి వారలు కొండలనూ
వసించువారలు వందలకొలదియు వానర వీరులు వరుసగనూ!
రాముడు నారోహించిన గిరిపై రయమున నెక్కిరి వారలునూ! 10-11-14

వారందఱునూ యతి శీఘ్రముగా వనరగ నలువైపులనుండి
ఆ పర్వతమును నెక్కిరి కపులును నాపర్వత శిఖరము నందున్!

ఆకాశము నందున వ్రేలాడుచు నతివైభవముగ నున్న పురిన్
ఆ లంకాపురి జూచిరి కపులును నాశ్చర్యంబును నొందుచునూ! 14

శ్రేష్ఠమైన ద్వారంబుల తోడను శ్రీకరమగు ప్రాకారములన్!
పరగ ప్రకాశించెడి యా లంకను బహు రాక్షసులను నిండినదీ!
ఆ సుందరమగు లంకానగరము నలరి జూచి రా కపివీరుల్! 15

శ్రేష్ఠమైన ప్రాకారంబులపై ప్రభ్రష్టాకారంబుల తోడన్!
నల్లనిదేహపు ఛాయల తోడను నల్లన నిలిచిన రాక్షసులున్!
మఱియొక ప్రాకారంబా యనునటు మానుగ నిలువగ వారలునూ!
ఆలంకాపురి జూచిరి గపులును నాశ్చర్యమును నొందగనూ! 16

సమస్తమగు నా వానరవీరులు సరగున రణమును గోరెడి యా
ఆ రాక్షసవీరులను గాంచియును నా కపివీరులు బిగ్గఱగా!
ఆ రఘువీరుడు గాంచుచుండగా నంచితముగ జేసిరి ధ్వనులన్! 17

అటుపిమ్మట యా రవిసంధ్యలచే నరుణారుణములు జిందబడీ!
ఎఱ్ఱని ముఖమున యస్తమించెనూ జర్రున జారెను సంద్రమునన్!
పూర్ణచంద్రునీ చేత ప్రదీప్తము బొలుపగు రాత్రియు నటువచ్చెన్!
తెల్లుగ నక్షత్రములును గనబడె జల్లిన ముత్యములకు బోలెన్! 18

అటుపిమ్మట లక్ష్మణుని గూడినా యా నరాధిపుడు రాఘవుడున్!
హరి వాహినిపతి యగు సుగ్రీవుని, యల విభీషణుని జేత మఱిన్!
అభినందింపంబడి వారలునూ యతి సత్కారములను నందీ!
ఆ సువేల పర్వతమునందునను నానందించుచు సుఖముగనూ!
విశ్రమించిరీ వారలందఱును విపులమైన ప్రకృతి యొడిలో! 19

(యుద్ధకాండమునందు 38వ సర్గము సమాప్తము)

* ★ *

# యుద్ధకాండము-మొదటి భాగము

## ము ప్ప ది తొ మ్మి ద వ స ర్గ ము

(శ్రీరాముడును వానరవీరులును సువేలపర్వతము శిఖరమునుండి సువేల పర్వతమును గాంచుట).

వీరవరులైన యా హరియూథపులును విమల సువేలా గిరియందున్
నారాత్రికి యటు విశ్రమించుచును నా లంకానగరము నందున్
వనములు మఱి యుద్యాన వనములను వనరగ గాంచిరి సంభ్రమునన్! 1

అశోక చంపక వకుల తాలములు నలరెడి సాల తమాలములన్!
పనస నాగ వృక్షంబుల తోడను బన్నుగ కప్పగ బడియుండెన్!
అంతట గూడను హింతాలార్జున వింత నీప వృక్షములతో!
పుష్పించిన యేడాకుల యరటులు బొలుపుగ విచిత్ర కుసుమంబుల్!
ఎట్టని మృదువగు జిగుళ్ళు గలిగిన యితరములగు వృక్షంబులచే
అగ్రభాగముల యందు బుష్పములు నలరి యుండినా పూలతలన్
చుట్టబడిన వృక్షంబుల తోడను సుందరమగు ఉపవనములునూ!
ఆ లంకాపురి యమరావతివలె అలరి ప్రకాశించుచు నుండెన్! 2-6

అచటి వృక్షములు సుగంధములతో నలరి బరిమళించుచు నుండెన్!
అతి రమ్యములగు బుష్పంబులతో నతి మధురములగు ఫలములతో!
అలంకారములు, భూషణంబులును నల మానవులు ధరించు విధిన్
ఆవృక్షములును ధరించుచున్నవి యందచందములు జిందుచునూ! 7

చైత్ర రథముతో సమానమైనది శ్రీకర మగుచు మనోహరమై!
నందన వనమును బోలియున్నదీ విందును గూర్చుచు గన్నులకున్!
అన్నిఋతువులకు సంబంధించిన యఖిల పుష్పఫలముల నిండి
ఆ వనంబు మఱి ప్రకాశించెనూ యల రతినాథుని తోటవలెన్! 8

వన నిర్ఝరముల యందున బక్షులు వనరగ దాత్యూహములు మఱిన్
కోయష్టిభకములును నను బక్షులు కూరిమి ధ్వనులును వినబడియెన్!

నృత్యము జేసెడి నెమిళ్ళ ధ్వనియును నిమిష నిమిషమున వినబడుచున్
కుహూకుహూమనియెడి కోకిల ధ్వనులును గూరిమి వినిపించుచు నుండెన్!9

అటువిమ్మట బహు సంతోషించియు నానందించిన కపివీరుల్
కామరూపులగు వానర వీరులు గాంచిరి యావనముల యందున్!
నిత్యము మదించు విహంగంబులును నిండు దుమ్మెధల గుంపులచే
సంచరింపబడు నవియు మఱియునూ సరస పుష్ప కుంజంబులునూ!

కోకిల మూకలజేత గూడిగొని కూర్మి వహించెడి వృక్షములున్!
విహంగంబులా రుతములు గలవియు విపుల భ్రమర గీతంబులునూ!
గోరింకల ధ్వనులును గలవియునూ కూరిమి ఖంజన బక్షులయున్!
ధ్వనులను గలవియు సారసపక్షుల స్వనములు గలిగిన వనములనూ!
ఉపవనంబులను బ్రవేశించిన చపల జ్ఞానమున కపివీరుల్!

మఱికొందఱు యూథప నాయకులును హరిసేనల గుంపుల నుండీ!
నిష్క్రమించి సుగ్రీవుని జేతను చక్కగ యాజ్ఞల గైకొనుచున్!
పతాకంబులును దోరణంబులును బన్నుగ యాలంకను గాంచన్!
గుంపులు గుంపులుగా బోయిరి మఱి సొంపులు వంపులు గాంచగనూ!

మహాతేజమును గల వానరులును మానుగ వనముల జూడగనూ
ప్రవేశింపగా పుష్ప పరిమళము బూనిక ఘ్రాణేంద్రియములకున్
సుఖకరమగు వాయువులను వీచెను సురుచిరమగు నా బూతీవెల్! 14

ధ్వనులు జేయు వారలలో శ్రేష్ఠులు దగ వానరవీరులు నంతన్!
అటగల బక్షుల భయపెట్టుచు మఱి యట మృగములకును, గజములకున్
దీనములగు నట్టుగ జేయురునూ ధీరులునగు నా కపివీరుల్!
ధ్వనులజేత గంపింప జేయుచును దగ బోయిరి యాలంకకునూ! 15

మహావేగమును గల కపివీరులు మహిని జరణముల ద్రొక్కుచునూ!
బీడించుచు బోయిరి యాలంకకు దాడించుచు దమ కరములతో!
చరణోత్థితమగు బరాగంబునూ చరచర బైకిని లేచియునూ!
చాలయెత్తునకు లేచి తూగిరెనూ నరసత యాకాశంబునకున్! 16

ఆ శబ్దమునకు భయపడి పోయిన యదలి యులికిపాటును జెందీ!
భల్లూకంబులు సింహంబులు మఱి బరగ మహిషములు, గజంబులున్!
మృగములు పక్షులు గంతులువేయుచు దగ పది దిక్కు లకును బాఱెన్! 17

అంతట పుష్పములను గప్పగబడి నలరుచుండు సౌభాగ్యమునన్!
మహారజిత సన్నిభమైనదియును మానుగ శత యోజనములునూ!
విస్తీర్ణంబును గలదియు మఱియును వినిర్మలంబై నది మఱియున్!
చారుదర్శనంబైనది మఱియును చారుసుందరం బైనదియున్!

శోభా యుక్తంబైనది మఱియును సురుచిరమగు బక్షులజేతన్!
బొందగ శక్యముగానిది మఱియును నందుకొనగ రానిది బ్రజకున్!
మనసుజేతనూ నధిరోహింపగ మానుగ నలవియు గానిదియునూ!
కర్మచేత మఱి దెలుపగ నేలా? గడు యున్నతమును గగనంబున్
స్పృశించునదియును నొక్కటి యున్నది త్రికూటపర్వత శిఖరంబున్!

అట్టి శిఖరమున రావణపాలిత యాలంకయు నిర్మింప బడెన్!
దశయోజవముల విస్తారతయును దగ యిరువది యోజనములయూ,
పొడవును గలిగీ సకల శుభములను బోలుపుగ నుండెను శిఖరముపై! 20

ఆ పురి లంకను నిర్మింపగబడె యతి యున్నత భవనంబులునూ!
తెల్లని మేఘంబుల సమానమగు యుల్లము లాశ్చర్యము జెందన్
గోపురంబులను బ్రవేశించునూ కూరిమి విమానముల తోడన్!
బంగరు, వెండీ ప్రాకారములను రంగుగ దృఢమగు రక్షణలన్
శోభించుచు నుండును లంకాపురి- చూడ ముచ్చటగ నుండునటన్ 21

ప్రాసాదంబులతో విమానముల బాగుగ నలంకరింప బడీ!
యా లంకాపురియును గనిపించును నందమైన స్వర్గంబు వలెన్!
అలంకృతంబగు నా లంకయునూ యల ప్రావృట్కాలము నందున్
మేఘావృతమగు నాకాశంబున విష్ణుపదము బోలుచు నుండున్! 22

ఆ లంకాపురి యందు నిత్యమును నా రాక్షస సైన్యంబులచే
రక్షింపగ బడుచుండు నచ్చటను రమ్యమైన యొక భవనంబున్!

వేయి స్తంభముల చేత గట్టబడి విమలమైన యాకారమునన్!
కైలాసంబున గల పర్వతమున గడు చోద్యంబగు శిఖరంబున్!
ఆకాశము వలె యాకారంబును నలరు చైత్య ప్రాసాదంబున్
ఆకాశంబును నంటుచున్నదిగ యటు గనిపించును జూచుటకున్!
అది రాజేంద్రుని పురభూషణమని నలరి జెప్పబడు చుండునటన్!
రాక్షస సేనయు నిత్యము దానిని రక్షణ సేయుచు నుండు నటన్! 23-24

మనోహరంబును గాంచన వతియును మానుగ నానా ధాతువులన్!
విచిత్ర వర్ణపు బర్వతములతో విమలోధ్యానంబుల తోడన్!
అనేక విధముల బక్షులతోడను ననేక విధముల మృగములతో
కూడి యున్న దా లంకాపురియును కూరిమి యంపము చందములన్! 27

అనేక విధముల బుష్పంబులతో నలరుచుండు నుపవనములతో!
అనేక విధముల రాక్షసులును మఱి యలరి వసించుచు నుందు రటన్!
ఐశ్వర్యంబులతో గూడి యున్నదియు నలరు సమృద్ధం బైనదియున్!
ఆ దశాననుని పురి యగు లంకను అందమైన యా నగరంబున్!
కపివీరులచే గూడి రాముడును గాంచెను నా లంకా పురిసి!
వీర్యవంతుడగు దశరథ రాముడు వివిధ గృహములను గూడికొని!
యిరుకుగ యున్నా యా లంకాపురి యిమ్ముగ రాముడు బరికించెన్!
స్వర్గతుల్యమగు నగరము గాంచి సరసత హృదయము నందుననూ!
ఆశ్చర్యంబును నబ్బురపాటును నా శ్రీరాముడు బొందె నటన్! 28

మహాసేనలను గూడిన రాముడు మణి రత్నంబుల నిండినదీ!
బహు సంవిధానములు గలిగియునూ ప్రాసాదంబుల బంక్తులచే!
అలంకరింపగ బడి నట్టిదియును నలరు గొప్ప యంత్రంబులతో
గూడిన కవాటములు గలదియునూ కూరిమి ఘన సైన్యంబులతో
గూడిన యా లంకా నగరంబును కూరిమి రఘువీరుడు గాంచెన్! 29

(యుద్ధకాండమునందు 39వ సర్గము సమాప్తము)

* * * *

# యుద్ధకాండము - మొదటిభాగము

## నలుబది సర్గము

### (సుగ్రీవ రావణుల మల్లయుద్ధము)

అటు పిమ్మట యా రామచంద్రుడును నా సుగ్రీవునితో గూడి!
వానర యూథపులను గూడికొని వరరగ యోజన ద్వయము నటన్!
మండలమగు నాకారము దోడుత మానుగ విశాల ప్రదేశమున్
గలిగినట్టి యా సువేల గిరిని జెలగుచు నెక్కెను రాఘవుడున్! 1

ముహూర్తకాలము నచటనె నిలిచియు మోదముతో పది దిక్కులనూ
యాలోకించెను నా శ్రీరాముడు నా లక్ష్మణు సుగ్రీవులతో!
రమ్యమైన యాత్రికూట పర్వత రమణీయంబగు శిఖరముపై
విశ్వకర్మ బహు నేర్పాటులతో వివిధములగు నిర్మాణములన్!
అందమైన వనముల తోడుతనూ సుందరమగు లంకాపురిని! 2

జయింప శక్యముగాని వాడునూ జయ శీలుండగు రావణునిన్!
నగరము నందున గోపురాగ్రమున నయముగ గూర్చొని యుండగనూ!
రావణాసురుని రాముడు గాంచెను రహి వింజామరలును విసరన్! 3-4-5-6

విజయభద్ర శోభితమగు వాడును, విమలమైన చందనములచే
పూయబడినవాడును, నరుణములగు బొలుపగు భూషణములు గలిగి!
నల్లని మేఘముతో సమానుడును, నయముగ బంగారము చేతన్
కప్పబడిన వస్త్రము గలవాడును, గడు నైరావత దంతములన్!
అగ్రభాగముల గిరుటజేతను నైన గాయములు వక్షమునన్
గురుతులు గలిగిన వాడును మఱియును గూర్చిన యెఱ్ఱని వస్త్రములన్!
ధరించువాడును, సంధ్యాకాలపు దగ రశ్మల గప్పగబడినా
యాకాశంబున మేఘరాశివలె నగుపించెను శ్రీరామునకున్! 3-4-5-6

ఆ దశాననుని కనుల జూడగనె యా సుగ్రీవుడు వే వెంటన్!
ఆ వానర నాయకు లందఱునూ యలరి జూచుచుండగ నవుడున్!

రఘువీరుడునగు రామచంద్రుడును రహి జూచుచు నుండగ వేగన్!
హఠాత్తుగా గిరి శిఖరము నుండియు యలరి లేచి పైకిని యెగిరెన్! 7

క్రోధవేగమున ధైర్యము దోడుత. కూరిమి బలమును గూడియునూ!
అటువిమ్మట యచలాగ్రము నుండీ యలరి లేచి పైకెగిరి మఱిన్!
గోపురంబు వైపునకును దుమికెను గూరిమి కపివీరులు గాంచన్! 8

ఆతడు ముహూర్తకాలము నిలిచియు యా దశాననుని గనుగొనుచున్!
నిర్భయంబుగా నంతరాత్మతో నిశ్చయముగ యారాక్షసునీ!
గడ్డిపరకవలె పరి గణించుచును గఠిన వచనముల నిటు బలికెన్! 8

ఓ రాక్షసుడా! లోకనాథుడగు నొప్పుగ రాముని స్నేహితుడన్!
అతని బంటును, నతని సేవకుడ యాతనితో నుందును నెపుడున్!
నేను నిన్నిపుడు విడువగ బోనూ! జననీయను మఱి యెచ్చటికిన్!
ఆరాముని దేజస్సుచేత నిను నంతము జేయుదు నే నిపుడున్! 10

అటుల బలికి సుగ్రీవుడు శీఘ్రము నాతనిపైకిని దుమికి మఱిన్!
విచిత్ర వర్ణంబులు గలిగిన యా విమల ముకుటమును లాగి మఱిన్;
ధాత్రిని బడవేసెను సుగ్రీవుడు దగ జూడగ యా రావణుడున్! 11

శీఘ్రముగా వచ్చెడి సుగ్రీవుని స్థిరకోపంబున రావణుడున్!
ఇటుల బలికి యా నిశాచరుండును నిమ్ముగ యా కపివీరునితో
నా పరోక్షమున సుగ్రీవా! విను! నయముగ సుగ్రీవుడవు సుమా!
హీనగ్రీవుడ వయ్యెద విప్పుడు హీన వానరాధీశ! వినూ! 12

ఇటుల బలికి యా నిశాచరుండును నిమ్మగ యా వానర రాజున్!
దన బాహువులను నా సుగ్రీవుని దగబట్టియు నేలను వైచెన్!
ఆ హరివీరుడు గందుకంబువలె యలరి లేచి యా రావణునీ
తన బాహువులను బట్టి యాతనిని దగ నేలను బడద్రోసి మఱిన్! 13

మహాబలులు నగు నా రావణుడును మానుగ యా సుగ్రీవుండున్
బరస్పరము స్వేదముతో దడిసిన బరగ దేహములు గలిగియునూ!

పరస్పరము శోణితమును జిందుచు బన్నుగ దేహములును గలిగీ!
పరస్పరము నదుముచు బట్టుచునూ బరగ నిరోధించుచు వారున్
పరస్పరము బుష్పించినట్టి యా బరగ శాల్మలీ కింశుకముల్
వృక్షంబుల వలె నుండి రిద్దఱును గక్ష తోడి వారిరువురునూ
పిడికిళ్లను, నర జేతుల దోడుత జడి హస్తాగ్రములను జాపీ
మల్ల, ద్వంద్వ యుద్ధంబులు జేసిరి మానుగ గోపుర శిఖరమునన్! 14-15

ఉగ్రవేగమును నురుబలంబు గల నుభయులు మఱి చిరకాలంబున్!
గోపుర వేదిని బాహుయుద్ధమును గూరిమి జేసిరి బహురీతిన్!
దేహంబుల మఱి యెత్తి యెత్తియును దేహంబులు మఱి వంచుచునూ!
పాదక్రమమున నడుచు కొనుచునూ! బరగ నిలిచి రా వేదికనూ! 16

వారిరువురు సుగ్రీవ రావణులు వనరగ గోపుర వేదికనూ!
పరస్పరము బీడించుకొనుచునూ బరగ దేహములు నొక్కటిగా!
ఒరిమి బట్టుకొని ప్రాకారమునకు అల బరిఖకు మధ్యమునందున్
బడిపోయిరి మఱి ముహూర్తకాలము బన్నుగ నిట్టూర్పుచు లేచీ!
ఒకరినొకరు మఱి బట్టుకొనియునూ యొనరగ నెగిరిరి ధర పైకిన్! 17

వారిద్దఱునూ బాహుయుద్ధమున యొనరగ వక్షమున యదుముచునూ
బాహుపాశముల నొకరి నొకరినీ బంధించుచు నతి బిగ్గఱగా!
సంరంభముతో నభ్యాసంబున సహజమైన నేర్పుల తోడన్!
బలముతోని వారిరువురు నప్పుడు బన్నుగ పోరాడిరి నచటన్! 18

వారిరువురు రావణ సుగ్రీవులు వనర బాహు యుద్ధము నందున్!
కోఱలు వచ్చిన పులి సింహంబుల కూరిమి పోలిక వలెను మఱిన్!
కలిసిన గజేంద్ర పోతంబులవలె కదనములో జేతులు గలిపీ!
బందొరులకు గల బలము దెలిసికొని యోటమి బొందక వారు మఱిన్
ఒక్కమారుగా నేలపై బడిరి చిక్కని ధూళియు పైబడగా! 19

వారిరువురు సుగ్రీవ రావణులు వనరగ యొకరిని యొక్కరునూ!
పైకి నెత్తి క్రిందను బడవేయుచు బాహు పాశముల నదుముచునూ!

ాహు యుద్ధ మార్గములో వారలు బహు విధముల బోయిరి నచటన్!
వ్యాయామము వలనను నభ్యాసము వలన గలిగినా బలములచే
ాకిరువురు యచ్చట, నలతలనూ వనరగ జెందక యుండి రటన్! 20

రవారణముల వన్నె గలిగినా వారిరువురు నటు బిమ్మటనూ!
జమండంబుల కాంతిని గలిగిన ఘనమగు హస్తంబుల చేతన్!
కరినొకరు వారించుకొనుచు మఱి నొప్పుగ యుద్ధము జేయుచునూ!
ండల మార్గము సంచరించి యుద్ధండత బాహు పరాక్రమమున్! 21

కరి నొకరు వధియించుట కొఱకై యొనరగ యత్నమును జేసెడి యా
రు లిరువురును నొక లక్ష్యంబునకు పీడితులబడి పోరాడెడి యా
ల్లులకును వలె వారిరువురునూ ముల్లులవలె జోరాడి రటన్! 22

ాహు యుద్ధమున విశారదులునగు వర సుగ్రీవుడు రావణుడున్!
ల్లియుద్ధమున మల్లులు దిరిగెడి మండలంబులను దిరుగుచునూ!
నేక విధముల స్థితులను జేయుచు యనేక విచిత్ర కార్యములన్!
మూత్రికలను చిత్రములైనా కూరిమి గతి ప్రత్యాగతముల్!
ర్యగ్గమనము, వక్ర గమనముల ప్రహారముల బరి మోక్షంబుల్!
ర్జనమును, బరిధావనంబునూ అభిద్రవణము నప్లావంబున్!
వస్థానమునూ, పరావృత్తమును. అపావృత్త, నపద్రుతములనూ
వప్లవములను, ఉపన్యస్తముల అపన్యస్తలను విద్యలనూ
చరించి మఱి చరించి రప్పుడు నలరు నేర్పులను జూపుచునూ!23242526

ంతలోనె రావణ రక్కసుడును సుంత తనదు మాయాబలమున్!
యోగించుటకు బ్రారంభించెను బరగ కపీంద్రుడు గమనించెన్!
యముతోని మఱి బ్రకాశించుచును సరగున యాకాశము పైకిన్
గిరిపోయె మఱి రావణు డంతట నిమ్ముగ సుగ్రీవుని చేతన్!
ాసగింపబడి యచటనె యుండెను మునిగెను గ్రోధ సముద్రమునన్!28

టుబిమ్మట యా హరివరనాథుడు నక్కసూనుడును యుద్ధమునన్
ర్తినిబొందీ దశగ్రీవునకు నార్తిని. శ్రమనూ గలిగించి!

అతి విశాలమగు నాకాశంబును నాతడు దాటుచు వేవేగన్!
సేనా మధ్యమునందు నున్న యా శ్రీరాముని సన్నిధి జేరెన్! 29

సూర్యపుత్రుడగు సుగ్రీవుంనును సురుచిర కర్మము గావించి
రామచంద్రునకు యుద్ధోత్సాహము రయమున బెంపొందించి మఱిన్!
సంతోషించుచు గపివీరులచే సరసత బూజింపగ బడుచున్!
వాయు వేగమున సైన్యములోనికి వచ్చి జేరె సుగ్రీవుండున్!

(యుద్ధకాండములోని నలుబదియవ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

## యుద్ధకాండము - మొదటి భాగము

### నలుబది యొకటవ సర్గము

[ఇట్టి దుస్సాహసమును జేయరాదని శ్రీరామచంద్రుడు సుగ్రీవునకు దెలుపుట—లంక నాలుగు ద్వారముల యొద్ద వానరులను నియమించి, అంగదుని రావణుని యొద్దకు దూతగా బంపుట — అంగదుడు రావణుని సభలో దన పరాక్రమము జూపుట — వానరులు ఆక్రమించుటచే రాక్షసులు భయము జెందుట.]

అటులిమ్మట లక్ష్మణ పూర్వజుడును నా రాముడు నా ప్రదేశమున్!
కనబడుచుండిన శకునంబులనూ గాంచి మదిని జింతించుచునూ!
సుగ్రీవుని కౌగిలిని జేర్చుకొని సురుచిరముగ నీ విధి బలికెన్! 1

నాతో గూడను నాలోచింపక నయముగ నిట్టి సాహసమున్
జేసినావుగడ! దెలుపకుండగా జెదిరి యొంటరిగ సాహసమున్
ప్రభువులైన వారిట్టి సాహసము బన్నుగ జేయరు సూర్యసుతా! 2

ియసాహసమును గల ఓ వీరుడ! ప్రియబంధూ! ఓ స్నేహితుడా!
న్నను నాసోదరు లక్ష్మణునీ నయముగ విభీషణుని నేనన్!
ంశయస్థితిలో నుంచినావుగద! చయ్యన యీ ఘన సాహసమున్:
సినావుగద! నా దశగ్రీవుని జేరి కయ్యమును జేసితివీ! 3

రిందమా! ఓ వీరుడ! వినుమా! నలరి జేయకుము నిట్టిపనీ!
హాబాహు ఓ శత్రుమర్దనా! మానుగ యిక ముందెన్నడునూ
కేదైనను నాపద గలిగిన నా కీ సీతయు నెందులకూ?
ియముగు భరతునితోడను మఱియును నీతిపాత్రుడగు లక్ష్మణుతో
త్రుఘ్నునితో నేమి లాభమూ? మిత్రమ! నాదు శరీరముతో!
మి ప్రయోజన మున్నది జెపుమా నిమ్మగ నీవును లేకుండన్! 4-5

హేంద్ర వరుణోపమా! వీరబల! మానుగ నీ బలమును దెలియున్!
యినను నీవును మఱలి రానిచో నాత్మ నిశ్చయము జేసితినీ!
ల దశగ్రీవుని యతని పుత్రులను నలరు మిత్రులను సైన్యంబున్!
హనంబులను వధించి లంకను వనరగ రావణు దమ్మునికిన్!
ట్టిముగట్టి భరతునికిని మఱి బన్నుగ రాజ్యము నర్పించీ!
ాణత్యాగమును జేయుదు నంచును బ్రతిన జేసితిని అర్కసుతా! 6-7

ఇవిధముగ బలికెడి శ్రీరాముని వినయవాక్యముల వినియు మఱిన్
సుగ్రీవుండు బలికె నిట్టులను నలరి వినయమున నంజలితో
ఘువీరా! నీ సతి జానకినీ రహి యపహరణము గావించీ!
తిలేని యా రాక్షసు గాంచీ నిలువజాలకను నుంటిని నే!
కు గలిగినా బలము దెలిసి నే నయముగ యెటులూరక యుండున్?8-9

టుల బలుకు నా సూర్యసుతుని గని యిమ్ముగ శ్రీరాముం డపుడున్!
సుగ్రీవుని యభినందించుచు నాతని వీర పరాక్రమమున్!
క్ష్మిసంపన్నుండునైన యా లక్ష్మణమూర్తిని గనుగొనుచున్!
టుల బలికె యా రాఘవేంద్రుడును విమలాక్షరములు ధ్వనియింపన్! 10

సౌమిత్రీ! మఱి శీతలోదకము సరసత ఫలములు గలిగిన యా
వనమునందు చక్కని స్థానంబును వనర జూచుకొని సైన్యంబున్!
విభజించియు వ్యూహములుగ జేసియు వీరలక్ష్మణా! నిలిచెదమూ! 11

లోక క్షయకర మైనది భీమము లోలత సుమహా వీరులునూ!
భల్లూకంబులు, వానరులును మఱి బన్నుగ రాక్షసులకును మఱిన్
నాశకరంబగు ప్రమాద మెదియో నయముగ వచ్చిన యటుల మదిన్!
తోచుచున్నది సౌమిత్రీ! విను దారుణముగా నపశకునంబుల్! 12

వాయువులును మఱి బరుషంబులుగా వనరగ వీచుచు నున్నవిగా!
వసుంధరయు మఱి వణుకుచునున్నది పర్వతములు మఱి కదులుచునూ!
పర్వతములు ధ్వనులను జేయుచునూ బన్నుగనున్నవి సౌమిత్రీ! 13

క్రూరమృగములకు వలె భీమంబును గూరిమి ధ్వనులను జేసెడి యా
మేఘంబులునూ భయమును గలుగగ మిశ్రిత శోణిత బిందువులన్!
వర్షించుచు నున్నవి మేఘంబులు వరుసదప్పి యాకాశమునన్! 14

రక్తచందనముతో సమానమును రవలు జిందు నా సంధ్య లలిన్!
భయంకరముగా గనబడుచున్నవి బరగ యగ్ని పర్వతము వలెన్!
సూర్యునినుండీ మండుచున్న యొక సురుచిర జ్వాలా మండలమున్!
క్రిందబడుచు నున్నది యన్నట్లుగ చిందునున్న వా సంధ్యలునూ! 15

దీనములును మఱి దీనస్వరమున దిక్కులన్నియును బిక్కటిలన్!
క్రూరమృగంబులు సూర్యుని కెదురుగ దారుణ ధ్వనులను జేయుచునూ!
భయమును గలిగించుచు మఱియును నట బాధయు గలిగించుచు నుండెన్!

ప్రళయకాలమున చంద్రుని వోలెను పర్యంతపు భాగము అందున్!
నల్లని యెఱ్ఱని కిరణంబులతో చల్లదనంబును వీడి మఱిన్!
అప్రశస్తుడుగ నున్న చంద్రుడును నలరు రాత్రులను మనసులకున్
సంతాపము గలిగించుచు నుండెను వింత భయంబును గొలుపుచునూ! 17

సూర్యమండలము చుట్టును నల్లని శుభకరంబు మఱి గానిదియున్
కళంక మది కనిపించుచున్నది గాంచు మదియె బహు హ్రస్వమునూ!

ƒయంకరంబును, సులోహితంబును బరగ యప్రశస్తమునైనా
ƒరివేషంబును గనబడుచున్నది బరగ సూర్యమండల మందున్! 18

ƒక్ష్మణ! విను! నక్షత్రంబులు గూడను లాలితముగ పూర్వము వోలెన్!
ƒన్నయటుల మఱి యుండుటలేదూ మిన్నున గనబడుటయు లేదూ!
ƒనిధి గనబడు దుశ్శకునములును నిమ్ముగ యీ లోకంబునకున్
ప్రళయ మెచ్చుచున్నద యన్నట్లుగ బరగ దెలవుచున్నట్లుండెన్! 19

ƒాకులు, డేగలు మఱియు గ్రద్దలును కఠినమైన ధ్వని జేయుచునూ!
క్రిందిభాగముల నెగురుచు నున్నవి క్రీడలు సలుపుచు వికృతినీ!
ƒొప్పధ్వనులుగల నక్కలు గూడను గూడి యమంగళకర ధ్వనులన్
ƒూయుచున్నవి సౌమిత్రీ మఱి కుటిల వికట స్వనములతోడన్ 20

కపులజేత రాక్షసులచేత మఱి విపుల గిరుల శూలంబులచే
ఖడ్గంబులచే ధాత్రి యంతయును గలవర బడుచుండిన దగుచున్!
మాంస శోణితంబులను గూడికొని మానుగ భూస్థలి యంతయునూ!
బురదతోని నిండియుపోగల దిక స్ఫూర్తిని దప్పిన శవములతో! 21

హరివీరులతో గూడి మనమిపుడు నతి శీఘ్రముగా రావణుచే
బరిపాలింపగ బడు నా లంకను బన్నుగ మన మిపు డందఱమున్!
అన్నివైపులను ముట్టడించెదము నతి విక్రమమును జూపుచునూ! 22

మహాబలుండును, విక్రముండునగు మానుగ యా రఘువీరుండున్!
లక్ష్మీవంతుడు లక్ష్మణుదోడను లాలితముగ నిటు బలుకుచునూ
పర్వతశిఖరంబును శీఘ్రముగా బన్నుగ దిగి యటు బిమ్మటనూ! 23

ధర్మాత్ముండగు శ్రీరాఘవుడును దగ యా పర్వతమును దిగుచున్
శత్రువులకు నెదిరింప రానిదగు సహజోత్సాహముతో నున్నా
తన కపిసేనా వాహిని గాంచెను దగురీతిని యా సమయమునన్! 24

కాలము నెఱిగిన శ్రీరఘువీరుడు గపిరాజగు సుగ్రీవునితో!
కూడినవాడై బహు విశాలమగు గూరిమి వానర సైన్యంబున్!

సంసిద్ధముగా నుండు నట్లుగా సరసరీతి గావించుచునూ
తగుసమయంబున యుద్ధంబునకై దగ ప్రేరేపించెను సేనన్! 25

అటుబిమ్మట నా మహాబాహువును నా శ్రీరాముడు వేగముగన్
మహాసైన్యమును గూడినవాడై మంచి ముహూర్తము గమనించి!
ధనుర్ధరుండై ముందు నడచుచును దగ లంకాపురి వైపునకున్
బయలుదేరెనూ కపీరులతో జయజయ శబ్దములును బలుకన్! 26

అట్టి సమయమున నల విభీషణుడు నా సుగ్రీవుండును మఱియున్
హనుమంతుడును, జాంబవంతుడును అల నలుండు మఱి నీలుండున్!
లక్ష్మీవంతుడు లక్ష్మణుండునూ భీష్మబలుడు శ్రీరామునితో
అనుసరించి బోయిరి వారందఱు నతి శౌర్యంబున రణమునకున్! 27

అటుబిమ్మట భల్లూకంబులయును చటుల వానరుల సేనయునూ!
విశాలమగు నా ధాత్రిని గప్పుచు విలక్షణంబగు గేకలతో!
వారల వెనుకను బయలుదేరెనూ వనరగ రామునితో గూడన్! 29

పర వారణులును గుంజరప్రఖ్యులు బన్నుగ యా వానరు లంతన్!
గిరి శిఖరములను వందల కొలదియు బ్రవృద్ధమగు వృక్షంబులనూ!
హస్తంబులతో నలరి బట్టుకొని యనుసరించి రా శ్రీరామున్!
శత్రు మర్దనులు సోదరులైనా సాహసవంతులు నైనట్టి
రామలక్ష్మణులు ననతికాలమున రావణ పాలితమును నైనా
లంకానగరము సమీపించిరీ శంక లేక కపివీరులతో! 30

రామవాక్యములచే కపివీరులు రయమున రణమును సలుపుటకై
పతాక పంక్తులతో గూడినదీ బన్నుగ యుపవన శోభితమున్!
చిత్రమైన ప్రాకారము గలదియు స్థిరముగ యున్నత మైనదియున్!
అందమైన ముఖద్వారంబులతో చంద్రకాంతులను గూడినదీ!
సురలకు గూడను దుర్దర్శంబును సురుచిరమగు లంకాపురినీ!
ముట్టడించుటకు సిద్ధముగా నట మోదముగా నిలిచిరి కపులున్! 32

ుజునితో గూడిన శ్రీరాముడు నతుల మహా ధనువును దాల్చి
ర్వత శిఖరము వోలె యెత్తయిన బరగ యుత్తరపు ద్వారంబున్!
క్షించుచు నుండెను శ్రీరాముడు రయమున లోపలి వారెవరున్
ఱపలకును రాకుండునట్లుగా వేగ విరోధించెను లంకన్! 33

శరథపుత్రుడు వీరుడైన యా దగ లక్ష్మణునీ గూడికొనీ
వణు బాలిత లంకను జేరీ రయమున యే ద్వారమునందున్!
వణుడుండెనో యుత్తర ద్వారము రహి యచటను రాముడు నిలిచెన్!

వణుచేతను నధిష్ఠింపబడు రహి యా యుత్తర ద్వారంబున్
రుణుడు వసించు సాగరంబువేలె వసర భయంకర మైనదియున్!
యుధములు ధరియించిన భటులును అన్ని వైపులను ద్వారంబున్
క్షించుచు నుండిరి రావణునీ రక్షింపగ లంకాపురినీ!

నవులను గూడిన పాతాలము దగ యుత్తర ద్వారంబు మఱిన్!
మాన్యుల కది భయమును గొలుపును సరసత మఱి యాద్వారంబున్!
ట్టడించుటకు రాముని కంటెను గట్టి సమర్థులు వేరెవరూ? 34-35-36

చ్చటగల యోధుల యొక్కయునూ యట నుంచిన యాయుధములనూ!
నేకవిధముల కవచంబుల మఱి యా శ్రీరాముడు గనుగొనియెన్! 37

నర సేనా నాయకుండు మఱి వసరగ బలవంతుడు నైనా
నీలుడు మైందునితో మఱియును నా ద్వివిదునితో గూడికొనీ
ూర్పు ద్వారమున యందున నిలిచెను దోరముగా జయమును నందన్! 38

హాబలుండగు నంగదుండు మఱి మానుగ ఋషభుని గూడికొనీ
వాక్షుండు మఱి గజునితోడనూ గవయుని తోడను గూడికొనీ
క్షిణద్వారము వద్ద నిలబడెను దగ లంకాపురి సాధింపన్! 39

లవంతుడును కపివీరుండును బన్నుగ హనుమంతుండు మఱిన్
ుజంఘు, శరసులతోని గూడికొని ప్రబలులైన కపివీరులతో!
ాడినవాడై పశ్చిమ ద్వారము గూరిమి నిలిచెను సాధింపన్! 40

ఆ సుగ్రీవుడు గరుత్మంతుడును, నల వాయువుతో సములైనా
వానర శ్రేష్ఠులతో గూడికొనీ వనరగ స్వయముగ దా నిలిచెన్!
సేనామధ్యమునందు నిలిచెనూ స్థిరముగ కేంద్రపు బిందువుగా! 41

సుగ్రీవుడు మఱి యున్నచోటునే శూరులు వీరులు ప్రసిద్ధులున్!
సేనానాయకులైన వానరులు సిద్ధముగా నట నిలబడిరీ!
ముప్పది యాఱగు కోట్లమందియును ముదముగ వానరులును యకటన్
రాక్షసులను నెదిరింప నిలిచిరీ రమ్య శిలలు వృక్షంబులతో! 42

లక్ష్మణ విభీషణులు నంతట మఱి లాలితముగ రాముని యాజ్ఞన్
ప్రతిద్వారమునను నిలిపిరి వేగము ప్రబల వీరులను వానరులన్
ఒక్కొక కోటీ సంఖ్యను నిలిపిరి మక్కువతో కపి సైనంబున్ 43

సుషేణుండు మఱి జాంబవంతునీ సురుచిరముగ గూడినవాడై!
అధికమైన సేనయు సుషేణునీ యనుసరింపగా రామునకున్!
పశ్చిమ దిశగా నిలిచెను నాతడు బహుదూరము గాకుండగనూ
మధ్యమ గుల్మము నందున నిలిచెను మానుగ స్థిరమగు సైన్యముతో! 44

పెద్దపులులవలె కోరలు గలిగిన పెద్దగ నఱచెడి కపివీరుల్
సంతోషించుచు మోదముదోడుత సరసత గంతులు వేయుచునూ
ద్రుమ శైలాగ్రంబులు హస్తంబున శ్రమ యింతయు లేకుండగనూ
గ్రహించి రణమును జేయగ వెడలిరి గలగల ధ్వనులను జేయుచునూ! 45

కోరలు, గోళ్లను నాయుధములుగా గూడిన వారగు నా కపులున్!
వికృతముగ దమ కుచ్చు తోకలను వికటముగా బైకెత్తుకొనీ!
సీత చెఱను విడిపించుట కొఱకై శీఘ్రము రావణు దునుముటకై
వారందఱునూ బోవుచు నుండిరి వనరగ రాముని కార్యమునన్! 46

ఆ కపివీరుల యందున గొందఱు నల పది గజముల బలంబునూ!
కొందఱు నూటికి పైబడు గజముల జెందెడి బలమును గలవారున్!
వేయి యేనుగుల బలమును గలిగిన విపుల బలాఢ్యులు గలరందున్! 47

ఓఘము గజముల బలవంతులు మఱి ఓఘము దశ సంఖ్యను మించి
ఆల గజముల బలమును గలవారును నటగల వానర శ్రేష్ఠులయున్
ఇంతబలము గలదంచు దెలుపుటకు సుంతయు ధైర్యము చాలదుగా!
అపరిమితంబగు బలము గలారును నాలోచించుటకును మించి! 48

అచ్చట గుమిగూడిన గపివీరుల యా సైన్యంబును జూచుటకున్!
మిడతల దండుకు వలె గానంబడు మిన్నున చుక్కలకును వోలెన్!
ఆ కపిలోక సమాగమంబునూ ఆశ్చర్యకరంబుగ నుండెన్
అతి విచిత్రముగ నుండెను నచ్చట గతి యత్యద్భుత మనిపించున్! 49

లంకను జేరిన కపివీరులచే శంకలేక వచ్చెడి వారున్
ఆ వానర సైన్యంబు జేతనూ యా భల్లూకంబుల చేతన్!
ఆకాశము బరిపూర్ణమైనటుల యగుపించును నేత్రంబులకున్
భూస్థలి యంతయు నిండిన యట్టుల బొలుపుగ కనిపించును నచటన్! 50

భల్లూకంబులు నొక కోటియునూ బరగ కోటియును వానరులున్!
వేలు వేలుగను మఱికొందఱునూ వేగముగా బరుగులతోడన్
రణమును జేయుటకై లంకను రహి విధ్వంసము జేయుటకై
అన్ని వైపులను నగర ద్వారముల నటు జేరిరి క్రిక్కిరిసియునూ! 51

ఆ పర్వతమున యన్ని వైపులను యన్నిప్రాంతములు గోతులచే
కప్పబడిన యటులుండెను నంతయు గానము భూస్థలి యచ్చోటన్!
సహస్ర యాయుత కపివీరులచే సరసత చుట్టగబడె పురియున్ 52

వృక్షంబులు ధరియించిన వారలు వీరులు బలవంతులునైనా
వానర వీరులచే జుట్టగబడి వసరగ యా లంకానగరిన్!
వాయువు గూడను బ్రవేశించుటకు వలన శక్యమును గాకుండెన్ ! 53

మేఘంబులతో సమానులును నగు మిగుల బరాక్రమ మందుననూ!
దేవేంద్రునితో సమ విక్రములును దీరుగ యా వానర వీరుల్

ఆకస్మికముగ ముట్టడింపగా నా రాక్షస వీరులు నంతన్!
ఆశ్చర్యంబును బొందిరి వారలు నద్భుతంబుగా గణియించి! 64

తీరము బ్రద్దలు జేసి బ్రెంచుకొని స్థిర వేగంబున వచ్చెడి యా
సాగరంబు బోలెను గపిసేనయు సరసర జేరుచు నుండగనూ
సముద్రజల ధ్వని వంటి ధ్వనియునూ సరసత వినిపించుచు నుండెన్! 55

మహా ఘనంబగు నా శబ్దంబున మానుగ ప్రాకారంబులతో!
పతాకముంతో, దోరణములతో బహు సుందర శిల్పంబులతో
సశైల వన కానన భూములునూ సమస్తమగు లంకా పురియున్!
కదలిపోయినవి పక్షులు, మృగములు గడలకు బరుగులు దీసినవి! 56

రామలక్ష్మణులచే గుప్తంబై రహి సుగ్రీవుని జేత మఱిన్!
సురక్షితంబై యుండి యున్నదో సురుచిరమగు హరి వాహినియున్!
సురలజేత మఱి యసురుల జేతను శూరత మఱి యెదిరించుటకున్
శక్యముగానిదిగా నట నుండెను శౌర్యదీప్తి యట జిందగనూ! 57

క్రమసంబంధము, నర్థ తత్త్వమును క్రమముగ నెఱిగిన రావణుడున్
తన సైన్యంబును రాక్షసవధకై దగ నావిధమున నట నిలిపి
మంత్రులతోడను మాటికి మాటికి మానుగ యాలోచన జేసి!
నిశ్చయంబు మఱిజేసి మీదటను నిర్మలమగు బుద్ధిని గూడి! 58-59-60

చేయదగిన దానిని జేయంగను స్థిర సంకల్పముతో గూడి!
రాజధర్మమును ననుస్మరించును రహి విభీషణునితో గూడన్
నాలోచించియు నతని యనుమతిని యల వాలి కుమారుడునైనా
అంగదుకుమారు నలరి బిలిచి తన ఖంగున మ్రోగెడి కంఠముతో!

ఓసౌమ్యుడ! ఓ యంగదుడా! విను! నొవ్పుగ లంకాపురి జేరి!
భయమును విడిచి నిర్భయుండవై పటుదరముగ ధీరత తోడన్!
భ్రష్టమైన శ్రమ గలిగినవాడును నష్టమైన యైశ్వర్యంబున్!
మరణేచ్ఛను మఱి నష్టమైన యా మానుగ చిత్తము గలవాడున్!
ఆ దశగ్రీవుని జేరి తెలుపుమా! అలరి నాదు వచనంబు లిటుల్! 61

శనీచర! విను! ఋషులకు సురలకు రమ్యాప్సరసలు నాగులకున్!
ంధర్వులకును మఱి యక్షులకును కావరమున భూవిభులకునూ!
జ్ఞానముచే, నవలిప్తముతో నటుజేసిన బాపము వలనన్!

పాపములను ననుభవించుటకు ఆ పాపంబుల ఫలముననూ
సమయము నిపు దరుదెంచినదీ యాలస్యము మఱి లేకుండన్!
హ్మదేవు డిచ్చిన వరదానము వలన గలిగినా గర్వమునూ
నున్నది! ఓ రావణ! వినుమా! పోకబంతి పూ రేకలుగా! 64

రా హరణముజేత కర్శితుడ దగ రఘువీరుడ! దశాననా!
ష్టిదోషమును జేసిన నీకును నిట్టె దండనము నీగలనూ!
ండంబును మఱి జేత ధరించియు దండము నీయగ నీకు దగన్
ంకా ద్వారమునందు నిలిచితిని శంక యింత మఱి లేకుండన్! 65

నిశాచరా! నాచేతను మఱి యెనర వధింపగబడి నీవున్!
వతలును మఱి మహర్షులును మఱి దీరుగ రాజర్షులును మునుల్!
వలనను నేమార్గము నందిరొ నిష్ఠురమగు నే మరణంబున్
మార్గంబును ఆ మరణంబును ననుభవించెదవు నేడికనూ! 66

క్షసాధమా! ఏమాయలచే రహి యేబలముల దోడుతనూ!
న్ను దూరమును జేసి జానకిని నయముగ హరించి బోయితివో!
మాయను నా బలంబు జూపుము నలరుచు రణరంగము నందున్! 67

మైథిలినీ యలరి గ్రహించియు యర్పించియు మఱి శరణంబున్
ేదకపోయిన నిశిత శరములను వీడగ జేసెద ప్రాణములన్!
ేసెద నుమ! విను నిశాచరా! విను! శీఘ్రము రాక్షసు లందఱినీ
ధించి వేసెద యీ వసుంధరను వసరగ యొక్కడు లేకుండన్! 68

ర్మాత్ముండును రాక్షస శ్రేష్ఠుడు దగ విభీషణుడు నను జేరెన్!
శ్రీమంతుడును నీతడు ధ్రువముగ శీఘ్రము నకంటకమునైనా
ంకా రాజ్యము, సకల సంపదలు లావుగ బొందును దశాననా! 69

మూర్ఖులైన యనుచరులు గలాడవు మూర్ఖులైన మంత్రుల తోడన్!
సంచరించు చుంటివి పాపాత్ముడ! సరియగు జ్ఞానంబును లేకన్!
ఆత్మనిగ్రహము లేనివాడవును నైన నీకు క్షణ కాలంబున్
అధర్మ మార్గమునందు రాజ్యమును ననుభవింప జాలవు సుమ్మా! 70

ఓ నిశాచరా! ధైర్యముతోడను నొప్పుగ శౌర్యంబును బూనీ!
నాతో యుద్ధము జేయుము ధీరత నయముగ రణరంగమునందున్!
యుద్ధమునందున నా శరములచే యిద్ధరిత్రి బడి మరణించీ
అటుపిమ్మట మఱి శాంతి బొందెదవు నాలస్యం బది యిక నేలా? 71

నిశాచరా! నా చక్షుఃపథంబున నిలిచి పక్షిరూపము నందీ!
మూడులోకములు దిరిగిన గూడను మోదంబున ప్రాణంబులతో
జీవింపగజాలవు ధరిత్రినీ! భావింపుము నే దెలుపునదీ! 72

నిన్ను గూర్చి యొక హితవాక్యంబును దిన్నగ దెలిపెద వినుమింకన్!
పరలోకమునకు సంబంధించిన బన్నుగ శ్రాద్ధాదికము నికన్!
జేసికొనుము; బంధువుల కందఱకు జేసికొనుము విందులను నికన్!
చివరిసారిగా లంకానగరము జేరి జూచుకొను వత్సలతన్!
నీదు ప్రాణములు నా యందున్నవి నిక్కముగా దెలుపుచు నుంటిన్! 73

అక్లిష్టకర్ముఁడైన రాఘవుని యా మాటలు విని యంగదుడున్!
మూర్తిమంతుడగు నగ్నిదేవువలె స్ఫూర్తి మంతుడై శీఘ్రముగా
ఆ తారా తనయుండు నంగదుడు నాకాశంబునకును బోయెన్!
రావణుపాలిటి తోకచుక్కవలె రమ్యముగా భీమంబుగనూ! 74

శ్రీమంతుండగు నంగదుండునూ! శీఘ్రము ముహూర్త కాలమునన్!
ఆ రావణు మందిరమును జేరెను నలరుచు నిర్భయముగ నచటన్!
మంత్రులతో గూడిన దశాననుని శాంతత యంగదుడును గనియెన్! 75

అటు పిమ్మట దీప్తాగ్ని సదృశుడు నలరెడి నా హరిపుంగవుడున్!
కనకాంగదములు గలవాడును మఱి కర్మిష్ఠుడు నగు నంగదుడున్!
ఆ రావణునకు నలతి దూరమున నంగదుండు దిగి నిలువబడెన్! 76

ార్చి మఱి తానే దెలిపెను దన వంశము దలిదం(డులనూ!
ఘ్నగు నా రాముని వచనము ఉన్నదున్నట్టుల యంతయునూ!
ాధికముగను నంతయును నా శ్రీరాముని వచనములన్!
సమేతుండైన రావణుకు మానుగ దెలిపెను యంగదుడున్! 77

త్రుడను నంగద డందురు వనరగ తారకు దనయుండన్!
కర్మణుడైన రామునకు నలరు దూతగా వచ్చితినీ!
ంటును! నతని దాసుడను! యాతని మార్గమునను నడుతున్!
యుందువు నా నామంబును వివరముగా నీ సచివులచే! 78

ంశంబున బుట్టిన వాడును రహి కౌసల్యా దనయుండున్!
ుడు నిను గూర్చి దెలిపెనూ! యా వచనము దెలిపెద నిపుడున్!
త్మద! యిక బైటికి రమ్మా! కూర్మి యుద్ధమును జేయుటకున్!
వంతుడవును గమ్మింకను జారిపోకు! రణ రంగమునన్! 79

ం నీదు నమాత్య శేఖరుల నీ పుత్రుల మఱి జ్ఞాతులనూ!
చరులను నీదు మిత్రులను నీ నిజ పరివారము నంతన్!
వను మఱి నీ యనంతరము వనరగ త్రిలోకములు గూడన్
ంను విడిచీ యుండగలవు సుసు బాధలు మఱి లేకుండగనూ! 80

నవులకును, యక్షులకును, దీరుగ గంధర్వులకు మఱిన్!
ంకును మఱి రాక్షసులకునూ యురుతర శత్రువు నీవు సుమా!
ుకు, ఋషులకు, యోగీశ్వరులకు ముల్లు వంటివాడవు నీవున్!
న్ను నే బెఱికి వేయుదును నిట్టి లోకములు సంతసిలన్! 81

_రించుచు వైదేహిని వే నయముగ సత్కృత్యము తోడన్!
ంక బోయినచో వేగము నలరి వధింతును నిన్నిపుడున్!
ాజ్యమును, నీదు సంపదలు నిజముగ విభీషణున కిపుడున్!
లవు సుమ! చెడిపోకుము మఱి జిందకు గర్వము మోహంబున్! 82

ంగవుదగు అంగదు డిటులను నలరి బరుషములు బలుకంగన్!
గణమును శాసించెడి యా రావణాసురుడు శీఘ్రముగా
బునకును వశుడై పోయెను క్రోధము నిండెను నణువణువున్! 83

అటుబిమ్మట కోపంబు నందినా యా రావణుడును మంత్రులతో!
'ఈ దుర్బుద్ధిని బట్టుడు! గొట్టుడు! నిమ్మగ జంపుడు వేగమునన్!
అనుచు మాటి మాటికిని మంత్రులను నాదేశించెను రావణుడున్!' 84

అటుబిమ్మట బహు భయంకరులునూ నలరెడి బాహు బలాఢ్యులునూ!
నలువురు రజనీ చరులు రావణుని నయముగ వచనములను వినియున్!
తేజస్సులతో ప్రదీప్తాగ్ని వలె దేజరిల్లు నా యంగదునీ!
బంధించిరి తమ బాహు పాశముల బట్టి వదలకను నుండి రటన్! 85

అట్టి సమయమున నాత్మవంతుడగు నా తారేయుడు యోజించీ
ఆ రాక్షస సముదాయము నందున యాత్మ బలంబును జూపింపన్!
తనకు దానె యా రాక్షసులకు మఱి దగ బట్టువడెను నిర్భయతన్! 86

అట్టి సమయమున యంగదు డంతట నిట్టె బాహువుల నుండి మఱిన్!
వ్రేలాడెడి యా రాక్షసవీరుల విదిలించుచు పక్షులవోలెన్.
గ్రహించి శైలము వోలె నున్న యా ప్రాసాదము శిఖరము పైకిన్
ఎగిరిపోయె నా వాలికుమారుడు నిమ్మగ వినతాసుతు వోలెన్! 87

ఆ నలుగురు రాక్షస వీరులునూ యలరి రావణుడు దర్శింపన్!
వాలి సుతుని యుత్పతన వేగమున వరుసగ ధులుపగ బడువారై
అచ్చటనే యా భూతలంబునను నలరి బడిరి పక్షుల వోలెన్! 88

అటుబిమ్మట యా ప్రతాపవంతుడు చటుల విక్రముడు నంగదుడున్!
శైల శిఖరమును బోలె నున్న యా శ్రీకరమగు బ్రాసాదంబున్
అగ్రభాగమును నెక్కి గాంచెనూ యల లంకను నలువైపులనూ! 89

వాలి సుతునిచే యాక్రమింపబడి యల ప్రాసాదపు శిఖరంబున్
పూర్వము వజ్రముజేత గొట్టబడి స్ఫూర్తి జెడిన హిమ శృంగముగన్
ఆ దశాననుడు గాంచు చుండగను నా ప్రాసాదపు శిఖరంబున్!
బ్రద్దలుగా జీల్చగబడి ధాత్రిని పడిపోయెను ఘన శబ్దమునన్! 90

అల దేవేంద్రుని మనుమడైన యా వాలిసుతుడు నా యంగదుడున్!
క్షణ కాలంబున యా ప్రాసాదపు కాంతివంతమగు శిఖరంబున్

జిచివేసి తన నామధేయమును విమలతరంబుగ వినిపించి!
నమగు ధ్వనులను జేసి యంగదుడు గగన భాగమునకును నెగిరెన్! 91

యంగదుడును నా రాక్షసులకు నటు బాధను గలిగించుచునూ!
నరవీరులకును హర్షంబును వనరగ జేయుచు శీఘ్రముగా!
పివీరులలో మధ్య నున్న యా కాంతిమంతుడగు శ్రీరామున్
ని సమీపమును జేరి యంగదుడు గథయంతయు మఱి వినిపించెన్! 92

ట లంకను మఱి యా దశాననుడు నటు ప్రాసాదపు శిఖరంబున్!
ాలుటజేతను గుపితుండాయెను గ్రోధ చింతనుండై బిదపన్!
న వినాశమును దగ వచ్చెననీ తలచి తలచి హృదయమునందున్
డి వేడి నిట్టూర్పులు విడిచెను గాఢమైన వేదన తోడన్! 93

ట శ్రీరాముడు సంతోషముతో నిమ్ముగ వానరులను గూడి
త్రువైన యా రావణు రాక్షసు సాధింపగ వధియింపగనూ
ాక్షసులను మఱి వధించుటకునూ రమ్యరాజ్య సంస్థాపనకై
భీషణునకును బట్టము గట్టగ వేచియుండె యని సలుపగనూ! 94

ుహావీరుడును గిరి కూటోపమ మహా రూపమును గలవాడున్
సుషేణుడును కామ రూపములు నటు ధరింపగల వీరులునూ!
ైన వానరుల వీరుల దోడను నట చరించు చుండెను మఱియున్
క్షత్రంబులలో చంద్రుని వలె నయముగ దిరుగుచు నుండె నటన్! 95

ర్ధర్షుండగు సుషేణుండునూ దుర్జయుడగు సుగ్రీవునిచే
జ్ఞను బొందియు నఖిల ద్వారముల యలరి యుండె నా వీరుడునూ!
ంద్రుడు నా యా రాసులలోపల చరించి నట్టుల సుషేణుడున్!
ాల్గు ద్వారముల నధ్దగించుచును నయముగ చరియించుచు నుండెన్! 96

ంక సమీపమున నందు విడిసినా శంకలేక సంద్రము వైపున్!
ున్న వానరుల యక్షౌహిణులను నిమ్ముగ గాంచియు రాక్షసులున్!

కొంచెము నాశ్చర్యంబును బొందిరి కొందఱు గని మది భయపడిరీ!
కొందఱు యుద్ధోత్సాహము వలనను జిందుచు సంతస మందిరటన్! 98

దీనమునై యా రాక్షస సైన్యము ధీరత్వంబును గోల్పోయెన్!
ఆ లంకాపురి ప్రాకారమునకు యా యగడ్తకును మధ్యమునన్!
కపివీరులచే యాక్రమింపబడి కదనంబునకును సిద్ధంబై!
వానరవీరులు నట ప్రాకారము వనరగ కట్టగబడి నటులన్
నుండుట జూచియు యా రాక్షసులును మెండుగ భయమును వ్యాపింపన్!

హాహాకారములను మఱి జేసిరి యా వానర సేనల గాంచీ!
మహా భీషణంబగు కోలాహల మహా ప్రవృత్తియు జెలరేగెన్!
రాక్షస పురియగు రాజధానిలో రాక్షసులును బహు వేగముగా!
మహాయుధంబులు ధరించి రందఱు మానుగ పోరాటంబునకై
ప్రళయకాల ఝంఝూమారుతముగ బరగ సంచరించిరి వారున్! 100

(యుద్ధకాండములోని 41 వ సర్గము సమాప్తము)

* * * *

## యుద్ధకాండము - మొదటి భాగము

### నలుబది రెండవ సర్గము

(వానరులు లంకను నాక్రమించుట - రాక్షసులతో యుద్ధము జేయుట)

పిమ్మట నటగల రాక్షస వీరులు చెప్పుట బట్టగ రావణునీ!
మందిరంబు జని దశగ్రీవునితో ఇందీవరశ్యాముడు నైనా
శ్రీరాముడు గపి వీరులతోడను శీఘ్రము ముట్టడి జేసెననీ
అంజలి తోడుత విన్నవించిరీ నా లంకేశ్వరునకును మతిన్! 1

ఆ లంకాపురి రాముని జేతను నలరి ముట్టడింపగ బడుటన్!
విని యా దశాననుండు వేగమే విక్రుద్ధుడై క్రోధము దోడన్!
ద్విగుణీకృతమగు నేర్పాటులనూ దీక్షగ జేయగ నియమించీ!
ప్రాసాదంబును నెక్కి జూచెనూ బన్నుగ వానర సైన్యమునూ! 2

యుద్ధ కాంక్షులగు నా కపివీరుల తద్దయు గాంచెను పైనుండీ!
అసంఖ్యాకులగు కపివీరులచే యా లంకా నగరంబు మతిన్!
అన్ని వైపులను ముట్టడింపబడి యా వన కానన శైలములన్!
వానర వీరులతో నిండిన యా వసరగ లంకను దా గాంచెన్! 3

సమస్తమగు కపివీరుల జేతను కపిల వర్ణముగ జేయబడీ!
యుండిన భూమినిగాంచి రావణుడు మెండుగ మదిలో జింతించెన్!
ఈ వానర సేనయు నే విధముగ నేరీతిని ధ్వంసంబగునా?
ఎటుల నశింపగ జేయుదునా యవి చటులరీతి మది చింతించెన్! 4

అటుపిమ్మట యా దశాననుండును యాలోచన యందున మునిగీ!
త్వరలో ధైర్యము నవలంబించియు ధీరత యాశ్చర్యము తోడన్!
వికసించిన నేత్రంబుల తోడను వీరవరుడు శ్రీరాఘవునీ,
ఆ వానర సైన్యంబుల గాంచెను నా రణవీరుడు రావణుడున్! 5

అంతట రాముడు సంతోషించుచు నా గపిసేనను గూడికొనీ!
కొంచెము ముందుకుబోయి గాంచెనూ యంచితముగ లంకాపురినీ!

అన్నివైపులను నిండియున్న యా నసురుల సేనను గమనించీ!
రక్షింపగబడు లంకానగరము రమ్య రీతులను గమనించెన్!

చిత్రధ్వజములతో బతాకముల శ్రీవిలసిల్లెడి యా నగరిన్!
కనుల గాంచి యా దశరథరాముడు గలతజెందె హృదయము నందున్!
మనసుజేత యాజనక తనూజను మానుగ స్మరించె రాఘవుడున్! 7

మృగ శాబాక్షియు, జనక నందినియు దగ నా జానకి యిచ్చటనే
శోకముచే వేదనను జెందుచును సురుచిరముగ నను స్మరించుచున్!
కటిక నేలపై శయనించుచు మఱి గడు గృశించి నిర్వేదమునన్!
నాకొఱకై బీడింప బడుచునూ నయముగ నున్నది రావణుచే! 8

ధర్మాత్ముండగు రామచంద్రుడును దగ బాధలు బడుచుండిన యా
జనకసుతను మదిలో స్మరించుచును జనించు వేదన నాపుకొనీ!
శీఘ్రముగా శత్రువుల వధింపను శ్రీరాముడు కపివీరులకున్
అజ్ఞాపించెను నన్ని వైపులను నలరి యున్న కపివీరులకున్! 9

అక్లిష్ట కర్మఋడగు శ్రీరాముని యా యాజ్ఞను మది మన్నించీ!
ఆవానర వీరులు నన్యోన్యము నలరి పొంగి యుత్సాహమునన్!
దిక్కులన్నియును సింహనాదముల దీరుగ గర్జించియు నంతన్! 10

ఈలంకను నిక శైలశిఖరముల నిమ్ముగ వర్షించెద మిపుడున్!
ముష్టి ఘాతములచే లంకాపురి మోదంబున జిమ్మెద మిపుడే!
లంకలోని యారాక్షసు లందఱు శంకలేక నశియింతురుగా!
అనుచు మదిని యా వానరవీరులు నలరుచు భావించిరి యంతన్! 11

ఆ వానర సేనానాయకులును నలరుచు గిరి శిఖరము లెత్తీ
మహా శిలలనూ మఱి వృక్షములను మానుగ బెకలించుచు దెచ్చి!
రణము సేయుటకు సంసిద్ధులునై రహి నిలిచిరి రామాజ్ఞకునై! 12

ఆ వానర సైన్యములు గుంపులుగ యలరి యేర్పడుచు నేకముగా
లంకేశ్వరుడును గాంచుచు నుండగ శంకలేక శ్రీరామునకున్!

సంతోషంబును జేయ గోరికను వింతగ వారలు గుంపులుగా
లంకను నారోహించుచు కిచకిచ వంకర దారుల నెక్కి రటన్! 13

తామ్రవక్త్రములు గలవారును మఱి హేమకాంతులును గలవారున్!
వృక్షంబులతో, శిఖరంబులతో వికట రణంబును గలవారున్!
ఆకపి వీరులు రామకార్యమై నలరి ప్రాణముబు విడుచుటకై
తరలిపోయిరీ సంసిద్ధులునై దగ యా లంకాపురి పైకిన్! 14

ఆ ప్లవంగ వీరులును శీఘ్రముగ నలరుచు వృక్షంబుల చేతన్!
పర్వత శిఖరంబులచే మఱియును బరగ ముష్టి ఘాతంబులచే
అనేకప్రాకారముల శిఖరముల నలరెడి ముఖద్వారంబులనూ
బడద్రోసిరి మఱి నష్టబఱచిరీ బన్నుగ లంకా పురియందున్! 15

అటు మీదట యా వానరవీరులు నలరు నిర్మలోదకములతో!
కూడిన బరిఖల బరాగములచే కూరిమి పర్వత శిఖరములన్!
తృణములజేతను, కాష్టంబులచే దీరుగ వృక్షంబుల జేతన్!
నింపివేసిరీ సంపూర్ణము భూ కంపము వచ్చిన రీతిగనూ! 16

అట్టి సమయమున వేయి యూథములు నిట్టె గలిగినా నాయకులున్!
కోటి యూథములు గలవారును మఱి కూరిమి నూఱగు కోటులకున్!
యూథంబులుగల కపివీరులునూ సాధన జేయుచు వేగముగా
లంకానగరముపై దండెత్తిరి శంకలేక యుత్సాహముతో! 17

ఆప్లవంగ వీరులు నా పిమ్మట నలరుచు ముందుకు బోవుచునూ!
బంగరు వికార ముఖ ద్వారములను చెంగున బ్రద్దలు జేయుచునూ!
కైలాసంబున గల శిఖరంబుల కాంతిగలుగు గోపురములనూ!
బడగొట్టుచు మఱి యాక్రమించిరీ బన్నుగ యా లంకాపురినీ! 18

మహా వారణములకును సమానులు మానుగ ప్లవంగ వీరులునూ
ఎగురుచు, దుముకుచు, గంతులువేయుచు నిమ్ముగ గర్జన జేయుచునూ,
లంకవైపు బరుగెత్తుచు బోయిరి లావుగ కేకలు వేయుచునూ! 19

కామరూపములు ధరింప గలిగిన కాంతివంతులగు బలవంతుల్!
ఆకపివీరులు జయశబ్దంబులు నంతట వినబడు నట్టులుగా!
మహాబలము గల దశరథరాముడు మానుగ మన పాలిట గలడూ!
లక్ష్మీవంతుడునైన లక్ష్మణుడు లాలితముగ మనపాలిటనూ!

రాముని జేతను బాలింపగబడి రాజగు మన సుగ్రీవుండున్!
మనపాలిట గలడో కపులారా! మానుగ భయమేమిటికి యికన్!
అని ఘోషించుచు గర్జించుచునూ ఆ లంకాపురి వైపునకున్!
ప్రాకారము వైపునకు కపులునూ బరుగులు దీసిరి వికటముగన్! 20-21

వీరబాహువును సుబాహువును మఱి వీరవిక్రముడు నా నలుడున్!
పనసుడునను వానర నాయకులును బరగ లంక ప్రాకారంబున్
ఆక్రమించి యుండిరి యంతట వే యల వానర సైన్యంబులునూ!
మోహరించి మఱి యాక్రమించినవి ముదమున జయజయ శబ్దములన్! 22

బలవంతుడునగు నా కుముదుండును బల్లిదులును జయశీలురునూ!
కోటిమంది వానర వీరులతో గూడి తూర్పు ద్వారంబుననూ
ఆగ్నేయంబున నడ్డగించుచును నలరి నిలిచె ధీరత్వమునన్! 23

ప్రసభుండను వానర వీరుడునూ పనసుండను కపివీరుడునూ
ఆకుముదుని మఱి యాదుకొనుటకును నసంఖ్యులగు కపివీరులతో
కలిసి నిలిచి రట యాగ్నేయంబున కదము త్రొక్కుచును రక్షణకై! 24

వీరుడైన బలవంతుడు శతబలి విపుల బరాక్రమ శాలియునూ!
ఇరువది కోటుల గపివీరులతో నిమ్ముగ దక్షిణ ద్వారమునన్!
నైరృతి భాగము సమీపించియును నయముగ నా ప్రదేశంబున్!
ఆవరించియును నడ్డుకొనగనూ నందు నిలిచె తన సేనలతో! 25

తార తండ్రియును బలవంతుండును దగ సుషేణుడను వీరుండున్,
పశ్చిమ ద్వారము నడ్డుకొనుటకై బన్నుగ తన సేనలతోడన్!
కోటికోటి కపివీరుల తోడను కూడి వెడలి యా స్థానంబున్!
ఆక్రమించెనూ జయ శబ్దంబుల యా రామునకును జయ మనుచున్! 26

సౌమిత్రిని గూడిన శ్రీరాముడు సాటిలేని బలవంతుడునూ!
ఆకపిరాజగు సుగ్రీవుండును నలరి యుత్తరపు ద్వారమునన్
పూనిక దారిని యడ్డగించుచును బొలుపుగ నిలిచిరి రణమునకున్! 27

శత్రు నిబర్హణుడైన వాడునూ శాత్రవ సంహారుండు మఱిన్!
అట్టి ధూమ్రుడును భయంకరంబగు నిష్ఠ కోపమును గలవాడున్!
ఒక కోటీ భల్లూకంబులతో వచ్చి నిలిచె రణరంగమునన్
రాముని పార్శ్వమునందున నిలిచెను రయమున యుత్తర ద్వారమునన్!28

మహావీర్యుడును విభీషణుండుచు మానుగ గదనూ ధరియించీ!
తన నలుగురు మంత్రులతో గూడను దగ రణ సంసిద్ధుం డగుచున్!
మహాబలుంతగు రాముని ప్రక్కన మానుగ నిలిచెను రణమునకై! 29

గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు గంధమాదనుడు నైదుగురున్!
అన్ని వైపులను దిరుగుచుండిరీ యా కపిసేనను గాంచుచునూ!
పరుగు లెత్తుచును నన్ని వైపులను బర్యవేక్షణను జేయుచునూ! 30

అటుబిమ్మట నా రాక్షసేంద్రుడగు నా రావణుడును శీఘ్రముగన్!
కోపపరీతాత్ముండగుచును మఱి క్రోధ పూర్ణ నేత్రంబులతో!
సకల సైన్యములు యుద్ధంబునకై సాగిపోవ యాజ్ఞాపించెన్! 31

ఆ దశాననుని ముఖేరితంబగు నా వాక్యంములను విని వేగన్!
ఆ రజనీచరులును వేగంబున యతి భయంకరంబగు ధ్వనులన్!
గలుగు నట్లుగా సింహానాదములు గలిసి జేసి రా సమయమునన్! 32

అటుబిమ్మట మఱి యన్ని వైపులను నా రాక్షసవీరుల జేతన్!
హేమదండ యగ్రంబుల చెతను సోమ పాండు పుష్కరములునూ!
ధ్వనింప జేసిరి రణభేరీలును దగ రా రమ్మని బిలుచుచునూ!
లంకానగరము నంతట వినబడె లావగు నా భేరీ ధ్వనులున్ 33

మహాభయంకరులగు రాక్షసు లా మానుగ ముఖ మారుతములచే
నింపబడినవై వందల కొలదియు సొంపగు వేలగు శంఖములున్!
ఘనఘోషంబున ధ్వనులు జేసినవి కదనంబునకును సూచికగా! 34

శుభ నీలాంగంబులు గలిగిన యా శుభకరమగు శంఖంబులతో!
కూడిన యా రజనీచరులును మఱి కూరిమి విద్యున్మండలమున్!
జుట్టుబడియు మఱి బలాకములతో సుందర మేఘంబుల వలెనూ
అటులనుండి రా రాక్షసులంతట యా శంఖంబుల గూడికొనీ! 35

అటుపిమ్మట నా రావణు జేతను నటు ప్రేరేపింపగ బడుచున్!
సంతోషించిన సైనికు లంతట పింతగ వెడలిరి రణమునకున్!
ప్రళయకాలమున నింపగబడు నా బన్నుగ మహోదధికి వలెన్
జలవేగంబుల వోలె రాక్షసులు బన్నుగ వెడలిరి రణమునకున్ 36

అటుపిమ్మట యా వానరసైన్యము నంతట జేసిన యా ధ్వనియున్
చరియలతోడను, శిలల తోడుతను చక్కని గుహలును గలిగిన యా
మలయ పర్వతము నింపివేసినది విలవిల దిక్కులు మార్మ్రోగన్! 37

బలవంతులు నగు నా రాక్షసులును బన్నుగ జేసిన యా ధ్వనులున్!
శంఖధ్వని, దుందుభుల స్వనములును సరగున హుంకారములు నిటన్!
అచట వానరుల సింహనాదములు నతి భయంకరమునగు కేకల్!
భూమ్యాకాశంబులు సాగరమును బొలుపుగ ధ్వనించి నటు లుండెన్! 38

గజముల ఘీంకారంబుల తోడను గడగి యశ్వముల సకిలింపుల్!
రథముల చక్రాంతముల ధ్వనులతో రాక్షస పద నిస్వనములతో
భూమ్యాకాశములు సాగరము బొలుపుగ ధ్వనించి నటులుండెన్! 39

అటుపిమ్మట రాక్షస వానరులకు నపూర్వ యుద్ధము జరిగె నటన్!
పూర్వకాలమున దేవాసురులకు బొలుపుగ యుద్ధము జరిగినటుల్!
భయంకరంబగు యుద్ధము జరిగెను బన్నుగ వర్ణింపగరానీ! 40

ఆ రాక్షసులును దమ విక్రమమును నలరి దెలుపుచును కపులకునూ!
ప్రదీప్తమగు దమ గదలచేతనూ బరగ శక్తి శూలంబులతో
గండ్ర గొడ్డలులతోని వానరుల గలబడి గొట్టిరి తీవ్రముగా! 41

మహాకాయములు గల వానరులును మానుగ యటు బిమ్మట వేగన్!
వృక్షంబులతో గిరి శిఖరంబుల వికటముగా నఖముల తోడన్!
దంతంబులు మఱి యాయుధములుగా వింతగ పోకాడిరి వారున్!
వానరేంద్రుడగు సుగ్రీవునకును వాసిగ జయమగు గాత!' యనీ
ప్రభువగు శ్రీరామునకును జయ!'మని బన్నుగ యా వానరు లపుడున్!
మహాఘనంబగు ధ్వనులను జేసిరి మానుగ దిక్కులు ధ్వనియింపన్! 42

పిమ్మట భయంకరులు రాక్షసులును నిమ్ముగ ప్రాకారంబుల పై
రాజా! నీకును జయమగు గావుత రాజా! వర్ధిల్లుము ధాత్రిన్!
అని బలుకుచు దమనామధేయముల నంతట వినబడు చుండగనూ!
క్రిందనున్న యా వానరవీరుల బిందిపాలముల, శూలములన్
గొడిచిరి, చీల్చిరి రక్తము లొలుకగ స్ఫూర్తిని బహు శౌర్యము తోడన్!44

భూమిపైని గల యా వానరులును బూర్ణ క్రోధమును గలవారై
ఆకాశము లోనికి యెగురుచునూ ప్రాకారంబుల పై నున్న
ఆ రాక్షసులను దమ బాహువులను నటు నిటు లాగుచు వారలనూ!
నేలపైకి బడద్రోసిరి వేగము విలవిల దొరలగ భూస్థలినీ! 45

ఆ రాక్షస వానరులకు మధ్యను నటు జరిగిన యుద్ధంబుననూ!
మాంస శోణితములను కర్దముల హింసాయుతమగు నా రణమున్!
ఆశ్చర్యముగా, నద్భుతంబుగా నలరి యుండె నట జూచుటకున్! 46

(యుద్ధకాండమందు 42వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# యుద్ధ కాండము - మొదటి భాగము

## నలుబది మూడవ సర్గము

[ద్వంద్వ యుద్ధమునందు వానరులు రాక్షసులను ఓడించుట]

అటుపిమ్మట యా మహాత్ములును నగు నా వానరులును రాక్షసులున్!
యుద్ధము జేయుచు నుండగ నంతట బద్ధ విరోధము జెలగంగన్!
ఇరు పక్షంబుల సైన్యము నందున యింతనరాని క్రోధంబున్!
రోషావేశము గలిగెను వారికి భీషణమగు రణరంగమునన్! 1

ఆ దశాననుని జయాభిలాషులు నా రజనీచర శ్రేష్ఠులునూ!
భీమకర్మములు గలవారును నగు బిరుదు వహించిన రాక్షసులున్!
స్వర్ణ శిరోభూషణములు గలిగిన సరసమైన హయముల తోడన్!

అగ్ని శిఖోపమ గజముల తోడను యాదిత్యునితో సమమైనా
రథములతోడను మనోహరంబగు రమ్య కవచముల ధరియించీ!
పది దిక్కుల పెను ధ్వనులు జేయుచును బయలుదేరి రా నిశాచరుల్!2-3

జయమును గోరెడు భయంకరంబగు సరగున యా కపి సేనయనూ!
ఘోర కర్మఠులు నా రాక్షసులును గూడినట్టి యా సేనలకున్
నెదురుగ బోయిరి యెదిరించుటకును గదిలి ముందునకు త్వరితముగన్!

అన్యోన్యంబును బరస్పరంబును నటుల వానరులు రాక్షసులున్!
ఒకరినొకరు నెదురుగ బరువెత్తుచు నొనర యుభయ పక్షంబులకున్
ద్వంద్వ యుద్ధమును నపుడు జరిగినది కందిపోవ యిరు సేనలకున్! 5

మహా తేజమును గల రాక్షసుడును మానుగ రావణు కుమారుడున్!
ఇంద్రజిత్తుతో వాలిపుత్రుడగు సాంద్రబలుండగు నంగదుతో!
అంధకాసురుడు పరమశివునితో అలరి యుద్ధమును జేసినటుల్!
వారిద్దరునూ యుద్ధ మొనర్చిరి వరుస నీవు నేనా యనగన్! 6

ఎల్లప్పుడు మఱి యుద్ధమునందున యెదిరింపగ శక్యముగానీ
సంపాతీ యను గపివరుండునూ కంపిల జేసెడి ప్రజంఘుతో

వాయుపుత్రుడగు హనుమంతుండును వనర జంబు మాలినితోడన్
యుద్ధము జేసిరి పర్వతముల వలె మధ్య యెవరు లేకుండగనూ! 7

మహా క్రోధుడును మహాబలుండగు మానుగ రావణు దమ్ముడునూ!
అల విభీషణుడు శత్రుఘ్నుండను నటగల రాక్షస వీరునితో!
భీకరమగు యుద్ధంబును జెసెను భీమ పరాక్రమమును జిందన్! 8

మహాబలుడు గజుడను గపివీరుడు మఱి తపనుండను రాక్షసునీ!
యుద్ధమునందున యెదుర్కొనెను మఱి వద్దనున్న శిఖరంబులతో
మహా తేజుడగు నీలుండును మఱి మానుగ నికుంభ రాక్షసుతో
రణరంగంబున వాని నెదుర్కొనె రణ పాండిత్యము జూపుచునూ! 9

వానరేంద్రుడగు సుగ్రీవుండును వనరగ ప్రఘసుని దోడుతనూ!
శ్రీమంతుండగు లక్ష్మణుండునూ శ్రీకరముగ రణరంగమునన్
విరూపాక్షుతో సమరము జేసెను విలక్షముగా నది యుండెన్! 10

ఎదిరింపగ మఱి శక్యముగానీ కదన వీరులగు రాక్షసులున్!
అగ్నికేతువును, రశ్మికేతువును యజ్ఞకోపుడును మఱి యింకన్!
మిత్రఘ్నుండును నను నలువురునూ మేలిమి శ్రీరాముని తోడన్
రణరంగంబున యెదుర్కొనిరి మఱి రమ్యాయుధముల జేబూనీ! 11

వజ్ర ముష్టి యను రాక్షసుండు మఱి వానరవీరుడు మైందునితో!
అశనిప్రభుడును ద్వివిదుని తోడను నలరి దలబడెను రణమందున్!
ఆ కపివీరులు మైంద ద్వివిదులు నల భయంకరులు నగు వారిన్!
మహా రాక్షసుల దలపడి రప్పుడు మానుగ మహా ధ్వనులు జెలగన్!

వీరుండును మఱి భయంకరుండును విపుల యుద్ధ దుర్ధర్షుడునూ!
పతీపనుండను ఘోర రాక్షసుని బన్నుగ రణరంగము నందున్!
బహు వేగంబును గలిగిన నలునీ బరగ యెదుర్కొని యని నిలిచెన్!

ఆల ధర్ముని పుత్రుడు బలవంతుడు నల సుషేణుడను వీరుడునూ!
ప్రసిద్ధుడును వానరులను శ్రేష్ఠుడు బన్నుగ యూథప నాయకుడున్!
విద్యున్మాలీ యను రక్కసుతో వికటముగా యుద్ధము జేసెన్!
భయంకరులును నగు నితర వానరులు బన్నుగ యంతకు ముందుగనూ!

యనేక రాక్షసులతో నని జేసీ యటు బిమ్మట బలవంతులునూ!
ఇతర ఘోర రాక్షసులను దలపడి నిమ్ముగ పోరాటంబునకై
ద్వంద్వ యుద్ధములకును దలపడి మఱి జిందిరి విక్రమమును జూపన్! 15

అచ్చట జయమును గోరుచుండినా యా హరివీరులు రాక్షసులున్
రోమాంచంబును గలుగ జేసెడీ రూఢమైన రణమును జేసీ!
శాహుబలమును బ్రదర్శించిరీ బన్నుగ యాసమయము నందున్! 16

అట్టి సమయమున హరి రాక్షసులయును నిట్టె దేహముల నుండియునూ
రక్తపు నదులను బ్రవహించినవీ రణరంగము నందంతటనూ!
గడ్డి కుప్పలకు వోలె కేశములు గనిపించుచు నుండెను నచటన్
శరీరంబులను కట్టెల మోపులు సరసత రక్త ప్రవాహమునన్!
గనిపించుచు నుండెను ఘోరముగా కదనమందు నా సమయమునన్! 17

ఇంద్రజిత్తు గోపించిన వాడై సాంద్ర శత్రు సైన్యంబులనూ
చీల్చివేయుచుండిన వీరుండును శ్రీకరుండు నగు నంగదునీ!
దేవేంద్రుడు వజ్రాయుధంబుతో దీరుగ గొట్టిన విధముగనూ!
ఆ రాక్షసుడును దన గద తోడను నలరి గొట్టె బహు దీవ్రముగన్! 18

వానరవీరుడు నా యంగదుడును వనరగ వేగము గలవాడై!
సమరమునందున యా రాక్షసునీ సహజ స్వర్ణ చిత్రాంగములున్
చక్రాద్యవయవములును గలిగినా చక్కని యా రథమును విరిచెన్!
గుఱ్ఱంబుల మఱి రథ సారథినీ గూల్చివేసే ధాత్రిని బతగన్! 19

ప్రజంఘుడునూ మూడు బాణములు ప్రయోగించి సంపాతిని వే
తీవ్రఘాతమున గురిసేయగనూ దీరుగ మఱి సంపాతియునూ!

శ్వకర్ణ వృక్షంబును దాల్చి మానుగ రణాగ్రమున యందున్!
ప్రజంఘుని యలరి వధించెను నా సైన్యము నబ్బురమందన్! 20

హాబలుండగు జంబుమాలియును నలరి రథస్థుండై యుండి!
గ్రుల కోపమున యుద్ధమునందున దగ హనుమంతుని వేగమ్ముగన్
క్షస్థలమున శక్తి యనియెడి వనరగ యాయుధమున బొడిచెన్! 21

గారుతాత్మజుడు హనుమంతుండును మఱి శీఘ్రముగా లంఘించి!
తని యరదమును నెక్కి యాతనిని యరజేతను గొట్టుచు మిగులన్!
తని ప్రాణములను హరించెనూ యాతని రథమును గూడి మఱిన్
ధ్వంసము జేసెను నేల గూలునటు దగ రాక్షసులును జూడగనూ! 22

యంకరుండగు ప్రతీపనుండును బన్నుగ గర్జించుచు వేగన్!
లుని మీదకును బరుగులు దీయగ నలుడును మిక్కిలి కోపముతో!
రాక్షసునీ నేత్రములను నుఱి నట బడగొట్టెను ముక్కలుగా!
యముని దగ్గఱకు బంపెను నాతని విమలాతిథ్యము గొనుటకునై! 23

స్త లాఘవము గల ప్రఘసుండును నలరు వాడియగు బాణములన్!
వరరాజగు నల సుగ్రీవుని నాతని శరీరమంతటనూ!
దింపగ మఱి నా సుగ్రీవుడు భీమబలుండై జవముననూ!
సైన్యము నంతయు మ్రింగివేయుచును సరసత వచ్చుచు నున్నాడా
నునట్లుగ యా మహారాక్షసుని యలరి సప్తపర్ణము జేతన్! 24

క్ష్మీవంతుడు నగు లక్ష్మణుడును లావు భయంకరు దగునట్టి
రూపాక్షుని శర వర్షముచే విపుల తరముగా బీడించి!
క్క బాణమున యమపురి కంపెను చక్కగ యాతిథ్యము నందన్! 25

డిరింపగ శక్యంబునుగాని యిమ్ముగ యగ్ని సుకేతువునూ!
శ్ని కేతువును మిత్రఘ్నుండును రంఙిలు యజ్ఞ సుకోపుండున్!
మచంద్రుని తమ బాణంబుల రయముగ బేదించిరి మఱియున్!
యబఱచిరి కఠిన శరములను గడు రక్తములును నొలుకంగన్! 26

రామచంద్రుడును బహు గోపించుచు రహి రణరంగము నందు మఱిన్!
భయంకరంబును నగ్ని శిఖోపమ బరగ నాల్గు బాణంబులచే
యుద్ధము నందున యా నలువురినీ యిద్దరిత్రి లేకుండగనూ!
యంపెను నా యమపురి కతిథులుగా సొంపుగ యాతిథ్యము నందన్! 27

వజ్రముష్టి యారణము నందునను వనరగ మైందుండను కపిచే!
ముష్టిఘాతముల ప్రహారంబులను మోదము నంతయు బోనాడీ
రథముతోని మఱి యశ్వంబులతో రయమున భూతలమున వ్రాలెన్!
మహానగర ప్రాకార శిఖరమును మానుగ నేలను గూలినటుల్! 28

నికుంభుండు నను రాక్షసవీరుడు నీలాంజన ప్రభగల వానిన్
నీలుండును నా వానరవీరుని నిలిచి వాడియగు శరములతో
అంశుమంతుడును దన కిరణములను నల మేఘంబును గొట్టినటుల్
నా నికుంభుడును గొట్టెను నీలుని యరమర లేకను శరములనూ! 29

హస్తలాఘవము గలిగినట్టి యా నలర రాక్షసుడగు నికుంభుడున్
మఱల నూఱు బాణంబుల జేతను మానుగ యా నీలుని వేగన్!
గాయబఱచి మఱి యట్టహాసమున కలకల నవ్వెను వికటముగా! 30

ఆహవరంగమునందు నీలుడును నలరి విష్ణు దేవునికి వలెన్!
ఆతని, రథచక్రంబు జేతనే యారణరంగము నందుననూ!
ఆ నికుంభునీ యలరు శిరస్సును యాతని సారథి శిరస్సునూ
ఛేదించెను భూతలమున బడగా చింది రక్తమును ప్రవహింపన్! 31

వజ్రముతోడను, పిడుగు తోడ మఱి వనరగ సమాన స్పర్శయునూ!
గలిగినట్టి యా ద్వివిదుడు గూడను గనుచుండగ యా రాక్షలున్!
అశని ప్రభువను ప్రబల రాక్షసుని యల పర్వత శిఖరంబుననూ
గాయబఱచె బలమున దీవ్రతనూ గడు రక్తంబును ప్రవహింపన్! 32

యుద్ధరంగమున వృక్షంబులతో నుద్ధతి రణమును జేసెడి యా
వానర నాయకుడైన ద్వివిదునీ వనరగ యశని ప్రభుండు మఱిన్!

ప్రజాయుధమునకును సమానమగు వనర తీవ్రతర బాణములన్
ఆ ద్వివిదునిపై ప్రయోగించెనూ యట గల సైన్యంబులు గాంచన్! 33

శరములజేతను గొట్టబడిన యా శరీరమును గల ద్వివిదుండున్!
క్రోధ మూర్ఛితుండై శీఘ్రముగా కూరిమి సాలంబును బూనీ!
రథముతోడ మఱి యశ్వంబులతో రయమున యశని ప్రభుని మఱిన్
గాలుని కతిథిగ బంపె వేగమున విలవిల నేలను బొరలఁ దన్! 34

రథమున నుండిన విద్యున్మాలియు రమ్య స్వర్ణ భూషణములునూ!
అలంకారముగ గల బాణంబుల నా సుషేణునీ పదే పదే!
మాటిమాటికిని దాడన జేయుచు మానుగ బిట్టుగ ధ్వని జేసెన్! 35

అటుబిమ్మట యా వానరోత్తముడు నా సుషేణుడును శీఘ్రముగా
రథమం దుండిన విద్యున్మాలిని రాక్షసు గనియును ద్వరితగతిన్!
గిరిశృంగముతో నాతని రథమును జరజర నేలను బడగొట్టెన్! 36

హస్త లాఘవమునను గూడిన యా యల రావణునీ సహచరుడున్!
విద్యున్మాలియు రథమునుండి దిగి వేగముగా మఱి దొలగుచునూ!
హస్తమునందున గదను ధరించీ నటభూతలమున నిలుచుండెన్! 37

అటి సమయమున వానరశ్రేష్ఠుడు నా సుషేణుడును గోపమునన్!
ఏమహాశిల చే ధరించి వేగము సురుచిరముగ నా రాక్షసుపై
గురుగెత్తెను నాతనిపై వేయగ బరువగు నాగిరి శిఖరంబున్! 38

నిశాచరుడు నా విద్యున్మాలియు విశాలమగు శిలతో గూడి!
తనపై నల్లని మేఘంబును వలె దనరి వచ్చుటయు గమనించీ!
హరిపుంగవుడగు నా సుషేణునీ నలరిచేత గద ధరియించీ
వక్షస్థలమున వనరగ గొట్టెను గక్షను దన గదజేత మఱిన్! 39

ఆ మహారణమునందు సుషేణుడు నా మహాభయంకరమైనా
గదాప్రహారము లెక్కసేయకను గడు నిబ్బరమున ధీరతనూ
కరమున నున్నా ఘనమగు శిలనూ కడు మౌనంబున రాక్షసునీ
వక్షస్థలమున బడవేసెను మఱి వనరగ క్షితిపైనను గూలన్! 40

ఆ శిలాప్రహారము జేతను మఱి యా విద్యున్మాలియు నపుడున్!
వక్షస్థల మంతయు నలిగినదై కుక్షియు జీలికలై పోయెన్!
ప్రాణములు మఱి పైకిపోయినవి బరగ నేలపై బడిపోయెన్! 41

శూరులైన యా రజనీచరులును శూరులైన కపివీరులచే
సిటుల నచట రణరంగము నందున నిమ్ముగ దివౌకసుల జేతన్!
దైత్యుల వోలెను నశించి రచ్చట దగ లంకానగరము నందున్! 42

మృతదేహంబులు దినుటకు వచ్చిన యతి భయంకరపు నక్కలతో!
నిండిపోయినవి యా రణభూమియు మెండుగ యాయుధములతోడన్!
భల్ల బాణముల జేతను మఱియును బఱగ శక్తి తోమరములతో
గదలజేత మఱి పట్టిసములచే ఖడ్గంబులు మఱి శూలములన్!

అశ్వంబులచే, రథముల జేతను నట మరణించిన గజములచే
రథ చక్రంబులతో నిసురులతో రమ్య కాడికట్టల జేతన్
వ్యాకులమై నట భయంకరముగా వనరగ కనిపించుచు నుండెన్!
మరణించిన యావానర రాక్షస మహాత్ముల యవయవములచే! 43-44

దేవాసుర యుద్ధమునకు బోలెను దీరుగ వ్యాకులమైన యనిన్!
వానర రాక్షస మొండెంబులునూ వనరగ రణరంగము నందున్!
దిక్కుల యందున నెగిరిబడినవీ చక్కని పూవుల గుత్తులుగా! 45

అటు బిమ్మట యా కపివీరులచే నలరి గొట్టబడు రాక్షసులున్!
రక్తదిగ్ధ గాత్రంబుల జేతను రహి యా రాక్షస వీరులునూ!
దివాకరుని యా యస్తసమయమునకు దీరుగ గాంచుచు తమ బలమున్!
ప్రదర్శించుటకు మఱల రణమునకు బన్నుగ యుద్యుక్తులు నైరి! 46

(యుద్ధకాండమునందు 43వ సర్గము సమాప్తము)

* * *

## నలుబది నాల్గవ సర్గము

(రాత్రి సమయమున వానర రాక్షసుల మధ్య భయంకరమైన యుద్ధము జరుగుట - అంగదుడు నింద్రజిత్తును ఓడించుట - ఇంద్రజిత్తు మాయా బలముచే అదృశ్యుడై రామలక్ష్మణులను నాగపాశములచే బంధించుట)

ఆ వానర రాక్షసులు నచ్చటను నలరి రణము సేయుచు నుండెన్
దివాకరుడు మఱి యస్తమించెనూ దిక్కులు జీకటి వ్యాపింపన్!
ప్రాణంబుల హరియించు రాత్రియును బన్నుగ నంతట నరుదెంచెన్! 1

అట్టిసమయమున నన్యోన్యంబును నిట్టి వైరమును బూనుకొనీ!
జయమును గోరెడి భయంకరులు నగు సాహస వానర రాక్షసులున్
పరస్పరము బోరాడగ సాగిరి బటు బల విక్రమముల తోడన్!
రాత్రి యుద్ధమును బ్రారంభించిరి రహి భయంకరముగా నపుడున్! 2

భయంకరంబగు నంధకారమున బరగ 'నీవు రాక్షసుడ'వనీ
బలుకుచు వానరులే వానరులను నలరి జంపుకొని రబ్బురతన్!
'నీవు వానరుడ!' వని బలుకుచు మఱి యల రాక్షసులును రాక్షసులన్!
జంపుకొనిరి వానరులు వానరుల జంపుకొనిరి రాక్షసులు మఱిన్! 3

అటుబిమ్మట యా సైన్యము నందున నట జంపుము! జీల్పుము! యనుచున్!
'రమ్ము! పారిపోవుచు నున్నావూ! మఱి యెందులకని?' బలుకుచునూ!
వ్యాకులమైనా యఱపులు వినబడె వనరగ యా రణరంగమునన్! 4

అటుబిమ్మట జీకటుల రాత్రినీ యలరెడి బంగరు గవచములన్!
గలవారును నగు మహారాక్షసులు గడు దీప్తౌషధములు గలుగూ!
శైలేంద్రములకు వలె గనబడిరీ సాహసులగు నా రాక్షసులున్! 5

దుష్పారంబగు జీకటి రాత్రిని దుష్ట చిత్తులగు రాక్షసులున్!
క్రోధముతో నిండిన వారగుచును గూరిమి భక్షించుచు గపులన్!
మహాజవముననను వచ్చి బడిరిగా మానుగ ద్రావుచు రక్తములన్! 6

భీమకోపమును గలవాడును మఱి భీమబలంబును గలవారున్!
ఆ వానరులును బైకి యెగురుచును బన్నుగ బదునగు దంతములన్!
బంగరునగలును గల యశ్వంభుల బరగ సర్పముల సమానముల్
ధ్వజపతాకముల జీల్చి వేసిరీ దగ హయముల హతమార్చుచునూ!
క్షోభను గూర్చిరి, రాక్షసవీరులు క్షోభించిరి యా జీకటినీ! 9

క్రోధముతో నిండిన గపివీరులు గూరిమినటగల గజములనూ!
గజములపైనను నున్నవారలను గడుసుందర ధ్వజబతాకముల్!
గూడిన రథముల గ్రిందికి లాగీ క్రూరమైన తమ దంతములన్!
కఱచిరి జంపిరి కదలకుండగను ఘనమగు శిలలను బైవైచీ! 8

ఆ శ్రీరాముడు లక్ష్మణుండునూ యాశీ విషోప సమానముల్!
బాణంబులచే దృశ్యాదృశ్యులు బన్నుగ దృఢవిక్రములున్గనూ!
శ్రేష్ఠులైన యా రాక్షసవీరుల శీఘ్రము జంపిరి శరములచే! 9

గుఱ్ఱపు డెక్కలజేత నలిగినా కూరిమి నేలను పైనున్నా
ధరణీ పరాగము చక్రాంతంబుల దగ పైపైకిని లేచినదై!
రణరంగంబున రణమునుజేసెడి రథి సైనికులకు వేగముగన్
నేత్రములను కర్ణముల నింపెనూ నింపె నాశికల కడ్డముగా! 10

భయంకరంబును రోమ హర్షణము బరగ రణము జరుగుచు నుండన్
రణరంగంబున భయంకరంబగు రక్తపు నదులును బ్రవహించెన్! 11

అంతటి లోపల శంఖంబులతో వింతగ చక్రధ్వనియు మఱిన్
ఆశ్చర్యంబుగ భేరి-మృదంగము నల చక్రాంతములగు ధ్వనులున్
వినిపించెను నట విలయ మొచ్చినటు విపరీతంబగు ధ్వని గలిగెన్! 12

సకిలించెడి గుఱ్ఱంబుల ధ్వనియును సరసత నట వినిపించుచునూ!
చంపబడెడి రాక్షసుల వానరుల కంపిత వేదనల ధ్వనియున్!
అఱపులయును మఱి గావుగేకలయు నట భయమును గలిగించునటుల్
వినబడుచుండెను విషమముగా నట వీనులు బ్రద్దలు నగునటులన్

౦ భూమిస్థలి యందు రక్తమును రహి బురదయు వ్యాపింపగనూ!
రణించిన వానరవీరులునూ మానుగ జచ్చిన రాక్షసులున్!
యుండిరి రణరంగ మంతటను బరగ రంగవల్లులకు వలెన్
కి శూలములు గద్రగొడ్డళులు సరసత యాయుధ సమితియునూ!
మితల్లినీ పూజించుటకై పూవులు జల్లిన విధముగనూ
బడుచుండెను యట్టి భూమినీ కని గుర్తించుటకు గానీ
కాశించుటకు శక్యము గాకను భయంకరముగా నట నుండెన్! 14-15

బదిమ్మట యా భయంకరంబగు నా రాత్రిని యా చీకటినీ!
రాక్షసులును నుత్సాహముతో నలరు శరములను వదులుచునూ
శ్రీరాముని యెదుట నిలిచి మఱి నట యెదిరించిరి తీవ్రముగా! 15

మస్త భూతంబులకును మఱియును సర్వ ప్రాణులకు గూద మఱిన్
తిక్రమింపగ శక్యముగానీ యలరు కాలరాత్రికి వోలెన్!
రాత్రియు ఘోరముగా నుండెను ఆల వానర రాక్షసులకు మఱిన్!
శము జేయగ వచ్చినదా యన నయముగ కనిపించుచు నుండెన్! 16

పముతో గర్జించుచు మఱియును క్రోధముతో మీదను బడెడీ
రాక్షసులును జేసెడి ధ్వనులును నలరు ప్రళయకాలము నందున్
లధి భీకర ధ్వనివలె నుండెను నలల తెరల స్వనముల వలెనూ! 18

శ్రీరాముడు రెప్పపాటునను నలరుచు ధనువును సంధించీ!
గ్ని శిఖోపము ను నగు శరముల యారింటిని వదిలెను వేగన్!
ర్గురునగు రాక్షసులను గొట్టెను నా సమయంబున వేగముగన్! 19

ర్ధర్షుడునగు యజ్ఞశత్రువును దుర్జయులగు శుకసారణులున్!
మహాపార్శ్వుడును, మహోదరుండును, మహాకాయుడను రాక్షసుడున్!
వజ్రదంష్ట్రిదను నారుగు రప్పుడు వనరగ రాముని శరములచే!
ర్వ మర్మస్థానముల యందునను సరగున తాడితులై వారున్!
ణరంగబున నుండి పాఱిరీ రణగొణ ధ్వనులను జేయుచునూ!
ప్రాణంబుల దక్కించుకొనిరి దమ ప్రాభవంబు మఱి జూపకనూ!
ఱికిపందలె వెన్నును జూపిరి ప్రీతిని ప్రాణంబుల మీదన్! 20-21

మహోరథుండగు రామచంద్రుడును మానుగ భయంకరము లైనా
అగ్నిశిఖలకును సమానమైనా యలరు దీవ్ర శరములజేతన్!
దిక్కులు, దిశలను వినిర్మలముగా దీరుగ జేసెను రాఘవుడున్!
రాక్షసులందఱ నిర్మూలించెను రహి యొక్కండును లేకుండన్! 22

ఆ శ్రీరామున కెదురు నిలిచినా యా రాక్షసులందఱు గూడన్
అగ్నిని బొందిన బతంగములవలె యారణ రంగము నందుననూ!
నశించిపోయిరి ప్రాణంబులనూ నయముగ వదిలిరి శీఘ్రముగన్! 23

అన్నివైపులను నలరిబడెడి యా సున్నిత సువర్ణపుంఖములన్
గలిగిన యా రాముని బాణములను నలరి వ్యాప్తమై యా రాత్రిన్
ఖద్యోతంబులచే శరత్తునను గలిగిన రాత్రికి వోలె నటన్
ప్రకాశించుచుండెను నా నిశియును బరగ చిత్రవర్ణము వోలెన్! 24

భయంకరంబగు నా రాత్రియునూ ప్రబలమైన రాక్షస ధ్వనిచే,
భేరీనాదంబుల జేతను మఱి భీకరముగ నా రాత్రియునూ
భయమును గొలుపుచు నుండెను నప్పుడు భారముగా నేనల కుండెన్! 25

అంతట వృద్ధిని బొందినట్టి యా యనంతమగు నా శబ్దంబున్!
కందరముల యందున వ్యాప్తమునై గడు మహత్తరము నగుధ్వనితో!
త్రికూట పర్వతమును మాటాడుచు దీరుగ మన్నటు గనిపించెన్! 26

మహాకాయములు గలిగినవారును మఱి జీకటితో సమానులున్!
శరీరఛాయను గలిగినట్టి యా సరగున గోలాంగూలములున్!
బాహుపంజరములను రాక్షసులను మఱి బన్నుగ బంధించుచు వేగన్!
భక్షించెను దమ యాకలి దీరగ కుక్షినింద బహు నాతురతన్! 27

రణరంగంబున శత్రు వీరులను రహి వధించుటకు వచ్చిన యా
అంగదుండు మఱి యతి శీఘ్రముగా రంగుగ రావణు గుమారుడున్!
ఇంద్రజిత్తునూ, యతని సారథిని సాంద్ర సుందరము లైనట్టి
రథ హయముల మఱి జితుకగొట్టెనూ రణమున నందఱు గనుగొనగన్!28

భయంకరము బృశ దారుణమైనా బన్నుగ యని జరుగుచు నులదన్
అంగదుచే హయములు, సారథియును రంగుగ జంపగ బడినపుడున్!
మహామాయలును గలవాడును మఱి మానుగ యింద్రజితుం దపుడున్!
దన యరదంబును విడిచి శీఘ్రముగ దగ యంతర్ధానము నొందెన్!29-30

పూజార్హుండగు వాలి పుత్రుడును బొలుపుగ జేసిన యాపనికిన్
మహర్షులును మఱి కిన్నర, యక్షులు మఱి దేవతలును గూడ మఱిన్
రామలక్ష్మణులు నిద్దరు గూడను రహి స్తుతించి రా యంగదునిన్! 31

రణమునందు నా యింద్రజిత్తునీ రణకౌశలమును నందఱకున్
దెలయుగదా! మఱి యందుచేతనే దీరుగ యంగదు వీరునిచే!
రణమునంధు వెనుదీయుట గనుగొని రహి సకలమునగు భూతములున్!
సంతోషించెను, మోదము నందెను సరసత రోమాంచము గలుగన్! 52

అటుబిమ్మట నా సుగ్రీవుండును నా విభీషణుడు మఱి కపులున్!
శత్రువు బరాజితుండై మఱియును సరగున యంతర్ధానంబున్!
నగుటయు గని సంతసమును నందుచును నఱచుచు మోదంబున వారున్!
'బాగు!' 'వాగు!' అని ప్రశంస జేసిరి బన్నుగ యా యంగదు నపుడున్!33

భీమకర్ముడును, వాలి సుతుండగు బన్నుగ యంగదు గుమారుచే
సంగ్రామంబున నిర్జింపగ బడి సాంద్రబలుండగు నింద్రజితూ
సుదారుణంబగు క్రోధము దోడను నురుచిరమగు చాపము బట్టెన్! 34

పాపాత్ముండును, రణ తర్కుశుడును బన్నుగ రావణు కుమారుడున్!
ఇంద్రజిత్తు గనిపింపక యెవరికి సాంద్రబలంబున జవముననూ
వజ్రమునకు మఱి సాటియైన యా వాడిబాణముల సంధించీ
రామలక్ష్మణుల పైని వదిలెనూ రహి శీఘ్రముగా నదృశ్యుండై! 35

ఇంద్రజిత్తు గోపించిన వాడై సాంద్రమైన సంగ్రామమునన్!
భయంకరములును, సర్పరూపములు బన్నుగ శిత శరముల జేతన్
రఘువంశంబున జన్మించిన యా రామలక్ష్మణుల వేగముగన్!
సర్వ గాత్రముల యందున శరముల సరగున ప్రయోగమును జేసెన్! 36

కపట యుద్ధమును జేయువాడు మఱి గానరాక యుండెడి వాడున్!
మాయజేత దా కనబడకుండగ మానుగ యుద్ధము నందుననూ!
రామలక్ష్మణుల మోసగించుచును రమ్యముగా నా సోదరులన్!
శరబంధముచే బంధన జేసెను చారుశీలురగు సోదరులన్! 37

కోపించిన యా యింద్రజిత్తునూ క్రూర సర్ప బాణంబులనూ!
ప్రయోగించి యా పురుష శ్రేష్ఠుల బన్నుగ వీరులు నగువారిన్!
రామలక్ష్మణుల నటు బంధించుట రహి కపివీరులు గాంచి రటన్! 38

రావణుబుత్రుడు నింద్రజితుండును రహి ప్రకాశ రూపముతోడన్
రామలక్ష్మణుల బాధించుటకును రమ్యమైన శక్తియు లేకన్
మాయాజాలముతోని వారలను మానుగ యా రఘువీరులనూ!
సర్పబాణముల మాయల జేతను సరగున బంధించెను వారిన్! 9

(యుద్ధకాండమందు 44వ సర్గము సమాప్తము)

* * *

# యుద్ధకాండము - మొదటిభాగము

## నలుబది యైదవ సర్గము

(ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణములచేత రామ లక్ష్మణులు మూర్ఛను జెందుట— వానరవీరులు శోకించుట).

రాజపుత్రుడును, బలశాలియునగు రాముడు రావణు కుమారునీ!
ఇంద్రజిత్తు మార్గమును గనుంగొన సాంద్రయోధులగు బదిమందిన్!
ఆజ్ఞాపించెను వేగ కనుగొనగ యా రాక్షసునీ మాయావిన్! 1

శత్రుమర్దనుండైన రాముడును సరగున సుషేణు గుమారులన్!
వీరులనిద్దఱ నియోగించెనూ వీరుడైన నీలుని మఱియున్!
వాలిపుత్రుడగు నా యంగదునీ వనర్చ బలాఢ్యుడు నా శరభున్!
ద్వివిదుని మఱియును హనూమంతునీ ధీరుడు స్థానుప్రస్థు మఱిన్
ఋషభుని మఱియును మహావీరుడగు ఋషభస్కంధుని బిలిచి మఱిన్
ఆజ్ఞాపించెను రాక్షసు వెదుకగ యాతని గతి దెలియగ వేగన్! 2-3

సమస్తమగు నా ప్లవంగ వీరులు సహజోత్సాహముతోని మఱిన్
భయంకరంబగు వృక్షంబులతో బరగ నెత్తి యాయింద్రజితున్
పదిదిక్కుల మఱి వెదుకగ సాగిరి బన్నుగ బిలుచుచు రణమునకున్!
ఆకాశంబున ప్రవేశించిరీ యలరి రణమునకు సిద్ధంబై! 4

అస్త్రవిదుండగు నింద్రజితుండును నస్త్రంబుల నంధించి మఱిన్!
అధిక వేగమును గల శరములచే అధిక వేగమును గల కపులన్!
వారివేగమును శమింప జేసెను వరుసగ బాణంబుల జేతన్! 5

భీమవేగమును గల యాకపులును భీషణమగు శరముల జేతన్!
గాయబడిన శారీరంబులచే గడు దీవ్రమునగు జీకటినీ!
మేఘంబులచే గప్పబడిన యా మిలమిల మెఱసెడి సూర్యువలెన్
అంధకారమున యా రాక్షసునీ యలరి జూడలేకను కపులున్! 6

సమితింజయుడగు నింద్రజిత్తునూ సమస్త దేహము దహియించూ
బాణంబుల మఱి మాటి మాటికిని బన్నుగ ప్రయోగమును జేసి!
రామలక్ష్మణుల వే గురిజూచుచు రహి ప్రవేశ పెట్టెను శరముల్, 7

వీరులైన యా రామలక్ష్మణుల విమల శరీరము అందుననూ!
కోపించిన యా యింద్రజిత్తునూ కూరిమి బాణంబులు నైనా
సర్పంబులచే శరీరమంతను సందు యెందు లేకుండగనూ
కొట్టుచు బాధించెను వారలనూ యిట్టెరక్తమును స్రవియింపన్! 8

దశరథపుత్రులు రామలక్ష్మణులు దగ దోర్బలులును మహాత్ములున్
అట్టి రామలక్ష్మణుల గాత్రములు నిట్టె బారె రక్తపుధారల్!
మోదుగులును మఱి కింశుకంబులును మోదముగా బూచిన యటులన్!
ప్రకాశించిరి వారలు సైతము బన్నుగ రక్తపు ధారలచే! 9

అటుబిమ్మట నా రక్తాక్షుండును నలరెడి గాటుక కుప్పకునూ!
సమానుండునగు నింద్రజితుండును సరసత యంతర్హితుడునునై!
సోదరులగు నా రామలక్ష్మణుల పూర్ణ వాక్యముల నటు లనియెంశోన్! 10

కనబడకుండగ యుద్ధము జేసెడి కదన పాండితుడ నగు నన్నున్!
త్రిదశేశ్వరుడగు నింద్రుడు సైతము దీరుగ జూడను జాలడుగా!
సమీపింపగను జాలడు సుమ్మీ సమరము జేయగ జాలడుగా!
మీ రిరువురినీ జెప్ప నేమిటికి మీరిన వాక్యములను జేర్చి! 11

ఓ రఘువీరులు! రామలక్ష్మణులు నొనరగ నా శరజాలముచే
కోపముతో నిండిన మనస్సుగల కూరిమి బలవంతుడ నేనున్!
కప్పివేయుదును మీ యిరువురినీ కష్టములను మఱి దప్పింపన్!
యముని సదనమునకును బంపెద వే విమలాతిథ్యము నొందగనూ! 12

ధర్మవేత్తలగు నా సోదరులను దగ రాముని యా సౌమిత్రిన్
నిటుల బలుకుచును నింద్రజిత్తునూ చటుల వాడి శరముల జేతన్!
ఛేదించెను నా రామలక్ష్మణుల బాధను బొందగ యిరువురునూ!
అటుబిమ్మట యా యింద్రజితుండును నలరి సింహ నాదము జేసెన్! 13

ంక కుప్పకు వోలె నల్లనగు గడు భీకరుడగు నింద్రజిత్తూ!
లమైన తన ధనుస్సు జఱచుచు విల్లువీగుచును రణమందున్!
ల భయంకరమగు శరములనూ మానుగ విడిచెను; ధ్వని జేసెన్! 14

ర్మస్థానముల నెఱిగినట్టి యా మానుగ వీరుడు నింద్రజిత్తూ!
లైన యా రామలక్ష్మణుల విమల మర్మస్థానము లందున్!
ేమాటికిని శరముల దింపుచు మాఱు మ్రోగగా ధ్వని జేసెన్! 15

రంగాగ్రపు భాగము లందున రణమున నిమేష కాలమునన్
ంధముచే గట్టబడిన యా సౌశీల్యులును, మహావీర్యుల్
లక్ష్మణులు గనులు విప్పి మఱి రహి గనజాలక యుండిరటన్! 16

ప్న సర్వాంగములును గలిగిన వీరులైన యా సోదరులున్!
మంతయు బాణపు ములుకులు సరగున వ్యాప్తంబై యుండన్!
ముక్తమై కదలుచున్న యా రమ్య మహేంద్రుని ధ్వజము వలెన్!

పోయినా వారును మఱియును జెదిరిన మనసును గలవారున్!
స్థానములు ఛేదించుటచే మానుగ గ్రుంగిన వారు మఱిన్
వీరులును, మహా ధనుస్సులు మానుగ గలిగినవారు మఱిన్
పతులగు రామలక్ష్మణులు దగ నేలను బడిపోయి రటన్! 17-18

రైన యా రామలక్ష్మణుల విమల శరీరములును మఱియున్
ంబులచే పరిపూర్ణంబుగ బన్నుగ కప్పగ బడియుండెన్!
ముచేతను దడుపగ బడియును రమ్య వీర శయనమునందున్!
నించిరి యా రామలక్ష్మణులు సరగున మూర్ఛను బొందిరటన్! 19

ంగములును శరముల జేతను సారత గ్రుచ్చగ బడి యుండెన్!
ంశమైనను చోటులేదు గద! యలరెడి వారి శరీరమునన్!
మంతయు గాయము లయ్యెను సరగున రక్తపు ధారలతో!
జేని స్థితి ద్రాపురించెనూ కదనమ్మందు నిస్తబ్ధులునై! 20

కామరూపమును గలవాడును మఱి కఠినుడు, క్రూరుడు, నింద్రజితూ!
ఆ రాక్షసుచే గొట్టబడిన యా నల దశరథుని కుమారులునూ!
దగ ప్రస్రవణపు బర్వతంబునను దగ జలములు స్రవియించినటుల్
యధికమైన రక్తమును స్రవించిరి యా శ్రీరాముడు, లక్ష్మణుడున్! 21

సురరాజగు దేవేంద్రుని పూర్వము సురుచిరముగ యని జయించెనో
అట్టి యింద్రజితు గ్రోధము వలనను నలరి తీవ్రతర బాణములన్!
మర్మస్థానముల మాటికి మాటికి మానుగ గొట్టుట జేత మఱిన్
ముందుగ వీరుడు రామచంద్రుడును గందుచు ధాత్రిని బడిపోయెన్! 22

నాగపాశముల బంధించియు మఱి నయముగ యాజగతీపతినీ!
రామచంద్రునీ, యింద్రజిత్తు మఱి రహి బంగారపు పొన్నులునూ
వాడియైన శరముల గ్రిందికినీ వడివడి ప్రయోగమును జేసెన్!
నారాచములను, నర్థ నారాచ భల్ల, అంజలిక శరములనూ
వత్సదంత మఱి సింహదంష్ట్రముల వాడి బాణముల తోని మఱిన్!
ఆ శ్రీరాముని పైని విడిచెనూ యారావణు దనయుండు మఱిన్! 23

స్వర్ణ భూషితంబైనది మఱియును సరి మూడు ప్రదేశము లందున్!
వంపులు దిరిగిన యా ధనుస్సునను సొంపగు నారియు నూడె నటన్!
పిడికిలి పట్టును జారిపోయినది ప్రిదిలి కార్ముకము బడిపోయెన్!
అట్టి కార్ముకము నా శ్రీరాముడు నిట్టి దూరముగ బడవేసెన్
వీరశయనమున శయనించెను మఱి వీరుడైన శ్రీ రాఘవుడున్! 24

ధనుస్సునుండీ విడిచిన బాణము దగబడు దూరము నందుననూ!
పురుషశ్రేష్ఠు డా రామచంద్రుడును స్పృహ దప్పియు బడిపోవుటయున్!
గాంచి లక్ష్మణుడు గరుణామయుడై యంచితముగ జీవితమందున్
ఆశవదులుకొని యన్నను గాంచుచు నడలుచు దుఃఖము నొందె నటన్! 25

పద్మ పత్రముల వంటి నేత్రములు బన్నుగ గలిగిన సోదరునీ
శరబంధంబున బంధించుటచే శరీరమంతయు గాయములై
రక్తసిక్తుడై దడిసియు మఱియును రహి నేలను బడి యుండుటయున్
లక్ష్మణుండు వేదనను బొందుచును లావుగ దుఃఖించెను నచటన్! 26

ఆ శ్రీరాముని గాంచి కపులునూ యతి సంతాపము నొంది రటన్!
శోకార్తులునై యశ్రువు లొలుకుచు శోకించిరి రాముని గాంచి!
ఘనమగు ధ్వనియును గలుగునట్లుగా గలతను నేడ్చిరి తీవ్రముగా! 27

హనుమంతుడు మఱి వానర వీరులు నల గపియోధులు నందఱునూ!
నాగపాశముల జేత బద్ధులై నయముగ ధాత్రిని బడియున్నా
రామలక్ష్మణుల జుట్టును జేరిరి రహి వారల గనుగొనుచు మఱిన్
దుఃఖ పీడితులునై నట నుండిరి దురపిల్లుచు మఱి జంతిలుచున్! 28

(యుద్ధకాండములోని 45వ సర్గము సమాప్తము)

* * *

## యుద్ధకాండము - మొదటి భాగము

### నలుబది యాఱవ సర్గము

[మూర్ఛితులైన రామలక్ష్మణులను గాంచి వానర వీరులు దుఃఖించుట — ఇంద్రజిత్తు ఆనందముతో గొప్పలు జెప్పుకొనుట — విభీషణుడు సుగ్రీవునకు ధైర్యమును జెప్పుట — ఇంద్రజిత్తు లంకలో ప్రవేశించి, తండ్రికి శత్రువధ వృత్తాంతమును వినిపించుట — రావణుడు సంతోషించి కుమారుని యభినందించుట.]

అటుబిమ్మట యా వానర వీరులు నటు గగనమునకు నిటు భూమిన్!
అవలోకించుచు, బాణంబులతో నా విధముగ గప్పగ బడియున్!
నున్న సోదరులు మహావీరులను నురు గుణమంతులు నగువారిన్!
రామలక్ష్మణుల గాంచుచు నుండిరి రహి వేదన దుఃఖముతోడన్! 1

పర్జన్యుడు వర్షించి నట్లుగా బరగ రాక్షసుడు బాణములన్
రామలక్ష్మణులపై వర్షించియు రహికృత కర్ముండై బిదపన్!

నుపరతుడగు చుండగ నచ్చటికిని యురువిక్రముడును, బలాఢ్యుడున్
విభీషణుడు సుగ్రీవుని తోడను వేగముగా నచటికి వచ్చెన్! 2

నీలుడు,ద్వివిదుడు,మైందుడుగుముదుడు మఱి సుషేణుడును, నంగదుడున్
హనుమంతునితో గలిసి వారలును హాహాకారములను జేసి!
రామలక్ష్మణుల నవలోకించుచు రహి దుఃఖించిరి వేదననూ! 3

అచేష్టుబును, మఱి మంద మందగముగ మానుగ శ్వాసయు గలవారున్!
రక్తముజేతను దడిసిన వారును, రహి శరజాలము దోడుతనూ!
వెండినవారును గదలని వారును, నిండు వీరశయనము నందున్
నున్నవారు మఱి సర్పంబుల వలె జెన్నుగ నిట్టూర్పుల తోడన్!
నిశ్చేష్టులు మఱి మంద విక్రములు నిరవధికముగా రక్తముచే
దడిసిన వారును, స్వర్ణ వికారపు ధ్వజముల వలె నుండిన వారున్!
వీరశయనముల నుండిన వారును వికల మంద చేష్టల తోడన్
నున్నవారు మఱి కంటినీటితో తమ్ము దాము మఱచిన వారున్!
తమ వానర సేనానాయకులును దగ పరివృతమై యుండియునూ

శరజాల సమన్వితులగు వారును చారు సుందరులు సోదఱులున్!
రామలక్ష్మణుల గాంచి రవిసుతుడు రహి విభీషణుడు కపివీరుల్!
వ్యథనుజెంది బాష్పములను రాల్చిరి బాధను జెందిరి యందఱునూ! 4-7

ఆ వానర వీరులును గగనమున యన్ని దిక్కులను గాంచియునూ!
యుద్ధమందు మాయాజాలముతో నుద్ధతుడగు నా యింద్రజితున్!
దాగియున్న వానిని గనజాలక దల్లడిల్లిరి యా కపి వీరుల్! 8

విభీషణుండును మాయజేతనే మఱి సహాయమున గనుగొనగా!
మాయజేత మఱి గప్పబడుచునూ మానుగ యెదుటను నిలబడినా!
యింద్రజిత్తుని కనుగొనె నాతడు సాంద్ర మాయ శక్తుల చేతన్!

తేజస్సును మఱి యశస్సు, శూరత దీరుగ పరాక్రమము గూడి
యుండినవాడు విభీషణుం డపుడు నిండు బరాక్రమ శాలియునూ!
ఆహవమందున యప్రతిద్వంద్వుడు యల యజు వరదానము జేతన్!

గర్వితుండు మఱి యంతర్ధానము గలిగిన భీషణ రాక్షసునీ!
కనుగొనె నంతట విభీషణుండును కాంతిమంతుడగు నింద్రజితున్! 10

ఇంద్రజిత్తు ధన కార్యంబునకును సాంద్రమైన యా భూస్థలినీ
రామలక్ష్మణులు శయనించుటయును రమ్య దృశ్యమును గాంచియునూ!
పరమ ప్రీతిని బొందినవాడై బన్నుగ రాక్షసులను గాంచీ!
పరమహర్షమున నిటులను బలికెను ప్రభువగు రావణు దనయుడునూ! 11

ఖరుని దూషణుని సంహరించినా ఘనమగు బాహు బరాక్రములున్!
సోదరులయినా రామలక్ష్మణులు శోచనీయముగ యీనాడున్!
నా బటు తరమగు బాణంబులచే నయముగ నేలను బడిరిపుడున్! 12

సురలు, రాక్షసులు, ఋషి సంఘంబులు సురుచిరముగ యందఱు గలిసీ
యేకమగుచు మఱి వచ్చినగూడను నిమ్ముగ యీ సోదరుల మఱిన్!
నాదు బాణబంధంబుల నుండియు నయముగ విడిపింపగ లేరూ! 13

వీరశయమున నున్నవారునూ వీరులునగు నీ సోదరులున్!
రామలక్ష్మణులు మనకందఱిని రహి యనర్థముగ నుండి రిటన్!
మన మూలంబును ద్రుంచి వేయుటకు మానుగ నుండిరి సిద్ధముగా
ఈయనర్థమును దలచియు మనసున నిమ్ముగ నిదురయు లేకుండన్
గడిపినాడు బహురాత్రులు దండ్రియు గానరాని వేదన తోడన్!

ఈ కారణమున లంకానగరము నిమ్ముగ వర్షాకాలమునన్
నదికివోలె మఱి వ్యాకులమైనది నయముగ నే నీ సమయమునన్
అట్టి యనర్థము దొలగించితినీ యిట్టి నాదు విక్రమముననూ! 14-15

రామలక్ష్మణుల బరాక్రమంబును రహి కపివీరుల విక్రమముల్!
శరత్కాలమున దోయదములవలె సర్వము వ్యర్థము లాయె నికన్!
మట్టి గలిసినవి వారి యత్నములు నుట్టి కెక్కినవి ప్రయత్నముల్! 16

ఇంద్రజిత్తు రాక్షసులతోని నిటు సాంద్రచిత్తమున బలుకుచునూ!
అచటను నిలిచియు జూచెడి వారల యలరెడి కపి యోధుల గూడన్!
తీవ్రతరంబగు బాణంబులనూ! దీరుగ వారలపై విడిచెన్! 17

అమిత్రఘ్నుడగు నా రాక్షసుడును నలరెడి తొమ్మిది బాణములన్!
ఆల నీలునిపై విడిచెను మఱియును నా మైంద ద్వివిదుల గూడన్
మూడు మూడు బాణంబుల తోడను మోదముగా గొట్టెను వారిన్! 18

మహాధనుస్సును గల రాక్షసుడును మహా జాంబవంతుని పైనీ
వక్షస్థలమున నొక్క బాణమున వనరగ గొట్టెను వేగముగన్!
మహాజవంబునుగల హనుమంతుని మానుగ వక్షస్థల మందున్
పదిబాణములను బ్రయోగించెనూ బల్లిదుడగు నా యింద్రజితూ! 19

మహాబలంబును గల రావణియును మానుగ యుద్ధము నందుననూ!
అమిత బరాక్రమ మగువారును మఱి యలరు బలాఢ్యులు నైనట్టి!
ఆ గవాక్షునీ, యాశరభుని మఱి యలరుచు రెండగు బాణములన్
బ్రయోగించెనూ వక్షస్థలముల బడి పోవగ ధాత్రిని వాడున్! 20

అటుబిమ్మట యా యింద్రజిత్తునూ యతి త్వరితగతుడై వేగన్!
గోలాంగూలంబుల యా నేతను, గూరిమి వాలి సుపుత్రుండున్!
అంగదునీ మఱి యనేక శరముల యలరుచు గొట్టెను దీవ్రగతిన్! 21

బలవంతుండును ధైర్యశాలియును నలరి యింద్రజిత్తు దచటన్!
అగ్నిశిఖలకును సమానంబులగు నలరు శరములను వేగముగన్
వానరశ్రేష్ఠుల శరీరంబులను వనరగ చీలిక లగునటులన్
జేసి ప్రబలమగు సింహనాదమును శీఘ్రము జేసెను బిగ్గఱగన్! 22

మహాబాహు వగు నింద్రజిత్తునూ మఱి బహు బాణంబుల చేతన్
ఆ కపివీరుల బీడించుచునూ యలరి భయంపడు నటుజేసీ!
'అహహా!' యనుచును వికట హాసమును నలరిజేసి యటు మీదటనూ!
తనవారలునగు రాక్షసవీరుల చగ గనుగొని యిటులను పలికెన్! 23

రాక్షసులారా! సేనాగ్రంబున రహి భయంకరము లగు నవియున్!
శరములచే బంధించితి జూడుడు! చక్కని రాముని లక్ష్మణులన్!
కలిసి పడియున్న యా సోదరులను గాంచుడు చక్కగ కనువిందున్! 24

అటుల బలుకు నా యింద్రజిత్తునూ చటుల బరాక్రమమును గనుచున్!
ఆపట యుద్ధమున బండితులైనా కర్మఠులగు నా రాక్షసులున్!
ఆ మాటలువిని యాతడు జేసిన యపూర్వమగు కర్మను గాంచి!
ఆశ్చర్యంబును బొందిరి వారలు నబ్బుర మందిరి సంతసమున్! 25

మేఘంబులతో సమానులైనా మీరిన రాక్షసు లందఱునూ
మహాధ్వనులనూ జేసిరి వారలు మానుగ సంతోషము నంది!
రాముడు గతించెనని మదియందున రమ్యానందము జెందుచునూ
రావణ సుతుడగు నింద్రజిత్తునూ రహి బూజించిరి యంజలులన్! 26

అట్టి సమయమున గదలకుండగా నలరి శ్వాస లేకుండగనూ!
సోదరులగు నా రామలక్ష్మణులు శోచనీయమగు దశయందున్!
యుండుట గని యా యింద్రజిత్తునూ నిండు సంతసము నంది మదిన్
రామలక్ష్మణులు గతించినారని రమ్యముగా మనసున దలచెన్! 27

సమితింజయుడగు నింద్రజిత్తునూ సంతసమున గూడిన వాడై
సమస్త రాక్షససేన నంతయును సంతోషంబున ముంచుచునూ!
లంకానగరము బ్రవేశించెనూ లలిత సుందరంబగు నగరిన్! 28

బాణంబులచే వ్యాప్తములైనా బన్నుగ రాముని లక్ష్మణునీ
శరీరంబులను సర్వాంగములను సాంగముగా బరిశీలించి!
అల సుగ్రీవుని మనసు నందునను నావేశించెను భయము మఱిన్ 29

పరిత్రస్తుండును సభాష్ప వదనము బన్నుగ గలవాడును మఱియున్
వ్యాకుల నేత్రంబులు గలవాడై నటు దీనత సుగ్రీవుండున్
యుండుట గని యా విభీషణుండును నిండిన మనసున నిటు లనియెన్! 30

సూర్యసుతా! ఓ సుగ్రీవా! విను! సుంత భయంబును బొందకుమా!
కన్నీటిని మఱి నిగ్రహింపుమా! కయ్యము లీ విధముగ నుండున్!
విజయము నిశ్చితమును గాదు గదా వీర విహారుల కెల్లపుడున్!
భయబడరాదూ! వీరు లెప్పుడును బన్నుగ యపజయ మందిననూ! 31

వీరోత్తమ! ఓ సుగ్రీవా! విను విముఖమైన నా వాక్యములన్!
భాగ్యవిశేషము గలిగి యున్నచో బన్నుగ మనవారల కిపుడున్!
మహాత్ములును బహువీరులు నైనా బన్నుగ రాజకుమారులునూ!
రామలక్ష్మణులు మోహము విడిచీ రహి రణంబునకు నిలిచెదరూ! 32

సుగ్రీవా! విను! నీవు ధైర్యమున సురుచిరముగ నిలబడియు మఱిన్
అనాధుండనగు నను ధైర్యంబున యలరు నటుల జేయుము మఱియున్!
సత్యధర్మముల యందాసక్తియు సహజ దీక్ష గల వారలకున్!
మృత్యువునందున భయము లేదుగా మేదిని యందున సుగ్రీవా! 33

విభీషణుండును నిటుల బలికి మఱి నమల జలంబుల దడుపబడీ!
అట్టి హస్తమున నా సుగ్రీవుని యమల శుభకరము లైనట్టి!
నేత్రంబుల నా విభీషణుండును నాప్యాయత దుడిచెను నపుడున్! 84

అటుబిమ్మట ధర్మాత్ముడు, వీరుడు నా విభీషణుడు సలిలములన్!
గ్రహించి రాక్షస మాయ దెలిసికొన గలిగిన మంత్రముజేత మఱిన్!
అభిమంత్రించుచు విభీషణుండును యతని నేత్రముల దుడిచె నటన్! 35

ధీమంతుండును, గపీశ్వరుండగు దీరుగ సుగ్రీవుని ముఖమున్!
ఆ విభీషణుడు దుడిచి శాంతమున యా సమయంబున కనుగుణమున్!
తొందరబాటును లేకుండను మఱి జిందుచు ధీరత హృదయమునన్
నీరీతిని బలికెను విభీషణుడు నిలకడగా సుగ్రీవునితో! 36

సుగ్రీవా! విను! ఈ సమయంబున శోభనీయమగు దుఃఖంబున్!
పొందుటకును మఱి సమయముగాదూ! చిందుట చింతయు దోష మగున్
అట్టిసమయమున యతి స్నేహంబును నలరి మరణమును నొందించున్!37

ఆ కారణమున సర్వకార్యముల నటు ధ్వంసంబు జేసెడి యా
మనోవ్యాకులత్వమును వీడుమా! మానుగ ధీరత వహించుచున్!
రాముడు రక్షకుడైన సైన్యమును రహి హితమో యాలోచించీ!
నడుపగా వలెను రణరంగంబును నయముగ స్థిరమగు సైన్యమునూ! 38

రిగి జాగృతిని బొందువఱకునూ దీరుగ రాముని రక్షించి !
•పాడుదమూ! కరమందఱమును కంటికి రెప్పగ గాంచుచునూ!
ంజ్ఞను బొందిన పిమ్మట వారలు సరసత మన వారందఱినీ!
ంనల నిద్దఱను గాపాడుదురూ! మానుగ కంటికి రెప్పవలెన్! 39

ది రామున కొక విషయము గాదూ! యీవిధి సంజ్ఞయు దప్పుటయున్!
ాముడు మరణింపగలేడు సుమా! రహి సంజ్ఞను మఱి గోల్పోయెన్!
ామచంద్రునకు కాంతి లక్ష్మియును రమ్యత దొలగను లేదుగదా!
ఆయుర్దాయము జెల్లిన వారికి అలరెడి శ్రీముఖమందుననూ
ట్టి కాంతి మఱి యుండదు మఱియును ఋట్టి తేజమును నుండదుగా! 40

ుందువలన నీవును నీ మనసును కందక స్థిరముగ నుంచుకొనీ!
ుదార్వుము! మఱి కపివీరులనూ యొప్పుగ ధీరత విలసిల్లన్!
కీనును సమస్త సైన్యంబుల వే నిలిపెద! ధైర్యము గలిగించి! 41

హరిసత్తమ! యీ వానరవీరులు నలరి కనులు బెద్దవి జేసి!
భయముజేత సంభ్రమమును జెందుచును బాధ జెందుచున్నారు మఱిన్!
ఒకరి చెవిని మఱియొక రేమేమో! యొనర జెప్పుకొనుచుండి రిటన్!
భయబడు చుండుట గంటి నేను మఱి బన్నుగ వానర వీరులలిన్! 42

సైన్యంబును నుత్సాహ బఱచుటకు సరసత నటు బోవుచు నుండన్!
నన్ను గాంచి కపివీరు లందఱును నయముగ యింద్రజితుండనుచున్
భయబడుచును నుండిరి కపివీరులు బన్నుగ ధీరత విడనాడి!
అట్టి భయంబును వాడిన మాలను నలరి త్యజించిన యట్టులుగా!
బరిత్యజించెడి యబుల నేయుమూ! బన్నుగ వానర వీరులలో! 43

రాక్షసవీరుడు విభీషణుండును రహి సుగ్రీవునకును మఱియున్
ఈ విధమున ధృతి గలుగగ జేసియు నిమ్మగ ధీరత్వంబుననూ!
పాఱిపోవు వానర సైన్యమును బన్నుగ నిలుపుచు నోదార్చి!
మానసికమునగు దీనత్వంబును మాపి ధీరతయు జేకూర్చెన్! 44

అటుబిమ్మట యా యింద్రజితుడును నలరు మాయలును గలవాడున్!
దనదు సర్వసైన్యంబుల గూడుక దగ లంకా నగరమునందున్!
ప్రవేశించి మఱి తండ్రి దగ్గఱకు బరగ బోయె నంతసముననూ!

ఇంద్రజిత్తు మఱి తండ్రిని జేరీ సాంద్రాంజలినీ ఘటియించీ
నమస్కరించుచు బలికె నిట్టులను నయముగ బహు ప్రీతియు గలుగన్!
'రామలక్ష్మణుల జంపి వేసితిని! రణమున దండ్రీ!' యని బలికెన్! 4

ఆ రాక్షసులకు మధ్య రావణుడు నలరు శత్రువులు నిద్దఱినూ!
వధింపబడినా వారలుగా విని వనరగ యట్టి దశాననుడున్!
ఎగిరి గంతువేసెను సంతసమున చిగురు వేయు హృత్పద్మంబున్!
గౌగలించుకొనె యింద్రజిత్తునూ గాఢమైన ప్రీతియు బొందన్! 4

ప్రీత మానసుండై రాజేంద్రుడు ప్రియముగ నాతని శిరస్సునూ
వాసన జూచీ ముద్దు బెట్టుకొని వనరగ నీవిధి ప్రశ్నించెన్!
ఎటుల జంపితివి? యేవిధి నొంచితి? వెటుల వారి బరిమార్చితివీ?
తెలియ జేయుమా! పుత్రా!' యనుచును దీరుగ తండ్రియు బశ్నించెన్! 4?

ఇంద్రజిత్తు మఱి తండ్రి ప్రశ్నలకు సాంద్రముగా ధీరత బలికెన్!
ఆ సోదరులను రామలక్ష్మణుల యా రాజకుమారులను మఱిన్!
శరబంధంబున యెటు బంధించెనొ సరసత కాంతి విహీనులుగా!
ఎటులజేసెనో విషయము నంతను చటుల యుద్ధ సంరంభమునూ!
యథా వృత్తమును దెలియగ జేసెను నట జరిగిన దంతయు వేగన్! 49

మహారథుండగు బుత్రుని వాక్యము మానుగ విని యా రావణుడున్
ఆనందంబును గూడిన మనస్సున యట సంతసమును బొందుచునూ!
రాముని వలనను గలిగిన తాపము రహి నొదులుచు నా రావణుడున్!
ప్రహృష్ట వాక్యములను దనపుత్రుని బలికి ప్రీతి యభినందించెన్! 50

(యుద్ధకాండమునందు 46వ సర్గము సమాప్తము)

* * *

# యుద్ధకాండము-మొదటి భాగము

## న లు బ ది యే డ వ స ర్గ ము

[వానరులు రామలక్ష్మణులను రక్షించుచు వారి చుట్టునూ నిలిచి యుండుట - రావణుని యాజ్ఞచేత రాక్షస స్త్రీలు సీతను యుద్ధభూమికి దీసికొనిపోయి యామెకు రామలక్ష్మణులను జూపుట - వారిని గాంచి సీత దుఃఖించుట]

రావణాత్మజుండైన యింద్రజితు రయమున దన కార్యము నచటన్!
బూర్తి జేసికొని రామలక్ష్మణుల బొలుపుగ జంపితి ననుకొనుచున్!
లంకయందునను బ్రవేశించె మఱి శంకలేక తన దోర్బలమున్,
రాక్షసులందఱు బ్రశంసింపగా రహి బొంగుచు నుండెను నంతన్! 1

అటుబిమ్మట యా వానర శ్రేష్ఠులు నల రాముని చుట్టును జేరీ
ఆ రాముని రక్షించిరి వేగము నలరి సేవలను గావించీ!

హనుమంతుడు మఱి యంగదుండునూ! యా నీలుడు మఱి సుషేణుడున్!
కుముదుడు, నలుడును, మఱియు, గవాక్షుడు గూరిమి సానుప్రస్థుడునూ!
గజుడు, జాంబవంతుండు, ఋషభుడును గంభీరుండగు సుందుడునూ!
రంభుడు, శతబలి, పృథుడు మఱియునూ! రయమున వానరు లందఱునూ!

వృక్షంబులు మఱి శిలలు ధరించీ విమల వృక్ష శాఖలు నుఱియున్
బటుతరమగు శిఖరముల ధరించియు బన్నుగ దశ దిశలును నిలిచీ!
ఆ కపిసేనా నాయకు లందఱు నలరిరి రణ సంసిద్ధులునై!
అన్ని దిక్కులను నద్దము నిలుచుచు నలరి పైకి జూచుచు వారున్!
గడ్డిపరక యటు గదిలిన గూడనూ చెద్ద రాక్షసులుగా దలచీ
భావించుచు నుండిరి కపివీరులు బహు భద్రత జాగృతి తోడన్! 2-3-4

ఆ రావణుడును సంతోషించుచు నలరు బుత్రుడగు నింద్రజితున్!
ప్రశంసించి మఱి బంపివేసెనూ బన్నుగ యానందము తోడన్!

అటుబిమ్మట నా రాక్షసేంద్రుడును నల సీతను రక్షించెడి యా
రాక్షసస్త్రీలను రయముగ రమ్మని రహి బిలిపించెను వేగముగన్!

ఆ దశాననుని యాజ్ఞ ప్రకారము నా రాక్షసస్త్రీలును మఱియున్!
అలరి త్రిజట యను రాక్షసస్త్రీయును ధీరుగ వచ్చిరి యచ్చటకిన్!
సంతోషించిన రావణుండునూ సరసత నటుబిమ్మట వేగన్
రాక్షసస్త్రీలను బలుకరించుచును రమ్యముగా నిటలను బలికెన్!

రామలక్ష్మణులు నింద్ర జిత్తుచే రహి జంపగబడి నారనుచున్,
జనకసుతకు మఱి దెలియగ జెప్పుచు వినయముతో గథ నంతయునూ
పుష్పకంబుపై నెక్కించియు మఱి బొలుపుగ రణరంగము నందున్
జంపబడిన యా రామ లక్ష్మణుల నింపుగ జూపుచు జానకికిన్!

ఎవని జూచుకొని గర్వితురాలై యిన్ని నాళ్లు నను జేరుటకున్!
నిష్టబడదొ యా శ్రీరాముండును నిమ్ముగ యాతని దమ్ముడునూ!
రణరంగంబున హతమాయెను గద! యింక యెవరి యాశలతోడన్
ఆ జానకి యిల బ్రదుకగలదు మఱి యాశ్రయించు నను సంప్రీతిన్!

జనకరాజసుత యా వైదేహియు సర్వాలంకారంబులతో
అలంకరించుక రాజసుతకు వలె యనునయ వినయంబుల తోడన్!
అల శ్రీరాముడు వచ్చుననుచు మది యాశయు భయమును లేకుండన్!
నన్ను జేరు నిక నా హృదయేశ్వరి నయముగ నాకును భార్యయునై!

విశాలాక్షియును నగు నా సీతయు విమలాంగంబులు గలదియునూ!
తన భర్తను శ్రీరాముని జూచీ! దగ సౌమిత్రిని గాంచి మఱిన్!
రణమునందు మరణించిరి యనుచును రహి మదిలో భావించుచునూ!
తిరిగివచ్చి మఱి గతి లేదనుచును స్థిరముగ మది నిశ్చితురాలై
స్వయముగ నన్నే యాశ్రయించునూ సరసత నొలుకగ బలుకు మఱిన్! 10

ఆ రాక్షసస్త్రీలును దురాత్ముడగు నా రావణునీ వచనములన్,
విని యట్లే యని రాక్షసస్త్రీలును వినయ విధేయతలను జూపి!
పుష్పక విమాన మెచట యున్నదో బొలుపుగ బోయిరి యచ్చటికిన్! 11

అటుపిమ్మట నా రాక్షసస్త్రీలును నా దశాననుని యాజ్ఞచే,
పుష్పక విమానమును గొని దెచ్చి బొలుపుగ యశోక వనమునకున్!
జనకుని కొమరిత సీత దగ్గఱకు జాగు సేయకను దెచ్చిరటన్! 12

అటుపిమ్మట నా రాక్షసస్త్రీలును నలరి భర్తృ శోకము జేతన్!
పీడింపగబడు సీతాదేవిని ప్రియమగు వాక్యము జేత మఱిన్!
పుష్పక విమానమును నెక్కించిరి బొలుపుగ రాముని గాంచుటకున్! 13

అటుపిమ్మట నా రాక్షసస్త్రీలును నలరు త్రిజటతో గూడికొనీ,
జనకసుతకు శ్రీరామలక్ష్మణుల సరగున జూపించుట కొఱకున్!
పుష్పక విమాన మెక్కించియు మఱి బొలుపుగ గొనిపోయిరి నటకున్! 14

రాక్షసరాజగు రావణాసురుడు రహి సంతసమున గూడికొనీ!
లంకాపట్టణ మంతయు శీఘ్రము వంకలేని ధ్వజముల దోడన్!
పతాకములతో వరుసలు దీర్చి బన్నుగ యలంకరింపగనూ!
జేసి మఱియు జాటించెను బురమున చిన్నలు బెద్దలు వినునటులన్!
'రణరంగంబున యింద్రజిత్తు మఱి రామలక్ష్మణుల వధియించెన్!
భయము లేదికను రాక్షసులారా! బన్నుగ లంకా పురమునకున్!' 15-16

అటుపిమ్మట యా సీతాదేవియు నలరి త్రిజటతో గూడికొనీ
పుష్పక విమాన మెక్కి త్వరితగతి బొలుపున రణరంగమునందున్
చంపగబడినా వానర వీరుల చయ్యన గాంచెను ధరపైనీ! 17

సంతోషంబున నున్న రాక్షసుల సరసిజాక్షి సీతయు గాంచెన్!
రాముని ప్రక్కన మిగుల దుఃఖమును రహి బొందెడి కపులను గాంచెన్ !18

అటుపిమ్మట యా సీతాదేవియు నట శయనించిన వారలనూ,
శరతల్పంబుల నున్నవారు మఱి సంజ్ఞలేని వారలు మఱియున్
శరపీడితులగు వారును మఱియును విరిగిన కవచములును గలిగీ
వీరులు, దూరము విసరివేయబడి విమల ధనుస్సులు గలవారున్!
శరములచే భేధింపబడిన యా సకల శరీరము గలవారున్!

ధాత్రిపైని బాణములను, బచ్చిక దగ నిండియు యుండిన వారున్!
అట్టి రామ లక్ష్మణులను సీతయు నిట్టె గాంచె నా దృశ్యమునూ! 19-20

ఉత్తమ పురుషులు, బురుష శ్రేష్ఠులు సురుగుణ వంతులు నగువారున్!
పుండరీకముల వంటి నేత్రములు బొలుపగు ముఖములు గలవారున్!
అగ్ని పుత్రులగు స్కంధ విశాఖుల నంగాంగంబులు గలవారున్!
శరతల్పంబుల నున్నవారునూ శయనించిన వారలు మఱియున్! 21-22

అట్టి విధముగా నున్నవారునూ యలరు మానవుల శ్రేష్ఠులునూ!
ఆ సోదరులను గాంచి సీతయును నదలుచు దుఃఖముతోని మఱిన్
గడుదీనముగా నత్యధికముగా గడలి తెరల వలె విలపించెన్!
అనవద్యాంగియు, ననితేక్షణయగు నా జనకాత్మజయును నపుడున్!
పాంసుపరాగము నందు దొరలెడి భర్తను మఱి యా లక్ష్మణునీ
గాంచి కన్నులను నీరు దెచ్చుకొని నంచితముగ రోదన జేసెన్! 23

దేవకుమారులవంటి ప్రభావము దీరుగ గల యా సోదరులన్!
జూడగనే యా సీతాదేవియు శోకముతో గన్నీళులనూ!
నొలుకుచు వారలు గతించి రనుచును నొప్పుగ మనసున దలచుచునూ!
దుఃఖముతో నీ విధముగ బలికెను దురపిల్లుచు బహు వేదనతో! 24

(యుద్ధకాండములోని నలుబది ఏడవ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

# యుద్ధకాండము - మొదటి భాగము

## నలుబది యెనిమిదవ సర్గము

(సీత విలపించుట-త్రిజట యామెను నోదార్చుచు రామలక్ష్మణులు జీవించియే యున్నారని సీతకు నమ్మకము గలిగించి తిరిగి యశోక వనమునకు రీసికొని వచ్చుట)

ఆ సీతయు మఱి మూర్ఛ జెందినా నలరు భర్త శ్రీ రాఘవునీ!
మహాబలుండగు లక్ష్మణు గాంచీ మరణించిరి యని భావించీ!
బహు దీనముగా నడలుచు నేడ్చెను బలు విధముల భావించుచునూ!
కురరీ పక్షికి వలె రోదించెను గుండె నూర్వ్రయ్యలు గాగన్! 1

నన్ను గాంచి సాముద్రికు లందఱు నయముగ దెలిపిరి నీ రీతిన్!
'సీత పుత్రవతి! యంచును మఱియును గతి వైధవ్యము లేనిదనీ!'
చెప్పినారు గద! పూర్వము జోశ్యులు జెప్పిన దంతయు నసత్యమై
కనబడుచున్నది నేడు రాఘవుడు గతించి పోయిన వాడగుచున్! 2

ఏ పండితు లందఱు బూర్వము నిమ్మగ దెలిపిరొ నను గూర్చి,
ఈమె యజ్ఞములు జేసిన వానికి నింపుగ భార్యయు నగుననియూ,
యాగంబులు మఱి జేసినవానికి భాగస్వామిని యగు ననుచున్
జెప్పినారొ వారలు మఱి యిప్పుడు జెచ్చెర రాముడు మరణింపన్
నసత్యంబు జెప్పిన యట్లయినది నురయగ వారల జోశ్యములున్! 3

వీరుడైన రామునికి భార్యనై వీరపత్ని యను మన్ననమూ,
భర్తగౌరము బొందు దాననని బన్నుగ దెలిపిరి పండితులున్
జెప్పినారొ వారలు మఱి యిప్పుడు జెచ్చెర రాముడు హతమొందన్
నసత్యంబు జెప్పిన యట్లయినది యరయగ వారల జోశ్యంబుల్! 4

దైవజ్ఞులు మఱి ద్విజులు బండితులు దీరుగ నే విను చుండగనూ!
ఈ జానకి సౌభాగ్యవతియు నగు! నింపుగ బలికిరొ శాస్త్రజ్ఞుల్!
బలికినారొ! వారలు మఱి యిప్పుడు బన్నుగ రాముడు మరణింపన్
నసత్యంబు జెప్పిన యట్లయినది యరయగ వారల జోశ్యంబుల్! 5

పాదములందున పద్మంబులు గల పడతులు భర్తలతో గూడన్
రాజులతోడను సమానంబుగా రమ్యముగా రాజ్యంబునకున్!
అభిషేకింపగ బడుదురు మఱియును నఖిల గౌరవము లందుదురూ!
కానీ నా కభిషేకంబును మఱి గౌరవాదరము లేదుగదా! 6

నాయందునగల సులక్షణంబులు నయముగ వ్యర్థములై పోయెన్
ఏ యవలక్షణములచే స్త్రీలును నిమ్ముగ వైధవ్యంబు మఱిన్!
దౌర్భాగ్యంబును బొందుదురో మఱి దగ యా లక్షణములు నాలో
వెదికి జూచినను గానబడవుగా నిక్కృతమైనది భాగ్యంబున్! 7

స్త్రీలకు గల యే ధ్వజ పద్మంబులు శ్రీకరమగు నే ఫలములునూ!
యిచ్చున వంచును దెలువబడినదో యుచ్చతరం బగు లక్షణముల్!
నా శరీరమునగల లక్షణములు నయముగ శుభకరమైనవియున్!
రాముడు మరణించుటచే నవియును రహి వ్యర్థము లాయెను నేడున్! 8

నా కేశంబులు సన్నగ నున్నవి నయముగ సమములు, శ్యామములున్!
కనుబొమ్మలునూ గాంచి జూడగా గలువకుండ మఱి యున్నవిగా!
చీలమండలును నుండె సుంద్రమముగ చిక్కని రోమములును లేవూ
దంతంబులకును నెడము లేదుగద వింతగ యవయవములు లేవూ! 9

బలాట పార్శ్వంబులు, నేత్రంబులు లాలిత కరములు బాదములున్
చీలమండలును నూరువులును మఱి శ్రీకరముగ సమముగ యుండెన్!
పుష్టికరముగా నున్నవి మఱియును బొలుపుగ వ్రేళ్లను మృదువుగనూ!
అమవృత్తములగు గోళ్ళ దోడుతను నలరుచు సమముగ నున్నవియున్! 10

నా కుచములు అవిరళమై యున్నవి యతి పీనములై యున్నవియున్!
అగ్రభాగములు లోనికి మఱిగీ నలరుచునున్నవి మృదువుగనూ!
ఉన్నత ప్రదేశమునగల నాభియు యున్నది లోతుగ జూచుటకున్
పార్శ్వభాగములు వక్షస్థలమును బన్నుగ పుష్టిగ నున్నవియున్ 11

నా శరీర వర్ణము మాణిక్యము నా రోమములును మృదువు మఱిన్
నేలమీద నే నిలుచునప్పుడును నిలకడగా బదివేళ్లు మఱిన్
శుభలక్షణములు గల దాననని! శుభ లాక్షిణికులు దెలిపిరిగా! **12**

పాణిపాదముల వ్రేళ్ళ యందునను బరగ యవల గుర్తులుగలవూ !
వేళ్ళను దగ్గఱ జేర్చిన యపుడును వేఱుగ రంధ్రములును లేవూ!
పాణిపాదములు బంగరు వర్ణము బన్నుగ నుండెను సుందరమై
చిఱునవ్వునుగల దాన ననుచునూ శ్రీకరముగ దైవజ్ఞులునూ!
కన్యాలక్షణ మెఱిగిన జోశ్యులు క్రమముగ దెలిపిరి యానాడున్! **13**

పతితోగూడుక నధిరాజ్యంబున యభిషేకంబును జరుగుననీ !
దైవజ్ఞులునగు బ్రహ్మవిదులచే దగ దెలుపగబడె యానాడున్!
ఆ బ్రాహ్మణులును జెప్పిన దంతయు నలరి వ్యర్థమై పోయెగదా! **14**

జనస్థానంబును నంతయు వెదికి వనస్థానంబుల శోధిబచీ!
నా వృత్తాంతము నంది పొంది మఱి నయముగ లంకను జేరుటకున్!
అక్షోభ్యంబగు జలధిని దాటి యలరివచ్చినా సోదరులున్!
గోష్పదమందున బడి మరణించిరి కూరిమి విధి నిర్ణయము గదా! **15**

వారుణాస్త్రమును ఆగ్నేయాస్త్రము వనరగ వాయువ్యాస్త్రంబున్
ఐంద్రాస్త్రంబును, బ్రహ్మశిరంబును ననేకాస్త్రములు గలవు గదా !
ఆ రాఘవులో యంబుల పొదిలో నసమానములగు శరంబులున్
గలిగిగూడ యిటు లగుట యెందుకో? కర్మఫలంబని దలప వలెన్! **16**

అనాధనగు నాకును రక్షకులును అల దేవేంద్రుని సమానులున్
రామ లక్ష్మణులు రణరంగంబున నయమున రాక్షస మాయలచే
చంపబడిరిగద! యింద్రజిత్తుచే పంపగ బడిరా రఘువీరుల్! **17**

మనోజవంబును గలవాడును మఱి మానుగ శత్రువు లెవరైనా,
ఆ శ్రీరాముని దృష్టి పథంబున యగుపించియు బోజాలరుగా!
ప్రాణంబులతో నిలిచి యుండడూ! బన్నుగ భూస్థలి యందుననూ! **18**

ఎందువలన శ్రీరామచంద్రుడును జెందొవ వర్ణము గలవాడున్!
ఆ సౌమిత్రిని గూడి యుద్ధమున నల క్రూరుండగు రాక్షసుచే
బడగొట్టగబడి వీరశయనమున బడియున్నాడో! యంతయునూ
కాలనిర్ణయము! విధి నెదిరించుట గడు దుర్లభమును జీవులకున్! 19

దీనురాలు గౌశల్యను గూర్చియు దీర్ఘముగా దురపించినటుల్
భర్తయైన శ్రీరాముని గూర్చియు బలవంతుడు లక్ష్మణుగూర్చి
నన్ను గూర్చిగానీ దురపిల్లను నయముగ నాతల్లిని గూర్చి
అత్తగారు కౌసల్యను గూర్చియు చిత్తము బహు తాపము నొందున్! 20

వ్రతము సమాప్తముజేసి రాఘవుడు వనరగ సౌమిత్రిని గూడి!
సీతగూడ మఱి యెపుడు వచ్చునా శ్రీకరముగ మఱి యయోధ్యకున్!
ఎప్పుడు వత్తురా వారలనుచునూ నిమ్ముగ చారెడు కన్నులతో
నెదురు జూచుచుండును గౌసల్యయు మది యాలోచించుచు నెపుడున్! 21

విలపించెడి యా సీతను గాంచుచు విమల త్రిజటయును నిటుపలికెన్!
ఓ దేవీ! ఓ జనక నందినీ! ధైరిమి వహింపు నిట్టి దశన్!
విషాదమును మఱి పొందబోకుమా! విలపింపకుమా! బహు రీతిన్!
నీదుభర్త శ్రీరామచంద్రుడును నిజముగ జీవముతో గలడూ! 22

ఓదేవీ! ఓ సీతాదేవీ! యొనరగ రాముడు లక్ష్మణుడున్
ఆసోదరులును ప్రాణంబులతో నలరి వసుధ జీవంబులతో
నుండిరనుటకు కారణంబులును మెండుగ గలవవి దెలిపెదనూ! 23

ప్రభువు రణమునను మరణించినచో బన్నుగ యోధుల ముఖములునూ,
క్రోధముతో నిండినవిగాని మఱి గూరిమి సంతోషంబుననూ
నుండవుగా మఱి లోకము నందున నున్నవి గను బరిశీలనగా! 24

వైదేహీ: విను! యీ విమానమును వనరగ దివ్యం బైనదియున్:
పుష్పక మనియెడి ప్రసిద్ధనామము బొలుపుగ కీర్తిని బొందినదీ!
రామలక్ష్మణులు మరణించినచో రమ్యమైన యీ విమానమున్!
నిను ధరింపదూ! నిజమిది దెలియుము! నిరసింపకు మది జనకసుతా! 25

రణరంగంబున ప్రధానవీరుడు రహి మరణించిన సమయమునన్!
సైన్యము నుత్సాహంబు లేనిదై స్తబ్ధత వహించి యుండు నటన్!
విరిగిపోయినా చుక్కానియు గల తిరిగినటుల యోడయు నచటన్!
దిరుగుచుండు నా సైన్యము లేవీ! దిరుగుచుండుటయు లేదుగదా! 26

తపస్వినీ! ఓ సీతాదేవీ! దగ యీసేనయు భయపడకన్!
దిగులు లేనిదై యున్నది జూడుము! దీపమువలె నిశ్చలముగనూ!
రామలక్ష్మణులు బ్రతికి యుండిరని రమ్య ప్రీతి నా వచనములన్!
రామలక్ష్మణుల రక్షినచుచునూ రమ్యరీతి గాపాడెడినీ! 27

ఊహల ఫలమును సుఖకరమైనది యున్నతమగు నూహల తోడన్!
నుండుము దేవీ! విశ్వాసముతో మెండుగ యాశాజనకముగా!
మరణింపగ లేదా సోదరులును మానుగ నిజమిది నమ్ము మికన్
నీపై నాకును గల స్నేహమునను విజముగ దెలుపుచు నుంటినిదే! 28

మైథిలి! పూర్వము నేనెన్నడునూ మానుగ యసత్య వచనములన్,
బలుకగ లేదూ! యిటుపై ముందును బలుకబోను మఱి యనృతమున్!
చారిత్రక సుఖ శీలత్వములను సహజ పతివ్రత గుణములచే
నా మనస్సు నాకర్షించితివీ! నను నీవైపుకు ద్రిప్పితివీ! 29

ఇంద్రునితో నా సురాసురులునూ యిమ్ముగ వచ్చినను గూడన్
రణరంగంబున రామలక్ష్మణుల రహి జయింపగను లేరు సుమా!
సోదరు లిద్దఱు జీవించినటుల సూచించెడి దృశ్యంబులనూ
గాంచి నీకు నే దెలియ జెప్పితిని నంచితముగ నే దెలిసినదీ! 30

వైదేహీ! బాణంబుల జేతను వనరగ గొట్టగబడి మఱియున్!
సంజ్ఞలేక బడియున్నను గూడను సహజ లక్ష్మి విడలేదు గదా!
సుమహత్తరమగు చిత్రము జూడుము! సుదతీ! నాశ్చర్యము నిదియున్! 31

ఆయుర్దాయము జెల్లిపోవగా నటు ప్రాణంబులు విడిచిన యా
పురుషుల ముఖముల నవయవంబులను బొలుపుగ నాడీ మండలమున్!
సాధారణముగ వికృతంబులై సహజ జాగృతియు గోల్పోవున్! 32

జనకాత్మజ! విను! రామలక్ష్మణులు చనిపోయిరి యని దలపకుమా!
వారి నిమిత్తము శోకంబును మఱి వనరగ దుఃఖమును మోహంబున్!
త్యజింపుమా! ఓ జనక నందినీ! దగ ముఖశోభాదులు గలుగా
రామలక్ష్మణులు మరణించుట యన రహి గుదురదు! జరుగదు దేవీ! 33

దేవకన్యతో సమానంబు నగు దీరుగ నా వైదేహియునూ!
ఆమె మాటలను విని యంజలితో నల యాకాశము గాంచుచునూ!
నీవు బలికినా పలుకు లన్నియును నిజమగు గావుత! యని బలికి!
అద్వితీయమగు నా పరమాత్మకు నాత్మ నమస్కారము జేసెన్! 34

దీనురాలునగు సీతాదేవిని త్రిజటా రాక్షసి వేగముగన్!
పుష్పక విమానమును వెనుకకునూ పూనికతో మఱి మరల్చుచున్!
సీతాదేవిని లంకాపురికివి శీఘ్రముగా జేర్చెను మఱియున్! 35

అటుబిమ్మట యాత్రిజటను గూడుక నలపుష్పకమును దిగినట్టి!
ఆ వైదేహిని జనక నందినిని యల రాక్షస స్త్రీలును వేగన్!
అశోకవనమును బ్రవేశబెట్టిరి యలరి పూర్వమున గలచోటన్! 36

అనేక వృక్షములను గూడినదీ యల రావణుని విహారంబున్!
అట్టి యశోకావనము నందునను నా దేవియును బ్రవేశించీ!
రామలక్ష్మణుల మనసున గాంచుచు రహి వారలనే దలచుచునూ!
పరమ విషాదము నొందుచు నుండెను బన్నుగ కన్నీ రొలుకుచునూ! 37

(యుద్ధకాండమునందు 48వ సర్గము సమాప్తము)

★ ★ ★

# యుద్ధకాండము - మొదటి భాగము

## న లు బ ది తొ మ్మి ద వ స ర్గ ము

[తిరిగి స్పృహ వచ్చిన తరువాత రాముడు లక్ష్మణుని కొఱకు విలపించుట - ప్రాణములను విడువవలెనని నిశ్చయించుకొని 'మీరందఱు స్వగృహములకు వెళ్ళుడు' అని వానరులను ఆజ్ఞాపించుట]

సుగ్రీవునితో గూడినట్టి యా సుమహాబలులగు కపివీరుల్!
ఘోరమైన శరబంధము జేతను గూరిమి కట్టగ బడియుండీ!
సర్పంబులవలె నిట్టూర్పులచే సతమతమగుచుండిన వారున్
రక్తముజేతను దడుపగబడి మఱి రహి ధాత్రిని నుండిన వారల్!

శయనించిన యా రాజకుమారుల ప్రియముగ రాఘవ లక్ష్మణులన్!
చుట్టును జేరి శోకము తోడను స్రుక్కుచు నిలిచిరి వారలునూ! 1-2

అటుపిమ్మట బహు వీర్యవంతుడును నలరు బలాక్రమ వంతుడునూ!
రాముడు శరముల బంధితు డయ్యును రహి ధీరత గల వాడగుటన్!
బలవీర్యంబుల సంబంధముననను బటుతర శక్తియు గలుగుటయున్!
జాగృతి దొందెను మేలుకొనుచు మఱి సహచరులను నట గాంచుచునూ! 3

అటుపిమ్మట శ్రీరామచంద్రుడును నలరి రక్తమున దడిసిన యా
విషణ్ణ వదనుడు నగువాడును మఱి విమల ధాత్రి నుండిన వాడున్!
తన సోదరునీ లక్ష్మణమూర్తిని దగ గాంచుచు విలపించుచునూ! 4

రణరంగమున జయింపబడి మఱి రహి నేలనుబడి యున్నట్టి
సోదరుడగు సౌమిత్రిని గాంచుచు సురుచిరముగ నే నిటనుంటిన్!
అట్టి నాకు నిక యేమి లాభమూ? నా సీతను బొందిన గానీ!
జీవితమున మఱి యేమి లాభమూ? స్థిర సంపదలును యెందులకూ? 5

అన్వేషింపగ యీ లోకములో నలరు జానకికి సమమైనా
మఱి యొకస్త్రీనీ బొందగ వచ్చును మహిలో సచివుడు, సహాయుతున్!

రణరంగంబున సహాయుడైనా రమ్య గుణంబులు గలవాడున్!
సౌమిత్రిని బోలెడి సోదరుడును సహజముగా దొరకడు వసుధన్!

సుమిత్రుడును నానందవర్ధనుడు సువ్రతుడు నగు లక్ష్మణుడున్!
పంచత్వమును బొందినచో మఱి యంచితముగ నేనును గూడన్!
వానరు లందఱు జూచుచుండగా పరిత్యజింతును ప్రాణములన్!

తల్లియైన కౌసల్యాదేవికి దగ యేమని నే దెలుపుదునూ?
తల్లియైన యా కైకేయికినీ దగ యేమని నే దెలుపుదునూ?
పుత్రుని జూడగ వలెనను కాంక్షను బొలుపుగ యెదురులు జూచెడి యా
సుమిత్ర మాతకు యేమి దెలుపుదును సురుచిరముగ సంభాషింతున్?

లక్ష్మణుండు లేకుండగ నన్నును వీక్షించిన యా సుమిత్రయున్
పుత్రుడు జతలేకుండగ జూచీ పొలుపుగ గోరింకకు వోలెన్
రోదసేయును వణికి పోవుచును రోదన మాన్పుదు యెటులను నే?
కరుణాశ్రువులను యెటుల దుడిచెదను గఠినముగా నను శపియించున్!

ఏ లక్ష్మణుడును భాతృభక్తితో నిమ్ముగ యడవులకును నాతో
వచ్చినాడొ మఱి యతడు లేడనుచు దిరిగి నేను వచ్చితి నసుచున్!
శత్రుఘ్నునితో కీర్తిమంతుడగు శాంతి కాముడగు భరతునితో
ఎటుల దెలుపుదును నోరు విడిచి నే యిల సౌమిత్రియు లేడనుచున్? 1

ఎంత కష్టమొచ్చినది ప్రస్తుతము వింతయైన దీ లోకముననన్!
సుమిత్ర దేవియు నిందించును మఱి సూదివంటి వచనములతో!
అట్టి నింద నే సహింప జాలను అందుచేత నే నిచ్చటనే
ప్రాణంబుల నే బరిత్యజించెద బన్నుగ కపివీరులు సూడన్! 1

ఎంతటి పాపాత్ముండను ఛీ! ఛీ! యెంతటి యనార్యుడను నేనున్!
నా యీ సోదరుడైన లక్ష్మణుండు నా నిమిత్తమై గొట్టబడీ!
మరణించిన విధి శరతల్పంబున మానుగ శయనించియు యుండెన్! 1

సౌమిత్రీ! నీ వెల్లప్పుడునూ చలితుడనై దుఃఖము తోడన్,
నున్నప్పుడు నోదార్చెడివాడవు యోరిమితో, ధీరత తోడన్!

ఇపుడు నీవు మరణించుట చేతను నిమ్మగ యార్తుండను నన్నున్
ఎవరోదార్చెద రింక తమ్ముడా! నింపుగ ధీర సువాక్యములన్! 13

రణరంగమునను బహు రాక్షసులను బన్నుగ క్షితిపై బడవేసి
వధియించితివో! అట్టి నీవు మఱి వనరగ శిత శరములజేతన్
వధింపగాబడి నేలపైని బడి వనరగ శయనించితివి గదా!

శరజాలముచే గప్పిన వాడవు విరబూచిన కింశుకము వలెన్!
రక్తముజేతను దడిసిన వాడవు! రమ్యమైన రణరంగమునన్!
శరతల్పమునను దీర్ఘ నిద్దురను శయనించిన వాడవు మఱియున్
అస్తాద్రిని జేరిన భానుని వలె నలరి యుంటి వీ సమయమునన్! 15

శరజాలమునను గొట్టబడుటచే సరసత మర్మ ప్రదేశములన్,
మాటలాడ జాలక యుండెనుగా మధురాలాపన జేయకనూ!
మాటలాడకున్నను గూడను మఱి మానగ యాతని నేత్రములన్
సీతని బాధయు దృష్టి రాగమున యింపుగ గనబడు చున్నదియున్! 16

మహాద్యుతియుగల యితడు వనములను మానుగ నే బోయెడి వేళన్!
ఏ విధముగ నన్ననుసరించెనో ఆ విధముగ నేనును గూడన్!
యమక్షయమునకు వెనుక బోయెదను ననుసరించుచును నీతనినీ! 17

సకల బంధు జనులందును గూడను సరసత ప్రీతిని గలవాడున్,
ఎల్లపుడును నన్ననుసరించుచును నిష్టుడుగా నుండెడి వాడున్
అట్టి లక్ష్మణుడు ననార్యుండ నగు నిట్టి నాదు దుష్కార్యములన్,
ఇట్టి యవస్థను బొందినాడు గద! గట్టిగ రణరంగము నందున్! 18

మిగుల కోపగించిన వాడైనను దగ సౌమిత్రియు నెన్నండున్,
బలుకడుగా మఱి పరుష వాక్యమును బలుకడు నప్రియమగు బలుకున్!
ఎన్నడైన మఱి బలికినట్లుగా చిన్న జ్ఞాపకము లేదు గదా! 19

వేయి భుజములను గలవాడును నగు వీర కార్తవీర్యార్జునుడున్!
ఒక్క యత్నమున వందల శరములు గ్రక్కున యత్నము జేసెడినో!

అట్టిబలుడు వీర్యార్జును కంచెను గట్టివాడు మన లక్ష్మణుడున్!
బాణప్రయోగమునందు యధికుడును, బల వీర్యంబుల యందుననూ! 2

ఏ లక్ష్మణుడును మహాత్ముడైనా యిమ్ముగ దేవేంద్రుని కంటెన్
అస్త్ర ప్రయోగమునందు నేర్పునూ యధికమైన చాతుర్యంబున్!
గలదో మహార్హ శయనోచితుడగు మతి మన సుమిత్ర దనయుండున్,
వధియింపగ బడి కటిక నేలపై బడి శయనించుచు నుండెగదా! 2

విభీషణుని రాక్షసులకు రాజుగా విరాజిల్ల జేయుదు నంచున్,
ప్రతినజేసితిని కానీ నే నది బరగ నిజము జేయకపోతిన్
విభీషణునితో బలికిన వచనము వేడుక, వినోద మాయెనుగా!
ఆ అసత్యమగు ప్రలాంపంబు నను యలరి కాల్చి వేయుచు నుండెన్! 2

వానరరాజా! సుగ్రీవా! విను! వనరగ యీ క్షణమున యందే!
యిచ్చటినుండీ వెడలి బొమ్మికను మచ్చికతో గిష్కింధకునూ!
సీతోలేనని దెలిసి రావణుడు నిను దిరస్కరించును సుమ్మా!
అంతకుముందే పరివారముతో శంకలేక బయనము గమ్మా! 2

సుగ్రీవా! విను! సైన్యము దోడను సురుచిర బరివారముగూడి!
చిన్నవాడు నా వాలికుమారుని సన్నముగా ముందుంచుకొనీ!
నీలునితోడను, నలుని తోడనూ నిఖిల వానరులతో గూడన్!
ఆ సముద్రమును, నలసేతువునూ యలరి దాటి పొమ్మావలకున్! 2

రణరంగరిబున మహాకార్యములు మానుగ జేసిన వీరుడునూ!
గోలాంగూలములకును ప్రభువునూ కూర్మి జాంబవంతుండు మతిన్!
జేసినందులకు సంతోషించితి చిరకృతజ్ఞుడను నాతనికిన్!
ఇతరులు జేయని ఘనకార్యంబులు నిమ్ముగ జేసెను రణమందున్! 2

అంగదుండు, ద్వివిదుండు, మైందుడును రంగమునం దా యుద్ధమునన్
కేసరి, సంపాతి, కపివీరులు గేతనముఖుగా రణమందున్!
ఘనమగు యుద్ధము జేసిరి వారలు కార్యశూరులగు వారలకున్!
సంతోషించుచు నుంటి మిక్కిలియు దగ సాయము జేసిరి వారున్! 2

గయుడు. గవాక్షుడు, శరభుడు మఱియును గజుఁడు గూడ నా నిమిత్తమై
ప్రాణములను మఱి బరిత్యజింపగ బన్నుగ జేసిరి యుద్ధంబున్
ఇతరులైన కపివీరులు గూడను నిమ్ముగ రణమును జేసిరిలన్! 27

గయుడు, గవాక్షుడు, శరభుడు మఱియును గజుడు గూడ నా నిమిత్తమై
ప్రాణములను మఱి బరిత్యజింపగ బన్నుగ జేసిరి యుద్ధంబున్
ఇతరులైన కపివీరులు గూడను నిమ్ముగ రణమును జేసి రిలన్! 27

సుగ్రీవా! మానవులజేత మఱి సురుచిరముగ విధి విర్ణయమున్
అతిక్రమించుట శక్యము గాదూ! యతిరథులకునూ యీ జగతిన్!
ధర్మభీరువగు నీవు మిత్రమా! ధార్మిక హృదయంబున నీవున్
మంచిమిత్రు డిల యేమిజేయునో యంచితముగ నది జేసితివీ! 28

ఓ కపివీరులు వినుడీ వాక్యము నొప్పుగ నాముది వచనములన్!
మిత్రకార్యమును జేసిరి మీరలు మిగులోత్సాహము దోడుతనూ!
మీ యందఱికిని యానతి యిచ్చితి మీరందఱు సంతోషముతో
మీ మీ నివాసములకును బొండిక మీ ప్రదేశముల కిష్టమునన్! 29

సమస్తముగు నా వానరవీరులు నా శ్రీరాముని వచనములన్
పరిదేవితమును విని కపివీరులు బన్నుగ కలతను బొందిరటన్
పచ్చని నేత్రంబులు గల కపులును పుచ్చికతో కన్నీళులనూ
నొలక బోసిరీ ధారలుగా నట జిలికినటుల బరివేదననూ! 30

అటువిమ్మట నా విభీషణుండును నలరి సకల సైన్యంబులనూ!
నిలిపి యచట మఱి గదను ధరించీ విలవిల నడుచుచు వేగముగన్
రాము డెచట నున్నాడో యచటికి రయమున వచ్చెను జూచుటకున్! 31

కాటుక రాశికి సమానుడైనా కాఱు జీకటిని బోలుచునూ!
శీఘ్రముగా బోయెడి విభీషణుని శీఘ్రతరముగా కపివీరుల్
ఇంద్రజిత్తనుచు బరుగులు దీసిరి సాంద్రభయంబున నటనుండీ! 32

(యుద్ధకాండ యందలి 49వ సర్గము సమాప్తము)

# యుద్ధకాండము - మొదటి భాగము

## యాబదియవ సర్గము

[విభీషణుగాంచి యింద్రజిత్తునుకొని కపివీరులు పారిపోవుట-సుగ్రీవుని యాజ్ఞచేత జాంబవంతుడు వెళ్ళి వారికి ధైర్యము జెప్పుట - విభీషణుడు విలపించుట-సుగ్రీవుడు అతనిని ఓదార్చుట- గరుత్మంతుడు వచ్చి రామలక్ష్మణులను నాగపాశముల నుండి విముక్తులను జేసి వెళ్ళుట వానరులు సంతోషించుట ]

అటుబిమ్మటనూ మహాతేజమును సల మహాబలము గలవాడున్!
సుగ్రీవుండును బలికె నీ విధము సురుచిరముగ యాశ్చర్యమునన్!
ఈ సైన్యము మఱిజలము నందునను నిమ్ముగ మూఢము నగు గాలిన్
నున్న యోడవలె వ్యధజెందినదీ యున్నకారణము దెలియదుగా! 1

ఆసుగ్రీవునీ వచనములను విని యా యంగదుడును నిటు బలికెన్!
శరసముదాయము జేత గప్పబడి సకల శరీరము రక్తముచే!
తడుపబడిన వారలును, శరతల్పము శయనించిన యుండిన వారున్!
మహాత్ములును మఱి దశరథాత్మజులు మానుగ రాముని లక్ష్మణునిన్!
చూచుట లేదా తండ్రీ! నీవది సుందరులగు నా సోదరులున్! 2-3

అటుబిమ్మట నా వానరేంద్రుడును నా సుగ్రీవుడు వెనువెంటన్!
పుత్రుడైన యా యంగదుతోడను బొలుపుగ బలికెను నీ రీతిన్!
నిమిత్త మేమియు లేనిదానిగా నే భావింపను దీనికిని
ఏదో యొక్కటి భయకారణమును నిమ్ముగ యుండగవలెను సుమా! 4

ఇచట సమస్తము నగు సైన్యంబును నిమ్ముగ భయకారణముననూ!
ఉత్ఫుల్లములగు లోచనములతో నురుతర ఆయుధముల విడిచీ!
నాలుగు దిక్కులకును వేగముగా నయముగ బోవుచు నుండి రటన్! 5

ఈ వానరులును బారిపోవుటను నిమ్ముగ యన్యోన్యము గాంచీ!
సిగ్గుబడుటయును లేదుగదా మఱి స్థిరముగ నిలబడుటయు లేదూ!

తిరిగి జూచుటయును లేదు మఱియునూ దీరుగ బోవుటయును లేదూ!
ఒకరినొకరు మఱి లాగుచుండిరీ యెప్పుగ బడిపోవుచు వారున్
బడిపోయిన వారిని పైదాటుచు బలుకక బోవుచునుండి రటన్! 6

అంతటిలో హస్తమున గదయునూ పొంతముగా ధరియించి మఱిన్
ఆ విభీషణుడు నరుదెంచుచు నట యలరు రామ సుగ్రీవులకున్
జయజయ శ్రీశబ్దముల బలుకుచును జయము గలుగు గావుత! యనుచున్!

వానరు లా విధమున భయపడుటకు వనర విభీషణ రాక్షసుడే!
కారణమనుచును గ్రహించి మదిలో గలత నొంది సుగ్రీవుండున్!
తన సమీపమున నున్న మహాత్ముడు దనర జాంబవంతుని గాంచీ! 8

ఈ విభీషణుని యాగమంబునను నితని గాంచుచు వానరులున్,
రావణాత్మజుడు నింద్రజితుండని రహి శంకను భయబడుచు నిదే
పాఱిపోవుచున్నారు మహాత్మా! పరుగు లిడుచు నున్నారు మఱిన్! 9

సుసంత్రస్తులై యనేక విధముల సురుచిరముగ బరుగిడుచున్నా,
ఆకపి వీరుల బహు శీఘ్రముగా నలరగ ధైర్యము కలవారిన్!
జేయుము! వారికి దెలియ జెప్పుమా! శీఘ్రము ధీరత విలసిల్లన్!
వచ్చినవాడు విభీషణుం డనుచు వనర యింద్రజితు గాడనుచున్! 10

సుగ్రీవుడు దెలిపిన విధముగనూ సురుచిర ఋక్షాధీశుండన్
పారిపోవు వానరులను వేగము బన్నుగ వెనుకకు బిలిచి మఱిన్
ధైర్యము, ధీరత, నూఱిపోసెనూ దగ రణమున మఱి నిలువగనూ!
వచ్చినవాడు విభీషణుండనుచు వనర యింద్రజితు గాదనుచున్! 11

వానరులందఱు జాంబవంతునీ వచనములను విని ధైర్యముతో!
ఆ విభీషణుని గాంచి మఱియునూ యలరి యింద్రజితు గాదనుచున్!
భయమును విడిచియు తిరిగివచ్చిరీ బన్నుగ సుగ్రీవుని కడకున్ 12

ధర్మాత్ముండగు విభీషణుండును దగ వరములచే గప్పబడీ!
రామలక్ష్మణుల శరీరములనూ రహి గాంచెను నటు బిమ్మటనూ
వేదన జెందెను మదిలో మిక్కిలి కలత బొందెను గాఢముగన్! 13

జలక్లిన్నంబగు దన హస్తమునను జాగృతి నొందగ వారలనూ;
నేత్రంబులు మఱి దుడిచియు వారల ముఖ మంతయు దన హస్తమునన్
దుడిచి శోక సంపీడితంబునగు దుఃఖముతో మది విలపించెన్! 14

అధికమైన సత్యము గలవారును నలరు బరాక్రమ వంతులునూ!
రణరంగము నందాసక్తియు మఱి రమ్యసుందరులు నగువాన్!
ఇట్టిసోదరుల రామలక్ష్మణుల నిట్టె కపట యుద్ధము నందున్,
రాక్షసులును జేసిరి గద యీస్థితి రాత్రి యుద్ధమున మోసమునన్! 15

కపట మెఱుగని పరాక్రమముగల కాంతి వంతులగు సోదరులన్!
రావణాసురుని దుష్పుత్రుండును రహి దురాత్ముడగువాడు మఱిన్!
నా సోదరుని తనయుని జేతను నయహీనుండగు రాక్షసుచే
కపట బుద్ధిగల యింద్రజిత్తుచే గలిగెను గద! యీ యపాయమున్! 16

బాణంబులచే గప్పబడియు మఱి బన్నుగ రుధిరముజేత మఱిన్,
తడిసి నేలపైనున్న వారలును దగ యీ రాజకుమారులునూ!
శల్యక మృగములవలె గనబడుచుండిరి శయనించిన యీ సోదరులున్! 17

ఏమహాత్ములగు రామలక్ష్మణుల యిమ్ముగ యాశ్రయ మందితినో!
రాజ్యంబును నే నందవలయునని రహి కోరితినో మది యందున్!
అట్టిసోదరులు రామలక్ష్మణులు నిట్టి దేహ నాశము గొఱకున్
భూస్థలి బడి నిదురించుచుండిరీ బొలుపగు జాగృతి విడనాడి! 18

నాదు రాజ్య లాభాశ నశించెను నయముగ యీతరుణము నందున్
అయినను నే జీవించి యుంటినీ యాపద యందున జిక్కితినీ!
శత్రువైన రావణు ప్రతిజ్ఞయును శీఘ్రము నెఱవేరినది కదా!
అతని గోరికయు దీరిపోయినది నాతని మనోరథమును గూడన్! 19

ఈ విధముగ విలపించుచున్న యా యిమ్ముగ వినయ విభీషణునీ!
కౌగలించుకొని యా సుగ్రీవుడు కరుణ వాక్యముల నిటు లనియెన్! 20

ధర్మము నెఱిగిన ఓవిభీషణా! దగ లంకానగరము నీవున్!
హొందగలవు సుమ! నినుమంతయునూ సందేహము నిందును లేదూ!

రావణుండు మఱి యతని కుమారుడు రహి యనుకొనునటులను మదిలో!
వారికోరికయు సఫలము గాదూ! వారల మనోరథములు మఱియున్! 21

సోదరులిరువురు రామలక్ష్మణులు స్రుక్కుచు మరణ మువేదననూ
బాధపడుటయును లేదుగదా మఱి భంగ బడుటయును లేదుగదా!
మూర్ఛను మాత్రము బొందియుండిరీ మోహము విడుతురు త్వరితగతిన్!
రణమునందు బరివార సహితుడగు రావణు వధింపగలరు సుమా! 22

ఈవిధి సుగ్రీవుడు విభీషణుకు విశ్వాసము గలిగించి మఱిన్!
ఓదార్చుచు దన ప్రక్కనున్న యా యున్నతుడును దన మామయునూ!
వానరసేనా మహానాయకుడు వనర సుషేణునితో ననియెన్! 23

శూరులైన హరి వీరులగలిసీ స్పృహ వచ్చిన యీ సోదరులన్
శత్రుమర్దనులు బలవీర్యులునగు శాత్రవ సంహారులు మఱియున్!
రామలక్ష్మణుల గ్రహించి వేగము రయమున కిష్కింధకు బొమ్మా! 24

నేను సుపుత్రులతోడను మఱియును సహబంధువులను గూడిన యా
రావణాసురుని వధియించెదనూ వనరగ దేవేంద్రుడు వేగన్
నశించిపోయిన రాజ్యలక్ష్మినీ నయముగ దెచ్చిన రీతిగనూ!
జనకనందినిని దోడ్కొని వచ్చెద జనులందఱు సంతస మందన్! 25

సుగ్రీవుని యా వచనములను విని సుషేణుండు మఱి యిటు లనియెన్!
'దేవాసురులకు' మధ్యను జరిగిన దీరుగ జరిగిన యుద్ధమునన్!
దానిని గూర్చియు నాకును దెలియును దగ వృత్తాంతం బంతయునూ! 26

అట్టివేళ శర సంస్పర్శంబున యలరు నేర్పరులు దానవులున్
శస్త్ర విదుషులును నగు దేవతలును సారెకు యంతర్ధానమునన్
మాటిమాటికిని వారల గొట్టిరి మానుగ మాయా జాలమునన్! 27

అట్టి సమయమున యా దేవతలను నలరి కొందఱును బీడితులై,
కొందఱు మూర్ఛను జెందిరి యందున కొందఱు మరణము జెందిరటన్
వారల నందఱ దేవగురుండగు వనర బృహస్పతియును నపుడున్!

మంత్రంబులతో గూడిన విద్యను మఱి యోషధులను జతగూర్చి
చికిత్స జేసెను వారికందఱకు శీఘ్రము జాగృతి నందగనూ! 28

ఔషధముల గొని వచ్చుట కొఱకును వొనరగ సంపాతియు మఱియున్
పనసుడు మొదలగు వానరవీరులు బహు వేగమునను శీఘ్రముగా!
క్షీరసముద్రము బోదురు గాతను! స్థిరమగు బరిసరములకు మఱిన్! 29

దివ్యమైన సంజీవ కరణిని దేవతలును మఱి సృజించినా
విశల్య కరణిని యితరములైనా వివిధ పర్వతములందుగలా
ఓషధులను కపివీరు లెఱుగుదురు నొనరగ దాని సుగుణములనూ!

దేనియందు నమృతము మథించిరో దీరుగ సురలును రాక్షసులున్;
సాగరములలో శ్రేష్ఠమునైనా సరసత క్షీరసముద్రమునన్
చంద్రము, ద్రోణము నను గిరులున్నవి సంజీవియు మఱి విశల్యముల్
అనుషయోధులను నాపర్వతమున యలరుచు నున్నవి సుగ్రీవా! 31

ప్రసిద్ధంబులగు నా పర్వతములు బరగ మహోదధి యందుననూ,
సురలచేత నిర్మింపగ బడియెను సురుచిరముగ ప్రఖ్యాతముగా!
వాయుపుత్రుడగు నీ హనుమంతుని రయమున బంపుము నచ్చటికిన్,
నా యోషధులను నిచటికి దెచ్చును నయముగ వేగము బయవించి! 32

ఇంతలోను సుఖములతో గూడిన వింతగ మెఱుపులును విరిసెన్!
సంద్రపుజలముల జిమ్మివేయుచును సాంద్రమైన గాలులు వీచెన్!
పర్వతంబులును నా సమయంబున బరగ కదులుచున్నటుల మఱిన్
తీవ్రమైన వాయువులును వీచెను దీరుగ భూమియు గదలునటుల్! 33

సర్వ ద్వీపముల గల వృక్షంబులు సరసత తీరమునందు గలా!
మహావృక్షములు రెక్కల గాలికి మానుగ విరుగగ గొట్టబడి
లవణ సముద్రమునందు జలములను లాలితముగ బడిపోయె నటన్! 34

సర్పములన్నియు భయపడిపోయెను సకములగు జలజంతువులున్
భీతిజెంది యా మహాసంద్రమున నతివేగముగా దాగికొనెన్!
పక్షులు గూడను బటుతర వేగము బారిపోయె నలు దిక్కులకున్! 35

అటుబిమ్మట యా వానరులకు మఱి నలరి ముహూర్తము కాలమునన్,
మండుచున్న యరణాగ్నికి వోలెను మెండుగ కాంతులు జిమ్ముచునూ!
వినతా తనయుడు మహావీర్యుడును విమల రూపమును గలవాడున్
గరుత్మంతుడును గనబడె నచ్చట గగనమునుండియు భువిదిగుచున్! 36

శరములుగా నైనవియును మఱియును బరగ మహాబలమును గలవీ!
వేనిచేత శ్రీరామలక్ష్మణులు వికటముగా గట్టగ బడిరో!
అట్టినాగములు గరుత్మంతుని నిట్టె గాంచి బహు శీఘ్రముగా
పారిపోయినవి వెనుకకు జూడక బటుదరముగ నలుదిక్కులకున్! 37

అటుబిమ్మట నా సుపర్ణుండునూ నాసోదరులను స్పృశించియున్,
జయజయాది వందనముల తోడను సాంద్ర సుశీతల హస్తములన్
చంద్రప్రభ సమ ముఖంబులను మఱి చారుసుందర సులలాటమున్
చేతులతో నిమిరెను ప్రసన్నమగు శ్రీకరమగు దన శుభదృష్టిన్! 38

గరుత్మంతుడును స్పృశింప వేగము కరమున వారల గాయములున్
అదృశ్యమాయెను వాని బాధయును నంతమాయె గడు వేగముగన్
వెనువెంటనె వారల శరీరములు విమల సువర్ణ సుకాంతులనూ
బహుస్నిగ్ధముగా గనబడుచుండెను బన్నుగ కపివీరులు గాంచన్! 39

సోదరులగు నా రామలక్ష్మణులు జోద్యముగను దేజస్సు మఱిన్
పరాక్రమము, నుత్సాహము మఱియును బన్నుగ యితర మహాగుణముల్
సూక్ష్మవిషయ పరిజ్ఞానము మఱియును సురుచిరబుద్ధియు స్మృతియు మఱిన్
ద్విగుణీకృతముగ బెఱిగెను వారికి దిగ్దర్శనమును మెండుగనూ! 40

మహాతేజుడగు గరుత్మంతుడును మానుగ యింద్రుని సమానులున్!
రామలక్ష్మణుల లేవదీసి మఱి రయమున వారల నిద్దరిని
కౌగలించుకొనె గడు గారవమున గరుణ బొరల హృత్పద్మమునన్!
శ్రీరాముడు మఱి సంతోషించియు శ్రీకరముగా యీ విధి బలికెన్! 42

భవత్ప్రసాదమునను మే మిరువురు బాధనుండి మరి ముక్తులమై
ఇంద్రజిత్తుచే గలిగిన యాపద సాంద్రముగా దాటితి మిపుడున్!
పూర్వమువలె బలమును గలిగియు మరి బొలుపుగ నుంటిమి వినతసుతా! 43

నిను గాంచుటచే నా మనస్సునూ నిరవధికమగు ప్రసన్నతన్!
బొందుచునున్నది తండ్రి దశరథుని బొందుగ జూచిన యట్లుగనూ!
పితామహుడు నగు నజుని గాంచినా విధముగ నున్నది ప్రసన్నతన్! 43

సుందర రూపము గలవాడవు మరి సురుచిర దివ్య సుమాలలనూ!
చందనాదులను గలవాడవు మరి యందములును, బహు సుందరమున్!
వస్త్రంబుల ధరియించినవాడవు వనరగ దివ్యము లైనట్టి
యాభరణంబులతో నుంటివి మఱి యలరి దెలుపు నీవెవ్వరివో! 44

మహాతేజుడును మహాబలుండును మానుగ పతత్రిరాజయినా!
వైనతేయుడును ప్రీతాత్ముండై వ్యాకుల సంతస నేత్రములన్
దశరథాత్మజుడు శ్రీరామునితో దగ నీ రీతిగ బలికె నటన్ 45

ఓ శ్రీరామా! నీప్రియ సఖుడను! నొనర బహిశ్చర ప్రాణంబున్!
గరుత్మంతుడను! వినతా పుత్రుడ! విని మీ యాపద శీఘ్రముగన్!
మీ సోదరులకు సాయము జేయగ మేదినీశ యిట కొచ్చితినీ! 46

క్రూరకర్ముడగు నింద్రజిత్తుచే గూరిమి మాయా జాలముతన్,
నిర్మింపగబడి సుదారుణంబగు నిరవధికంబును, భీమంబున్!
శరబంధంబును విడిపించుటకును సాహసవంతులు నసురులునూ,
మహావీర్యులగు కపులుగాని మఱి మహావిక్రములు దేవతలున్!
గంధర్వులు మఱి యక్షులుగానీ గలిసియు విడిపింపగలేరూ! 47-48

తీక్షణములునగు గోరలు గలవియును దీరుగ విషోల్బణము లయినా
కద్రువసుతులగు నీనాగంబులు కఠిన రాక్షసుని మాయలచే
బాణములుగా నై యీవిధమున బరగ యాక్రమణము జేసె మిమున్! 49

ధర్మము దెలిసినవాడవు రామా! దగ సత్య పరాక్రమునవునూ
రణరంగంబున నీవును మఱి నీ రహి సోదరుడగు లక్ష్మణుడున్
సభాగ్యవంతులు, సహజ విక్రములు సకల విద్యలను జతురులునూ! 50

ఈ వృత్తాంతము వినిన వేంటనే యిరువురి మధ్యను గలిగిన యా
ం స్నేహంబును మదిని దలచుచును సువ్రత! యది భావించుచునూ!
్వరమాణుడనై యిటకు వచ్చితిని దగ ఖిందగ కన్నుల నీరున్! 51

ంహాభయంకర నాగ బంధముల మానుగ విడిపింపగ బడిరీ,
పేమరిబాటును లేకుండను మఱి యెల్లపుడును బహు జాగృతితో
ండవలయు మఱి యీరాక్షసులును చండవిక్రములు మాయలనూ! 52

ణరంగంబున కపట బుద్ధితో రణము జేయుదురు రాక్షసులున్!
ది నిశాచరుల స్వభావంబు మఱి యది వారల నైజంబు మఱిన్!
ారులును మఱి శుద్ధభావులును సురుచిర క్షాత్రము గలవారున్,
ర్జవంబు మరి ఋజుత్వంబునూ యదియె బలము మీ కెల్లపుడున్! 53

ఀ కారణమున రణరంగంబున యా నిశాచరుల విషయమునన్,
మ్మగూఢ దది ప్రబల సత్యమిది నమ్మరాదు మరి రాక్షసులన్,
ంద్రజిత్తు నిందుకు నిదర్శనము సాంద్ర మాయచే మిమ్ములనూ
ాగబాణ బంధములను మిమ్ముల నయముగ బంధించెను నిపుడున్! 54

ంహాబలుండగు సుపర్ణుడును మరి మానుగ శ్రీరాముని తోడన్!
ఀవిధముగను బలికి స్నేహమున యాలింగనమును జేసికొనీ!
ిడలిపోవుటకు ననుజ్ఞ గోరుచు వినయముగా నీ విధి బలికెన్! 55

ర్మజ్ఞా! ఓ శత్రువత్సలా! దగమిత్రుడవగు శ్రీరామా!
పనుమతి నివ్వగ గోరు చుంటినీ యతిసుఖముగ నే బోయెదనూ! 56

ంహావీర! ఓ శ్రీరామా విను! మానుగ మనయిద్దఱకు మరిన్,
్నేహ మెచటిదని, యెప్పటి దనుచును స్థిర యభిలాషను జూపకుమా!
ణమునందు శాత్రవుల వధించియు రణమ్ము బూర్తిజేసిన పిదపన్!
ఀ స్నేహంబును దెలియును నీకును నలరెడి బాంధవ్యము గూడన్! 57

ాణంబులు నను దరంగములచే బన్నుగ లంకా నగరమ్మునన్!
ాలురు, వృద్ధులు మిగులునట్లుగా బన్నుగ జేయుము శీఘ్రముగా

శత్రువైన రావణుని మరియునూ సకల బంధువుల మిత్రులనూ
సంహరించి యా జనక నందినిని సంతసమున బొందెదు వింకన్! 58

సువర్ణంబులను గలవాడును మరి సురుచిర గమనము గలవాడున్!
వీర్యవంతుడును గరుత్మంతుడును వీరులైన కపులకు మధ్యన్!

ఈ రీతిని మృదువచనంబులతో నిమ్ముగ కౌగిలి జేర్చికొనీ,
యా శ్రీరాముని, యా రఘువీరుని యా దశరథ రాముని వేగన్
బాధలేని వానినిగా జేసియు బన్నుగ యటుమీదట నతడున్
ప్రదక్షిణంబును జేసి యంజలిని బరగ నమస్కృతులను జేసీ
వాయువువలె గగనంబు జేరికొని వనరగ జనె నిజస్థానంబున్! 60

అటుబిమ్మట వానర యూథపులును నా రఘువీరుల నచ్చటనూ!
పీడా నిముక్తులై నట్టులు మఱి ప్రీతిపూర్వకము గాంచి మఱిన్
సింహనాదములు జేయుచు మఱియును జిరుగంతులు నట వేయుచునూ!
తోకల దులిపిరి నేలను గొట్టును దోరముగా ధ్వనులను జేసీ! 61

ఆ వానరవీరులు బూర్వము వలె యలరు భేరులను ప్రమోగించీ,
మృదంగంబులును నటు ప్రమోగించిరి మిగుల శంఖముల బూరించీ!
అనేక విధముల నఱవుల నఱచిరి యాకాశంబును ధ్వనియింపన్; 62

పర్వతములతో యుద్ధము జేసెడి పరాక్రములు వానరు లంతన్
భుజములు జఱచుచు దొడలు గొట్టుచును భూరి బలోద్ధతులగు వారున్!
వృక్షంబుల బెకలించి దెచ్చిరీ విసరివేయ యరి వీరులపై,
నిలిచి రచట రణమును సలుపుటకై బిలబిల శత్రుల బిలుచుచునూ! 63

వానరవీరులు ధ్వనులు జేయుచును వనతగ రాక్షసులను మఱియున్,
మిగుల భయము బెట్టుచు వారలనూ మిగుల బాధబెట్టుచు వారిన్
రణముజేయ లంకా ద్వారంబును రయమున జేరిరి కపివీరుల్! 64

గ్రీష్మఋతువునకు నంతము నందున భీషణమగు రాత్రిని వేగన్,
నల్లని మబ్బులు వ్యాప్తిజెంది మఱి బెల్లున గాలులు వీచుచునూ!
భయంకరంబగు నాదము వోలెను బన్నుగ యా కపివీరులయున్!
భయంకరంబగు వ్యాకులమైనా బన్నుగ ధ్వనులును నట నుండెన్! 65

(యుద్ధకాండమందు 50వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

## యుద్ధకాండము - మొదటిభాగము

### యాబది యొకటవ సర్గము

(రాముడు శరబంధమునుండి విముక్తుడైనట్లు దెలిసి రావణుడు చింతాక్రాంతుడగుట— ధూమ్రాక్షుని యుద్ధమునకు బంపుట — అతడు సేనాధిపతితో కలిసి నగరమునుండి బైటకు వచ్చుట)

అ సమయంబున మహాతేజమున్న నలరి గర్జనము జేసెడి యా
వానర వీరులు జేయు ధ్వనులునూ వనరగ వ్యాకులమైన ధ్వనుల్
రావణుండు మఱి యారాక్షసులును రహి విని భీతిని జెంది రటన్! 1

అటుబిమ్మట యా దశాననుండును నట్టి స్నిగ్ధ గంభీర ధ్వనుల్
జేయుచున్న యా కపివీరుల గని జింతిలుచును మది బహుళముగా!
మంత్రుల మధ్యను నిలిచి యాతడును మది కలతను నీ విధి బలికెన్! 2

వానరులందఱు సంతోషించుచు వనరగ జేసెడి యీ ధ్వనులున్
మేఘంబులకును బోలియున్నవియు మీరిన ప్రావృట్కాలమునన్!
ఘనమగు సంతస మెదియో వారికి గలిగినటుల మది దోచెడిని!

ఈ విషయము మఱి స్పష్టము! నిందున యించుక సందేహము లేదూ!
అధికమైన యీ ధ్వనులజేత మఱి యల లవణాంబుధి గూడ నదే
క్షోభించుచు నున్నది ఘోరముగా క్షోభించుచు నున్నది మదియున్! 3-4

సోదరులగు నా రామలక్ష్మణులు సూది మొనలుగల బాణములన్
నాగపాశబంధములను వారును నయముగ గట్టగ బడిరి కదా!
ఇపుడు బయలుదేరిన సుమహాధ్వని యిమ్ముగ శంకయు గలిగెడినీ
ఏదో కారణ ముండి దీరునూ యీధ్వను లిటు జేయగ కపులున్! 5

రాక్షసేశ్వరుండయిన రావణుడు రహి మంత్రులతో నీ రీతిన్
బలికి సమీపమునందు దిరిగెడీ బన్నుగ రాక్షసులను బిలిచీ!
ఈ విధముగ బలికెను వారలతో నిమ్ముగ యాశ్చర్యంబుననూ! 5

ఈ సకలంబగు వనౌకసులకును నిమ్ముగ శోకము జెందుటకున్
దగిన కాలమిది, యీ సమయంబన దగ సంతసమును జెందుకుటన్!
ఏకారణమది గలిగినదో మఱి నిమ్ముగ శీఘ్రము దెలియు డికన్! 7

ఆ రావణుచే నటుల బలుకబడి నా రాక్షసులును ద్వరితగతిన్
ప్రాకారంబును నెక్కి జూచిరీ బన్నుగ సుగ్రీవుని సేనన్!
మహాత్ముడగు నా సుగ్రీవునిచే మానుగ బాలింపగ బడినా
సేనను గాంచిరి భయంకరంబగు స్థిర శర బంధము జేత వటన్
విముక్తులై మఱి లేచినట్టి యా విమల మూర్తులగు సోదరులన్! 8-9

రామలక్ష్మణుల గాంచిరి వారలు రమ్యముగా సేనల మధ్యన్,
ఆ రాక్షసులును దిగులు జెందిరీ నా రాజకుమారుల గాంచీ! 9

భయంకరులునగు నా రాక్షసులును బరగ సంత్రస్త హృదయులునై,
మారిపోయినా ముఖ ఛాయలతో మఱి ప్రాకారంబుల నుండీ,
దిగి వారందఱు బోయిరి వేగము దగ రావణుని సమీపంబున్! 10

వాక్య కోవిదులు నగు రాక్షసులును వనరగ దీన ముఖంబులతో
అప్రియమగు నా విషయ మంతయును నలరి దశానను తోడ మఱిన్!
ఉన్నదంతయును నున్నట్టుగ మఱి విన్నవించిరీ వినయమునన్! 11

మారుడగు నింద్రజిత్తుచే నిమ్మగ రణరంగము నందున్,
రులగు నా రామలక్ష్మణుల సూది మొనలు గల బాణములన్!
ంధములను గట్టి వేయబడి సరగున గదలక లేకుండన్!
ంగబడెనో యా రాజకుమారులు యా గజేంద్రముల సమమున్!
మము గలవారును నిరువురు విమల తేజమున బాశములన్
పుకున్న గజములకును వోలెను యంచితముగ యుండిరి యచటన్!

ంబలుడు నా రావణు డంతట మానుగ వారలు దెలిపిన యా
క్యములను విని విచార మందెను వనరగ రోషముతో గూడీ,
వసికముగా వేదన బొందెను మాటరాక మౌనము నందెన్!
క్ష వదనుండై దిక్కులనూ విల విల గాంచెను దీనముగా! 14

నానముచే బొంది నట్టివియు వనర భయంకర మును నైనా.
ాఘములు, సూర్యునితో సమములు నలరు శరములను రణమందున్!
ంపబడి మన యింద్రజిత్తుచే మానుగ కట్టగ బడినట్టి:
శత్రువులగు రామ లక్ష్మణులు నయముగ యాశర బంధమునన్,
క్కొనియు మఱి విముక్తి బొందుట చిత్రముగా గనిపించెడినీ!
బలమంతయు సంశయ స్థితిలో మానుగ నున్నటులను దోచున్! 1516

ర్వంబున యే వాడి బాణములు బొలుపుగ రణరంగము నందున్,
ం శత్రువుల జీవితంబులను నయముగ యంతము జేసెడివో!
ంక తేజసములు నగు శరములు ఫలము లేనివై బోయెగదా!
యంతయు చిత్రముగా దోచును నిమ్మగ యాశ్చర్యంబుగనూ! 17

ణుం డిటుల బలికి క్రోధమున రహి సర్పము వలె నిట్టూర్పుల్,
లు గొట్టుచును రాక్షసులందున బొలుపుగ నుండిన ధూమ్రాక్షున్!
బిలిచి యీ విధమున బలికెను స్నేహ వాక్యములు విలసిల్లన్! 18

విక్రమా! ధూమ్రాక్షా! విను! భీమసైన్యమును గొని వేగన్,
క రాక్షసవీరుల తోడను నలరు మహాయోధుల తోడన్!
ాముని మఱి యా లక్ష్మణునీ యా వానరులను వధింపగన్!
ంలుదేరుమా! వేగము రాక్షస! బరగ జయమ్మును గొనిదెమ్మా!

ధీమంతుడగు రాక్షసేంద్రుచే దీరత నావిధి జలుకబడి!
ధూమ్రాక్షుండును యచటనుండి మఱి ఘోరముగా బోయెను వేగన్!
రాజభవనమున నుండి వెడలెనూ రహి సైన్యంబును దీసికొనీ!
వానరులను, రాముని వధియింపగ వనర లక్ష్మణునీ వధింపగన్! 20

అతడు ద్వారమును దాటి వేగమున అల సేనాధ్యక్షుని తోడన్,
ఇటుల బలికె బహు దర్పంబున మఱి యిమ్ముగ బటుతర వాక్యములన్!
యుద్ధంబునకును బోవుచుంటినీ సిద్ధము జేయుము సైన్యంబున్!
ఆలస్యంబును జేయకుమా మఱి యా రాజేంద్రుని యాన సుమా! 21

సైన్యంబును గల సేనాధ్యక్షుడు సరగున యాతని మాట వినీ,
రాక్షసేంద్రుడగు రావణు యాజ్ఞను రయమున సిద్ధంబును జేసీ!
ఆ ధూమ్రాక్షుని వెంట సైన్యమును నలరుచు బంపెను రణమునకున్! 22

బద్ధ ఘంటలును, బలవంతులునూ భయంకరంబగు రూపంబున్,
గలిగినట్టి యా రజనీచరులును గణగణ ధ్వనులను జేయుచునూ!
సంతసమున ధూమ్రాక్షుని చుట్టును జెంత జేరి రుత్సాహమునన్! 23

జలదంబుల వలె ధ్వనులను జేసెడి సరి భీకరులగు రాక్షసులున్!
గర్జించుచు మఱి యనేక విధముల కఠినమైన యాయుధములనూ!
శూలంబులు మఱి ముద్గరంబులును సురుచిరముగ హస్తములందున్!
ధరించి మఱియును గదలు, దండములు దగ రోకళ్ళను బట్టిశముల్
పరిఘలు మఱియును బిందిపాలములు బల్లెంబులు మఱి పాశములున్!
మున్నగు నాయుధముల ధరించియును మోదంబున బోయిరియనికిన్!24-25

కొందఱు కవచములను గలవారై కొందఱు రాక్షసులును మఱియున్,
ధ్వజములజేతను, స్వర్ణజాలముల దగ యలంకరింపగ బడియున్!
అనేక ముఖముల ఖరముల జేతను నలరి లాగబడు రథములనూ,
పరమ శీఘ్రమును గల హయములనూ బన్నుగ మదోత్కటంబులునూ!
గజముల మీదను బెద్దపులుల వలె బన్నుగ యెద్దిరింపగ రానీ!
శ్రేష్ఠులైన యా రాక్షస వీరులు శీఘ్రము వెడలిరి రణమునకున్! 26-27

ంర నిస్వనమున గల ధూమ్రాక్షుడు గరమున మృగ సింహంబులయున్,
ోలిన ముఖములు గలిగినట్టి మఱి బొలుపగు భూషణముల జేతన్!
అలంకరింపగ బడిన ఖరములను నలరి గట్టినా రథములనూ!
ంయలుదేరె నా ధూమ్రాక్షుండును బన్నుగ సేనను గూడికొని! 28

మహావీర్యుడగు నా ధూమ్రాక్షుడు మానుగ రాక్షసులను గూడీ,
వ్వుచు, బ్రేలుచు వింతధ్వనులతో నయముగ ప్రలాపములతోడన్!
హనుమంతుడు నే ద్వారమందునను నలరీ సేనకును నధిపతిగా
ఉండెనొ మఱి యాబడమటి ద్వారము నుండివెలువడెను రణమునకున్!29

ంరయుక్తంబును, ఖరస్వనంబుగల కరమున రథమున బోయెడి యా
భయంకరుండును, భీమ దర్శనుడు బలవంతుండగు రాక్షసునీ
ఆకాశంబున గల దుష్టములగు నభిశకునంబులు నడ్డుబడెన్!
భూమి మీద గల దుష్ట శకునములు భుగభుగ మనుచును నెదుర్కొనెన్!30

ఆ ధూమ్రాక్షుని రథ శీర్షంబున నతి భయంకరంబైనదియున్
గద్ద యొక్కటియు వచ్చి వ్రాలెనట కడు భీకరముగ నఱచుచునూ!
శవముల దిను రాబందులు గూడను సరగున రథ ధ్వజ శిఖరమునన్!
వచ్చిబడినవీ గుంపులు గుంపులు మచ్చిక యెఱవేసిన యటులన్! 31

రుధిరార్ద్రంబగు శ్వేత కబంధము రొదజేయుచు బహు వికృతినీ!
ధూమ్రాక్షుని యా రథము ముందఱను దోరముగా నేలను బడియున్!
రక్తపు వర్షము గురిసెను నంతట రయమున భూమియు గంపించెన్!32-33

డుగుతోని సమమైన ధ్వనియుగల వడిగా వాయువు నెదురయ్యెన్
క్కులు దిమిరము వ్యాపించినదీ దిశలును గాటుకతెర లయ్యెన్!
ునుని కాంతులు గనబడవయ్యెను బ్రకాశమును లుప్తంబయ్యెన్! 34

సమయంబున గనబడినట్టి యా శకునంబుల గాంచుచునూ!
ధూమ్రాక్షుడు బహు గలతను బొందెను దోరముగాతన మది యందున్!
ుందునడుచు నా రాక్షసులందఱు మోహాముజెందిరి శకునములన్! 35

అటువిమ్మట నా సుభీముండునూ, బటువీరుడు ధూమ్రాక్షుడునూ!
అధికమైన రాక్షసులను గూడి యతి యుద్ధోత్సాహము తోడన్!
జయలుదేరుచును వచ్చిచేరెనూ బటుతరమగు సంభ్రమువోలెన్
రామునిచే రక్షింప బడెడి యా రమ్యమైన కపి సైన్యంబున్!
గనుల జూచె నా ధూమ్రాక్షుండును కనక రథంబున పైనుండీ! 36

(యుద్ధకాండమునందు 51వ సర్గము సమాప్తము)

★ ★ ★

## యుద్ధ కాండము - మొదటి భాగము

### యాబది రెండవ సర్గము

[హనుమంతుడు ధూమ్రాక్షుని వధించుట]

భీమ విక్రముండైన రాక్షసుడు భీకరంబు నగు నాదమునన్
ధూమ్రాక్షుండును వచ్చుట గాంచియు ఘోరముగా వానరు లంతన్!
సంతోషించిరి రణము సలుపగను సరసత ధూమ్రాక్షుని తోడన్
కిచకిచలను బహుధ్వనులను జేసిరి కెవ్వున గేకలు వేయుచునూ! 1

భయంకరంబగు వృక్షంబులచే బటుతర శూలంబుల జేతన్!
పరస్పరంబును గొట్టుకొనెడి యా బన్నుగ వానర రాక్షసులున్!
భయంకరంబును వ్యాకులమైనా బటుతర రణమును బరిగెనటన్! 2

భయంకరులు నగు వానరసైన్యము బన్నుగ రాక్షస సైన్యముచే
వధింపబడిరీ వసుధా స్థలిపై వనరగ లెక్కకు మించియునూ!
వానరులును మఱి వృక్షంబులచే, వనర శైల శిఖరంబులచే
రాక్షసులను వధియించిరి వారలు రహి భూస్థలి యంతయు నిండన్! 3

ం గోపించిన వారై రహి భయంకరములును నైనా
మఱి భీమంబులునగు వనర గ్రద్ద ఱెక్కలు గలుగూ!
ం బోవు శరంబుల శంకలేక యా వానరులన్
ని ప్రయోగించిరీ మానుగ యా కపి వీరులపై! 4

బగు గదలజేత మఱి బన్నుగ బట్టిశముల జేతన్!
చే ముద్గరములచే ఘోరమైన బరిఘల చేతన్!
ం నా త్రిశూలములచే జీల్చివేయబడు వానరులన్! 5

ుట్టిన యుత్సాహము గూడిన వారై గపివీరుల్,
ం భయబడ కుండగనూ నిమ్మగ ఘన కార్యంబులనూ
ున జేసిరి వారలు రయమున సుభీమ కార్యంబుల్! 5-6

ములగు గాత్రంబుల సరగున శూలంబుల జేతన్,
దేహంబులు గలిగిన కూరిమి వానర వీరులునూ!
వృక్షములను శిలలను నలరి హస్తముల బుచ్చుకొనీ,
ంను మోదగ సాగిరి నతిబలోద్ధతులు నగువారున్! 7

బగు జవమును గలిగిన బన్నుగ వానర వీరులునూ!
మఱి రణరంగంబున గలుగు ప్రదేశం బంతయునూ!
గా రాక్షసులను మఱి వికటముగా వధియించి రటన్,
బుల జెప్పికొనుచు మఱి దగ మర్దించిరి రాక్షసులన్! 8

రాక్షసులకు మధ్యను ననేక విధములు నైనట్టి,
మఱి శాఖలు గలిగిన శ్రీకరమగు వృక్షంబులతో
బగు యుద్ధము జరిగెను బహు నాశ్చర్యముగా నుండెన్! 9

ించి వానరవీరులు సరగున రాక్షసులను వేగన్,
రాక్షసులును మఱి వనరగ రణమును జేయుచునూ!
గెడి రాక్షసు లంతట రక్తము గ్రక్కిరి వక్త్రములన్! 10

రులును బిమ్మటను నా రాక్షసులను బార్శ్వములన్,
వినిగి పోవగా స్థిర ప్రాణంబులు బోవగనూ!

కొందఱు రాక్షసులను వృక్షంబుల గొట్టుచు గూల్చిరి గుట్టలుగా!
కొందఱు రాక్షసులను శిలలతో గూరిమి జేసిరి చూర్ణముగా!
మఱి కొందఱిని దమ దంతంబుల మానుగ జీల్చిరి రణమందున్! 11

ఆ రజనీ చరులును గొట్టబడి యంతములేని దురవస్థలనూ,
భగ్నములగు ధ్వజములతోడను మఱి బన్నుగ జారిన ఖడ్గములన్
విధ్వంసములగు రథముల తోడను వికలమైన హృదయంబులతో!
వ్యథనుజెంది యా రజనీచరులును బాధనొంది రా యుద్ధమునన్! 12

వనౌకసులచే బ్రయోగింపబడి వనరగ పర్వత శిఖరములన్,
నలిగిపోయినా గజముల జేతను, నయముగ పదాతి సైన్యముచే
హయములతోడను వసుధ యంతయును నలరియుండె బహు చిత్రముగా
మృత్యుదేవతయు ముగ్గులు వేసియు నత్యుత్సాహము నొంది నటుల్! 13

భయంకరంబగు బరాక్రమముగల బటుతర వానర వీరులునూ!
వేగముగా మఱి యుద్ధము దిరుగచు వికటముగా బై కెగురుచునూ!
వాడియైన దమ గోరుల తోడను వనర రాక్షసుల ముఖములనూ
రక్కుచు, జెక్కుచు జీల్చివేసిరీ రక్తము జిమ్మగ నంతటనూ! 14

ఆ రాక్షసులును దీనవదనులై దిగులుజెందినా ముఖములతో!
విడిపోయిన యా శిరోజములతో విమల రక్త గంధంబులచే
స్పృహను దప్పి మోహమును జెందుచును స్థిరముగ బడిపోయిరి వసుధన్!

భయంకరంబగు బరాక్రమంబున బల్లిదులగు రాక్షసులు మఱిన్,
పరమక్రుద్ధులై యా వానరులను బరగ వజ్రస్పర్శకు సమమై!
అరచేతులతో నా వానరులను నలరి గొట్టుటకు వేగముగా
పరుగులు దీసిరి బండ్లు గొఱుకుచును బటువేగంబున వారలపై; 16

వేగముగా మీదికి వచ్చెడి యా వికట రాక్షసుల గాంచి మఱిన్,
వానరు అంతట యంతకుముందే వనర యధికమగు వేగముతో
బిడికిళ్ళను, మఱి పాదంబులచే గడు తీవ్రములగు దంతములన్!
వృక్షంబులచే మర్దన జేసిరి విలవిల వచ్చెడి వారలనూ! 17

రాక్షసశ్రేష్ఠుడు ధూమ్రాక్షుండును రాక్షస సేనయు బరుగిడుచున్.
పారిపోవుటను జూచి హృదయమున బన్నుగ కోపించుచు మఱియున్,
యుద్ధముజేయగ వచ్చిన కపులను నొద్దికగా వధియించె నటన్! 18

ఆ వానర వీరులలో గొందఱు నలరగ ప్రాసంబుల జేతన్
గొట్టబడుచు రక్తము స్రవించుచును గూరిమి యంతము నొంది రటన్!
మఱికొందఱు గపివీరు లచ్చటను మానుగ ముద్గర ఘాతములన్,
దాళజాలకను నేలను బడిరీ దల్లడిల్లుచును వేదనతో! 19

కొందఱు వానరవీరు లచ్చటను గూరిమి పరిఘా ఘాతములన్,
వధింపబడిరీ ఖింది పాలముల వనరగ జీల్చగ బడి రచటన్!
కొందఱు బట్టిసముల వధింపబడి చింది వ్యాకులత మనసులలో
అసువుల నొదలిరి యా వానరులను నా ధూమ్రాక్షుని జేతనటన్! 20

కొందఱు వానరవీరు లచ్చటను గూర్మి రాక్షసుల జేత మఱిన్
వధింపగాబడి రక్తము జేతను వనరగ దడిసిన వారలునై!
నేలమీద బడిపోయిరి వారలు విలవిల లాడుచు మోహమునన్!
కొందఱు గపివీరులు దరుమబడి నందక బరుగులు దీసిరటన్! 21

ఖండింపగ బడి నట్టి హృదయముల మెండుగ యొక ప్రక్కకు దిరిగీ
పడిపోయిరి కొందఱు గపివీరులు బన్నుగ భూతల మందుననూ!
కొందఱు త్రిశూలముల జేతను మఱి కందునటుల జీల్చగ వారిన్!
ప్రేవులన్నియును వెలుపలి కొచ్చెను వికటముగా నుండెను నచటన్! 22

మిగుల భయంకరమగు నా యుద్ధము దగ హరిరాక్షసులకు మరియున్,
మిగుల వ్యాకులమునై యట నుండెను మిగుల శైల శిఖరంబులతో!
పాదపములచే, బహు శస్త్రంబుల బన్నుగ రణభూస్థలి యచటన్!
వ్యాకులంబుగా ప్రకాశించెనూ వనరగ యధిక భయంకరమై! 23

ఆ యుద్ధమనే సంగీతంబును నలరుచు నందముగా నుండెన్!
చాపంబుల నారుల ధ్వని యనియెడి సరసత దీగెల ధ్వనులు మరిన్
మధురముగా నటు వినబడు చుండెను మానుగ వీణా ధ్వనులవలెన్!

నెక్కుడుష్ఠను మరి దాళంబులుగా నిమ్ముగ యలసటచేత మరిన్!
మందమందముగ వచ్చు మాటలును మరి గీతంబులుగా నుండెన్! 24

రణరంగంబున యగ్ర భాగమున రహి ధూమ్రాక్షుడును నిలిచీ
చాపంబును హస్తమున ధరించీ సరసత బకబక నవ్వుచునూ!
బాణవర్షమును గురిపించుచు మరి బన్నుగ ప్లవంగ వీరులనూ!
దిక్కులబట్టి బోవునట్లుగా దీరుగ జేసెను రాక్షసుడున్! 25

ధూమ్రాక్షునిచే బీడింపగబడి దుఃఖితులై బహు వ్యథజెందీ
యున్న సైన్యమును గాంచి మారుతియు నున్నతమగు నొక శైలశిలన్!
హస్తమునందున గ్రహించి వేగము నా రాక్షసు పైకిని బోయెన్! 26

తండ్రియైన యా వాయుదేవునికి దగ సమానమగు విక్రమమున్!
గలిగినట్టి యా హనుమంతుడును గలిగిన కోపము జేత మరిన్!
అరుణారుణ నేత్రంబుల నాతడు నా ధూమ్రాక్షుని యరదముపై
అట్టి శైల శిఖరంబును వేసెను నణిగి బోవ భూతలముననూ! 27

వచ్చుచున్న యా శిలను గాంచి మరి వనరగ సంభ్రమమును జెందీ!
గదను హస్తమున జేతబట్టుకొని కాంతిజిందు యరదముపైనీ
క్రిందికి దుమికియు భూతలంబునను బొలుపుగ నిలిచెను రాక్షసుడున్! 28

హనుమంతుడు వేసిన యా శిలయును నలరి చక్రములతోడ మరిన్!
కాడి దూలమును నగ్రభాగమును గలిగిన ధ్వజమునుగూడ మరిన్!
శరాసనముతో గూడిన రథమును సర్వము ధ్వంసము జేసియునూ!
నేలమీద బడిపోయెను నాశిల నింగి మారు మ్రోగెడి రీతిన్! 29

మారుతాత్మజుండగు హనుమంతుడు మానుగ యా రాక్షసు రథమున్!
ధ్వంసము జేసియు జూర్ణముగా నట దగ వృక్షంబుల జేత మరిన్!
కొమ్మల జేతను మ్రానుల జేతను గూరిమి జంపెను రాక్షసులన్! 30

ఆ రాక్షసులును విభిన్న శిరసులు నగుటచేత రక్తంబులచే
దడిసి పోయిరీ రణరంగబున దగ బడిపోయిరి భూస్థలినీ!

మఱికొందఱు రాక్షసులు నచ్చటను మానుగ వృక్షంబులచేతన్!
గొట్టబడగ నేలను బడిపోయిరి కూరిమి హాహాకారములన్! 31

మారుతాత్మజుడు హనుమంతుండును మానుగ రాక్షస సైన్యంబున్,
తరిమివేసి యొక గిరి శిఖరంబును దగ హస్తంబున గ్రహియించీ!
ధూమ్రాక్షుని మీదికి బరుగెత్తెను దోరముగా నాతని జంపన్! 32

వీర్యవంతుడగు ధూమ్రాక్షుండును వేగముగా గద గ్రహియించీ!
ఎత్తి బట్టుకొని గర్జించుచునూ నిమ్ముగ తనపై వచ్చెడి యా
హనుమంతుని బాధింప దలచి మఱి యాతనిపైకిని గమియించెన్! 33

అటుబిమ్మట నా ధూమ్రాక్షుండును చటుల భయంకరమును నైనా!
కంటకములతో గూడిన గదనూ కంట నిప్పులను రాల్పెడి యా
వాయుపుత్రునీ మస్తకంబునను వనరగ విసెరెను రాక్షసుడున్! 34

భీమవేగమును గల గద జేతను బిట్టుగ గొట్టగ బడినట్టి
వాయుదేవునీ వంటి బలముగల వనరగ యా హనుమంతుడునూ!
ఆలోచింపక యా ధూమ్రాక్షుని యలరు మస్తకమునను వేసెన్!
తెచ్చినట్టి యాశైల శిఖరమును మెచ్చుకొనగ యా కపివీరుల్! 35

గిరిశృంగముచే కొట్టబడిన యా గిరి సమానుడగు రాక్షసుడున్,
ఆ ధూమ్రాక్షుని సర్వాంగములును నలరి జాచుకొని దూరముగా
విసరివేయబడు బర్వతమును వలె వేగము వసుధను బడిపోయెన్! 36

ధూమ్రాక్షుడు మరణించుట గాంచియు దోరముగా నా రణభూమిన్,
చావగా మిగులు రాక్షసు లందఱు జంపుచుండ హనుమంతుడునూ!
పారిపోయిరీ రాక్షసు లందఱు బన్నుగ నాలుగు దిక్కులకున్!
లంకయందునను బ్రవేశించిరీ వంకరదారుల వేగముగన్! 37

మహాత్ముడగు నా పవనసుతుండును మానుగ శత్రుల వధియించీ
రుధిరంబును బ్రవహింప జేసియును రోదన ధ్వనులును బెల్లుబకన్!

వానరవీరులచే నాతండును వనరగ బూజింపగ బడుచున్!
శాత్రవ సంహారము జేతను మఱి శ్రమను జెంది హనుమంతుడునూ!
ఆనందించెను, సంతోషించెను నటగల సహచరులను గూడి! 38

(యుద్ధకాండమునందు 52వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

## యుద్ధకాండము - మొదటిభాగము

### యాబదిమూడవ సర్గము

[రావణుడు వజ్రదంష్ట్రుడు అను రాక్షసుని యుద్ధమునకు బంపుట-అతడు వానరులతో భయంకరమైన యుద్ధము జేయుట]

రాక్షసేశ్వరుండైన రావణుడు రహి ధూమ్రాక్షుని గూర్చి వినీ
క్రోధంబున మఱి సర్పంబును వలె కూరిమి బుసలను గొట్టుచునూ
వేడివేడి నిట్టూర్పులు విడిచెను వేగముగా గలుషీకృతుడై
క్రూరుడు మఱియును మహాబలుండును గూర్మి వజ్రదంష్ట్రుని వేగన్
బిలువ నంపి మఱి యిటులను బలికెను ప్రియవచనంబులతో నపుడున్! 1-2

ఓ వీరా! ఓ వజ్రదంష్ట్రుడా! యొనర బొమ్ము యుద్ధంబునకున్
రాక్షస సైన్యముతోడ గూడికొని రహి జతురంగ బలంబులతో
దశరథ కుమారుడైన రామునీ దగ లక్ష్మణమూర్తిని మఱియున్!
సుగ్రీవుని మఱి వానరవీరుల శూరత వధింపు! రణమందున్! 3

మాయావియు నగు రాక్షసేశ్వరుడు మానుగ నటులే యని బలికి,
సేనలతోడుత, బరివారములో స్థిరమగు రాక్షస బలములతో!
గజముల తోడుత నశ్వంబులతో ఖరములు మఱి యొంటెల తోడన్!

పతాకధ్వజములతోని చిత్రముగ పలువిధ రథముల గూడికొనీ
తానుగూడ బహు భూషణములతో దగ యలంకరించుక మఱియున్
సావధాన చిత్తముతో గూడుక సాహసమగు నాలోచనలన్!
అతిశీఘ్రముగా బయలు దేరెనూ యా వానరులన్ వధియింపన్! 4-5

అటుమిమ్మట బహు విచిత్రంబులగు నలరు బాహు పురలును మఱియున్,
కిరీటమును శిరసున ధరియించీ కీర్తి కవచమును గప్పుకొనీ!
ధనుస్సు హస్తమునందు ధరించియు దగ వెడలెను యుద్ధంబునకున్! 6

సేనానాయకుడైన రాక్షసుడు స్థిర చిత్తంబున గూడికొనీ
పతాకములచే నలంకృతంబగు ప్రకాశ మానం బగునట్టి!
తప్తకాంచనపు భూషితంబు నగు ధగ ధగ మెఱసెడి యరదంబున్
ప్రదక్షిణంబును జేసి యెక్కెనూ బన్నుగ జయమును నందగనూ! 7

శస్త్రపాణులగు బదాతి దళములు నస్త్రశస్త్రముల ధరియించీ
విచిత్రములునగు దోమరంబులును విమల ధనుస్సులు ధరియించీ
దండంబులు, రోకళ్ళు, శక్తులను దగ ఖడ్గములును బట్టిసముల్
భిండి పాలములు, గదలు, జక్రములు అందమైన గొడ్డళులు మఱిన్
ఇతరమైన బహు సాయుధంబులును నిమ్ముగ ధరించి వెడలిరటన్! 8-9

విచిత్ర వస్త్రములను ధరించినా వీరులైన రాక్షసులు మఱిన్
శూరత్వంబున నిరులా యనునటు సుందర మగు నడకల దోడన్!
మదోత్కటంబగు గజములు గూడను మానుగ రణభూమికిని జనెన్! 10

తోమరములు మఱి యంకుశంబులును దోరముగా హస్తము లందున్
ధరించినట్టి యా యోధులు మఱి దగ యెక్కిన గజములు మఱియున్!
యుద్ధమునందున నేర్పును గలవీ శుద్ధ వీరులగు రాక్షసులున్!
ఎక్కిన యుత్తమ లక్షణములు గల మక్కువ గలిగిన గజములునూ
మహాబలంబును గలవియు మఱియును మహాశౌర్యమును జూపునవీ!
అట్టి మదోత్కట వారణంబులును నలరుచు రణ భూస్థలికి జనెన్! 11

ప్రయాణమై బోవుచు నుండిన యా ప్రబలమైన యా సేనయునూ!
ప్రావృట్కాలమునందు ధ్వనులతో బన్నుగ మెఱసెడి మెఱుపుల యా
మేఘంబుల వలె నా సైన్యంబును మెఱయుచుండె నా సమయమునన్!
ఆ రాక్షసులును వచ్చి రచటికిని యాకపి సేనా నాయకుడున్
అంగదు డుండిన దక్షిణ ద్వారము రంగుగ యుండిన చోటునకున్! 12

ఆ రాక్షసులును బయలు దేరగను నట గనబడె దుశ్శకునంబుల్
మేఘంబులు వింగిని లేకుండగ మిఱుమిట్లును గొలుపుచు వేగన్!
గగనమునుండియు గౌరవులు బడినవి కంపము నొందెను భూమియునూ!
భయంకరంబగు నక్కలు జ్వాలలు బన్నుగ గ్రక్కుచు నఱచినవీ !13-14

అట్టి సమయమున భయంకరంబగు నడవి మృగములును వేగముగన్
నిశాచరుల మరణంబును గోరుచు నిట్టూర్పులతో బలికినవీ!
శీఘ్రముగా వచ్చెడి యోధులకును స్థిరముగ యడ్డంకులు గలిగెన్! 15

మహాబలుండును, దేజస్వియునూ మహా వజ్రదుష్ట్రిందుఁమతిన్
అపశకునంబులు గనుల జూచియును నలరి ధైర్యమును వహియించీ!
రణమునందు వేడుక గలవాడై రయమున వెడలెను సైన్యముతో! 16

జయింపబడినా శ్రమ గల వారును జాగడూకతయు గలవారున్
అట్టి వానరులు గాంచి రచ్చటను నలరి వచ్చు నా రాక్షసులన్,
సుమహాధ్వనులును జేసిరి వారలు సురుచిరముగ బది దిక్కులనూ!
సిద్ధముగా నుండిరి కపివీరులు యుద్ధము జేయగ వారలతో! 17

అటుబిమ్మట క్రూరులు మఱి శూరులు. నలరు భయంకర రూపములన్
గలవారును మఱి యన్యోన్యంబును కలని చంప గోరెడి వారున్!
ఆయిన వానరుల రాక్షసులకును మఱి యతుల తుముల రణమును జరిగెన్

మహోత్సాహమున రణమును సలుపగ మానుగ వచ్చిన వీరులునూ
ఆ వానరులు నా రాక్షసులును నలరి యుద్ధమును జేసి రటన్
విరుగగొట్టబడు నవయవములతో విరిగి తెగిన శిరముల తోడన్!

రుధిరోక్షిత సర్వాంగములతో రోదన జేయుచు గేకలతో
ధరణీతలమున బడిరి వారలును దగ ప్రాణములను విడుచుచునూ! 20

రణమున వెనుకకు మఱలని వారలు రహియోధులు మఱి శూరులునూ
హస్తములను బరిఘలు ధరించియును నన్యోన్యతను సమీపించీ!
అనేక విధముల యాయుధంబులను నలరి ప్రయోగించిరి వారున్! 21

ఆప్రదేశమున వృక్షంబులతో నలరి శిలలు నాయుధములునూ
ప్రయోగించుటను హరి రాక్షసులును నచ్చోటను భీమమునైనా!
హృదయ భేదనంబగు సుమహాధ్వని యదిరె భూమి యాకాశములున్ 22

అచట వినబడెను భయంకరమునగు నల రథచక్రాంతముల ధ్వనీ,
ధనుస్సులయు మఱి నారీధ్వలును దగ శంఖంబుల తీవ్రధ్వనుల్!
భేరీ మృదంగ తాళ ధ్వనులును మీరెను దశదిశలును నపుడున్! 22

కొందఱు రాక్షసు లట్టి సమయమున పొందుగ యస్త్రములను విడిచీ,
బాహు యుద్ధమును జేసి రప్పుడును బన్నుగ వానర వీరులతో!
రణమున మదించి యున్న వానరులు రహి రాక్షసుల శరీరములన్,
నర జేతులతో బాదంబులతో నలరుచు బిడికిలి పోటులతో,
వృక్షంబులచే, శిలల తోడుతను విరుగగ గొట్టిరి రాక్షసులన్,
మఱి కొందఱు రాక్షసుల శిలలచే మానుగ జేసిరి చూర్ణముగా! 23-34

వజ్రదంష్ట్రుడును రణరంగంబున వనరగ బాణంబుల జేతన్!
హరివీరులకును భయము గొలుపునటు నట వర్తించుచు నుండె నటన్!
ప్రళయకాలమున యా ధర్ముండును పాశము హస్తము ధరియించీ!
సంచరించునటు వజ్రదంష్ట్రుడును సంచరించె రణరంగమునన్! 25

బలవంతులు మఱి యస్త్రనిదుషులును బన్నుగ నానా విధములునూ,
అస్త్రంబుబు గలవారునైన యా యల నిశాచరులు క్రోధమునన్!
రణమునంచు వానర సైన్యంబును రహి జంపిరి మిక్కుటముగనూ! 26

ధైర్యవంతుడును, వాలి సుతుండును దగ నంగదుడును నట్టి యెడన్!
ద్విగుణీకృత క్రోధముతో గూడుక దిరుగ వధించె రాక్షసులన్!
ప్రళయమందు ననలమువలె రణమున బన్నుగ మండుచు రాక్షసులన్!
దహించి వేసెను నెండు టడవి వలె! దగ కనిపింపక బాఱునటుల్ 27

వీర్యవంతుడగు నంగదు డంతట విమలారుణ నేత్రంబులతో!
వనమున సింహము నీచమృగములను వనరగ జంపిన రీతిగనూ!
ఆరాక్షస గణముల నన్నింటిని నంగదుడు నటు బరిమార్చెన్!
శక్రతుల్య విక్రము డంగదుడును శాత్రవులను భీకరముగనూ!
వినాశనంబును జేసె సైన్యమున వికలత్వంబున బడవేసెన్! 29

ఆ రణ భూస్థలి యంగదు జేతను నలరు బరాక్రమ విక్రములున్
ఆ నిశాచరుల శిరసులు నేలను నలరి బడుటచే వికటగతిన్!
నఱికిన మ్రానుల వృక్షంబులవలె నలరిబడిరి ధరణీతలమున్! 30

అట్టి సమయమున రథముల జేతను, నతి చిత్రములగు ధ్వజములతో,
హయములతో, నా హరి రాక్షసులయును నలరు శరీరంబుల జేతన్!
రక్త ప్రవాహములను గప్పగబడి రహి భయంకరముగా నుండెన్! 31

హారంబుల మణి కేయూరంబుల యలరు బాహు పురులను గూడి,
వస్త్రంబులచే, ఛత్రంబులతో వనరియున్న యా భూమియునూ
శరత్కాల రాత్రికి వలె నుండెను విరబూసిన వెన్నెలల వలెన్! 32

అట్టి సమయమున యా యుద్ధంబున నలరు రాక్షసుల సైన్యంబున్!
వాలిసుతుడు నంగదుని ధాటికిని వనరగ నిలువగ జాలనిదై!
వాయువుచే యంబుదములకును వలె వనరగ కంపించిన యటులన్!
రాక్షస సైన్యము కంపించెను నట యా యంగదు విక్రమముననూ! 3౩

(యుద్ధకాండములోని 53 వ సర్గము సమాప్తము)

* * *

# యుద్ధకాండము - మొదటి భాగము

## యాబది నాలుగవ సర్గము

### (అంగదుడు వజ్రదంష్ట్రిని సంహరించుట)

మహాబలుండగు వజ్రదంష్ట్రిడును మానుగ తన బలమును గాంచీ,
సేన యంతయును జిదికి పోవుటయు జెదిరి పోవుటయు గాంచి మఱిన్!
ఆ యంగదునీ బలమును గాంచీ యాకపి సేనల ధీరతనూ!
గాంచి రాక్షసులు వజ్రదంష్ట్రిడును గడుగ్రోధంబును బొందె నటన్! 1

దేవేంద్రుని వజ్రాయుధ సమమగు దీరుగ జవమును గలిగిన యా.
భయంకరంబగు దన ధనుస్సు వే బన్నుగ యెక్కును బెట్టుచునూ!
వానర సైన్యంబులపై వేగము వనర శరవృష్టి గురిపించెన్ 2

అట్టి సమయమున యుద్ధ రంగమున యల రథములపై వచ్చిన యా
శూరులైన రాక్షస నాయకులును సురుచిరముగ వివిధములైనా
ఆయుధములతో యుద్ధము జేసిరి నటు వానర వీరులపైనీ! 3

వానరవీరులలో బహు శూరులు వనరగ కపిశ్రేష్ఠులు మఱియున్!
అన్నివైపులను జేరి హస్తముల యలరు శిలల వృక్షంబులనూ!
ధరించి యుద్ధము జేసి రచ్చటను దద్దరిల్లునటు భూమియునూ! 4

అట్టి యుద్ధమున యా రాక్షసులును నా యుద్ధంబున యనేకముల్
వేలకొలది మఱి యాయుధంబులను వేలకొలది శూలంబులనూ!
వానర నాయకులను వే గొట్టిరి వనర బ్రయోగించుచు వానిన్! 5

మదించినట్టి గజముల తోడను మానుగ నమానులును మఱియున్,
మహావీరులగు గపి నేతలునూ మఱి రాక్షస వీరులపైనీ!
గిరి, వృక్షంబుల, మహా శిలలనూ గిరగిర ద్రిప్పుచు బదవైచీ
ఆ రాక్షసులను బాధించిరి మఱి నటు ప్రాణంబులు బోవగనూ! 6

యుద్ధము జేసెడివారు మఱియునూ సిద్ధముగా నుండిన వారున్!
రణమునందు వెనుదిరుగని వారును రహి వీరులు మఱి ధీరులునూ!
అయిన రాక్షసులు గూడ యుద్ధమును నటు జేసిరి భీతిలక మఱిన్! 7

ఆ హరి రాక్షసులను కొందఱిని నలరు శిరస్సులు దెగిపోయెన్
కొందఱి కరములు పాదంబులునూ జిందుచు విరిగెను నచ్చోటన్
కొందఱి దేహంబులు బాణంబుల కందుచు బీడింపగను బడీ!

రక్తము జేతను దడుపబడుచునూ రహి బడియుండెను భూస్థలిపై!
నేలపై బడిన వారల చుట్టును నిరంతరము పైకెగురుచునూ!
రాబందులు మఱి గ్రద్దలు నక్కలు రహి యచటికి జేరుచు నుండెన్! 8-9

పిరికివారి కటు భయమును గొల్పెడి నెఱి మొండెము లట యెగిరినవీ!
హరి రాక్షసులును, దెగిన భుజములను హస్తంబులతో, శిరములతో!
అచట నేలపై బడియుండిరి బహు నాశ్చర్యంబుగ రణస్థలినీ! 10

అటుబిమ్మట యా వజ్రదంష్ట్రుడును నావిధముగ జూచుచు నుండన్!
ఆ రాక్షస సంబంధమైన యా యసుర సైన్యమంతయు జచ్చెన్!
వానర వీరులు జయజయ ధ్వనులను నొప్పుగ నుండిరి రణభూమిన్! 11

ప్లవంగ వీరులజేత జంపబడు బన్నుగ రాక్షస వీరులునూ!
పారిపోవు నా నిశాచరుల గని బరగ వజ్రదంష్ట్రుండు మఱిన్
రోషభీషణములగు నేత్రములను రోష వచనముల నాతండున్
ధనుస్సుజేతను ధరించి శీఘ్రము దగ వానరులును భీతిలగన్
ప్రకాశించె రణరంగము నందున బరగ కాలయమునికి బోలెన్! 12

ప్రతాపవంతుడు వజ్రదంష్ట్రుండును బన్నుగ క్రోధము గలవాడై
గ్రద్ద ఱెక్కలను గట్టి నట్టి యా సిద్ధము దిన్నగ బోవునవియున్!
బాణములచే నచ్చట నిండిన బన్నుగ యేడ్గురు, నైదుగురున్,
ఎనమండుగురను, దొమ్మండుగురను నిమ్ముగ యా వానరుల నటన్,
గొట్టి జీల్చివేసెను వారలనూ యిట్టె ధాత్రిబడి పోవగనూ! 14

బాణంబుల ఛేదింపబడిన యా బరగ శరీరములును గలుగూ
వానర గణములు భయము జెందుచును వనరగ ప్రజలు ప్రజాపతినీ!
జేరినటుల యా యంగదు జేరిరి శీఘ్రము బరువెత్తుచు నటకున్! 15

ఆ సమయంబున వాలి సుతుండగు అంగదుండు నట వీక్షించెన్!
ఓడిపోయినా వానరులను గని యొప్పగ యారాక్షసు వైపున్!
తీవ్రదృష్టితో బహు క్రోధంబున దీరుగ గాంచెను నంగదుడున్! 16

వజ్రదంష్ట్రుండును నంగదుండు నట బరస్పరము యుద్ధము జేసీ,
ప్రబల సింహమును, మత్తగజము వలె బరగ ప్రబలమగు గోపమునన్!
సంచరించిరీ రణరంగమున మించిన బలమును జూపుచునూ! 17

అటుబిమ్మట యా వజ్రదంష్ట్రుండును నా యంగదు బహు వేగముగన్!
మర్మప్రదేశములందు నగ్నితో మానుగ సమమగు బాణములన్!
లక్షశరములను గొట్టెను నంగదు గక్షతోని యారాక్షసుడున్! 18

మహాబలుండును భయంకరంబగు మానుగ రూపము గలవాడున్,
వాలిసూనుడగు నంగదు డంతట వనరగ రుధిరము జేత మఱిన్!
దడిసిపోయి యొక ప్రబల వృక్షమును దగ నాతనిపైకిని విరిసెన్, 19

వచ్చిబడెడి యా వనవృక్షంబును వనరగ రాక్షసుడును గాంచీ,
అసంభ్రాంతుడై యనేక విధముల నా వృక్షంబును ఛేదించెన్!
ఆవిధముగ ఛేదింపబడిన యా యల వనవృక్షము వేగముగన్,
భూమిమీదబడి పోయెను నంతట భుగభుగమని మండుచు వేగన్! 20

వానరశ్రేష్టుండగు నంగదుడును వజ్రదంష్ట్రునీ విక్రమమున్
గాంచి విపులమగు శైలము నొక్కటి వనర గ్రహించియు రాక్షసుపై
విసిరివేసి గట్టిగ ధ్వనిజేసెను విలయ మొచ్చినటు దీవ్రముగన్! 21

వజ్రదంష్ట్రుడును వచ్చి బడెడి యా వనపర్వతమును గాంచుచునూ,
అసంభ్రాంతుడై హస్తమునందున యలరు గదను మఱి ధరియించీ!
రథమునుండి మఱి క్రిందికి దుమికి రయమున భూతలమున నిలిచెన్! 22

అంగదుజేతను విసరబడిన శిల యలరి రణాగ్రమునను నున్నా
చక్రంబులతో, గూబరములతో సరగున యశ్వంబుల గూడన్!
ఆయరదంబును జూర్ణము జేసెను యారణ భూస్థలి యందుననూ! 24

అటుబిమ్మట యా వాలి సుతుండును నటగల ద్రుమ భూషితమైనా,
విశాలమగు నొక పర్వత శిఖరము విమల తరంబుగ గొని వచ్చి
వజ్రదంష్ట్రిని శిరంబు మీదను వనరగ బడవేసెను వేగన్! 23

వజ్రదంష్ట్రిడును రక్తము గ్రక్కుచు వనరగ నిట్టూర్పును విడిచీ,
మూర్ఛను జెందెను ముహూర్త మాత్రము మోదముతోదను దన గదనూ!
ఆలింగనమును జేసికొనియెనూ నట నిలబడె రణరంగమునన్! 25

లబ్ధ సంజ్ఞుడై రజనీచరడును లావుగ కోపించిన వాడై
అవస్థితుండగు నంగదు గాంచీ నిమ్మగ తన గద బుచ్చుకొనీ!
వక్షస్థలమున గొట్టె నాతనిని గక్షతోని బహు వేగమునన్! 26

అటుబిమ్మట యా నిశాచరుండును నట్టి గదను యట విడనాడీ
అంగదు దోడను గలబడె నాతడు జెంగున వారిరువురు గూడన్!
పిడికిళ్ళను మఱి యుద్ధము జేసిరి భీమ పరాక్రమముల తోడన్,
ఒకరి నొకరు మఱిగొట్టుకొనిరి యట వనరగ వానర రాక్షసులున్! 27

దెబ్బలజేతను రుధిరము నొలుకుచు దీరుగ వారిరువురు గూడన్,
సువిక్రమంబున యుద్ధము జేసిరి సురుచిర బుధ యంగారకుల్!
యుద్ధముజేసిన తీరున నుండిరి యుద్ధరంగమున వారలునూ! 28

అటుబిమ్మట బహు దేజస్వియునూ యా కపి వీరుడు నంగదుడున్,
బహు పుష్పఫలంబులతో గూడిన బన్నుగ యొక వృక్షంబు నటన్!
పెకలించియు మఱి కరమున దాల్చెను బెనుకేకను నట నిలువబడెన్! 29

విపులంబును మఱి సుందరమైనా విమలమునగు జిఱుగంటలతో,
వృషభచర్మమున జేయబడిన యా విమలమైన డాలును మఱియున్!
ఒరలో నుంచియు సంరక్షించిన యొద్దికతో నా ఖడ్గంబున్
గ్రహించె నంతట బ్రయోగింపగా గడుసువాడు నగు నంగదుడున్! 30

ఆ సమయంబున జయమును గోరుచు నా వానర రాక్షసులు మఱిన్!
గర్జించుచు మఱికేకలు వేయుచు గదిలి నడుచుచును జిత్రముగా
నొకరి నొకరు మణి కొట్టుకొనిరిగా నొనరగ బిడికిలి దోటులతో! 31

వారిరువురు బోరాటము జేతను వనరగ గాయంబుల జేతన్;
పుష్పించిన కింశుకముల వలె బొలుపుగ నుండిరి రణముననూ!
రణమును జేయుచు వారిరువురు నట రహి యలసియు మోకాళులతో,
నేలమీద బడిపోయిరి వారలు నిలువలేక రణరంగముననన్! 32

కపి కుంజరుడగు నంగదు డంతట కదలుచు నిమేష మాత్రముననన్,
దీప్తాత్ముండై లేచి వేగమున దిక్కులన్నియును వినబడగన్!
దండహతంబగు సర్పము వోలెను మెండుగ కేకలు వేయుచునూ!
ఆరాక్షసుపై గవిపె నంగదుడు నలరి వాని వధియించుటకై! 33

మహాబలుడు నా వాలి సూనుడును మానుగ యంగదు డంతటనూ,
పరిశుభ్రంబును మెఱయుచున్న యా బన్నుగ తన ఖడ్గము జేతన్!
వజ్రదంష్ట్రిని మహాశిరస్సును వనరగ ఛేదించెను వేగన్!

రుధిరోక్షిత గాత్రము గలవాడై రోదసి యంతయు ధ్వనించుచున్,
వజ్రదంష్ట్రిని సురుచిర శిరమును వనరగ ఖడ్గము జేత మఱిన్!
ఛేదింపగబడి కనులు త్రిప్పుచును జీలిన శిరమును గలవాడై
రెండు ముక్కలుగ బడిపోయెను ధర మెండుగ రుధిరము స్రవించుచున్!

వజ్రదంష్ట్రుడును మరణింపగనే వనరగ జూచియు రాక్షసులున్!
భయమోహితులై కపివీరులచే బన్నుగ రజనీచరు లంతన్
చంపబడుచు నుండుటయును గాంచియు గంపిత గాత్రులునై వేగన్!
దీనవదనులై సిగ్గుబడుచునూ దీనత తలలను వంచుకొని,
లంకవైపునకు బరుగులు దీసిరి శంకలేక రావణు కడకున్! 36

ఇంద్రుని వంటి ప్రతాపంబు గల సాంద్రబలము గల యంగదుడున్
వజ్రదంష్ట్రిని వధించి మఱియును వానరసేనల మధ్యమునన్!
సత్కారంబును బొందిన వాడై సరసత యా యంగదుడు మఱిన్,
సురలమధ్య దేవేంద్రుని వోలెను సురుచిరముగ సంతస మందెన్ 38

(యుద్ధకాండములోని 54వ సర్గము సమాప్తము)

* * *

## యుద్ధకాండము - మొదటి భాగము

### యాబది యైదవ సర్గము

[రావణుని యానతిచే ఆకంపనుడు రణరంగమునకు బయలు దేరుట — దుశ్శకునములను గాంచి యతడు ఖిన్నుదగుట — వానర-రాక్షస వీరుల మధ్య భయంకరమగు యుద్ధము జరుగుట ]

వాలి సూనుడగు నా యంగదుచే వజ్రదంష్ట్రుడును నొరెగెననీ
విని రావణుడును దన సమీపమున వినయాంజలితో నిలిచిన యా
రాక్షస సేనానాయకు తోడను రహి బలికెను నీ విధముగనూ! 1

భీమబలులు మఱి దుర్ధర్షులునూ భీతిలేని మన రాక్షసులునూ!
సమస్తమగు శస్త్రాస్త్రంబులనూ సంగతి నెఱిగిన వాడు మఱిన్!
అకంపనుని డమ ముందు నుంచుకొని యల రణరంగమునకు వేగన్,
బయలుదేరెదరు గాత! యనుచు నా బల్లిదుండు రావణు డనియెన్! 2

ఈ యకంపనుడు మిగుల యుత్తముడు నిమ్ముగ రణరంగము నందున్,
శిక్షకుండు మఱి రక్షకుండునూ స్థిరమగు నాయకుడును మఱియున్!
నిత్యంబును నా శ్రేయము గోరుచు నిర్మల బుద్ధియు గలవాడున్,
సమర ప్రియుడును, సాహసవంతుడు సకల విద్యలను నేర్పరియున్! 3

ఈతడు నా రఘువీరుల జంపును నిమ్మగ సుగ్రీవుని గూడన్,
భయంకరులునగు నితర వానరుల బన్నుగ దప్పక వధియించున్!
సంశయంబు మఱి సందేహంబును సమర నాయకా! లేదు సుమా! 4

మహాబలుడు మఱి విక్రముండు నగు మఱి యకంపనుడు వేగముగన్!
రావణు యాజ్ఞను ననుసరించి మఱి రహి భయంకరమునగు సేనన్
ప్రవేశించి మఱి ప్రేరేపించెను బన్నుగ వెడలగ రణమునకున్! 5

అటుబిమ్మట మఱి భయంకరంబగు నాయుధంబులును గలవారున్
భయంకరంబగు నేత్రంబులునూ భయ దర్శనమును గలవారున్!
ముఖ్యులైన యా రాక్షస వీరులు ముదమున సేనాధ్యక్షునిచే
ప్రేరేపింపగ బడు వారలునై ప్రేలుచు వెడలిరి రణమునకున్! 6

మేఘాభుండును, మేఘవర్ణుడును మేఘస్వనమును గలవాడున్,
ఆ యకంపనుడు బరిశుద్ధము నగు నలరు స్వర్ణ భూషణములచే
అలంకరింపగబడిన యరదమున యధిష్ఠించి బహు క్రోధమునన్!
భయంకరులునగు రాక్షస వీరుల బన్నుగ గూడుక వెడలెనహా! 7

ఆ యకంపనుని సంగ్రామంబున నలరు దేవతలు గూడ మఱిన్
గంపింపగ చేయగ జాలరు మఱి కదనము జేయగ జాలరుగా!
అందుచేత నా యకంపనుండును జిందుచు నసురుల మధ్యమునన్
మిగుల తేజమున సూర్యుని బోలెను మిఱుమిటులను గొలుపుచు నుండెన్!

ఆ యకంపనుడు యుద్ధము జేయగ యరుచు నుత్సాహము తోడన్,
త్వరితగతినీ మఱి బోవుచుండగా జిందుచు వీరత్వము తోడన్!
అకస్మికముగ యరదము లాగెడి యా యశ్వములును నిలిచె నటన్,
దీనత్వంబును నిరుత్సాహమును దీరుగ యాక్రమణము జేసెన్! 9

రణమును గోరుచు బోవుచున్న యా రహి యకంపనునికిని వేగన్,
సవ్యనేత్రమును నదిరెను విలవిల సరగున ముఖవర్ణము మారెన్!
కంఠధ్వనియును మారిపోయెనూ గద్గద స్వరమాయెను నపుడున్! 10

సుదినము నందున రూక్ష మారుతము సూటిగ వీచెను దుర్దినమై
సమస్తములునగు మృగములు, పక్షులు సకల క్రూర మృగములు గూడన్!
భయావహములగు నఱపులు నఱిచెను బహు విధముల వికృతముగనూ! 11

సింహమూపురము వలె బలిసిన యా స్థిర మూపురమును గలవాడున్,
శార్దూలమునకు సమ విక్రముడును సరసత యట్టి యకంపనుడున్!
ఆ దుశ్శకునములను మది నెంచక నరిగె యుద్ధరంగంబునకున్! 12

ఆ రాక్షసుడును నితర రాక్షసుల నలరి గూడికొని రణమునకున్,
వచ్చుచుండగా సాగరంబునూ వనర క్షోభ జేసిన యటులన్!
సుమహానాదము నట వినిపించెను స్రుక్కగ కపివీరుల గుండెల్! 13

యుద్ధంబునకై వచ్చుచున్న యా యుద్ధతులగు నా రాక్షసులా,
శబ్దంబుల విని వృక్షంబులనూ, సరసత బర్వత శిఖరంబుల్!
ఆయుధములుగా ధరించి నిలిచిన యా వానర సేనయు నచటన్
భయమును మనముల బొందియు నిలిచెను భద్ర మనియెడి కేకలతో! 14

రామ రావణుల కొఱకు ప్రాణముల రహి త్యజించుటకు సిద్ధంబై,
యున్న వానరుల రాక్షసులకు మఱి యురుతర సంగ్రామము జరిగెన్!
మహారౌద్రమును, భయంకరంబును మహా శౌర్యతర కర్మములన్! 15

పరస్పరంబును జంపుకొనుటకును బ్రయత్నించు చుండిన వారున్,
ఆ వానరులును, రాక్షసులును మఱి యఖండ బలములు గలవారే!
శూరుల్లు, వీరులు, విక్రమవంతులు సురుచిర యుద్ధ ప్రకాండులునూ!
పర్వత సన్నిభులందఱు గూడను బాహు బలంబును గలవారున్! 16

ధ్వనులు జేయుచును గ్రోధము తోడను దగ గర్జనముల జేయుచునూ,
మహాబలాఢ్యులు, హరి రాక్షసులయు మానుగ గర్జనముల ధ్వనియున్!
యుద్ధరంగమున యంతయు బిట్టుగ యుద్ధతిగా వినిపించె నటన్! 17

అరుణారుణమును కాంతిని గలిగిన యలరు భయంకరమును నైనా,
ఎట్టని ధూళియు నెగిరె యాకసము నెట్టని సంధ్యలు మూగినటుల్!

వానర వీరుల జేతను మఱియును వనరగ రాక్షస వీరులచే
నెగురగొట్టబడు ధరాపరాగము నెగిరి కప్పివేసెను దిక్కుల్! 18

ఎగురవేసినా పట్టుబట్ట వలె నిమ్ముగ నుండిన పరాగమున్,
గప్పబడెను భూమ్యాకాశంబులు గప్పబడెను సర్వము జగతిన్!
యుద్ధభూమియందున్న వారికిని సిద్ధము నన్యోన్యంబు మఱిన్
ఒకరికొకరునూ, వస్తు జాలమును నొనరగ కనిపించుట లేదూ! 19

ఆ పరాగమును గప్పుటజేతను నల ధ్వజములును, బతాకములున్,
డాలులుగాని, హయంబులుగానీ గల యాయుధములుగాని మఱిన్
రథములుగానీ కనిపింపవుగా రహి యా పరాగ మందుననూ! 20

రణ రంగంబున గర్జించుచునూ లావుగ కేకలు వేయుచునూ,
ఎదురెదురుగ బరుగెత్తెడి యోధుల యిమ్ముగ వ్యాకుల మైనట్టి!
తుములమైన మఱి వ్యాకులమైనా దోరపు శబ్దము మాత్ర మటన్,
వినబడుచుండెను గాని వారలయు గనిపింపవుగా రూపంబుల్! 21

అట్టి సమయమున తిమిరమునందున నట్టి భయంకర యుద్ధమునన్,
వానరులే వానరులను జంపిరి వనరగ రాక్షసులను కొనుచున్!
రాక్షసులే రాక్షసులను జంపిరి రహి వానరులని యనికొనుచున్! 22

తమవారిని మఱి పరులను గూడను దగ జంపుచు నుండిరి యచటన్,
ఆ వానరులును నా రాక్షసులును యలరి యా వసుంధరను మఱిన్,
రక్తము జేతను దడియునట్లుగా రహి జేసిరి బురదయు నిండన్! 23

అటుబిమ్మట యా రక్తముజేతను నా పరాగమును నట నణిగెన్,
శవముల తోడను, శరీరములతో సరి నిండెను రణభూస్థలియున్! 24

రాక్షసులును మఱి వానరు లంతట రహి విక్రమమున శీఘ్రముగా,
ఒకరి నొకరు వృక్షంబుల తోడను శక్తులు, గదలును, బ్రాసములున్!
శిలలజేత మఱి పరిఘలజేతను తళతళలాడెడి తోమరముల్,
బ్రయోగించి మఱి యుద్ధము జేసిరి బటుతర బరాక్రమంబులతో! 25

భయంకరంబగు గర్మలు గలిగిన బన్నగ పర్వత సమమైనా,
యాకారంబును గల వానరులును నల బరిఘాకారంబులునూ!
కరములతో బోరాడుచునూ మఱి కర్కశులను నగు రాక్షసులున్,
రణరంగంబున జంపిరి శీఘ్రము రాహువు జంద్రుని మ్రింగినటుల్! 26

కోపించిన యా రాక్షసులును మఱి క్రూరమైన యాయుధములతో!
ప్రాసలు, తోమరములు ధరించియును బరగ శూలములు ధరియించీ!
ఆ వానరవీరులను గొట్టిరీ యఱచి యఱచి పెను కేకలతో! 27

రాక్షస సేనా నాయకుడైనారాక్షసుడైన యకంపనుడున్,
మిగుల కోపమున వానరవీరులు దగ వధించుచును గ్రూరముగా!
తన విక్రమమును జూపుట ద్వారా దగ వీరులు నగు రాక్షసులున్
సంతోషంబును గూర్చుచు నుండెను వింత వింతలగు కర్మలచే! 28

వానర వీరులు గూడ వీరతను వనరగ రాక్షస సేనలనూ,
చిందర వందర జేయుచునూ మఱి నందక వారల యాయుధముల్!
లాగికొనుచు మఱి య్యాక్రమించుచును లావగు వృక్షంబుల తోడన్
మహా శిలలతో నా రాక్షసులను మానుగ జీల్చుచు నుండి రటన్! 29

ఆ సమయంబున వానర వీరులు నల కుముదుడు నలుడును మఱియున్,
మైందుడు మిక్కిలి గోపించియునూ మానుగ జూపిరి విక్రమమున్! 30

మహా వీర్యులగు నా హరివీరులు మహనీయులు నగు ముప్వనుసూ!
సేనాగ్రంబున నిలిచి వారలును స్థిరమగు వృక్షంబుల తోడన్!
శిలల జేతనూ రాక్షస సేనను శిథిలము జేసిరి వేగముగన్,
అనేక విధముల యాయుధములచే నా రాక్షసుల వధించి రటన్! 31,32

(యుద్ధకాండములోని యాబది ఐదవ సర్గము సమాప్తము)

* * *

# యుద్ధకాండము - ప్రథమ భాగము

## యా బ ది యా ఱ వ స ర్గ ము

[హనుమంతుడు అకంపనుని వధించుట.]

ఆకంపనుండును రణరంగంబున యా వానర వీరుల జేతన్,
జేయబడిన యా ఘనకార్యంబును జెలిగి గాంచి బహు క్రోధమునన్!
అరుణ నేత్రముల నంతట గాంచుచు నాయుధములచే ధరియించి! 1

అ యకంపనుడు శత్రులు జేసిన యా భీభత్సము గాంచి మఱిన్,
క్రోధపూర్ణుడై ధనువు ధరించియు గూర్మి సారధిని బరికించి!
ఈ రీతిని బలికెను నాతండును నిమ్మగ యా విషయ స్థితిని! 2

ఓ సారధి! విను! బలవంతులునగు వొప్పగ కపివీరులును మఱిన్,
అధిక సంఖ్యగల రాక్షస వీరుల యలరి జంపుచును నుండి రటన్!
త్వరిత గతిని యీ రథము నచటికే దగ నడుపుము! గావిబొమ్మటకున్!3

బలవంతులు మఱి భీమ కోపులును బన్నుగ యా వానరులు నిటన్,
ద్రుమ శైలంబులు పక్షశాఖలును బరగ యాయుధములను గలిగి!
హస్తములందున ధరించి నిలిచిరి యందుకొనగ విజయంబు మఱిన్! 4

తమను దాము శ్లాఘించుకొనుచునూ దన్మయమై రణమందుననూ!
అట్టి వానరుల జంపవలయునని యలరి గోరుకొను చున్నాడన్!
ఎందుజేతనన మన సైన్యంబుల జిందుచు బహు నుత్సాహమునన్,
నశింపజేయుచు నున్నవారు మఱి నయముగ దీనిని యాపవలెన్! 5

అటు బిమ్మట నా మహారథికుడును యకంపనుడు దన రథమునకున్,
గట్టిన హయముల నటు దోలించియు నిట్టె దూరమున నుండి మఱిన్
శరజాలముతో వానరవీరుల సరభస రీతిని యెదురుకొనెన్! 6

ఆ వానరులును నాహవ మందున యలరి నిలుచుటకు గాని మఱిన్
సమర్థులును మఱి గాజాలకనూ సరితూగక యుద్ధమునందున్!

అకంపనుని యా శరజాలంబున నలరి మునిగి యల్లాడుచునూ,
పరాజితులునై నలుదిక్కులకును బారి పోయి రా వానరులన్! 7

తన వారందఱు యా యకంపనుని దగ బాణములకు గురియగుచున్,
మృత్యువాత బడుచుండుట గాంచియు మిక్కిలి బలశాలియు నైనా!
వాయుపుత్రుడగు హనుమంతుండును వనరగ యచ్చటికిని బోయెన్! 8

పారిపోవు నా వానరవీరులు బన్నుగ వీరత్వము నందీ!
వానరులందున శ్రేష్ఠుడైన యా పవన పుత్రునీ గాంచి మతిన్!
అతని చుట్టును జేరి రందఱును నలరి యుద్ధమును జేయుటకై! 9

వానరవీరులు నచట నిలిచినా యా హనుమంతుని గాంచుచునూ!
బలవంతుండగు పవనతనయునీ బరగ యాశ్రయించిన వారై!
వారునుగూడను ధైర్యశాలురై వనరగ బలవంతులు నైరీ! 10

అటుబిమ్మట యా యకంపనుండును నలరి పర్వతంబునకు వలెన్,
నిలిచియున్న యా హనుమంతునిపై యల యింద్రుడు వర్షపుధారల్!
గురిపించినటుల శర వర్షంబును గురిపించెను నాతని పైనీ! 11

మహాబలుండును హనుమంతుండును మానుగ తనదు శరీరమునన్,
బడుచునున్న శరజాలంబులనూ బరగ గణింపక మదియందున్!
ఆ యకంపనుని జంపుట కొఱకై యలరి నిశ్చయము జేసికొనెన్! 12

మహాతేజుడును మారుతాత్మజుడు మానుగ యా హనుమంతుడునూ,
బిగ్గఱగా నవ్వుచు నాతనిని బిట్టుగ హేళన జేయుచునూ!
భూకంపమునకు నటుల రాక్షసుని బొలుపుగ వధింప నేగె మతిన్! 13

అటుబిమ్మట గర్జించువాడునూ నలర దీప్యమానుండునూ,
ఆ హనుమంతుని దివ్య రూపమును నలరు విభావసు రూపముగన్!
ఎదిరింపగ శక్యంబు గాకనూ కదిరి శత్రువులు భయమందన్! 14

హరిపుంగవుడగు హనుమంతుండును నలరు హస్తమున యాయుధమున్,
లేకపోవుటను మది గుర్తించుచు జీకుచింత లేకను వేగన్!
ఒక పర్వతమును బెల్లగించె నట నొప్పుగ పరాక్రమము జేతన్! 15

వీర్యవంతుడగు నా హనుమంతుడు విమల హస్తమున పర్వతమున్,
గ్రహించి వేగము దానిని ద్రిప్పుచు గడు బిగ్గఱగా నాదంబున్!
జేయుచుండగా రాక్షసు లందఱు స్థిర ధైర్యంబును వీడుచునూ! 16

అటుబిమ్మట మఱి పూర్వకాలమున యా పురందరుడు యుద్ధముననన్!
నముచి మీదికిని బోవునట్లుగా నా హనుమంతుడు వేగముగన్!
రాక్షసేంద్రుడగు నకంపనునిపై రహి నేగెను వధియింపగనూ! 17

ఆ యకంపనుడు, నెగబడినా యల పర్వత శిఖరము గాంచీ,
దూరమునుండియె యా హనుమంతుని దోరముగా గాంచియు మఱియున్!
అర్ధచంద్ర యాకారములైనా యలరు బాణ సముదాయముచే
జీల్చివేసెనూ ఖండఖండములు చిందర వందరగా శిలనూ! 18

రక్షోబాణ విదారితంబునై రహి యాకాశమునందుననూ,
చిమ్మబడియు మఱి క్రిందబడిన యా శిఖరము గాంచియు మారుతియున్!
మనస్సు లోపల జింతించెను మఱి మానుగ క్రోధము వహియించెన్! 19

అంతట యా హనుమంతుడు మఱియును నలరు రోష దర్పాన్వితుడై!
మహాగిరికి వలె యున్నతమైన మద్దిచెట్టు నొకదానిని వే
సమీపించి శీఘ్రముగా దానిని సాహసమున బెకలించి మఱిన్! 20

మహాద్యుతియు గల యా హనుమంతుడు మద్దిచెట్టు నట గ్రహియించీ,
ఉత్సాహముతో నొక హస్తంబున యువ్వెత్తున త్రిప్పుచు దానిన్
నేలమీద మఱి నిలబడియుండెను విలవిల వానిని వధియింపన్! 21

పరమక్రుద్ధుడగు హనుమంతుండును పాదన్యాసము జేత ధరన్
బద్దలు గొట్టుచు బరమ వేగమున బరుగెత్తుచు రణరంగముననన్!
బలముజేత వృక్షముల నన్నిటిని బన్నుగ విరిచెను గ్రోధముననన్! 22

వాయుపుత్రుడగు నా హనుమంతుడు వరుసగ రణరంగము నందున్,
మావటివానిని గూడికొనిన యా మదగజంబులను వధియించెన్!
రథములతో గూడిన రథికులనూ రహి వధియించెను వేగముగన్!
కాలిబంటులుగ నున్న రాక్షసుల గదగి సంహరించెను నచటన్! 23

శోపించిన యంతకునికి వలెనూ క్రోధపూర్ణుడై వృక్షమునన్,
బాణంబులనూ దీయుచున్న యా బన్నుగ హనుమంతుని గాంచీ!
రాక్షసులంతట పారిపోయిరీ రమ్య ప్రాణముల నిలుపుకొనన్! 24

చ్చి మీదపడుచున్న వాడునూ, వనరగ రాక్షసులకును మఱిన్,
ంగుల భయము గలిగించు వాడునూ, మిక్కిలి గోపము జెందిన యా!
ాయుపుత్రుడగు నా హనుమంతుని వనర గాంచి యా రాక్షసుడున్
ోభించిన వాడై బిగ్గఱగా క్షోభింపగ దిక్కులు నఱచెన్! 25

యకంపనుడు నా సమయంబున యలరుచు ధనుస్సు చేదాల్చి,
హంబును మఱి జీల్చివేయునవి దీరుగ పది బాణంబులనూ!
హా విక్రమము గలిగినట్టి యా మారుతిపై విడిచెను నంతన్! 26

డియైన సత్త్వంబును గలిగిన వనర నారాచ శరములచే,
రీరమంతట గ్రుచ్చుకొనగ మఱి చారుసుందరుడు మారుతియున్!
్రుక్షంబులు మొలిచిన పర్వతముగ విమల రూపమున గనబడియెన్! 27

హావీరుడును మహాకాయుడును మహా విక్రమముగలవాడున్,
సమయంబున యా హనుమంతుడు నలరు బుష్పితా శోకముగన్!
ాసముులేనీ యగ్నికి వోలెను దోరముగా వెలిగెను నచటన్! 28

ుబిమ్మట దన జవమును జూపీ యటగల యొక దృఢ వృక్షమునూ!
కలించియు మఱి చేత బుచ్చుకొని పెను కేకయు మఱి వేయుచునూ!
క్షసేంద్రుడగు నా యకంపనుని రహి శిరమున వేగము గొట్టెన్! 29

పముతో గూడిన మహాత్ముడును గూరిమి యా హనుమంతునిచే
క్షముజేతచు గొట్టబడిన యా వికట రాక్షసుడు నేలపడెన్!
ంబడుటయే కాదు సుమా! మఱి తన ప్రాణములను విడిచెను వే! 30

ంపబడినా రాక్షసేంద్రునీ వనర యకంపనుడును నేలన్,
యుండుటయును గాంచి రాక్షసులు బన్నుగ భూకంపము నందున్!
క్షంబులవలె వ్యధను జెందిరీ విపుల భయంబును నొంది రటన్! 31

రాక్షసు లంతట బరగ యాయుధములను విడచీ,
దరుమబడి వరుసను భయమున బరుగులతో
ురి వారలు శంకలేక రావణు కడకున్! 32

, భగ్న మానసులు బరాజితులు నగు వారు మఱిన్,
శ్రమజలములచే మోదము పీడిన వారు మఱిన్!
ాయాసముతో నిరతము వెనుకకు జూచుచునూ,
ంక్షసు లందఱు పాదము భూమినీ నిలువకనూ! 33

తిభయంబుతో నలరి వెనుకకును గాంచుచునూ!
మఱిదోపక యిమ్ముగ చింతాగ్రస్తులునై!
ే ద్రోసికొనుచునూ యొకరిపై నొకరు బడుచు మఱిన్,
ాశించిరీ శంకలేక మఱి యఱచుచునూ! 34

లంకలోపలికి రహి ప్రవేశ మొందిన బిదపన్,
వానరులందఱు మానుగ హనుమంతుని జేరీ!
ాజించిరి మఱి బన్నుగ సంతసమంది రటన్! 35

గలవాడును మఱి సహజపరాక్రమ వంతుడునూ,
ము ననుకూలముగా నలరి దగిన విధమున నపుడున్!
ారవించెనూ యతి వినయంబున కట్టియెదన్! 36

కఱగద్రొక్కినా సాహసవంతులు గపివీరుల్!
్వనులు జేయుచును బిరబిర గంతులు వేయుచునూ!
ఘన్న రాక్షసుల బరబర నీడ్చిరి యచ్చటనూ! 37

ద మారుతియు వనరగ సేనాగ్రము నందున్!
కధించె నంతట రహి రణరంగము శాంతింపన్!
ఁలవాడును మరి భీమరూపమును గలవాడున్,
ే నెడి వాడును సహజ విక్రమము గలవాడున్!
ంపినట్టి యా మహాత్ముడగు విష్ణువును వలెన్
సుతాత్మజుడు విమల తేజమున విలసిల్లెన్! 38

అట్టి సమయమున దేవగణంబులు నలరి స్వయముగా రాఘవుడున్,
అతిబలంబుగల లక్ష్మణుండునూ యల సుగ్రీవుండును మరియున్!
వానరులును మరి మహాబలీయుడు వనర విభీషణుడును నంతన్
ఆ హనుమంతుని గౌరవించిరీ యతిశయముగ పూజించిరిగా! 39

(యుద్ధకాండమునందు 56వ సర్గము సమాప్తము)

★ ★ ★ ★

## యుద్ధకాండము - మొదటి భాగము

### యేబది యేడవ సర్గము

(రావణుడు సేనాధిపతియైన ప్రహస్తుని యుద్ధమునకు బంపుట)

రాక్షసేంద్రుడగు రావణు డంతట రాక్షసుడైన యకంపనునీ,
మరణవార్త విని క్రుద్ధుండై మఱి మానుగ దీనముఖుండునునై
మంత్రులవైపున గాంచి వారలను మానుగ కర్తవ్యము నడిగెన్! 1

రాక్షసాధిపుడు నగు రావణుడును రహి ముహూర్తకాలంబు మఱిన్,
ఆలోచించియు మదియందున మఱి యాలోచించెను మంత్రులతో!
అటుబిమ్మట పూర్వాహ్నము నందున నలరి సైన్య వ్యూహంబులునూ!
పర్యవేక్షణము సేయుట కొఱకై బన్నుగ లంకాపురి కరిగెన్, 2

రాక్షసగణములజేత మఱియునూ రక్షింపగ బడుచున్నదియున్
అనేక సేనా వ్యూహంబులచే నలరి నిండిపోయినదియునూ,
ధ్వజ పతాకములతో నిండినదీ తగ లంకాపురమును గాంచెన్! 3

రాక్షసేశ్వరుండైన రావణుడు రయమున శత్రుల జేత మఱిన్,
ముట్టడింప బడినట్టి లంకనూ నిట్టె గాంచి యా రావణుడున్!

యుద్ధమునందున సమర్థుండునగు యుద్ధతుండు నా ప్రహస్తునిన్,
గాంచి యట్టి సమయమున దనకు మఱి యంచిత హితవాక్యము బలికెన్! 4

యుద్ధ విశారద ప్రహస్తుడా! విను యిద్దరిత్రి లంకాపురమున్,
ముట్టడింపబడె శత్రుల జేతను యిట్టె నశింపగ బడుచుండెన్!
రణమునకంటె మఱియొక యుపాయమును రహి కనిపించుటలేదు సుమా!

నేనుగాని మఱి కుంభకర్ణుడుదు, విను! నా సేనకు నధిపతివీ,
నీవుగాని మఱి యింద్రజిత్తుడును నికుంభుండుగానీ మఱియున్!
ఈదృశ భారము వహింపగలరూ! విక్రమము లంకను రక్షింపన్! 6

అట్టి నీవు నా కారణంబునను నిట్టె శీఘ్రముగ సైన్యమునూ,
గైకొని, నీ యాధీనము నందున కరము దానికిని నేతవునై!
వానరు లెచ్చట యుండిరో యటకు వనరగ రణ భూస్థలమునకున్!
బోయి విజయమును సాధింపుము వే బొలుపుగ నే శాంతిని నందన్! 7

నీ నిర్ణయమున నే శీఘ్రముగా నిఖిలమైన హరివాహినియున్,
చలించిపోవును, రాక్షసవీరుల సాహస ధ్వనులను విని మఱియున్!
వానరవీరులు జారిపోవుదురు వనరగ నాలుగు దిక్కులకున్! 8

వానరులందఱు చలచిత్తులు విను! వనర శిక్షణయు లేదుగదా!
చపల స్వభావము గలవారును మఱి నంచితముగ దుర్బలులు సుమా!
సింహ గర్జనంబును విని గజములు చెదిరి పోవునటు దిక్కులకున్!
అటులే నీధ్వని విన్నమాత్రమున యడలిపోవుదురు వానరులున్! 9

ప్రహస్తుడా! యా వానర సేనయు బరగ పాఱిపోయిన వెంటన్,
సౌమిత్రిని గూడిన యారాముడు సహాయ మింతయు లేకయునూ!
వశముదప్పి మనవశమై పోదురు వనర మనకు విజయము గలుగున్! 10

ఇపుడు నీవు రణరంగంబునకును నిమ్ముగ బోయిన పక్షమునన్!
విజయము లభింపవచ్చును మఱి యపజయము లభింపగ వచ్చు సుమా!
రణమునకును మఱి వెళ్ళకపోయిన రహి పరాజయము నిశ్చితమున్!

తప్పక గలిగెడి యాపద కంటెను దగ సంశయాత్మకమునైనా!
ఆపద మంచిది! ఆలోచింపుము! అలరి నీదు మది యందునసూ!
అనుకూలము ప్రతికూలంబులనూ యలరి హితాహితములను మఱిన్! 1

రాక్షసేంద్రుడగు రావణాసురుని రహి తీక్షణమగు పలుకు వినీ!
వాహినీ పతియునగు ప్రహస్తుడును వనరగ ఉశనుడు బలితోడన్
బలికి నటులను నాతడు బలికెను ప్రభువగు దశాననుని తోడన్! 1

రాక్షసేంద్ర! పూర్వము నేర్పరులగు రహి మంత్రులతో గూడికొనీ,
మన మాలోచన జేసియుంటిమీ మన మీ విషయము నందుననూ!
ఆలోచించిన పిదప మన కపుడు నభిప్రాయ భేదంబులునూ!
వివాదంబునూ జరిగిన దప్పుడు వివరింపగ పని లేదిపుడున్! 1

జనకసుతను శ్రీరామచంద్రునకు సరసత నిచ్చుట మంచిదనీ,
నాదు అభిప్రాయమును దెలిపితిని నయముగ యందరి ముందుననూ!
ఇవ్వకబోయినచో జానకిని యిమ్ముగ యుద్ధము వచ్చుననీ!
తెలియజెప్పితిని శాంత భావమున సమస్త మంత్రుల గట్టెదుటన్! 1

ఆ యా కాలము లందు బహుమతుల నలరెడి సత్కారంబులచే!
అనేక విధముల మంచి మాటలను నలరు ప్రశంసల జేత మఱిన్!
ఆదరింపబడితిని నే నప్పుడు నలరి జేయకుందున హితమున్?
ప్రాణములను నర్పింతును నీకై ప్రభుభక్తిని జూపుదు నిపుడున్! 1

నా జీవితమును రక్షణ సేయగ నయముగ కాంక్షయు లేదు సుమా!
పుత్రదార ధనముల రక్షింపగ బొలుపుగ కాంక్షయు లేదు సుమా!
నీ నిమిత్తమై యుద్ధమునందున నిమ్ముగ నా జీవితము నిలన్
హోమంబును మఱి జేయదలచితిని విపులాగ్నులలో భస్మమునై! 1(

సేనాపతియగు ప్రహస్తుండునూ శ్రీకరుడగు రావణుతోడన్,
అటుల బలికి తన యెదుటను నిలిచిన నలసేనాధ్యక్షుల తోడన్!
ప్రబల ప్రతాపుడు నా ప్రహస్తుడును బన్నుగ యీ విధమున బలికెన్! 1

రాక్షసులకు జెందిన సైన్యంబును రహి నా యొద్దకు దెండిపుడున్,
ఈ దినమున నా బాణంబులచే నిమ్ముగ జంపుదు వానరులన్!
అడవులలో నివసించు పక్షులును నా మృగములు బహు వేగముగన్,
జంపబడిన యా కపుల మాంసమును నింపుగ భుజించుతను గాతన్! 19

మహాబలముగల సేనాధ్యక్షులు మానుగ యాతని మాట వినీ!
ఆ రావణు గృహ సమీపంబునను రహి సిద్ధము జేసిరి సేనన్! 20

ఆ ముహూర్తమున యా లంకను గల యలరు గజములకు సాటియగూ,
భయంకరులునగు రాక్షసు లంతట బన్నుగ నిలిచిరి యచ్చోటన్!
నానా విధముల యాయుధములతో నయముగ బోవగ రణమునకున్! 21

అటగల కొందఱు రాక్షసవీరులు నగ్నిని హోమములను జేసీ,
హుతాశనుని బరితృప్తి బఱచుచును నుత్తమ బ్రాహ్మణులకు వేగన్!
నమస్కరించుచు నుండి రపుడు మఱి నయముగ దానంబుల తోడన్!
ఆజ్య గంధముల మోసికొనుచు మఱి యలరు బరిమళములను గూడీ,
వాయువు వీచెను నాలుగు దిక్కులు వనరగ భూమియు గగనంబున్! 22

సంగ్రామమునకు సిద్ధమైన యా సాహసులునగు రాక్షసులున్,
వివిధాకారములను గలిగిన యా వివిధ మంత్రముల జేత మఱిన్!
అభిమంత్రింపగబడిన మాలికల యా రాక్షసులును గ్రహియించీ
సంతోషించుచు తమ కంఠములను సరసత ధరియించిరి యంతన్! 23

ధనుస్సులను మఱి గూడినవారును దగ కవచములను ధరియించీ,
రాక్షసేంద్రుడగు రావణు గాంచీ రయమున వేగమునను లేచీ,
సేనానాయకుడైన ప్రహస్తుని జేరి నిలిచి రట దగ్గఱకున్! 24

అటుపిమ్మట యా ప్రహస్తుండునూ యా రావణు యాజ్ఞను నందీ!
భయంకరంబగు భేరీలను దా బన్నుగ మ్రోగించియును మఱిన్,
ఆయుధముల ధరియించి, తన కొఱకు నలరి సిద్ధమును జేయబడీ
యున్న రథము నెక్కెను ప్రహస్తుడును దిన్నగ రణమునకును వేగన్! 27

వేగముగల హయములను సారథియు దగ వశమునయం దుంచుకొనెన్!
చంద్రసూర్యులా కాంతిని గలిగిన చారు రుచిరమగు నరదంబున్!
మేఘంబుల యురుముల వలె నుండెను మిఱుమిట్లును మఱి గొల్పుచునూ,
మధ్య భాగమును బహు సుందరమును మంచి చక్రములు గలిగిన యా
రథముమీద గట్టిన బతాకమును రహి సర్పాంకితమై యుండెన్!
చూచుటకును మఱి భయంకరముగా జూడశక్యమును గాకుండెన్!
బంగరు జాలము తోని యా రథము రంగుగ బహు శోభలతోడన్
నవ్వు చున్నదా యన్నటు లుండెను నయముగ యట్టి రథంబు మఱిన్!

అటుబిమ్మట రావణుని శాసనము నలరి శీర్షమున ధరియించీ,
యా ప్రహస్తుడును నరదము నెక్కెను నా ఘన రాక్షస సైన్యంబున్!
వెంట బయలు దేరెను గేకలతో నంటగ యాకాశంబు మఱిన్!
లంకనుండి మఱి బయలుదేరెనూ శంకలేక రణ భూస్థలికిన్! 28

సేనాపతియగు బ్రహస్తుండునూ చెలగి బయలుదేరగ వేగన్,
మేఘధ్వనితో సమానమైనా మిగుల దుందుభుల ధ్వని గలిగెన్
వాద్యంబులధ్వని శంఖధ్వనులును వనరగ గగనము ధ్వనియింపన్
భూమి యంతయును నిండునట్లుగా బొలుపుగ వినబడె నంతటనూ? 29

భీమరూవమును గలవారును మఱి భీమ కాయములు గలవారున్
ఆగు రాక్షసులును సింహనాదములు నలరి జేయుచును మిక్కుటమున్!
బ్రహస్తువీరుని ముందు నడిచిరీ బన్నుగ రణరంగమునకునూ! 30

నరాంతకుండును, కుంభహనువునూ నయముగ సమున్నతుడు మఱియున్
మహానాథుడును ననువారలునూ మానుగ బ్రహస్తు సచివులునూ!
ఆ ప్రహస్తు నలువైపుల బోయిరి నలరుచు రణరంగంబునకున్! 31

వ్యూహముగా నేర్పడినది వోలెను మహాభయంకరమునునైనా
గజసమూహమును బోలుదుసున్నా ఘనసైన్యంబును గూడికొనీ!
ఆ ప్రహస్తుడును దూర్పు ద్వారమును గలరి బయలుదేరెను వేగన్! 32

ప్రళయకాలమున ప్రాణుల నన్నిటి బరగ నశింపగచేసెడి యా
వినాశకారుడు యముని సమానుడు వికటముగా గోపించి మఱిన్!
ఆ ప్రహస్తుడును సాగరమును వలె నలరెడి రాక్షస సైన్యముతో
గూడినవాడై బయలుదేరెనూ కూరిమి రణరంగంబునకున్! 33

ఆప్రహస్తుడును బయలుదేరగా నటవెడలిన వాద్యపు ధ్వనులున్
ఆ రాక్షససైన్యము గర్జించెడి యా పెను గేకల ధ్వనిచేతన్
లంకలోని యా ప్రాణులన్నియును శంకను వికృత స్వరములతో
పెనుగేకలు వేసినవి భయంబున వినువీధుల బరుగెత్తినవీ! 34

మాంసరక్తముల భక్షించెడి యా మానుగ గ్రద్దలు డేగలునూ!
మేఘములేనీ గగనమునందున మిగుల ప్రవేశించియు మఱియున్!
రథముజుట్టు మఱి యపసవ్యంబుగ రహి పైనను నెగురుచు నుండెన్! 35
భయంకరములగు నాడు నక్కలును బన్నుగ పావక జ్వాలలనూ
గ్రక్కుచు గూసెను దిక్కులు వినబడ,గగనము నుండియు నుల్కావడెన్!
వాయువులును బరుషముగా వీచెను బరగ వేడిమిని గ్రక్కుచునూ! 86

గ్రహములు నన్యోన్యంబు బోరుచును గాంతి విహీనములయ్యె మఱిన్
మేఘంబులు మఱి యా ప్రహస్తునీ మిగుం నుందరము నరదముపై!
పరుషమైన ఘన ధ్వనులు జేయుచును బరగ రక్తమును వర్షించెన్
అగ్ర భాగమున నడిచెడి వారల యలరి దడిపివేసినవి మఱిన్! 37

గ్రద్ద యొకటి ధ్వజ శిఖరంబుననూ కఠినముగా ధ్వని జేయుచునూ
దక్షిణాభిముఖమున గూర్చుండియు దగ రెండిటి దిక్కుల దిరిగీ !
కూయుచుండె నా యరదపు శోభయు కూరిమి గూలుచు నుండెనటన్! 39

సూతనంశమున జన్మించిన యా సూతుడు నా రథ సారథియున్
రణరంగబున ప్రవేశించెడి రహి యా సమయము నందుననూ!
చేతినుండీ యా చెర్నాకోలయు శీఘ్రముగా జారెను నంతన్
అనేకపర్యాయంబులు జారెను యా కొరడా భూస్థలి యందున్! 40

ప్రయాణ సమయమునందున గనబడు బస్నుగ దుర్లభ శోభయునూ
ఆ క్షణమందున మాయమాయెనూ యంతట నిరాశ గ్రమ్ముకొనెన్!
సమతల ప్రదేశమందున హయములు సరిముందుకు బోకుండగనూ!
తొట్రుబాటు బడినవి చలించుచును దోరముగా భయపడిన యటుల్! 41

గుణపౌరుషముల ప్రఖ్యాతుండగు గూరిమి యా ప్రహస్తుండున్
రణమునకును మఱి పచ్చుచుండగా రహ నానా ప్రహరణములునూ!
గలిగిన వానరసేన యుద్ధమున గడగి యెదుర్కొనె రాక్షసులన్! 42

ఆ సమయంబున వానర సేనలు నలరి వృక్షములు బెఱుకంగన్
మహా శిలలనూ యెత్తుచుండగను మానుగ పర్వత శిఖరములన్!
ద్రోయుచుండగా వ్యాకులమైనా తోరముగా నతి ధ్వని గెలిగెన్! 43

గర్జించెడి యా రాక్షస సైన్యము గర్జించెడి కపివీరులయూ
ఉభయ సైన్యములు సంతోషించెను నుత్సాహముతో రణమందున్!
వేగవంతులును, సమర్థులును నట వికృతముగ మఱి యఱచుచునూ
బరస్పరము వధ జేయుట కొఱకును బరస్పరము బిలుచుచు వారున్ 44

కయ్యమునకు మఱి యాహ్వానించుచు కదనమునకు మఱి రమ్మనుచున్
రక్షోగణముల వానరులయును మఱి రహి నినాదములు జెలగె నటన్!
మహోధ్వనియు గలిగెను యా రణమున మానుగ కపిరాక్షసులకు నటన్!45

అటుబిమ్మట దుర్బుద్ధియునైనా యల ప్రహస్తుడును విజయంబున్
సాధింపగ సుగ్రీవుని కడకును సరగున బోయెను బయనంబై!
వివృద్ధ వేగముదోడను మఱియును వికల మరణమును బొందుటకై!
శలభము నగ్నిని ప్రవేశించినటు నల సుగ్రీవుని సైన్యమునన్!
అధికవేగమున ప్రవేశించెనూ! యలరి విజయమును సాధింపన్! 46

(యుద్ధకాండములోని 57వ సర్గము సమాప్తము)

* * *

## యుద్ధకాండము - మొదటి భాగము

### యాబది యెనిమిదవ సర్గము

### (నీలుడు ప్రహస్తుని జంపుట)

అటుబిమ్మట యా యరిందముండగు నా శ్రీరాముడు వేగముగన్
బయలు వెడలి వచ్చెడి వాడును మఱి బాహుబలుడు నగు రాక్షసునీ!
రణకృతోద్యముండగు ప్రహస్తునీ రమ్యముగా నట గాంచి మఱిన్
సుస్మితుడై యా విభీషణునితో సురుచిరముగ యీవిధి బలికెన్ ! 1

మహాకాయమును గలవాడును మఱి మహాసైన్యమును గూడికొనీ
వచ్చుచున్నవా డితడెవరో మఱి వనర వీని బల పౌరుషముల్!
యెట్టివి దెలుపుము! ఓ విభీషణా! యిట్టె వీని వృత్తాంతంబున్
బరాక్రముండగు నీ రాక్షసునీ బన్నుగ దెలుపుము వివరముగా! 2

రాముని పలుకులు విని విభీషణుడు రయమున బలికెను నీ రీతిన్!
ఇతడు రావణుని సేనకు నధిపతి యితని పేరు మఱి ప్రహస్తుడున్,
మూడువంతులగు సేనకు లంకను మోదమునను నాయకు డితడున్!
విక్రముండు, శూరుడు, వీరుడు మఱి వివిధాస్త్రములను, శస్త్రములన్
దెలిసిన వాడును రణరంగంబున తీరులు దెలిసినవాడు మఱిన్! 3-4

అటుబిమ్మట మఱి భయంకరుండును నలరు భీమ విక్రముడు మఱిన్
మహాకాయమును గలవాడును మఱి మానుగ బహు గర్జించుచునూ!
రాక్షససేనను గూడి వచ్చెడీ రమ్యపరాక్రమ వీరుండున్
ఆ ప్రహస్తునీ గాంచి శీఘ్రముగ యఖిలమైన కపిసేనయునూ!
అధిక క్రోధమున నా ప్రహస్తునీ యఱచుచు నెదిరించెను వేగన్! 5-6

జయమును గోరుచు నున్నవారునూ, భయములేక కపివీరులకున్
నెదురుగ పరుగులు దీయుచున్న యా యిమ్ముగ రాక్షస సైనికులున్!
ధరించినట్టి ఖడ్గంబులు మఱీ దగ శక్తులు, బాణంబులునూ,
శూలంబులు, ముసలములు, గదలు మఱి చోద్యమైన పరిఘులు, ప్రాసల్
అనేక విధముల బరశ్వధములునూ, యలరి ప్రకాశించుచు నుండెన్! 7-8

యుద్ధము జేయగ కోరిక గలిగిన యోధులునగు వానరు లపుడున్,
పుష్పించిన ఘన వృక్షంబులనూ బొలుపగు బర్వత శిఖరములన్!
విపుల దీర్ఘములు నగు శిలలను మఱి విమల శాఖలను గ్రహియించీ! 9

అన్యోన్యంబును సమీపించియును నా వానర రాక్షస సేనల్
శిలావర్షమును, బాణవర్షమును శీఘ్రము గురిపించుచు నున్నా !
ఆ హరి రాక్షస వీరుల మధ్యను నలరి గొప్ప యుద్ధము జరిగెన్! 10

అట్టి యుద్ధమున యనేకులైనా యలరు వానరులు రాక్షసులున్,
వధించి వేసిరి బాహు బలంబున వనరగ యంపిరి యమపురికిన్!
వానరవీరులు గూడ రాక్షసుల వనరగ జంపిరి యనేకులన్,
వృక్షంబులతో, కొండ రాళ్ళతో, వేధించిరి యా యసురులనూ! 11

కొందఱు కపివీరులు రణమందున కూరిమి శూలంబుల చేతన్,
బొడువబడిరి, మఱి కొంద అంతటను బొలువుగ పరమాయుధములతో!
గొందఱు బరిఘలచేత గొట్టబడి కొందఱు పరశ్వధంబులచే
నఱుకబడిరి యా వానరవీరులు నయముగ రాక్షస సైన్యముచే! 12

కొందఱు వానర వీరు లంతటను గూరిమి ప్రాణంబులు వీడీ,
పడిపోయిరి జగతీ తలంబుపై బన్నుగ ప్రాణంబులు బోవన్!
మఱికొందఱు బాణంబుల జేతను మానుగ ఛిన్న హృదయులునై
అంతకునికి మత్తి యతిథుల్లు నైరి నఱచుచు నసువుల్లు వీడి మఱిన్! 13

శూరులైన యా రాక్షస వీరులు సుఖచిర బదునగు ఖడ్గములన్
ఆ వానరులను రెండు ముక్కలుగ నటు జేయగ రోదించుచునూ!
గొట్టుకొనుచు రణ భూస్థలియందున బిట్టుగ సఱచుచు బడి రచటన్! 14

ఆ వావర సముదాయము గూడను నధిక కోపమున గర్జించీ,
వృక్షంబులతో, కొండరాళ్ళతో వివిధములగు శాఖలతోడన్!
అల రణరంగం బంతయుగూడను నా రాక్షసవీరుల నంతన్!
వసుధాతలమున నలగ గొట్టిరి వనరగ చూర్ణము చూర్ణముగా! 15

వజ్రస్పర్శగల యరచేతులతో వనరగ బిడికిలి పోటులతో!
కొట్టబడిన వారై రాక్షసులును గూరిమి వానర వీరులచే!
చీల్చబడిన ముఖములు, నేత్రంబులు జెన్నుగ గలవారగుచు మఱిన్,
నోళుల నుండి రక్తము గ్రక్కిరి నూకలు జెల్లిన వారగుచున్! 16

ఆర్త నాదమున రోదించుచు మఱి యలరు సింహనాదంబులతో,
ఆ రాక్షసులును నా కపివీరులు నలరి జేయుచుండగ రణమున్!
వ్యాకులమైనా ధ్వనియును గలిగెను వనరగ రణరంగము నందున్! 17

వీరమార్గమును బొందుటకై మఱి వీరులైన హరి రాక్షసులున్,
నిశ్చయించుకొని యుద్ధము జేసిరి నిఖిల తంత్రముల పద్ధతులన్!
నేత్రంబుల క్రోధమును ద్రిప్పుచును నిర్భయముగ రణరంగమునన్! 18

నరాంతకుడు మఱి కుంభహనుపునూ నయముగ సమున్నతుండు మఱిన్,
మహానాథుడగు ప్రహస్తు సచివులు మానుగ నలువురు మంత్రులునూ!
వానరవీరుల జంపి వేసిరీ వనరగ యెదురుగ నిలిచి మఱిన్! 19

శీఘ్రముగా నట కొచ్చి వానరుల స్థిరముగ జంపెడి వారలలో
ఆ నలువురిలో నొక్కడైన యా నల నరాంతుకుని ద్వివిదుండున్!
పర్వత శిఖరముతోని జంపెనూ బన్నుగ విక్రమమును జూపి! 20

కపివీరుండగు దుర్ముఖు డంతట కడు విపులంబగు వృక్షంబున్,
బెకలించియు మఱి జేత బుచ్చుకొని బెబ్బులి సముడగు నాతండున్!
హస్తలాఘవము గలిగినట్టి యా యలరు సమ్మున్నతుడను వానిన్,
శిరసున గొట్టెను నా వృక్షంబున జెదిరిబోవ సర్వాంగంబుల్! 21

తేజోశాలియు జాంబవంతుడును దీరుగ మిక్కిలి క్రుద్ధుండై
పర్వత శిఖరము జేతబుచ్చుకొని బన్నుగ ద్రిప్పుచు రణమందున్!
మహానాథునీ వక్షస్థలమున వనరగ బడవేసెను వేగన్! 22

ఆటుబిమ్మట మఱి వీర్యవంతుడును నా తారుడు రణమందుననూ,
కుంభహనుపునూ సమీపించి మఱి కూరిమి ఘనమగు వృక్షమునన్!
ప్రాణంబుల మఱి వీడునట్లుగా బటు తరముగ నంతట వేసెన్! 23

ప్రహస్తుండు దన మంత్రులందఱును బన్నుగ మరణించుట గాంచి,
పరమక్రుద్ధుడై రథము నెక్కి మఱి బన్నుగ చాపము ధరియించి!
వనౌకసుల మఱి సంహరించెనూ వనరగ కవులును భయమందన్! 24

ఆ సమయంబున యుభయ సేనలయు నట్టి భయంకర నాదంబున్,
ఊహింపగ మఱి శక్యముగాదూ! యూహ కందనిది వివరింపన్!
ప్రళయకాలమున క్షోభించెడి యా బరగ సముద్రపు ధ్వనివోలెన్!
నాహరి రాక్షస సేనల ధ్వనియును నటు లుండెను బహు భీమంబై! 25

రణమందున మఱి దుర్దముడైనా రాక్షసుడగు నా ప్రహస్తుడున్,
ఆ రణరంగమునందు క్రుద్ధుడై యలరు బాణ సముదాయముచే
ఆ కపిసైన్యములను బీడించెను నతి భీకరముగ నాతండున్! 26

భయంకరంబగు వానర రాక్షస బన్నుగ శరీరముల చేతన్,
వ్యాప్తమైన రణరంగమంతయును వనర గిరులు బఱచిన యటులన్!
కనుల కటుల గనిపించుచు నుండెను గఠినమైన యుద్ధము నందున్! 27

రక్త ప్రవాహముచేత గప్పబడి సిక్తమైన యా ధరణియునూ,
మాధవమాసమునందు మోదుగుల మహిత పుష్పములు బఱచినటుల్!
రణభూమియు నట ప్రకాశించెనూ రమ్య దృశ్యమునువలె నుండెన్! 28

దాట శక్యమును గానిది యగు నా బటు దుష్కరమైనదియు మఱిన్,
యుద్ధరంగమను నదిని రాక్షసులు యుద్ధతులగు వానరులు మఱిన్!
గజయూథంబును నడిపెడి వారలు కమ్మని పద్మ పరాగముచే,
గప్పబడిన యా పద్మ సరస్సును గడు ధీరత దాటిన యటులన్,
హరిరాక్షస వీరులును దాటిరీ యతి ధీరత యుత్సాహములన్!

రణ భూమికి సంబంధించిన యా రమ్య వీర సముదాయమనే
తీరంబులు మఱి తెగిపోయినవీ దీరుగ యాయుధములును ననే
మహావృక్షములు విఱిగి పోయెనట మానుగ పెటపెట యను ధ్వనులన్!

రక్త ప్రవాహంబను జల తరగల రహి యముడను సంద్రము వైపున్,
ప్రవహించుచు నుండెను, యకృత్తులును బరగ ప్లీహమను బురదలతో!

ఇటు నటు జిమ్మగబడిన ప్రేవులను నాచుతోడ, మఱి తెగివడినా,
శరీరంబులను జేపల తోడను చారు సుందరత మెఱయుచునూ! 29-33

శరీరాంగములు పచ్చికబీళ్ళను సరిగనిండి యుండెను నచటన్
గ్రద్దలనే హంసలును మఱియునూ డేగలనే సారసపక్షుల్
కొవ్వు అనే నురుగులతో నిండిన కూరిమి నుడుల నినాదంబుల్
బయలుదేరుచుండెను నా నదియును బన్నుగ సముద్రమున గలియన్!

శరదృతువునందున హంసలతో సారపక్షుల తోని మఱిన్,
నిండిన నదివలె యుండినట్టి యా చండ రణస్థలి నెవ్వరునూ!
పిరికి వారెవరు దాటగ జాలరు భీతిలు వారలు గూడ మఱిన్! 33

ప్రహస్తుండు మఱి యరదము నెక్కి బాహుబలంబును గూడికొనీ,
బాణౌఘములను బ్రయోగించుచును బన్నుగ వానర వీరులపై
చీల్చుచు మఱి చెండాడు చుండగా జెచ్చెర యా నీ[illegible]డు గాంచెన్! 29-31

గగనమునందున విజృంభించిన కమ్మని గదసరి వాయువులున్,
బలమగు మేఘంబుల వైపునకును బన్నుగ బోయిన విధముగనూ!
రణరంగమునకు శీఘ్రము వచ్చిన రహి విక్రముడగు నా నీలున్!
గాంచి సేనాని ప్రహస్తుండునూ కాంచనవర్ణపు యరదముపై
అతని మీదికే రథమును నడిపెను హాహాకారము జెలరేగన్! 35-36

ధనుర్ధరులలో శ్రేష్ఠుడైన యా దగ సేనాపతి బ్రహస్తుడున్,
అట్టి మహా రణరంగమునందున నిట్టె ధనుస్సును లాగుచునూ!
నీలునిపై శరజాలము విడిచెను నిఖిల భూతములు వెఱగందన్! 37

కోపించిన సర్పంబుల వోలెను గూరిమి యుండిన బాణములున్,
మహావేగమును గల బాణములను మానుగ ప్రహస్తుడును నపుడున్!
ప్రయోగింపగా నా బాణంబులు బన్నుగ నీలుని జేరికొనీ,
అతని శరీరమును భేదించియు నటుపై వసుధను బడె వేగన్! 38

మహావానరుడు వీర్యవంతుడును మానుగ యా నీలుండు మఱిన్,
అగ్ని సమానములగు బాణంబుల నతి నిశితములగు శరములచే!

గొట్టబడియు, నొక మహావృక్షమును గూరిమి బెకలించియు మఱియున్,
దుర్ధర్షుండును దుర్మతియును నగు దుష్టుడైన యాప్రహస్తునీ
వక్షస్థలమును గొట్టెను నీలుడు వచ్చుచున్న యాతని పైనీ! 39

నీలుని జేతను గొట్టబడిన యా నిఖిల సైనికుల కధిపతియున్,
రాక్షసశ్రేష్ఠుండైన ప్రహస్తుడు రయమున గోపించుచును మఱిన్!
బహు బిగ్గఱగా నఱచుచు నాతడు బలవంతుడు గపి నాయకుడున్!

అగు నీలునిపై బాణవర్షమును నటు గురిపించెను దీవ్రముగా!
దురాత్ముండునగు రాక్షసవీరుని దుర్భర బాణ సముదాయమునూ!
నివారించుటకు నసమర్థుండై నిఖిలము దా సహియించుచునూ!
కనులుమూసికొని స్వీకరించె దా కానికాల మని మనసుననూ! 4

శరత్కాలమున యతి శీఘ్రముగా సరగున వచ్చిన వర్షంబున్,
గోవృష మెటుల సహించునో యటుం గూరిమి యా నీలుండు మఱిన్!
ప్రహస్తురాక్షసు దురాసదంబగు బడెడి బాణ వర్షంబులనూ
నిమీలితాక్షుండై యా నీలుడు నిఖిలము సహించె నట్టియెడన్! 42

మహాబలుండును మహిత విక్రముడు మానుగ యా నీలుం డపుడున్,
ఆప్రహస్తునీ బాణ వర్షమును నలరి క్రోధమున శీఘ్రముగా
మహాసాల వృక్షంబును గైకొని మానుగ హయముల జంపె నటన్! 43

అటుబిమ్మట యా మహావీర్యుడగు యా కపివీరుడు నీలుండున్,
రోషపరీతాత్ముండై శీఘ్రము రాక్ష నయనుడై ప్రహస్తునీ!
మహాధనుస్సును విఱిచి వేసెనూ మఱి సారథినీ బరిమార్చెన్,
మాటిమాటికిని కేకలు వేసెను చటుల పరాక్రమమును జూపి! 44

నీలు డా విధము నా రాక్షసునీ నిర్ధనువును గలవానినిగా,
జేయగా నతడు ధీరత వదలక శీఘ్రము భయంకరమునైనా,
ముసలము ధరించి యరథమునుండీ ముదమున భూతలమున దుమికెన్!45

వృత్రాసుర దేవేంద్రులకును వలె విమల కీర్తి మఱి బొందుటకున్,
కోరుచుండి రా యనునట్లుగ మఱి గూరిమి రణమును జేసి రటన్!

వైరము బూనియు, జవమును గలిగియు వనర రణంబును సలిపెడి యా,
ఇరువురు సేనా నాయకులును మఱి యిమ్మగ రక్తమునను దడిసీ!
మదమును స్రవించు గజముల వోలెను మానుగ యుండిరి యట్టియెడన్!46

సుతీక్షణములగు గోఱల చేతను సురుచిరముగ యన్యోన్యంబున్,
బొడుచుకొనుచు, సింహము శార్దూలము బొలుపుగ సమమగు వారు మఱిన్,
సింహము శార్దూలంబుల వలెనూ స్థిరముగ యట బోరాడుచునూ!
అనేక యుద్ధములను విజయంబును నలరి పొందినావారు మఱిన్,
ఏ యుద్ధంబున వెనుకకు బాఱని యిమ్ముగ యట్టి మహావీరుల్, 47-48

అట్టి సమయమున నా ప్రహస్తుడును యా నీలుని నుదుటను వేగన్,
ప్రయత్నపూర్వకముగా ముసలంబున బన్నుగ మోదెను దీవ్రముగన్!
నీలుని లలాటమందు ధారలుగ నిరతము రక్తము స్రవియించెన్! 49

అటుబిమ్మట నా కపివీరులలో నలరి శ్రేష్ఠుడగు నీలుండున్,
శోణిత దిగ్ధాంగంబుల తోడను శూరత్వంబున గోపించీ!
మహావృక్షమును జేత ధరించీ మానుగ ప్రహస్తు రాక్షసునీ,
వక్షస్థలమున గొట్టెను వాడును వనరగ దానికి జింతిలకన్! 50

ఆ ప్రహస్తుడును నా ప్రహారమును నలరి లక్ష్యమును జేయకయున్,
ఘనమగు ముసలము గ్రహించి వేగము గడు బలవంతుడు నీలునిపై
తనదు బలము జూపగ రాక్షసుడును దగ నీలునిపై బరువెత్తెన్! 51

అటుబిమ్మట వానర వీరుండును నల కపి సేనల కధిపతియున్,
నైన నీలుడును నుగ్రవేగమున నలరి వచ్చెడీ రాక్షసునీ!
యాతని గనుగొని మహావేగమున యటగల ఘన శిల గ్రహియించీ! 52

ఆ నీలుండును నా ఘనశిలనూ యట యుద్ధంబును గోరుచునూ,
రణరంగంబున ముసలము దోడుత రహి యుద్ధము జేయుచు నున్నా!
రాక్షసుడైనా యా ప్రహస్తుని రయమున శిరసున బగవేసెన్! 53

వానర సేనానాయకుడైనా వనరగ యా నీలుని జేతన్,
ప్రయోగింపబడినట్టి యా శిలయు ప్రళయ నాదమును జేయుచునూ!
ప్రహస్తు శిరమును ముక్కలు జేసెను బన్నుగ చూర్ణము చూర్ణముగా! 5

పోయిన ప్రాణంబులు గలవాడును, బోయిన శోభయు గలవాడున్;
గత సత్త్వంబును గలవాడును మఱి గత యింద్రియములు గలవాడున్!
నగు బ్రహస్తుడును బ్రాణంబులనూ యా రణరంగమునను విడిచీ
మొదలు నఱికినా వృక్షమునకు వలె కదనంబున ధరణిని బడియెన్! 5

బ్రద్దలైన యా ప్రహస్తు శిరమున బహురక్తము వెల్లువ యయ్యెన్,
అతని శరీరమునందు గూడనూ యల పర్వతమున నుండి మఱిన్!
ప్రస్రవణపు గిరి సెలయేఱుకు వలె బన్నుగ స్రవియించెను నపుడున్! 56

ఆ కపి సేనానాయకుడైనా యల నీలుండును బ్రహస్తునిన్,
జంపిన వాడగుచుండగా నటను గంపము నొందుచు రాక్షసులున్!
జయింప శక్యముగాని సైన్యమును సామర్థ్యంబును విడనాడీ,
లంక వైపునకు బరుగుదీసినవి లంకేశ్వరునకు దెలుపగనూ! 57

సేనానాయకుడైన ప్రహస్తుడు స్థిర నిద్రను బొందిన వెనుకన్!
ఆ రాక్షస సైన్యంబు జిఱికె మరి యటు నిటు బోయెను నిలువకనూ!
సేతు బంధమును విరిగిన బిమ్మట స్థిరముగ జలములు నిలువనటుల్!
నాయకుండు లేనట్టి సైన్యమును నలు దిక్కులకును బరుగులిడెన్! 58

చమూ ముఖ్యుడగు బ్రహస్తుండునూ జంపబడిన వాడగుచుండన్,
ఆ రాక్షసులును నేమి చేయుటకు నలరి యే విధము యోచింపన్!
ప్రయత్నంబు మఱి లేని వారలై బన్నుగ లంకేశ్వరు గడకున్,
బోయి ధ్యానమూకత్వము నొందిరి బొలుపుగ స్పృహ దప్పిరి వారున్! 59

అటుబిమ్మట నా మహావీరుడును నా కపిసేనా నాయకుడున్,
ఆయిన నీలుడును విజయవంతుడై అలరి జేసినా కార్యమునన్,

రామలక్ష్మణుల కడకుబోయి మఱి రమ్య దీవెనల నంది యటన్,
అందఱి జేతను బ్రశంసింపబడి యందఱి మన్నన లందికొనీ,
కడు సంతోషంబున నతడుండెను గడిగిజేసినా కార్యమునన్! 60

(యుద్ధకాండమునందు 58వ సర్గము సమాప్తము)

* * *

## యుద్ధ కాండము - మొదటి భాగము

### యాబది తొమ్మిదవ సర్గము

(ప్రహస్తుడు మరణించుటచే దుఃఖితుడైన రావణుడు యుద్ధమునకు బయలుదేరుట- అతనితో వచ్చిన వీరులను గుఱించి విభీషణుడు రామునకు జెప్పుట- రావణుడు సుగ్రీవుని మూర్ఛబోవునట్లు జేయుట— లక్ష్మణుడు యుద్ధమునకు వచ్చుట- రావణ హనుమంతులు ఒకరినొకరు నఱజేతులతో గొట్టుకొనుట- రావణుడు నీలుని మూర్ఛనొందించుట- రావణుడు శక్తిని బ్రయోగింపగా లక్ష్మణుడు మూర్ఛను జెందుట— మఱల లేచుట- రాముని జేతిలో బరాజితుడై రావణుడు లంకలో బ్రవేశించుట)

రావణు సేనకు రక్షకుం డయిన రహి బ్రహస్తుడును నీలునిచే
చంపివేయబడగా రణమందున వంపగ రాక్షస సైన్యంబున్!
భయంకరంబగు నాయుధంబులును ప్రబల సముద్రపు సమానమున్
వేగము గలిగిన రావణు సైన్యము వికలమునై బరుగెత్తె నటన్! 1

రాక్షస సేనాపతిని బ్రహస్తుని రహి పావక సూనుండు మఱిన్,
ఆ నీలుడు నని జంపినట్లుగా నా సైనికులును రావణుకున్!
తెలియజెప్పగా రావణు డంతట దీవ్ర దాపమును జెందె నటన్! 2

రణ రంగంబున నా ప్రహస్తుడును రహి జంపగబడి నట్టులనూ,
విని క్రోధంబున దశాననుండును వికల చిత్తమును గలవాడై

రాక్షస సేనానాయకులకు మఱి రహి దేవేంద్రుడు గోపమునన్
సురవీరులతో బలికినట్లుగా జోద్యముగా నిటులను బలికెన్! 3

సుర సైన్యంబును నంతము జేసిన శూరుడైన మన ప్రహస్తునిన్,
సైన్యబలముతో, గజ సైన్యంబును సరసత జంపిన శత్రువుమా!
అనాదరము జేయగ రాదు గదా! యాతని బల పౌరుషములనూ,
సామాన్యునిగా దలపరాదు సుమ! సరసత యాతని విక్రమమున్! 4

కావున ప్రస్తుతమును నే బోయెద కలన యోజనయు లేకుండన్!
శత్రు వినాశము గొలుకును మఱియును సరసత విజయము సాధింపన్!
నే బోయెద స్వయముగ యిపుడిపుడే నిర్మూలింపగ శత్రువునూ!
యుద్ధరంగమున యగ్రభాగమును యుద్ధతులను బరిమార్పంగన్! 5

ఆ వానర సైన్యంబు నంతనూ యా శ్రీరాముని లక్ష్మణునీ,
అగ్నుల జేతను దారువనంబును నలరి గాల్చి వేసిన యటులన్,
గాల్చివేసెదను వారల నిప్పుడు గదనరంగమున వేగముగన్,
ఆ కపివీరుల రక్తము జేతను నలరు భూమికిని సంతృప్తిన్! 6

అమరరాజ శత్రువు నైనట్టి యా రావణుడును నటు బలికీ,
జ్వలన ప్రకాశములైన దురగముల దోరముగా నట గూర్చబడీ!
అట్టి రథమునను బయలు దేరెనూ యిట్టి రాక్షసేంద్రుడు నపుడున్
ఆయరదంబును మండెడి రీతిని యలరి ప్రకాశించుచు నుండెన్! 7

ఆ సమయంబున రాక్షస ముఖ్యుడు నా దశగ్రీవుడు రావణుడున్,
శంఖంబులు మఱి భేరీధ్వనులును చారు బణవ శబ్దంబులతో!
ఆస్ఫోటిత క్ష్వేడితములు నగు నా యలరు సింహ నాదంబులతో!
ఉత్తమమగు స్తోత్రంబుల తోడను ఉరుతరమగు జయనాదములన్
ఆ రావణుడును రణరంగమునకు రయమున వెడలెను గ్రోధమునన్! 8

నల్లని మబ్బుల రూపంబులు మఱి ఝల్లనిపించెడి కర్కశతన్,
పావక దీప్తములైన నేత్రములును బన్నుగ మాంసము దినువారున్!
అట్టి రాక్షసుల గుణములతోడను నా రాక్షసముఖ్యుడు మఱియున్,

భూతంబులతో గూడినట్టి యా భువనేశ్వరుడగు రుద్రుడవలెన్!
ప్రకాశించె యా రావణు డప్పుడు బంచ భూతములు భయమందన్! 9

అటుబిమ్మట మఱి మహావేగమును చటుల భీముడగు రావణుడున్,
నగరమునుండియు బయలు దేరెనూ నయముగ సైన్యములను గూడి!
ఉగ్రమైనదియు మహాసముద్రపు నురుతర మేఘంబులకు వలెన్,
గర్జించుచు నున్నదియు, మఱియునూ కఠిన శిలలను, వృక్షములన్
హస్తములందున ధరించి వేగము నలరి రణంబును జేయుటకున్
సిద్ధముగా నుండిన గపివీరుల శీఘ్రము సైన్యంబును గాంచెన్! 10

విపులమైన బాహువులును గలిగిన విమల సైన్యమును గూడికొని,
పృథుశ్రీ ఐశ్వర్యంబు గలిగినా ప్రియమగు వర్తన గలవాడున్!
అగు శ్రీరాముడు నతి ప్రచండతను నలరి వచ్చు రాక్షస సేనన్,
గాంచి శస్త్రధారులలో శ్రేష్ఠుడు నంచిత రావణు దమ్ముడునూ,
విభీషణునితో నిట్లని బలికెను విమల వాక్య సంభరితుండై! 11

నానా పతాక ధ్వజచత్రములను నయముగ గూడుక యున్నదియున్!
అక్షోభ్యంబగు సేన యెవరిది? యందున వీరులు నెవరెవరూ?
ఆ సైన్యంబున ప్రాసలు, కత్తులు నలరు శూలములు ధరియించి,
ధైర్యవంతులగు వీరయోధులును దగ కనిపించును నుండి రటన్!
గజములు మహేంద్ర పర్వతములవలె కనిపించుచు నున్నవి యచటన్! 12

విమ్మట శక్ర సమాన వీర్యుడును విభీషణుండును బ్రియముగనూ,
ఆ శ్రీరాముని వాక్యంబుల విని యలరు బుద్ధిబలమును గలుగూ!
ఆ రాక్షసశ్రేష్ఠులను గూర్చియును నా యుత్తమ సేనను గూర్చి
ఆ శ్రీరామునకును విభీషణుడు నలరి దెలిపె నీ విధముగనూ! 13

రఘుపుంగవ! యదె యేనుగు నెక్కి రమ్యాదీతి గజ శిరస్సునూ,
కదిలించుచు మఱి సూర్యుని వలెనూ కడు యెఱ్ఱని కాంతులును గలా!
ఆమహాత్ముడే యకంపనుడు సుమ! యలరి యిటుల వచ్చుచు నుండెన్! 14

సింహధ్వజమును గల రథంబుపై స్థిరమగు నింద్రధనుస్సువలెన్,
ప్రకాశించు చాపమును గదల్చుచు భయంకరంబును నైనట్టి!
వంకరదిరిగిన కోఱల తోడను శంకలేక గజమునకు వలెన్,
నున్నవాడదే యింద్రజిత్తు సుమ! యురుతర విక్రమవంతుడునూ!
బ్రహ్మదేవునీ వరముల నందెను బరాక్రమంబున మేటి సుమా! 15

సంధ్యాస్తాద్రుల గిరుల సమానుడు సాహసుడును మఱి వీరుండున్,
అరదమునను గూర్చున్నవాడునూ యతి రథుండు మఱి వీర్యుండున్!
అతుల్యమానంబగు చాపంబును నలరి లాగుచును నున్నట్టి,
మహా కాయమును గలవాడును మఱి మానుగ యతికాయుడు నితడే! 16

అపుడే యుదయించిన సూర్యునివలె యరుణ నేత్రముల గూడికొనీ!
ఘంటాధ్వనులను ధ్వనించుచున్న గజారోహణము గావించీ!
ఖరశబ్దంబున గర్జన జేయుచు కావరమున నటు నున్నాడో!
మహోదరుండను పేరుగలిగినా మానుగ యుద్ధండుడును సుమా! 17

విద్యుత్ప్రభలను గలిగిన యట్టి విమల శూలమును ధరియించీ,
శశి ప్రకాశమగు వృషభము నెక్కి చరచర యిటు వచ్చుచు నుండెన్!
త్రిశిరస్సుడనియెడి రాక్షసు డితడే దీరుగ బాహు పరాక్రముడున్,
రణరంగంబున కీర్తివంతుడును రాటుదేలినా విక్రముడున్! 18

మేఘంబులతో సమాన రూపము మిక్కిలి బలిసియు, విశాలమున్
అందమైన వక్ష స్థలంబునూ యలరి యున్నవాడును మఱియున్!
సమాహితుండును ధనువు గదుల్చుచు సరగున నిటు వచ్చుచు నుండెన్,
ఈతని కుంభుడు నని బిలిచెదరూ నిమ్మగ రాక్షసులందఱునూ!
ఈతని రథ కేతువుపై గలదూ నిమ్మగ సర్పపు చిహ్నంబున్! 20

బంగారముతో, వజ్రంబులతో బ్రజ్వరిల్లు చున్నట్టిదియున్,
పొగలను గూడిన మహా బరిఘనూ బొందుగ హస్తమునను బట్టీ!
ఇటు వైపునకే వచ్చుచుండెనూ యిమ్ముగ కేకలు వేయుచునూ!
రాక్షస సేనకు ధ్వజము నితడు సుమ! రహి యద్భుత కర్ముండు మఱిన్,
అత్యద్భుతమగు వీరకృత్యములు నలరి జేయు నీ నికుంభుడున్! 21

సంధ్యాకాలము నందలి మేఘము, సరసత పర్వత ప్రకాశమున్,
స్వర్ణాలంకారముల హయంబును స్వారి జేయుచును వేగముగా!
కిరణములను బ్రసరించు బ్రాసయును కరమున ధరించి శౌర్యమునన్.
ఇటువైపే మఱి వచ్చుచు నుండెను చటుల పరాక్రమ విక్రమతన్,
అశనితుల్య వేగముగల పీరుడు నతని పేరు మఱి బిశాచుడున్! 21

ధనుస్సులును మఱి శరసముదాయము దగ ఖడ్గంబుల తోడుతనూ,
నుండినట్టి మఱి బలాక్రంబులను మండిత మైనట్టిదియు మఱిన్!
అగ్నివోలె మఱి బ్రకాశించెడి యరదంబును నధిరోహించి,
తీవ్ర స్వభావంబున నిటువైపుకు దీరుగ వచ్చుచు నున్నాడున్!
ఈతని పేరు నరాంతకుండు సుమ! యీతని గెలవగ జాలిలన్,
అందులకే గిరి శిఖరంబులతో చందముగా బోరుచు నుండున్! 22

అనేక విధముల భీమ రూపములు నలరు బెద్దపులులును, నొంటెల్,
ఏనుంగులు మఱి లేళ్ల గుఱ్ఱములు నిమ్మగ ముఖములు గలిగిన యా
తిరిగి పోవుచున్నట్టి నేత్రములు దీరుగ గలిగిన భూతములన్,
గూడినవాడును, దివిజుల దర్పము గూఢిమి దొలగించిన వాడున్,
రావణాసురుడు నతడే! యతడే రహి త్రిలోకముల బ్రసిద్ధుడున్,
చంద్రునివలె నున్నట్టి ఛత్రమున సరసత భూతంబుల గూడి
నల రుద్రుని వలె బ్రకాశించెడి యతడే! యతడే! రావణుడున్! 24

యమ దేవేంద్రుల దర్పంబులనూ యణచి వేసినా వాడితడున్,
సూర్యునివలె మఱి బ్రకాశించుచును సురుచిర కాంతులు జిమ్ముచునూ!
వింధ్య పర్వతపు సమానమైనా విపుల కాంతులును గలవాడున్,
వజ్ర కిరీటము ధరించి యుండెను వానినందె ముల్లోకములన్,
ఇతని కర్ణముల గల కుండలములు నిమ్మగ నున్నవి గదులుచునూ, 25

అటు బిమ్మట యా శత్రుమర్దనుడు నా రాఘవుడు విభీషణుతో,
ఆశ్చర్యమునను నీ విధి బలికెను నలరు మంద వాక్యంబులతో!
రాక్షసేంద్రుడగు రావణాసురుడు రహి యెంతటి దేజస్సుననూ!
ప్రకాశించుచున్నాడు ఆహా! మఱి ప్రభు లక్షణములు గలవు సుమా! 26

కిరణంబులచే నాదిత్యుని వలె కరమున జూచుటకు మఱియున్,
శక్యముగాకను నుండె సీతడును చారు ప్రకాశంబుల తోడన్!
తేజస్సులతో నిండిన యాతని దీరుగ గలిగిన రూపంబున్,
వ్యక్తముగా కనిపించుట లేదూ! శక్తి మంతు డీ లోకమునన్! 27

దేవదానవుల వీరుల యందున దీరుగ వారి శరీరములున్,
ఈ రావణుని శరీర మెట్లుగా నిమ్ముగ బ్రకాశ మందెడినో!
అటుల బ్రకాశము నొందదుగా మఱి యలరి గాంచ మా వీరులలో! 28

మహాత్ముడగు సీతని యోధులునూ, మానుగ పర్వత సములుగనూ!
కనిపించుచునున్నారు విభీషణ! కఠిన కావ్యముల తోడ మఱిన్,
పర్వతములతో యుద్ధము జేయగ బల సాహసములు గలవారున్!
బ్రకాశించెడీ యాయుధములనూ బన్నుగ ధరించి యుండిరిగా! 29

ప్రదీప్తవంతులు భీమదర్శనులు బన్నుగ క్రూరాత్ములు మరియున్,
ఘనదేహంబులు గలవారును మఱి గడగి చుట్టు మరి నిలిచిన యా
భూతలంబులతో రాక్షసేంద్రుడును బొలుపుగ యమునికి వలెను మరిన్
బ్రకాశించుచున్నాడు రథమునను బ్రబలమైన బిడుగుకు వోలెన్! 31

దైవ వశంబును నీ పాపాత్ముడు దీరుగ యీ రావణుడు మరిన్,
నాదు దృష్టిపథమునను బడియె నిక నయముగ బోవగ జాలడుగా!
జనక సుతను మరి హరించి నందున సరగున గలిగిన కోపమునూ,
వీనిపైని విడిచెద నే నిప్పుడు విమలమైన నా శరములనూ, 31

వీర్యవంతుడగు రామచంద్రుడును విమల వాక్యములు బలికి మఱిన్,
అటుబిమ్మట చాపమును గ్రహించెను నలరు మహోన్నత శరములనూ!
అట నిలబడె రణమును సలుపుటకును నా రావణుతో శీఘ్రముగన్,
సుమిత్ర సుతుడగు లక్ష్మణ మూర్తియు సురుచిరముగ రాముని వెనుకన్,
ధనుర్బాణములు జేత బట్టుకొని దగ నిలిచెను ధీరోత్తముడై! 32

అటుబిమ్మట యా మహాత్ముడైనా యారాక్షస పతి రావణుడున్,
బలవంతులునగు సచివులతోడను బన్నుగ బలికెను నీరీతిన్!

ద్వారములందున, మహా మార్గముల దగ గోపురముల యందుననూ.
నిర్విశంకగా నుండుడు మీరలు నిశ్చిత సుఖముగ నుండు డికన్! 33

మీతో గూడుక యచ్చటి కొచ్చిన మీరిన సంగతి దెలిసికొనీ,
యీ యవకాశమునందు వాసరులు నిమ్మగ యంగదు గూడికొనీ,
దుర్ధర్షంబగు లంకా పురినీ దోరముగా ముట్టడి జేసీ
క్షోభజెందునటు బీడన జేతురు క్షుభితంబును నొనరించెదరూ! 34

అ సచివులనూ విసర్జింపగా నటుబిమ్మట యా రాక్షసులున్,
ఆరావణు నానతిని గైకొనుచు నటుబోయిరి వెనుకకు మఱలన్!
అటుబిమ్మట ఘన ఋషము సంద్రమున యలరు జలంబును జీల్చినబుల్!
ఆ వానర సేనాసముద్రమును నా దశాననుడు జీల్చి మఱిన్! 35

ప్రకాశించెడి ధనుర్బాణముల బన్నుగ యుద్ధమునందుననూ!
అకస్మికముగ యవతరించినా యా రావణు మఱి గనుగొనుచున్!
కపిరాజగు నా సుగ్రీవుండును ఘనమగు బర్వత శిఖరంబున్.
బెకలించియు మరి చేతబుచ్చుకొని యారావణుపై బరుగెత్తెన్! 36

బహువృక్షంబులు, సానువులును గల బన్నుగ పర్వత శిఖరంబున్,
గ్రహించి వేగము గపీశ్వరుండును గదగి మీదికిని విసరగనూ!
వచ్చుచున్న యా శైలశృంగమును వనరగ రావణుడును గాంచీ,
బంగారపు పొన్నులుగల శరముల బన్నుగ ఛేదించెను వేగన్! 37

బాగుగ బెరిగిన వృక్షంబులతో బహుచరియలతో గూడిన యా
శైలశృంగమును జీల్చి వేయగా విలవిల లాడుచు గ్రిందబడెన్!
రాక్షసలోకమునకు నాదుడు నగు రహి రావణుడును వెనువెంటన్,
యమునితోని మరి సమానమైనా యలరెడి మహోహి కల్పంబున్,
ఆ సుగ్రీవునిపై సంధించెను నలరు బాణమును వేగముగన్! 38

ఆరావణుడును దుష్టుండై మరి యలరు బిడుగుతో సమానమున్,
దేవేంద్రుని వజ్రాయుధంబుతో దిరుగ వేగము గలదియునూ!

అగ్నివంటి తేజస్సు గలదియును, నగ్ని కణంబులు గలదియునూ,
శరమును గ్రహించి యా సుగ్రీవుని జంపగ విడిచెను వేగముగన్! 39

ఆరావణునీ బాహు ముక్తమగు నా సాయకమును శీఘ్రముగన్
ఇంద్రుని వజ్రాయుధము సమానము సాంద్రదీప్తిగల శరీరమున్!
బొంది, కుమారస్వామి విడిచినా బొందుగ శక్తి శరంబు మరిన్,
క్రౌంచ పర్వతము ఛేదించిన యటుల కపిరాజగు నా సుగ్రీవున్,
ఛేదించెను మరి క్రింద బడునటుల బీభత్సము నట సృజియించెన్! 40

పీరుడైన యా సుగ్రీవుండును కరమున శరమున బీడితుడై,
విపరీతంబగు చిత్తముదోడను విపరీతంబుగ యఱచుచునూ!
నేలమీద బడిపోయెను నంతట విలవిల లాడుచు స్పృహదప్పెన్!
ఆ సుగ్రీవుడు రణరంగంబున నటు స్పృహ దప్పియు బడుటయునూ!
గాంచి రాక్షసులు సంతస మందిరి యంచితముగ వేసిరి కేకల్! 41

అటుబిమ్మటను గవాక్షుడు, గవయుడు, నల సుషేణుడును, ఋషభుండున్
జ్యోతిర్ముఖుడును మరియు నలుండును ప్రీతి శరీరములను బెంచీ!
పర్వత శిఖరములను గ్రహించియును బటుతరమగు వృక్షములు మరిన్
ఆరావణు మీదికి పరుగెత్తిరి యతివేగంబున మార్కొనగాన్! 42

రక్షోధిపుడగు నారావణుడును రహి శితాగ్రములుగల శరముల్,
వందలకొలదియు ప్రయోగించి మరి వానరవీరుల యాయుధముల్!
వ్యర్థములై పోవగ జేసియు మరి వనగగ స్వర్ణ విచిత్రములౌ న్
బాణంబులచే వారి తనువులను వనరగ ఛేదించెను నపుడున్! 43

భయంకరంబగు శరీరములు గల బన్నుగ వానర నాయకులున్,
ఆ దశాననుని బాణజాలమున నటు భేదింపగ బడి యపుడున్!
బద్ధులైన యా శరీరములతో బటుతరముగ మూర్ఛను జెందీ
ధరణిమీద బడిపోయిరి వారలు నలరు భయంకర శరములచే
అటుబిమ్మట యా రాక్షసేంద్రుడును నలరు భయంకర శరములచే,
వానరసైన్యము నంతను గప్పెను వనరగ కపులును భీతిలగన్! 44

వధ్యమానులును నేలపడిన యా వానర వీరులు వేగముగన్,
రావణవీరుని సాయకములతో రహిధ్వని జేసెడి వారలునూ!
భయము ననెడు శల్యమున గొట్టబడి బహు భీతిని యణచెడి వారున్;
సర్వలోక రక్షకుడు వీరుడగు శరణు వేడిరి శ్రీరామున్! 45

అటుబిమ్మట మఱి మహాత్ముండునూ యలరు ధనుర్ధరుడు నైనా,
అల రఘురాముడు ధనుసు గ్రహించీ యలరి ముందునకు నటువచ్చెన్!
ఆ సమయంబున లక్ష్మణమూర్తియు నల రాముని వద్దకు నేగి,
అంజలిఘటించి యర్థముక్తమగు నలరు వాక్యమును నిటు బలికెన్! 46

దురాత్ముండునగు నీ రావణునీ తోరము వధియింతువు నీవున్,
సమర్థుండవును నీ విషయంబున సందేహం బింతయు లేదూ!
ఆర్యా! యీతని నేను వధింతును నలరి యాజ్ఞ యిమ్మా! నాకున్! 47

సత్యపరాక్రముడైన రాముడును సరసత దమ్మునితో ననియెన్
సౌమిత్రీ! యటులే వెడలుము! మరి విమలమతీ! యుద్ధమునందున్
జాగరూకతను యత్నము చేయుము త్యాగమూర్తి! యా రావణుడున్!
అనంత శక్తియు గలవాడు సుమా! యనంత విక్రముడును మఱియున్, 48

అరావణుడును మహా వీర్యుడును నల రణమందున విక్రముడున్,
అద్భుతంబునగు బరాక్రమంబును నలరి జూపగలవా డితడున్,
కోపించినచో ముల్లోకంబులు కూడిమి నిలువగ జాలవుగా!
సందేహంబింతయు లేదు సుమా! సాహసవంతుడు రావణుడున్! 49

ఆతని లోపములు గ్రహింపుమా! మఱి యలరి యుద్ధరంగము నందున్,
నీ లోపములను గూడ జూచుకొని నిబ్బరమగు ధీరత తోడన్!
నేత్రంబులతో ధనుస్సు తోడను నిన్ను నీవు రక్షించుకొనీ,
శత్రువుతో బోరాడుము లక్ష్మణ! క్షాత్ర ధర్మమును నిలుపుచునూ! 50

సౌమిత్రియు శ్రీరామచంద్రునీ సారవంతమగు వచనములన్,
విని, శ్రీరాముని కౌగలించుకొని విమల హృదయమున పూజించీ!
అభివాద్యంబును జేసి లక్ష్మణుడు నలరి బోయె యుద్ధంబునకున్!

ఏనుగు తొండమువంటి బాహువులు నిమ్ముగ గలిగిన రావణుడున్,
భీమోద్యతమగు దీప్త చాపమును భీమములగు బాణంబులచే!
వానరులను మఱి గప్పివేయుచును వసుధను జెల్లాచెదురుగనూ!
వారి దేహములు నటబడవేయుచు వనరగ రక్తము ప్రవహింపన్,
అట్టి రావణుని జూచె లక్ష్మణుడు నా రణరంగము నందుననూ! 52

మహాతేజమును గలవాడును మఱి మారుతాత్మజుడు మారుతియున్!
ఆ దశాననుని గాంచి వేగమున యా శరజాలములను మఱియున్,
అడ్డుకొనుచు మఱి ముందుకు బోవుచు నా దశాననుని దరి జేరెన్! 53

ధీమంతుండగు హనుమంతుండును ధీరత రావణు రథమునకున్,
సమీపంబునకు జేరి యాతనీ సాహసమున భయబెట్టుచునూ!
దక్షిణ బాహువు నెత్తి బలికెనూ దగ యీరీతిని స్పష్టముగన్! 54

దేవదానవుల గంధర్వులచే దీరుగ యక్షులచే గూడన్
జంపశక్యమును గాకుండునటుల నింపుగ వరమును బొందితివి!
కాని వానరులవలన భయంబును కలదు నీకు నిది నిజముగనూ! 55

ఇదిగో చూడుము! పంచశాఖలును గల దీ దక్షిణ హస్తమునూ!
నీదేహంబున జిర కాలంబును నిలిచియున్న జీవాత్మ నికన్!
విడివడ జేయును! దొలగించును మఱి వేఱుదారి లేదిక నీకున్! 56

భయంకరంబగు విక్రమును గల బన్నుగ యా దశాననుడున్!
హనుమంతుని యా వాక్యములను విని నంరి కోపమును గూడికొని!
ఎఱ్ఱనైన నేత్రములను ద్రిప్పుచు నీ విధమున వలికెను నతడున్! 57

వానరుడా! సందేహము లేకను వనరగ గొట్టుము! శీఘ్రముగన్!
స్థిరమగు కీర్తిని బొందుము మఱి నను దీరుగ కొట్టిన యా మీదన్,
నీ పరాక్రమం బెట్టిదియో యని నే దెలిసెద మఱి బలవీరా!
అటుపిమ్మట నిను నశింపజేసెద చటుల విక్రమము జేత మఱిన్! 58

మహా తేజశాలియు విక్రమముడును మానుగ రాక్షస రాజయినా,
రావణుండు మారుతి మాటలు విని రహి హనుమంతుని వేగమునన్,
అతని వక్షస్థలమున గొట్టెను నఱజేతిని బహు తీవ్రముగన్! 60

ఆ రావణు నఱచేతి దెబ్బతో నా హనుమంతుడు వేగముగన్,
మాటిమాటికిని చలించి పోయెను నటు నిటు దూలెను ముహూర్తమున్!
తేజోవంతుడు మహామతియునూ దీరుగ మారుతియును మఱలన్,
నఱజేతను నా రావణాసురుని నలర గొట్టె నిలద్రొక్కు కొనీ! 61

మహాత్ముడగు నా హనుమంతునిచే మానుగ గొట్టగబడినట్టి,
యా దశగ్రీవుడు భూకంపంబున యలరి పర్వతము గదిలినటుల్!
ఆతడు గూడ మఱి కంపించెను నట యా హనుమంతుని ఘాతమునన్!62

సంగ్రామంబున నా ప్రహారమున సాహసుడగు నా మారుతిచే
గొట్టబడిన యా మారుతి గాంచుచు గూరిమి ఋషులును, వానరులన్!
సిద్ధులు, దేవతలును, నసురులునూ శీఘ్రము నాశ్చర్యము తోడన్
ధ్వనులను జేసిరి యానందముతో దగ దిక్కులు దిశలును నిండన్! 63

ఆ దశగ్రీవుడు నటు బిమ్మటనూ నలరుచు మఱి స్థిర బఱచుకొనీ
హనుమంతునితో నీ విధి బలికెను నలరు మంద స్వరమును గూడీ!
'ఓ వానరుడా! బాగు! బాగు! మఱి యొప్పగ నిను గుర్తింపదగున్,
శ్లాఘనీయ శత్రువుగా నుంటివి! సరసత విక్రమమున నీవున్! 64

ఆ దశగ్రీవుడు నటుల బలుకగా నా మారుతియును నిటు బలికెన్,
'ఓ రావణ! నా బలము, వీర్యమును నొప్పగ నిందింపగ దగున్!
ఛీ! ఛీ! నాబలమేమి బలము మఱి స్థిరముగ యుంటివి జీవించీ! 65

ఓ దుర్బుద్ధీ! బడాయి మాటలు నొప్పగ బలికెద వెందులకూ?
ఇప్పుడు నన్నొక మాఱు గొట్టుమా! యిమ్మగ నీ బలమును జూపీ!
అటు బిమ్మట నా పిడికిలిపోటున యంపెద యమపురికి నినున్! 66

అటు బిమ్మట నా దశగ్రీవుండును నా హనుమంతుని మాట వినీ,
కోపము తోడను బ్రజ్వలించెనూ కోటి శిఖల యగ్నుల వోలెన్!

అరుణ నేత్రములు గల వాడగుచును నలరి ప్రయత్నముతోని మఱిన్
దక్షిణ హస్తపు బిడికిలినెత్తి దారుణ బరాక్రమము దోడన్,
ఆ హనుమంతుని వక్షస్థలమున యలరి బొడిచె బహు దీవ్రమునన్! 68

విశాలమగు దన వక్షస్థలమున వేగముగా నా రావణుడున్,
గొట్టుటజేతను నా మారుతియును గూరిమి దూలెను నటు నిటులన్!
మాటి మాటికిని చలించి పోయెను మందముగా శ్వాసను వదిలెన్!
మహాబలుండగు చా మారుతినీ మానుగ యా స్థితి గాంచి మఱిన్,
అతిరథుడగు నా రావణుండునూ యా నీలునిపై గమియించెన్!

సకల రాక్షసుల కధిపతియును మఱి సహజ బరాక్రమ వంతుడునూ!
అగు దశగ్రీవుడు బన్నగములతో నలరు సమానం బైనవియున్!
భయంకరములును, మర్మస్థానము బన్నుగ భేదించెడి వానిన్!
శరముల జేతను హరి చమూపతిని సరగున యా నీలుని వేగన్,
బ్రజ్వలింప జేసెను శరములతో సకల సైన్యమును వెఱగందన్! 70-81

బాణంబుల సముదాయము జేతను బన్నుగ బీడింపగ బడినా!
హరి చమూపతియు నగు నా నీలుడు నలరుచు నొక హస్తము జేతన్!
పర్వత శిఖరము నల రావణుపై బన్నుగ విసరెను వేగముగన్! 72

మహాతేజమును, మహా మనస్సును మానుగ గల యా మారుతియున్,
మూర్ఛనుండి మఱి దెప్పరిల్లుచును ముదమున రణమును జేయుగనూ!
అటునిటు గాంచెను నా హనుమంతుడు నలరావణుడును నీలునితో,
రణము సేయుచుండుటయు గనుంగొని రాక్షసేంద్రుడగు రావణుతో,
నీవిధముగ బలికెను హనుమంతుడు నిమ్ముగ క్షాత్ర సుధర్మంబున్!
అతనితో బోరాడు నపుడు మఱి నిమ్ముగ బోరా దాతనిపై,
క్షాత్ర ధర్మమిది నే బాలించెద! సరసత ధర్మబరుండను నే! 73-74

తేజోశాలియునగు రావణుడును దీరుగ నీలుడు విసిరిన యా
శైలశిఖరమును వాడి బాణముల చయ్యన నేడింటను గొట్టెన్!
ఆపర్వత శిఖరంబు ముక్కలై నటబడె నేలను వేగముగన్, 75

శాత్రవసంహారుండునైన యా సాహస వంతుడు నీలుండున్,
దాను విసిరినా పర్వత శిఖరము దగ నేలను బడుటయు గాంచీ!
కోపముతో గాలాగ్నికి వోలెను గూరిమి జ్వలించె నట్టియెడన్! 76

అట్టి మహా సంగ్రామము నందున యిట్టె నీలుడును గోపించీ,
మద్దిచెట్లనూ, సాలవృక్షముల మఱి పుష్పించిన చూతములన్!
అనేక విధముల చూత వృక్షముల యా దశగ్రీవునిపై విసిరెన్! 77

ఆ దశాననుడు నా వృక్షంబుల యలరి యెదుర్కొని ఛేదించెన్,
భయంకరంబగు బాణవర్షమును బన్నుగ యగ్ని సుపుత్రుండున్
నగు నీలునిపై వర్షించెను మఱి యల సైన్యంబును వెఱగందన్! 78

ప్రావృట్కాలపు మేఘరాశియును బన్నుగ వర్షించిన యటులన్,
ఆ రావణుడును దనపై వేగము నల శరవర్షము గురిపింపన్!
మహాబలముగల యా నీలుండును మానుగ తన రూపంబు మరిన్
హ్రస్వముగా మఱిజేసి వేగమున నతని ధ్వజాగ్రమునను వ్రాలెన్, 79

ధ్వజాగ్రమందున గూర్చొనియున్నా దగపావక బుత్రుని నీలున్,
జూచి రావణుడు గ్రోధము తోడను సురసుర మనుచును మండిపడెన్!
ఆనీలుండును నఱచె బిగ్గఱగ యంతరిక్షమును ధ్వనియింపన్! 80

ఆ నీలుండును నా దశాననుని యలరి ధ్వజాగ్రమునందుననూ,
ధనుస్సు చివఱను మఱి కిరీటమున దగ పైభాగము నందుననూ!
ఆనీలుడు వ్రాలుటయు జూచి మఱి యా శ్రీరాముడు లక్ష్మణుడున్
నా హనుమంతుడు నాశ్చర్యంబును నలరి పొందిరా సమయమునన్! 81

అటుబిమ్మట యా తేజోవంతుడు నారావణుడును మది యందున్,
కపి లాఘవమును గాంచుచు మదిలో గడు విస్మితుడై వేగమునన్!
దీప్తాద్భుతమగు నాగ్నేయాస్త్రము దీరుగ సంధించెను నంతన్! 83

అటు బిమ్మట యా యాహవమందున నల నీలుని లాఘవము గనీ,
సంభ్రాంతుండగు రావణుగాంచీ సమస్త వానర సేనయునూ,

సంతసమందగ దగు నవకాశము సరసత లభించి నందులకున్,
సంతసంబునను గంతులు వైచిరి సరగున వేసిరి కేకలునూ! 82

ఆ సమయంబున రాక్షససేనల యలరు ధ్వనులచే రావణుడున్,
తొంచరబడుచును దొట్రుబడుచునూ యందని పొందని హృదయమునన్,
ఏమి చేయవలెనో మఱి దోపక నిమ్మగ నుండెను ముహూర్తమున్! 84

నిశాచర ప్రభువైన రావణుడు నిగ్రహమును మది వహియించీ,
అగ్నేయాస్త్రముతోని గూడినా యా శరమును మఱి గ్రహియించీ!
ధ్వజ శీర్షస్థితుడైన నీలునీ దగ నేత్రంబుల బైకెత్తి
అతని గాంచుచు నిటులను వలికెను నతి బరుషములగు వాక్యములన్! 85

ఓవానరుడా! నీవు మాయనూ, యొప్పగ లాఘవమును గూడన్!
జూపుచు నుంటివి యుద్ధరంగమున శూరత్వంబును విడిచితివీ!
అనేకవిధములుగా మఱి నీవును నా యా రూపములందుననూ!
కనబడు చుంటివి నా కన్నులకును గానరాని విధమున నీవున్!
సామర్థ్యం బది యున్న వేగమున సరసత నీ ప్రాణంబులనూ!
రక్షజేసి కాపాడుకొనుము మఱి రయమున నా శరముల నుండీ! 86-87

ఎన్నిరూపములు ధరించినను మఱి బన్నగ నేను బ్రయోగించూ!
అస్త్రముతో గూడిన బాణంబున యంతమగును నీ జీవంబున్!
ఎన్నిమాయలును జేసిన గూడను బన్నగ ప్రాణంబులు దీయున్!

మహాబాహువులు గలవాడును నగు మానుగ యా యసురేంద్రుండున్,
రావణు డా విధి బలికి వేగమున రయమున యాగ్నేయాస్త్రముతో!
ఆ బాణము సంధించి వదిలెనూ యా నీలునిపై వేగముగన్! 89

అస్త్రము సంధించిన బాణంబున యలరి వక్షమున గొట్టబడి,
ఆ వానర సేనాధిపతియు నగు నా నీలుడు నా యస్త్రంబున్!
కాల్చివేయ బడుచుండగ నాతడు కటిక నేలపై బడిపోయెన్! 90

తండ్రి పావకుని మహాత్మ్యంబుచే దగ సంబంధము వలన మఱిన్,
అగ్ని యొక్క మఱి యా ప్రభావమును నలరి కొంతయుండుట జేతన్!

తన తేజస్సుల జేత నీలుడును దగ నేలను మోకాళ్ళ బడెన్,
కాని, ప్రాణములు విడువలేదుగా కలని యగ్ని పుత్రుండు మఱిన్! 91

అగ్నిపుత్రుడగు నా నీలుండును నలరి మూర్ఛ నొందుట గాంచీ!
రావణుండు మఱి యుద్ధమునందున రహి యాసక్తివి గూడికొనీ!
మేఘధ్వనిగల యరదము దోడను మేలిమి బంగరు రథముననూ,
లక్ష్మణు డుండిన యాప్రదేశమును లలి రావణు డేగెను నటకున్! 92

ప్రతాపవంతుండైన రాక్షసుడు బరగ యుద్ధరంగము మధ్యన్
నా లక్ష్మణువీ నమీపించి మఱి యలరి ముందునకు రాకుండన్!
వారించుచు మఱి ప్రజ్వలించుచును వనరగ యట నిలిచిన వాడై,
తన ధనుస్సు సారించుచు జఱచెను దగ ధ్వని దిక్కులు ధ్వనియింపన్! 93

అదీన సత్త్వుండగు లక్ష్మణుడును న్రపమేయమగు ధనుస్సునూ,
నఱచుచున్న యాతనితో నిట్లనె సరగున మహార్థ వాక్యములన్!
నిశాచరేంద్రా! రమ్ము! ఇచటికిని నిశిత రణంబును సేయుటకున్,
వానర సమూహమును నెదిరింపగ వనరగ యది శౌర్యముగాదూ! 94

రాక్షసేంద్రుడగు రావణుండునూ రహి బక్ష్మణునీ మాటవినీ!
నిండిన ధ్వనిగల భయంకరంబగు మెండుగ జ్యా ఘోషను వినుచున్!
దగ్గఱగా నుండిన లక్ష్మణునీ దగ సమీపమునకును నేగీ,
కోపము దోడను బరుషవాక్యముల కూరిమితో నీవిధి పలికెన్! 95

ఓ రాఘవ! విపరీత బుద్ధివీ! యొప్పుగ యంతము నొందెదవూ,
దైవ వశంబున దృష్టి బథమునను దగ బడితివి నాకిపుడు మఱిన్!
నాదు నిశిత శర జాలంబులచే నయముగ క్షీణింపగ బడుచున్,
ఈ క్షణమందే యమలోకమునకు నిమ్ముగ పయనము జేసెదవూ! 96

సౌమిత్రియు విస్మయము జెందకను సరసత తెల్లని కోరలతో,
గర్జించెడి యా దశగ్రీవునితో కఠినముగా నిటులను బలికెన్!
పాపాత్ములలో గొప్ప వాడవును, బన్నుగ నీవు దురాత్ముడవూ!

రాక్షసరాజా! బడాయి మాటలు రహి దెలుపుచు మంటివి నీవున్,
మహా ప్రభావముగల సజ్జనులను మఱి గర్హింపరు నీ రీతిన్! 97

రాక్షసేంద్ర! విను నీ వీర్యంబును, రహి బలంబు మఱి ప్రతాపమున్
పరాక్రమంబును నేనెఱుగుదు సుమ! బడాయి మాటలు బలుకకుమా!
ధనుర్బాణములు ధరించి నే నిదె దగ నిలిచితి! రా రమ్మ! నికన్
వ్యర్థముగా మాటలు బలుకుటయును వ్యర్థము! ఏమి ప్రయోజనమూ? 98

ఆ లక్ష్మణుడు బలికిన బలుకుల కా రావణుడును గోపించీ,
బంగరు పొన్నులు గలిగినట్టి యా రంగుగ మేలగు బాణములన్
ఆ లక్ష్మణుపై విడిచె రావణుడు నంతకుడగు యమునికి వోలెన్!
అంతట నా సౌమిత్రి చిత్రమగు నలరెడి బంగరు పొన్నులతో,
వాడియైన మఱి యగ్రభాగమున వనరగ యంచులు గలిగిన యా
బాణంబులచే వానిని విఱచెను బరగ నేలపై రాలగనూ! 99

ఆ లక్ష్మణుడును నా విధంబుగను నలరి విరిచి వేసిన యట్టి
పడగలు దెగ గొట్టిన సర్పములుగ బడియుండిన యా బాణములన్!
చూచి రావణుడు నధిక కోపమున చూర్ణమాయె నా సమయమునన్
వాడియైన బాణముల గొన్నిటిని వనరగ ప్రయోగమును జేసెన్! 100

రామానుజు డగు నా లక్ష్మణుడును రమ్యభావమున యపూర్వమౌ
బాణవర్షమును వర్షించెను నట ప్రబలుడైన దశగ్రీవునిపై!
అర్ధ చంద్రక్షుర కర్ణి బాణముల యారావణునీ ఛేదించెన్,
వీమాత్రంబును గలత జెందకను నిమ్మగ నుండెను నిశ్చలుడై! 101

రాక్షసేంద్రుడగు దశగ్రీవుండును రహి దా విడిచిన బాణములున్,
వ్యర్థమగుట గని లక్ష్మణార్యునీ వనరగ హస్త సులాఘవమున్!
కన్నులార గని యాశ్చర్యంబును గన్నుల నిప్పులు రాల్చుచునూ!
మఱల వాడి బాణంబుల విడిచెను మానుగ సుమిత్ర తనయునిపై! 102

ఆ మహేంద్రుతో సమానుడైనా యా సుమిత్ర దనయుడు గూడన్,
వాడి యగ్రభాగములును గలవియు బన్నుగ పిడుగుల సమానమౌ!

అగ్నివంటి మఱి ప్రకాశంబునూ యలరు బాణముల ధనుస్సునన్,
సంధానంబును జేసి మఱియునూ సకలలోక భీకరుడైనా,
ఆ రావణుని వధింప దలచుచును వనరగ విడిచెను వేగమునన్! 103

రాక్షసేంద్రుడగు రావణుండునూ రమ్యమైన శిత శరములనూ,
ఛేదించియు మఱి బ్రహ్మ యిచ్చినా శ్రీకరమగు జ్వాలాగ్నులతో
సమానమైన మహాబాణమును సంధించియు మఱి ధనుస్సునన్
ఆ రామానుజు లలాటమందున యలరి విడిచె నతి శీఘ్రమునన్! 104

ఆరావణునీ సాయకములచే నా లక్ష్మణ మూర్తియు వేగన్,
బీడింపగబడి తన చాపంబును బిడికిలి వదులుగ బట్టుకొనీ!
చలించిపోయెను స్పృహను దప్పి మఱి సరగున సంజ్ఞను బొందుచునూ!
ఇంద్రవైరి యగు నా దశగ్రీవుని సాంద్ర ధనుస్సును ఖండించెన్! 105

లక్ష్మణుండు రావణుని ధనుస్సును అలి ఖండించిన బిమ్మటనూ!
శితాగ్రములు నగు వాడి బాణముల శీఘ్రము రావణుపై విడిచెన్
ఆశరములచే బీడితుం డగుచు నా రావణుడును చలియించెన్,
అతికష్టముపై స్పృహను దెచ్చుకొనె మతి స్థిమితంబును బొందై నటన్!106

ధనుస్సు ఖండింపగబడి మఱియును దగ శరములచే గొట్టబడీ,
దేవశత్రువగు నా రావణునీ దేహమంతయును రక్తమునన్!
క్రొవ్వుచేత మఱి దడిసిపోయెనూ కూరిమి రణరంగంబుననూ!
స్వయముగ శక్తియు గలవాడును నగు స్వయంభు దేవుడు గూర్చిన యా
శక్తి బాణమును యుద్ధమునందున సరగున గ్రహించె హస్తమునన్! 108

అట్టి శక్తి బాణము ధూమముతో నిట్టై యగ్నితో గూడికొనీ,
యుండినట్టి యా శరమును గాంచీ నిండిన భయమున వానరులున్!
పరుగులెత్తుచును నాల్గు దిక్కులకు పారిపోవుచుండిరి యచటన్,
అట్టి శక్తి బాణమును రావణుడు నిట్టి లక్ష్మణుని పై వేసెన్, 108

భరతానుజుడగు లక్ష్మణు డంతట భగ్గున దనపై వచ్చెడి యా
శక్తిబాణమును వస్త్రంబులతో సరగున హుతాగ్ని కల్పములున్!

అట్టి శరములను దానిని గొట్టెను నటులయినను వా శక్తియునూ,
రామానుజునీ విశాలమయినా రమ్య వృక్షమున గ్రుచ్చుకొనెన్! 109

శక్తిశాలియగు నా సౌమిత్రియు శక్తి బాణమున గొట్టబడీ,
నేలమీదబడి ప్రజ్వాలించెనూ నివురు గప్పినా నిప్పువలెన్!
దేవశత్రువగు దశాననుండును దీరుగ వేగము నటకొచ్చి,
వ్యాకులుడై బడియున్న లక్ష్మణుని వనరగ దన బల వీర్యములన్,
నుపయోగించియు దన భుజములతో నున్న లక్ష్మణుని బట్టుకొనెన్! 110

హిమవంతము, మందరము, మేరువును నమరులతో మఱి గూడికొనీ,
మూడులోకముల దనభుజములతో మోదముగా నెత్తగ వచ్చున్!
కానీ భరతానుజుని లక్ష్మణుని గడగి యెత్తజాలకపోయెన్! 111

బ్రహ్మయిచ్చినా వరదానమునను బరగ శక్తిచే వక్షమునన్,
గొట్టబడిన యా సౌమిత్రియునూ భూరిమి యూహించుటకు మఱిన్,
శక్యముగానీ విష్ణుభాగమను సరసత విషయ సుస్మరణమునన్,
నే యపాయమును లేకను నుండెను నిమ్ముగ ధరణీ తలముననూ! 112

అటుబిమ్మట యా దశగ్రీవుండును నా రాక్షస సంహారకుడున్,
అయిన లక్ష్మణుని దన బాహువులను నలరి బట్టుకొలి యెత్తుటకున్!
కదుల్చుటకు మఱి సమర్థుండునూ కాజాలక పోయెను నంతన్! 113

అట్టిసమయమున యాహనుమంతుడు నా రావణు మీదికి దుమికి,
కోపించినవాడై మిను మిక్కిలి క్రోధము నొందిన వాడగుచున్,
వజ్ర సమానంబగు బిడికిలితో వక్షస్థలమున గొట్టె మఱిన్! 114

ఆ హనుమంతుని ముష్టి ఘాతమున యా రావణుడును చలియించీ!
మోకాళ్ళను మఱి నేలపైబడెను మోదమంతయును దిగజారెన్! 115

ముఖము మండి నేత్రముల నుండియును మునిమునీ నవ్వుల నోళులనూ!
చెవులనుండి మఱి ముక్కుల నుండియు చేరదేసి రక్తము నొలికెన్!
విమూర్ఛ మానుండై రావణుడును వికలత చలించి పోయె నటక్,
రథమధ్యంబున నిశ్చేష్టుండై రహి కుప్పగ కూర్చుండె నటన్! 116

సంజ్ఞను గోల్పోయెను రావణుడును సరగున మూర్ఛను బొందె నటన్,
నిలిచి నిలబడక పోయెను నాతడు నీరస మాననుడయ్యె నటన్!
సమరమునందున స్పృహను దప్పినా సకల భయంకర విక్రముడున్,
లోక కంటకుండైన రావణుని లోలత గాంచియు భూతములున్,
సురలు, నసురులును, ఋషులు, వానరులు సురుచిరముగ జేసిరి ధ్వనులున్!

అటుబిమ్మట యా తేజస్వియునగు నా హనుమంతుడు వేగముగన్,
దేవశత్రువగు దశగ్రీవునిచే దీరుగ బీడింపగ బడినా,
ఆ సౌమిత్రిని దన బాహువులను అలరి గ్రహించియు బట్టుకొనీ
రామచంద్రుని సమీపంబునకు రయమున గొనివచ్చెను నతనిన్! 118

సుమిత్ర తనయుండైన లక్ష్మణుని సురుచిరముగ శత్రువు లెవరున్,
కదల్పజాలరు, యెత్తగ జాలరు గానీ యా హనుమంతుడున్!
శక్తియున్నవాడగుట చేత మఱి బన్నుగ మిత్రుండగుటయునూ!
ఆ మారుతికిని దేలిక యయ్యెను నా సౌమిత్రియు నట్టియెడన్! 119

వరదానంబున బ్రహ్మచేత మఱి వనరగ బొందిన శక్తియునూ,
రణమందున లక్ష్మణుని జయించీ రమ్యముగా నాతని విడిచి!
రాక్షసుడగు రావణుని రథంబున రమ్యమైన తన స్థానమునన్,
అలంకరించెను నవ సమరంబున నతనికి దోడ్పడుటకును మతిన్ 120

తేజస్వియునగు రావణుండునూ, దీరుగ యా రణ మందుననూ,
మఱల సంజ్ఞనూ బొందె నాతడును మఱల ధనుస్సును గ్రహియించెన్!
వాడియైన బాణంబుల గూడను వరుసను దాల్చెను బోది యందున్! 121

శత్రునూదనుండైన లక్ష్మణుడు సరసత మది నూహింపగనూ,
శక్యముగానీ విష్ణ్వాంశంబగు సహజ స్వరూపము స్మరించుచున్!
తేరుకొనెను మఱి శరీర మందలి దీరుగ శల్యములును దొలగెన్! 122

రణరంగంబున కపి సైన్యంబున రణవీరులు మఱి యందఱునూ,
పడిపోవుట, మఱి దొలగిపోవుటను బన్నుగ గాంచియు రాఘవుడున్!
ఆ రావణు నెదిరింపగ బోయెను నలరు ధనుర్బాణంబులతో! 1 3-124

అటుబిమ్మట నావాయుపుత్రుతును నా హనుమంతుడు వేగముగన్,
రఘువీరుని శ్రీరామచంద్రుని రహి సమీపించి యిటులనియెన్!
విష్ణుమూర్తి యా గరుత్మంతునీ వీపున యధిరోహించి ననున్,
దేవశత్రువుల వధించి నటులను దీరుగ యధిరోహించి ననున్,
ఈ లంకేశ్వరు సంహరింపుమా! యిన వంశోత్తమ! వేగముగన్! **125**

హనుమంతుడు బలికిన వాక్యములను నా శ్రీరాముడు యోజించీ,
అటుబిమ్మట యా వానర శ్రేష్ఠుని యా హనుమంతుని మూపుననూ!
శీఘ్రముగా మఱి యధిరోహించెను జేరె రావణుని యొద్దకునూ,
రథస్థుడై యట నున్న రావణుని రామచంద్రుడును గాంచె నటన్! **126**

తేజస్వియునగు రామచంద్రుడును దీరుగ యారావణు గాంచీ,
కోపముతోడను జాపము నెత్తి కూరిమి విష్ణువు బలి పైకిన్!
బోయినట్లుగా రావణు పైకిని బోయె శీఘ్రముగ చాపమునన్! **127**

అల రాముండును ఘన వజ్రంబును నలరి నలగ గొట్టిన యపుడున్,
గలిగెడి ధ్వనివలె నిష్ఠురమైనా ఘన టంకార ధ్వనిజేసీ!
గంభీరంబగు వాక్యంబులతో గడగి రావణునితో బలికెన్! **128**

రాక్షసరాజా! నిలువుము! నిలువుము! రహి నా కిటులను వాపదయున్,
అపకారంబును జేసినావు గద! యలరి యెచ్చటికి బోగలవూ?
ఎటుల విడువబడ గలవాడవు మఱి యెటుల నాదు శరముల నుండీ? **129**

నాదు దృష్టి పథమున బడితివి యిక నయముగ యెచటికిని బోలేవూ!
ఇంద్రుడు, యముడును, భాస్కరు యొద్దకు నిమ్ముగ నీవును బోయిననూ!
బ్రహ్మ యొద్దకును, శివుని యొద్దకును బన్నుగ వైశ్వానరు గడకున్,
బది దిక్కులకును బోయినగానీ బన్నుగ విడువను రాక్షసుడా! **130**

రాక్షస రాజా రావణ వినుమా! రమ్యమైన నా వాక్యమునూ,
ఏ లక్ష్మణునీ శక్తి బాణమున యిమ్ముగ రణమున గొట్టితివో!
మూర్ఛనొందినా లక్ష్మణుడిప్పుడు మోదముగా యనికిని వచ్చి,
యుద్ధము జేయును నా యుద్ధంబున యుద్ధతులగు నీ పుత్రులనూ,

పౌత్రులనందఱ, పరివారంబును బన్నుగ నాశము జేయు సుమా!
నీ పాలిట మఱి మృత్యుదేవతగ నిలిచి నశింపగ జేయు నికన్! 131

అద్భుత దర్శనమును గలవారును నల జనస్థానము నుండిన యా
శ్రేష్ఠమైన యాయుధముల తోడను జెలగి రణము జేసెడివారున్!
పదునాలుగు వేలకు మించిన యా బన్నుగ రాక్షసు లందఱినీ,
బాణంబులచే నశింప జేసితి బన్నుగ యుద్ధము నందుననూ! 132

మహాబలుండగు రాక్షసేంద్రుడును మఱి రాముని వచనముల వినీ,
మహత్తరంబగు గోపము జేతను మానుగ పూర్వపు వైరంబున్!
స్మరించుచును మఱి రామచంద్రునీ సరసత మోయుచు నుండిన యా!
మహా జవంబును గల మారుతినీ మానుగ కాలానలము వలెన్,
ప్రజ్వరిల్లు బాణంబుల జేతను బన్నుగ గొట్టెను దీవ్రముగన్! 133-134

ఆహవమందున రావణు జేతను నలరి గొట్టబడి నప్పటికిన్,
స్వభావతేజోవంతుడైన యా సాహసవంతుడు మారుతికిన్!
ఆ తేజస్సును వృద్ధి నందెసూ యధిక తరముగా నట్టియెడన్! 135

తేజస్వియునగు రామచంద్రుడును దీరుగ యా రావణు జేతన్,
గాయబరుపబడినట్టి మారుతిని గాంచి నంతనే యధికముగా!
క్రోధము జెందెను నా రావణుపై క్రోధ పూర్ణ నేత్రుండయ్యేన్! 136

రామచంద్రుడును ముందుకు బోయీ రమ్యమైన చక్రంబులతో,
ధ్వజముదోడ మఱి ఛత్రముదోడుత దగ బతాకలను సారథితో!
అశని శూల ఖడ్గంబుల తోడను నా రాక్షసు రావణు రథమున్,
వాడియైన బాణంబులతో మఱి వసుధను గూల్చెను వేగముగన్! 137

అటుబిమ్మట వజ్రాయుధంబుతో నలరు బిడుగుతో సమానమున్,
నగు బాణంబున యింద్ర శత్రువగు నా దశగ్రీవుని బలముననూ!
విశాలంబు మఱి సుందరనుయినా విమలమైన వక్షము నందున్,
భగవంతుండగు దేవేంద్రుండును బన్నుగ వజ్రాయుధముననూ,
మేరు పర్వతమునను గొట్టినటుల మీరుచు గొట్టెను రాఘవుడున్! 138

ఏ లంకకు ప్రభువైన రావణుడు నింద్రుని వజ్రాయుధముననూ,
పిడుగులు పడినను క్షోభ జెందడో ప్రిదిలి చలింపడో! యీనాడున్,
అట్టి వీరుడగు రావణు డిప్పుడు నలరెడి రాముని బాణముచే,
కొట్టబడిన వాడై రణమందున గూడిన దుఃఖము గలవాడై
చలించిపోయెను; ధనుస్సు గూడను జారవిడిచె యాశ్చర్యముగన్, 139

విహ్వలుడగు నా రావణుగాంచీ విమల వర్తనుడు రాఘవుడున్,
అటుపిమ్మట మఱి ప్రజ్వలించెడియర్ధచంద్ర బాణంబుల వే,
గ్రహించి సూర్యునివంటి ప్రకాశము గలిగిన రావణు కిరీటమున్,
ఛేదించెను మఱి క్రిందబడునటుల భేదించెను రాజ్యశ్రీనీ 140

యుద్ధమునందున యా దశాననుని యుద్ధతి, దర్పము నశియించెన్,
విషములేని సర్పంబునకును వలె విహ్వలుడై యుండెను నపుడున్!
శాంతార్చులుగల రవి బింబమువలె భ్రాంతి బొందుచును నుండెనటన్!
కిరీటమును ఖండించుటె జేతను గ్రీ దప్పి శోభయు లేకన్,
యున్న వానితో నా రఘువీరుడు కొన్ని మాటలను నిటు లనియెన్! 141

సుభీమంబునగు సుమహా కర్మము సురుచిరముగ జేసితి విపుడున్!
నాదు మహా వీరుల నందఱినీ నయముగ బడవేసితి విపుడున్!
ఆ కారణమున యలసి పోతివని యలరి దలంచుచు నున్నాడన్,
అందువలన నా శరముల తోడను నల యమపురి కంపుటలేడూ! 142

రాక్షసరాజా! నే నెఱుగుదునూ! రణమున నీ వలసితి వనుచున్
వెడలిపొమ్ము! లంకకు వేగముగా విశ్రాంతిని వే బొందు మింకన్!
ధనుస్సు, రథమును గ్రహించి రమ్మా! దారుణమగు యుద్ధంబునకున్!
అపుడు రథమునందున్న వాడవై యలరి గాంచెదవు నా బలమున్! 143

ఆ దశగ్రీవుని దర్ప హర్షములు నణిగిపోయె నా సమయమునన్
ధనుస్సుగూడను ఖండింపగబడె దగ హయములు, సారథిగూడన్!
జంపబడెను మఱి కిరీటంబునూ యంపబడెను ధూళిని నేలన్!
అట్టి స్థితిని రాముని బాణముచే నిట్టె బీడితుండైనట్టి,
ఆ రావణుడును రాముని మాటలు నలరి వినుచు లంకకు బోయెన్, 144

మహాబలియుడు దేవ దానవుల మానుగ శత్రువు రావణుడున్,
లంకలోనికిని ప్రవేశించి మఱి శంకలేక విశ్రాంతి గొనన్!
అటువిమ్మట శ్రీరామచంద్రుడును నల రణ రంగమునను బడినా,
లక్ష్మణునకు మఱి కపివీరులకును లలి దేహంబుల నుండిన యా
బాణపుములుకుల దొలగించెను మఱి బాధను వేగము దొలగించెన్! 145

ఇంద్ర వైరియగు నా రావణుడును సాంద్ర పరాజయమును నందన్
సురాసురులునూ, భూతగణంబులు సురుచిరముగ దిక్కులు, దిశలున్!
సముద్రంబు మఱి సమస్త యురగులు సరసత భూమిని, జలములనూ
నివసించెడి యా ప్రాణులన్నియును నిరవధికముగను సంతసిలెన్! 146

(యుద్ధకాండమునందు 59వ సర్గము సమాప్తము)

* * *

## యుద్ధకాండము - మొదటి భాగము

### అఱువదియవ సర్గము

[రామునిచేత పరాజయము నొంది దుఃఖితుడైన రావణుని యాజ్ఞచేత కుంభకర్ణుడు నిద్రనుండి మేలుకొలుపుట — అతనిని జూచి వానరులు భయము జెందుట]

అటువిమ్మట యా రాక్షసరాజగు నా రావణుడును నా లంకన్,
ప్రవేశించినా పిమ్మట గూడను బన్నుగ రాముని బాణముచే
భయముజేత బీడన గలవాడై భగ్న దర్పమును గలవాడై!
వ్యథితేంద్రియములు గలవాడాయెను వనరగ కలతను బొందెనటన్! 1

రాక్షసేంద్రుడగు రావణు డంతట రహి సింహముచే గజమువలెన్
గరుత్మంతుచే బన్నగమును వలె కాంతిని దప్పిన వాడగుచున్!
మహాత్ముడగు శ్రీరాముని జేతను మానుగ యభిభూతుండయ్యెన్! 2

పూర్వమందు నే నవమానించిన బరగ వేదవతియును నన్నున్,
శపించినది మఱి యావేదవతియు సరసత జనకుని కుమార్తెయై
సీతగ జన్మించిన దీ జగతిని శ్రీకరముగ లక్ష్మికి వోలెన్! 10

పార్వతి, నందీశ్వరుడు, రంభయును బన్నుగ వరుణుని కన్యకయున్,
ఏటుల శపించిరో, యా విధముగనే యిపుడు జరుగుచున్నది మఱియున్,
అసత్యంబులును గావుగదా మఱి యలరి ఋషుల వాక్యము లెపుడున్, 11

ఇట్టి శాపముల స్వరూపంబులను గట్టిగ దృష్టిని యుంచుకొనీ,
మీ ప్రయత్నముల మీరు జేయవలె మీరిన దృఢతర కార్యములన్!
రాక్షసవీరులు రాజమార్గముల, రమ్య సుగోపుర శిఖరములన్,
నిలిచియుండవలె నిరంతరంబును నిఖిలము గాపాడగ వలయున్! 12

పాటిలేని గాంభీర్యంబును మఱి సాంద్రబలుడు విక్రముడు మఱిన్
దేవదానవుల దర్పంబును మఱి దీరుగ యణచిన వా డతడున్,
బ్రహ్మశాప అభిభూతుడు నగునా బరగ కుంభకర్ణుని వేగన్,
మేలుకొలుపుడూ! నిద్రను లేపుడు! మిగుల యాపదయు వచ్చెననీ! 13

మహాబలుండగు రావణాసురుడు మానుగ రణమున ప్రహస్తుడున్,
చంపబడుటయును దానుగూడ మఱి వంపబడుట జేతను నతడున్!
తనశక్తియు మఱి దాను దెలిసికొని దగభయంకరము నైనదియున్,
సైన్యంబునకును నాజ్ఞల నిచ్చెచు సర్వసిద్ధముగ నుండుడనీ! 14

ద్వారములందున యత్నపూర్వకము దగ సిద్ధముగా నుండవలెన్,
ప్రాకారంబుల నెక్కి శత్రువుల బన్నుగ జూచుచు నుండవలెన్,
నిద్రావశుడగు కుంభకర్ణునీ నిద్ర లేప వలయును వేగన్! 15

రాక్షసుడైనా కుంభకర్ణుడును రయమున కాలవశంబుననూ,
స్పృహకోల్పోవుచు నిద్రబోవుచో స్థిరతను తొమ్మిది, యేడు, పదీ,
ఎనిమిది మాసములును నిశ్చింతగ యిమ్ముగ సుఖముగ నిదురించున్! 16

అతనితోని మనమందఱను నిట యాలోచన జేసిన పిదపన్,
తొమ్మిది దినముల క్రిందట నాతడు దోరముగా మఱి నిదురించెన్,
మహాబలీయుడు కుంభకర్ణునీ మానుగ లేపుడు రణమునకున్! 17

సమస్త రాక్షసులును శ్రేష్ఠుండును సాహసుండు మఱి విక్రముడున్,
మహాబాహువులు గలవాఁడును శగు మానుగ నాతమ్ముండు మఱిన్,
రణమ్మునందు ఆ రామలక్ష్మణుల రహి వధించు కపివీరులనూ! 18

సమస్త రాక్షసులను ముఖ్యుండును సరసత యుద్ధము నందుననూ,
ధ్వజమువంటి వాడయిన నాతడును దగ మూఢుండై నీచతనూ,
నిద్రాసుఖమున యాసక్తుండై నిరతము నొడలును దెలియకనూ,
నిదురబోవుచున్నాడు నాతనిని నిదుర మేల్కొలుపు డిక మీరున్! 19

కుంభకర్ణునీ నిదుర లేపి మఱి కూరిమి యనికిని బంపినచో,
భయంకరంబగు నీ యుద్ధములో బన్నుగ యా రఘు వీరునిచే
ఓడిపోయినా నాదుఃఖ బును నొప్పుగ నిక శాంతించు మఱిన్! 20

శత్రునితోదను సమానమైనా విక్రమంబు గలవాడైనా
కుంభకర్ణుడును నిట్టి యాపదను గూరిమి సహాయ బడకున్నన్,
వానివలన నాకేమి లాభమూ? వసర ప్రయోజన మేమి యికన్! 21

ఆరాక్షసులును రాక్షసేంద్రునీ యా వాక్యంబులును వినుచున్,
సంభ్రాంతులునై కుంభకర్ణునీ సదనంబునకును వే జనిరీ! 22

మహాబలముగల రాక్షస వీరులు మహాద్వారములు గలదియునూ,
అన్ని వైపులా యోజన దూరము యతి వైశాల్యము గలదియునూ!
పుష్పగంధముల విరజిమ్ముచునూ పొలుపుగ సుందర మయినదియున్,
కుంభకర్ణునీ నివాసగృహమును గూరిమి బోయిరి రాక్షసులున్!
కుంభకర్ణునీ నిఃశ్వాసంబులు కూరిమి కదుల్చుచుండగనూ,
అతికష్టంబున నిలద్రొక్కుకొనీ యా గుహలోనికి జొచ్చి మఱిన్! 24

రత్నంబులతో, బంగారమ్ముతో రమ్యముగా నిర్మించిన యా
కుట్టిమ్ములతో గూడినట్టి, యా కూరిమి గుహలోనికి బోయీ!

శయనించిన యా భీమవిక్రముని సహజ క్రూరుడగు రాక్షసునీ,
కుంభకర్ణునీ గాంచి రచ్చటను గుండెలు జిల్లున బొంగగనూ! 25

కుంభకర్ణుడును జూచెడి వారికి గూరిమి వికటుంబుగ నచటన్,
నిదురబోవుచుండెను నాతండును నీరధివలె శబ్దంబుననూ!
పడవేసిన పర్వతమును వోలెను బన్నుగ నుండెను నచ్చోటన్,
మహానిద్రలో నున్న రాక్షసుని మానుగ నైర్రుతు లందఱునూ!
మేలుకొలుపుటకు యత్నము చేసిరి మిగుల ధ్వనుల మఱి జేయుచునూ!

పైకి లేచినా రోమంబులతో బరగ శరీరము గలవాడున్,
సర్పమువలె మఱి శ్వాసను బీల్చుచు సరి వదులుచు నుండిన వాడున్,
భీమ విక్రమము గంవాడును మఱి భీమ నాశికయు గలవాడున్,
పాతాలము నలె విశాలమైనా బన్నుగ ముఖమును గలవాడున్,
శయనమునందున సర్వాంగములును సరసత నుంచిన వాడు మఱిన్;
కాంచనాంగదములను గూడికొనీ యంచితముగ యుండిన వాడున్
కిరీటంబునూ సూర్యునివలె మఱి కిరణ కాంతియును గలవాడున్,
రాక్షసశ్రేష్ఠుడు నరిమర్దనుడును రమ్య ప్రకాశము గలవాడున్,
అట్టి కుంభకర్ణుని రాక్షసుడును నిట్టె గాంచిరీ వెఱచుచునూ! 27-28-29

అటుబిమ్మట యా మహారాక్షసులు నతి తృప్తిని గలిగించెడిదీ,
మేరు పర్వతము వంటి రాసులను మిగుల మాంసముల ప్రోవులనూ!
కుంభకర్ణునీ యెదుటను నుంచిరి కుంభినిపై పెనుప్రోవులనూ! 30

మహారాక్షసులు లేళ్ళు, దున్నలను మానుగ వరాహముల నచటన్,
కట్టివేసిరి యాహారముగా నిట్టె కుంభకర్ణుని కొఱకై,
ఆ జంతువులా మాంసపు ప్రోవుల యచట నుంచిరీ రాక్షసులై
విచిత్రమైనా యన్న రాశులను విమలమైన పానీయములన్! 31

అటు బిమ్మట యాదేవ శత్రువులు నా రాక్షసులును వేగముగా,
రక్తము నిండిన కుంభంబులనూ రమ్యమైన మాంసంబులనూ!
కుంభకర్ణునీ యెదురుగ నుంచిరి కూరిమి యాతడు భుజియింపన్! 32

శ్రేష్ఠమైన చందనముల తోడను చారు సుశీతల సుగంధముల్,
అరిందముండగు కుంభకర్ణునికి యలదిరి శరీరమంతటినీ!
శ్రేష్ఠములైనా పుష్ప మాలలను శ్రీకర సుగంధ ద్రవ్యములన్,
వాసనజూపిరి కుంభకర్ణునికి పనరగ నిద్రను లేపుటకై! 33

ఆ రాక్షసులును ధూప గంధముల యలరి సృజించిరి యచ్చోటన్,
బరంతపుండగు కుంభకర్ణుని బరగ స్తుతించిరి రాక్షసులున్
మాటిమాటికిని యంబుదములవలె మానుగ ధ్వనులను జేసి రటన్! 34

శశాంక సదృశ ప్రభలు గలిగినా శంఖములను బూరించి రటన్,
పసుగుజెంది కోపించిన వారై వికటముగను నా రాక్షసులున్,
ఒక్కమారుగా రాక్షసు లందఱు మిక్కిలి ధ్వనులను జేసి రటన్! 35

కుంభకర్ణుని లేపుట కొఱకై కుంభిని బ్రద్దలు యగునటులన్,
కేకలు వేసిరి యతని శరీరము మేకులవలె యుండిన యట్టి,
గోళుల గ్రుచ్చిరి, మఱియు జఱచిరీ కూరిమి మెలకువ నందుటకై,
అవయవంబులును నెత్తిబడు నటుల యలరి జార్చిరీ క్రిందకునూ! 36

విహంగములు మఱి యా శంఖంబుల వికట భేరి శబ్దంబులనూ,
పణవంబుల ధ్వని, జబ్బలు జఱచుట బన్నుగ గర్జించుట మఱియున్
సింహనాదముల మహా శబ్దములు శీఘ్రము విని పదిదిక్కులకున్
పాఱిపోయి, గగనంబున నెగురుచు బన్నుగ నేలను బడిపోయెన్! 37

నిద్రించెడి యా మహాత్ముడైనా నిర్భర బలవంతుడు నైనా,
కుంభకర్ణుని యెంత లేపినను గూరిమి నిద్రను లేవడుగా!
అటుబిమ్మట యామహా రాక్షసు లాతని నిద్రను లేపుటకై
ముద్గరముల మఱి గదల గ్రహించిరి ముసలములను ధరియించి మఱిన్! 38

క్రూరులైన యా మహారాక్షసులు గూరిమి భూతల మందుననూ,
నేలమీద సుఖ ప్రసుప్తుడైనా నిఖిలము మఱచిన వాడైనా
కుంభకర్ణుని ముసలంబులచే గూరిమి పర్వత శిఖరములన్

గదలతోని, బిడికిళ్ళతోని మఱీ కఠినమైన యట్టి చేతులతో,
కుంభకర్ణునీ వక్షస్థలమున కూరిమి గొట్టిరి తీవ్రముగన్! 39

రాక్షసుడైనా కుంభకర్ణునీ రహి శ్వాసల యా గాలికినీ,
బలవంతులునగు నారాక్షసులును బలిమిని యాతని యెదుట మఱిన్,
నిలబడజాలక పోయిరి వారలు నిలకడగా మఱి యచ్చోటన్! 40

అటుబిమ్మట యా భీమ విక్రములు నా రాక్షసులును గాఢముగా,
నిలద్రొక్కుకొనీ, మృదంగములనూ నిలిచి పణవముల భేరీలన్,
శంఖ కుంభ సముదాయము తోడను సరసత మ్రోగించిరి యచటన్!
ఎంతలేపినను కుంభకర్ణు డట సుంత గదలడూ! మేల్కొనడూ! 41

పదివేలకు పైబడిన రాక్షసులు బరగ చుట్టు ముట్టడి జేసీ,
ఒక్కమారుగా కేకలు వేసిరి మిక్కిలి దిక్కులు నిండగనూ!
కొట్టుచు, దిట్టుచు నిదురలేపిరీ, యెట్టి ప్రయత్నము జేసిననూ!
కానీ యాతడు గదలడు! మెదలడు! కనులువిప్పి మేల్కొనడు గదా! 42

ఎంతప్రయత్నము జేసిన గూడను సుంత మేల్కొనడు రాక్షసుడున్,
ఆరాక్షసులును నంత కంటె మఱి యతి దారుణమగు యత్నములన్
జేయుటకును మఱి ప్రారంభించిరి శీఘ్రము నాతని లేపుటకై! 43

గుఱ్ఱంబులనూ, ఒంటెలనూ మఱి కూరిమి ఖరముల గజములనూ!
దండములను మఱి కశముల జేతను మెండుగ యంకుశముల తోడన్!
కొట్టుచు యాతనిపై నడిపించిరి కూరిమి కేకలు వేయుచునూ,
ప్రాణబలంబును జిక్కబట్టుకొని బన్నుగ భేరి మృదంగములన్,
శంఖంబులనూ మ్రోగించిరి యట సరసత దిక్కులు మార్మోగగన్! 44

నల్లని కాటుక ప్రోవుల వంటీ నయముగ యాకారము గలుగూ,
యారాక్షసులను గట్టిలతోడను నలరు స్తంభములతోని మఱిన్,
బలమునంతనూ యుపయోగించియు బరగ ముసల ముద్గరములతో,
అన్ని అవయవము లందున గొట్టిరి యాతడు మాత్రము లేవడుగా! 45

పర్వతములతో, వనముల తోడను బన్నుగ యుండిన లంకయునూ!
వారలుజేసెడి ధ్వనులలోని మఱి వనరగ మ్రార్మోగుచు నుండెన్!
కాని కుంభకర్ణుండు మాత్రమును గదలడు! మెదలడు! మేల్కొనడూ! 46

అటుబిమ్మట యా మహారాక్షసులు నలరుచు సహస్ర భేరీలన్,
నాతని చుట్టును నమర్చి రప్పుడు నలతి దూరస్థల మందుననూ!
పరిశుద్ధంబగు బంగారముతో బన్నుగ జేసిన దండములన్,
ఒక్కమారుగా నా భేరీలను జిక్కబట్టి మ్రోగించి రటన్! 47

ఇంతజేసినను రావణు దమ్ముడు సుంత మెదలడూ! కదలడుగా!
బ్రహ్మశాపమున వశుడై యాతడు బరగ మహానిద్రను నుండెన్!
ఆరాక్షసులకు గోపము గలిగెను నాతడు లేవక బోవుటచే! 48

భీమపరాక్రములైన రాక్షసులు భీకరులై కోపము జెందీ,
అతి నిష్ఠురతను నతని లేపుటకు నఖిల యత్నములు జేసిరటన్!
తమ తమ బలముల నన్ని జూపిరీ దరుగని యత్నంబుల తోడన్! 49

ఆ రాక్షసులను మఱి కొందఱునూ నలభేరీలను మ్రోగించీ,
ధ్వనులను జేసిరి భూమ్యాకాశము దగ మ్రార్మోగగ యచ్చటనూ!
కొందరు నాతని జుట్టును లాగిరి, కొందఱు జెవులను గొఱికి రటన్! 50

మఱికొందఱు నట మహారాక్షసులు మానుగ కోపముజెంది మఱిన్,
వందలకొలదియు నుదక కుంభముల జిందగ యాతని కర్ణములన్!
వంచిరిగానీ కుంభకర్ణుడును నంచితముగ మఱి గలడుగా!
మహానిద్రకును వశుడై యాతడు మానుగ మేల్కొన లేదపుడున్! 51

మహారాక్షసులు మఱికొందఱు నట మానుగ ముద్గర కూటములన్,
హస్తములందున ధరించి వేగము నాతని శిరమున వక్షమునన్,
అవయవంబులను బడవేసిరి మఱి నా ముద్గరముల కూటములన్! 52

త్రాళ్ళయొక్క బంధనముల జేతను దగ గట్టగబడి నట్టివియునూ,
శతఘ్నులను మఱి యన్ని వైపులను సతతము గొట్టిన గూడ మఱిన్
మహాకాయమును గల రాక్షసునకు మాన్నుగ మెలకువ రాలేదూ! 53

కుంభకర్ణుని శరీరంబుపై కూరిమి సహస్ర గజములనూ,
వరుసగ జేర్చియు బరుగెత్తించిరి వనరగ యాతని వక్షముపై
కుంభకర్ణునకు నపుడు మాత్రమే కొంచెము మెలకువ వచ్చినదీ,
స్పర్శ మాత్రమే గలిగెను నతనికి చక్కిలిగిలి బెట్టిన యటులన్! 54

అట్టి కుంభకర్ణుండు దనపైన నలరు పర్వతపు శిఖరములన్,
వృక్షములను బడవేయుట వలనను వికటమైన యా దెబ్బలకున్,
లెక్కజేయనీ వాడై పిమ్మట చక్కని నిద్రయు క్షీణింపన్,
ఆకలిజేతను, భయంబు జేతను నట్టి కుంభకర్ణుండు మఱిన్
ఆవలించుచును నిద్దుర లేచెను నందఱు భయబడుచుండగనూ! 55

కుంభకర్ణుడును నిదురలేచి మఱి కూరిమి విషఫణి సమానమున్,
పర్వత శిఖరముతో సమానమగు బన్నుగ వజ్రాయుధము వలెన్,
సారముగలిగిన దన బాహువులను సరిగ నెత్తి పైకిని వేగన్,
బడబాముఖమును గలిగిన యాతడు బరగ యావులించెను వికృతిన్! 56

ఆవులించు నా కుంభకర్ణుపీ యలరు ముఖము బాతాలముగా,
మేరుపర్వతపు శిఖరాగ్రంబున మేలిమి కాంతులు జిందుచునూ,
ఉదయించిన సూర్యునివలె గనబడె యురుతర ప్రకాశమును జిమ్మన్! 57

అతి బలియుడగు నిశాచరుండును నలరి యావులించుచు లేచెన్,
ఆ సమయంబున యతని శ్వాసయును నల బర్వత వాయువు వోలెన్,
వీచుచునుండెను నా రాక్షసులును వికలత నందిరి నిలువకనూ! 58

ఉత్తిష్ఠుండగు కుంభకర్ణునీ యున్నతమగు నాకారంబున్,
ప్రళయకాలమున సకల భూతముల సర్వము ధ్వంసము జేసెడి యా,
కాలుని యాకారమువలె నుండెను గాల పాశమే లేదు మఱిన్! 59

అగ్ని దీప్తితో సమానంబులును నలరు మెఱుపు కాంతుల తోడన్,
ప్రజ్వలించెడి యాతని నేత్రములు బన్నుగ గగనమునందుననూ,
మహాగ్రహములుగ గనబడుచుండెను మానుగ ప్రకాశముగ నచటన్! 60

అటుతిమ్మట యా కుంభకర్ణుడును ననేక విధముల భక్ష్యములన్,
అనేక విధముల పదార్థంబులను నలసట లేకయు భక్షించెన్!
వరాహముల మఱి వహిషంబులనూ వరుసగ వానికి నవి జూపన్,
అతడు వాని నన్నిటిని భుజించెను నలసట యంతయు లేకుండన్! 61

ఆకలి దప్పుల నుండుట జేతను నట్టి కుంభకర్ణుండు మఱిన్,
అనేక విధముల మాంసంబులనూ యలరి భుజించెను వేవెంటన్!
తృషితుడైన యా యింద్రశత్రువును దీరుగ శోణితమును ద్రావెన్,
క్రొవ్వు, మద్యభాండంబుల నంతట కూరిమి ద్రావెను బరితృప్తిన్; 62

ఈతడు దృప్తిని జెందినాడనుచు నిమ్ముగ రాక్షసులును దలచీ,
శీఘ్రముగా నా రాక్షసులందఱు జేరవచ్చి వినయంబుననూ!
శిరముల జేతను నమస్కరించుచు జేరిరి యాతని రాక్షసులున్! 63

నిద్రజేత యా కుంభకర్ణునీ నీరవములు నగు నేత్రములున్,
మూతలు బడుచుండెను మఱియును నట ముడుతలు బడుచును నుండెనటన్,
కలుషముగా నుండెను నేత్రంబులు కష్టముగా జూచుచు నుండెన్!
అట్టి కుంభకర్ణుండు దృష్టినీ నిట్టె గాంచుచును నిశ్చలతన్,
ఆ రాక్షసవీరులతో బలికెను నలరుచు నీ నిధముగ యపుడున్ 64

రాక్షసశ్రేష్ఠుడు కుంభకర్ణుడును రయమున రాక్షసు లందఱినీ,
ధైర్యము జెప్పుచు దోదార్చెను మఱి తనను లేపినందుల కటులన్!
ఆశ్చర్యంబును బొందుచు నాతడు నలరి వారితో నిటు లనియెన్! 65-66

ప్రయత్న పూర్వకముగ నన్నిట్టుల బరగ లేపిరెందుల కొఱకున్?
రాజు క్షేమముగ నున్నాడు గదా! రహి భయ మేమియు లేదుగదా!
లేదా యన్యుల వలన భయంబును నధికముగా వచ్చియు యుండున్!
ఆపద యేదో యుపస్థితంబై యలరి లేపి రిటు నిశ్చయమున్!
అందుజేతన్ తొందర బడుచును కందుచు లేపిరి నన్నిటులన్! 67

రాక్షసేంద్రుడగు దశగ్రీవునకును రయమున 'గలిగిన యాపదనూ!
మొదలంటను బెకలించి వేసెదను మోదము గూర్చెద నాతనికిన్!

ఆ స్వర్గంబున కేగి మహేంద్రుని యలరి జీల్చి వేయగ వలెనా?
అగ్నిహోత్రునీ వేడిని మాపీ యతి చల్లగ చేయగ వలెనా? 68

నిదురించిన మా వంటి వారినీ నిష్కారణమున లేపరుగా,
ప్రబలమైన కారణ మది యేదో బన్నుగ యుండును లేవుటకున్!
కారణమేమో అర్థతత్త్వమున గడగి దెలుపు డిక సఖులారా! 69

కడు మిక్కిలి యాతురతను జెందుచు గలత జెంది మాటాడెడి యా,
అరిందముండగు కుంభకర్ణునీ నలరి గాంచుచును భయబడుచున్,
కుంభకర్ణుతో రావణు మంత్రియు గూరిమి యూపాక్షుండు మఱిన్!
అంజలి ఘటించి నమస్కరించుచు నలరి బలికె నీ విధముగనూ! 70

మహారాజ! మఱి మాకెన్నడునూ మానుగ దివిజులచే గానీ,
భయమేమాత్రము లేదుగదా మఱి బాధయులేదు సుమా! యింకన్,
మనుష్యునుండీ గలిగిన దిప్పుడు మానుగ యపాయమును నేమి,
అట్టిభయము బాధించుచు నున్నది గట్టిగ మము నీ సమయమునన్! 71

మహారాజ! మా కీ సమయంబున మనుష్య సంబంధము వలనన్,
భయము, నాపదయు నెంత వచ్చినదొ బన్నుగ వివరింపగ తేనూ!
దైత్యుల నుండియు భయములేదు మఱి దానవులను భయమును లేదూ!
మానుష సంబంధము నగు నాపద మానుగ వచ్చెను లంకకునూ! 72

పర్వతముల యాకారంబును గల బన్నుగ వానరవీరులచే!
లంకానగరము చుట్టుముట్టబడె శంకలేక కపివీరులచే!
సీతను మనము హరించుటజేతను జింత నుండె యా రాఘవుడున్,
ఆతని వలననే యాపద వచ్చెను నల లంకకు రాక్షసులకునూ! 73

ఒక కపివీరుడు వచ్చి పూర్వమున యొనరగ లంకానగరంబున్,
కాల్చివేసెగద! పరివారముతో గదన రంగమున గజములతో!
అక్షకుమారుని జంపినాడు గద యల కపివీరుడు ఒక్కరుడే!
అంతజేసినా యా వానరుడును నెంతజేయునో! మఱి యిపుడున్! 74

రక్షోధిపుడును, దేవకంటకుడు రహి స్వయముగ పౌలస్త్యుడునూ!
భానుతేజమును గలవాడును నగు బన్నుగ యా రామువిజేతన్,
పరాజయము జెందెను రణమందున బన్నుగ రాక్షసులును జూడన్,
వెఱ్ఱము! అనుచును పలికి విడిచెనూ విపరీతము గాదా యిదియున్! 75

మనరాజగు నా దశగ్రీవుని మానుగ దేవతలును గాని,
దైత్యదానవులు గాని యెట్టిస్థితి దగ కల్పింపక జాలకనూ,
యుండినారొ మఱి యట్టి పరిస్థితి మెండుగ రాముడు గల్పించెన్!
ప్రాణసంశయము నుండి బ్రోచెనూ బన్నుగ మన లంకాధీశున్! 76

కుంభకర్ణుడును నా యూపాక్షుని కూరిమి వాక్యములను వినియున్,
రణమున దన సోదరునకు గలిగిన రహి పరాభవములను వినుచున్,
కోపముతో నేత్రములను ద్రిప్పుచును గుదురుగ నాతనితో ననియెన్! 77

ఓ యూపాక్షుడ! యిప్పుడు నేనును నొప్పుగ వానర సైన్యంబున్,
కపివీరుల నందఱ జయించెదను కంటకములు మఱి లేకుండన్!
రాముని లక్ష్మణులను జయించెదను రయమున యుద్ధము నందుననూ,
అటుపిమ్మట మా యన్నను గాంచెద యాదరమును నే బొందెదనూ! 78

ఆ కపివీరుల రక్త మాంసముల యలరెడి మన రాక్షసులకునూ,
సంతృప్తిని నే గలిగించెదనూ సంతసమును మఱిబొందగనూ!
మానవులగు నా రామలక్ష్మణుల మానుగ రక్తము ద్రావెద నే! 79

రోషము జేతను, గర్వముజేతను, దోషాధికమగు వచనములన్,
కుంభకర్ణుడును బలుకుట గాంచి కూరిమి రాక్షస యోధులలో,
ముఖ్యుండగు నా మహోదరుండును ముదమున కరములు జోడించి,
నమస్కరించుచు నీవిధి బలికెను నయముగ వినయము బొంగారన్! 80

మహాబాహువులు గలవాడా! ఘన కూర్మి విక్రమము గలవాడా!
ముందుగ రావణు డేమి దెలుపునో చందముగా విని పిమ్మటనూ,
గుణదోషములను విమర్శజేయుము గూరిమి నటు పిమ్మటను మఱిన్,
రణమున శత్రువులను జయింపుమా! రమ్యముగా విజయము గొనునూ! 81

మహాతేజమును గలవాడును మఱి మహాబలంబును గలవాడున్,
కుంభకర్ణుడును నా మహోదరుని కూరిమి వాక్యములను వినియున్!
ఆ రాక్షస వీరులతో వెడలెను అన్నయైన రావణు గదకున్! 82

ఆ రాక్షస వీరులు వేగముగా నతిభీమములగు నేత్రములన్,
గలవాడును మఱి భీమరూపమును గలగు విక్రమము గలవాడున్!
నిదురించిన యా కుంభకర్ణునీ నిర్నిరోధముగ దోడ్కొనుచున్,
దశగ్రీవుని యా నివేశమునకును దరలిపోయిరీ శీఘ్రగతిన్! 83

ఆ రాక్షసు లందఱు ద్వరితంబుగ యాసనమున యాసీనుండ్రై,
యున్న రావణుని జేరి సమీపము సన్నగ వినయము, దోడుతనూ!
అంజలి దోడుత నమస్కరించుచు నా రావణుతో నిటులనిరీ! 84

రాక్షసరాజా! నీ సోదరుడగు రమ్య విక్రముండగు వాడున్,
కుంభకర్ణుడును మేలుకొనియెనూ కూర్మి ప్రబోధింపగ మేమున్!
అచ్చటనే యాతడు యుద్ధమునకు నలరి బయలుదేరగ వలెనా?
అటులుగాక నిను జూడగ యిచటికి యలరి రావలయునా రాజా? 85

రావణుండు మది సంతోషించుచు రాక్షసులను గని యిటు లనియెన్,
నా సోదరుడగు కుంభకర్ణునీ నయముగ యిచ్చటనే! యిపుడే,
చూడగోరు చున్నాడను నతనిని శుభకరమగు నా చూపులతో!
యధా న్యాయముగ గొనితెండతనిని యథారీతి సత్కారములన్! 86

రావణు డా విధి ప్రేరేపింపగ రహి రాక్షసు లందఱు వేగన్,
'అటులే జేసెద' మనుచు బలుకుచును నా రావణు యానతి రీతిన్!
తిరిగి వచ్చి యా కుంభకర్ణుతో దీరుగ బలికిరి యీ రీతిన్!

సమస్త రాక్షసులును శ్రేష్ఠుండును సార్వభౌముడగు రావణుడున్,
విన్ను గనుగొనగ వలెనని గోరుచు యున్నవాడు నీకై యచటన్,
అందుచేత నీ వచటికి బోయీ సందుకొనుము నళినందననూ!
సోదరునకు సంతోషము గూర్చుము నాదరమున యంజలితోడన్! 88

దుర్ధర్షుండును మహావీర్యుడును దూరాలోచన గలవాడున్,
అట్టివాడునగు కుంభకర్ణుడును నిద్రె యన్న యాజ్ఞను దెలిసీ,
'ఆజ్ఞే జేసెద!' నని బలుకుచునూ నా రాక్షసులను గనుగొనుచున్
శయనము నుండియు లేచి నాడు మఱి సకల భూతములు భయమందన్! 89

సంతోషముతో కుంభకర్ణుడును సరసత ముఖ ప్రక్షాళమునన్,
జేసి మఱియునూ స్నానము జేసీ శ్రీకరమగు మణిభూషణముల్,
అలంకరించుక యద్ధము జూచుచు నలరి దప్పికను బొందుచునూ,
బల సమీకరణమును బొందించెడి పానీయంబుల దెమ్మనెనూ! 90

అటుదిమ్మట యా రావణాజ్ఞచే నలరు కుంభకర్ణుని వేగన్,
దోడ్కొని పోవుటకును రాక్షసులును దొరమైన బహు మద్యములన్,
అనేక విధముల భక్ష్యంబులనూ నలరి దెచ్చి రటకును వేగన్! 91

సహజముగా మత్తుండు, మఱియునూ సహజముగా దుష్టుడు నైనా,
కుంభకర్ణుడును మద్యము ద్రావెను గూరిమి వందల ఘటములనూ!
కొంచెముగా మత్తెక్కిన వాడును నంచితముగ లేచిన వాడై
తేజోబలముల గూడినవాడై దీరుగ ప్రయాణమై జనియెన్! 92

రాక్షస సైన్యముతో గూడికొనీ రయమున సోదరు గృహమునకున్,
బోవుచున్న యా కుంభకర్ణుడును బొలుపుగ కోపముజెందిన యా,
కాలాంతక యమునికి వలె నుండెను కలకల ప్రకాశమును జెందన్,
కుంభకర్ణునీ పాదన్యాసమున కూరిమ ధరణియు గంపించెన్! 93

సహస్ర రశ్మియు దన కిరణములను సరసత ధాత్రిని బ్రకాశమున్,
జేయనట్లుగా కుంభకర్ణుడును శ్రీలు జిందు శారీరముచే,
రాజమార్గమును బ్రకాశమానము రమ్యముగా జేయుచు నుండెన్,
దారి బొడవునను రాక్షసవీరులు దగ యంజలులను ఘటియింపన్,
స్వయంభువుని గృహమునకు నింద్రుడును బోయినట్లుగా నాతండున్,
అన్నయైన రావణుని గృహమునకు నలరి కుంభకర్ణుం డేగెన్! 94

అమిత్ర ఘాతకుడైన వాడునూ, యప్రమేయుడగు వాడు మఱిన్,
పర్వత శిఖరముతో సమానుడును బరగ రాజ మార్గమునందున్,
బోవుచున్న యా కుంభకర్ణుని బొలుపుగ వెలుపల నున్నట్టి.
వానర వీరులు సేనాధిపులును వనరగ భయమందిరి గాంచి! 95

శరణాగత రక్షకుడగు రాముని శరణము వేడిరి కొందఱునూ!
వ్యథ జెందియు గొందఱు కపివీరులు వరుసను నేలను బడి రప్పుడున్,
మఱి కొందఱు నలుదిశలను బట్టుచు మానుగ బరుగులు దీసి రటన్!
కొందఱు భయమును జెంది నేలపై కూరిమి నిదురించిరి యప్పుడున్, 96

అద్రిశృంగ ప్రతిముండు మఱియునూ నలరు కిరణములు గలవాడున్,
ఆత్మతేజమున యా యాదిత్యుని అలరి స్పృశించుచు నున్నాడా?
అనునట్లుండెను కుంభకర్ణుడును నాకాశంబును నంటుచునూ!
అత్యాశ్చర్యమునను బెరిగిన యా యతని దేహమును జూడగనే
ఆ వానరులును భయకంపితులై యటునిటు బరుగులు దీసి రటన్! 97

(యుద్ధకాండములోని 60వ సర్గము సమాప్తము)

  

## యుద్ధకాండము - మొదటి భాగము

### అఱువదిఒకటవ సర్గము

(విభీషణుడు కుంభకర్ణుని గూర్చి శ్రీరామునకు దెలుపుట— రామాజ్ఞచేత వానరవీరులు లంకా ద్వారముల వద్ద నిలుచుట).

అటుబిమ్మట యా మహాతేజమును నలరు విక్రమము గలవాడున్,
ఆశ్రీరాముడు ధనువు ధరించి యలరు బెద్ద దేహమును మఱిన్,
కిరీటంబు మఱి గలిగినట్టియును కిరణంబులు విరజిమ్ముచునూ,
రావణు తమ్ముని కుంభకర్ణునీ రాముడు జూచెను మార్గమునన్! 1

పూర్వకాలమున యా కాశంబును బొలుపుగ యాక్రమణము జేయూ,
సర్వలోకప్రభువైన విష్ణువును సరసత బోలుచు నుండిన యా
మహాపర్వతమువలె గనిపించెడి మానుగ గాంచుచు రాక్షసుని
రాముడు మఱి సన్నద్ధుడు నాయెను రయమున చాపము గ్రహియించి! 2

ప్రావృట్కాలపు మేఘంబును వలె బన్నుగ యుండినవాడు మఱిన్,
కాంచనాంగదములను ధరియించి కలకలలాడుచు నుండిన యా
కుంభకర్ణునీ గని కపిసైన్యము కుంభిని నాలుగు దిక్కులకున్,
భయంపడియు మఱి పరుగులు దీసిరి బన్నుగ వ్యథ జెందియు మిగులన్!3

పారిపోవుచుండిన సైన్యంబును బరగ గాంచి యా రాఘవుడున్,
పెరుగుచున్న యా రాక్షసుగాంచి పేరిమి మిగులాశ్చర్యమునన్,
శ్రీరాముండును! విభీషణునితో శ్రీకరముగ నిటులను పలికెన్! 4

పర్వత సంకాశుండును మఱియును బరగ కిరీటము గలవాడున్,
పచ్చని నేత్రంబులు గలవాడును బరగ మెఱుపుతో గూడిన యా
మేఘంబును వలె గనబడు చుండెను మిత్రమ! యీతడు నెవ్వడిటన్! 5

ఈత డొక్కడే గొప్పదేహమున యిచ్చట గానగ బడుచుండెన్,
భూమియందునను ధ్వజసమానమున బొలుపుగ నుండిన వాడెవడూ?
ఇతని గాంచి కపివీరు లందఱును నిటు నటు బరుగిడు చుండిరదే! 6

ఇంత పెద్ద దేహమున నుండినా యీతం డెవ్వడు విభీషణా?
రాక్షసుడా? లేకను నసురుండా? రయమున వివరిపుము నాకున్!
ఇట్టి భూతమును ఏదివఱ కెన్నడు నిట్టె జూచి యుండగ లేదూ! 7

అక్లిష్టకర్మణుడైన రాముడును నలరి బలుకగా నీరీతిన్
మహాప్రాజ్ఞుడగు విభీషణుండును మానుగ బలికెను రామునితో! 8

ఎవనిచేత రణరంగమునందున యిమ్ముగ వైవస్వతుడు మఱిన్,
వాసవుండు మఱి యోడింపగబడి వనరగ దొలగిరొ రణమందున్,
అట్టి యితడు విశ్రవసు కుమారుడు నిట్టి కుంభకర్ణుడు వీడున్!
మహాప్రతాపుడు, వీర్యవంతుడును మానుగ మాయా జీవియునూ,
ఈతని దేహ ప్రమాణ సదృశుడు ఇలపై యొక్కడు గనబడడూ! 9

వీనిచేత రణరంగము నందున విద్యాధరులును దేవతలున్,
దానవుడును, యక్షులు, నాగులు మఱి దగ మాంసముదిను రాక్షసులున్!
ఆల గంధర్వులు, పన్నగులును మఱి అలరు వేలకొలదియు వీరుల్,
ఈతనిచే అని యోడింపగ బడి యిమ్ముగ బోయిరి యడవులకున్! 10

విరూపాక్షుడును, శూలపాణియును వికృత రూపమును గలవాడున్,
మహావీర్యుడగు కుంభకర్ణునీ మానుగ గాంచియు దేవతలున్,
ఇతడు యముండని భ్రాంతిని జెందీ యితని జంపలేకను వారున్,
దూరదూరముగ పారిపోయిరీ దూరముగా నీతని గాంచీ! 11

ఇట్టి కుంభకర్ణుండు సహజముగ యిమ్ముగ తేజము గలవాడున్,
మహాబలంబును గలవాడును మఱి మహా విక్రమము గలవాడున్,
అన్యరాక్షసులకును లలి బలమును నలరి లభించెను వరములచే
నీతని కటులను గాదు సుమా! మఱి యిమ్ముగ దెలిపెద శ్రీరామా! 12

పుట్టుక జేతను కుంభకర్ణుండును బొందుగ క్షుధచే నార్తుండై!
అనేక ప్రాణుల వేల భూతముల నలరుచు భక్షించుచు నంతన్! 13

ఆ విధముగ యా కుంభకర్ణుడును నాప్రాణుల భక్షింపగనూ,
భయపీడితులై ప్రజలందఱునూ ఐన్నగ సురరాజును జేరి,
శరణుజొచ్చి మఱి విన్నవించిరి నరగున విషయము నంతయునూ! 14

వజ్రాయుధమును గల దేవేంద్రుడు వనగర కోపించిన వాడై!
కుంభకర్ణుని వజ్రాయుధమున గొట్టెను దీవ్రముగా నపుడున్!
వజ్రము జేతను గొట్టబడిన యా వనరగ యట్టి మహాత్ముండున్,
కుంభకర్ణుండును చలించిపోయెను కోపమునను బిగ్గఱ నఱచెన్! 15

ముందుగనే భయపడిన ప్రజలునూ మొండి బాలుడగు రాక్షసునీ,
బహు బిగ్గఱగా నఱచుచున్న యా బాలుని కంఠధ్వనిని వినుచున్,
ఇంకను భయపడిపోయిరి ప్రజలును బింకమైన యా యఱపులకున్! 15

బాలుడైన యా కుంభకర్ణుండును ఐన్నగ కోపము జెందుచునూ,
మహా బలముగల కుంభకర్ణుండును మఱి యింద్రుని వాహనమైనా,
ఐరావత దంతంబును బెఱికి యల యింద్రుని వక్షమునందున్,
విసిరెను దేవతలందఱు జూడగ వినువీధిని ఋషులును జూడన్! 17

కుంభకర్ణుడును గొట్టుట జేతను గుదురుగ యింద్రుడు బీడితుడై
సంతాపము జెందెను నాతండును వింతగ గాంచెను రాక్షసునీ!
అటుబిమ్మట దేవతలు, దానవులు అలరు మునులు మఱి బ్రహ్మఋషుల్!
విషాదమును జెందిరి వారలునూ వేగము నింద్రుడు నల ప్రజతో
బ్రహ్మలోకమును బోయెను నాతడు ఐన్నగ బాధను వివరింపన్! 18

ప్రజాపతియునగు బ్రహ్మదేవునకు బరగ కుంభకర్ణుని గూర్చి,
వివరించిరి మఱి యతని దుష్టతను వివరముగా సుస్పష్టతనూ!
ప్రజలను భక్షణ నేయుచుండెనని బరగ సురల నెదిరించుచునూ,
ఆశ్రమములనూ ధ్వంసము జేయుచు నతి బరస్త్రీల హరించుచునూ!
నున్నవాడనుచు బ్రహ్మదేవునకు విన్నవించిరీ యింద్రాదుల్! 20

ఇతడీ విధమున భక్షించినచో నిల ప్రజలను బ్రతినిత్యంబున్,
అచిరకాలమున యీలోకంబును నగును ప్రాణి శూన్యంబునునై! 21

సర్వలోకపితయైన బ్రహ్మయును సరసత వాసవు వాక్యములన్,
విని యా రాక్షసు లందఱినీ మఱి వేగము రప్పించెను నటకున్,
ప్రజాపతియునగు బ్రహ్మదేవుడును ఖరగ కుంభకర్ణుని గాంచెన్! 22

కుంభకర్ణునీ సమీపించి మఱి కుదురుగ బ్రహ్మయు భయబడియున్,
కొంత సేపటికి యూరడిల్లుచును చెంతబాసి, సరళత దోడన్,
కుంభకర్ణుతో నిట్లని బలికెను, కుంభిని ప్రజలును సంతసిలన్! 23

లోక వినాశనమునకే నీవును లోలత విశ్రవసుని చేతన్,
సృజింపబడితివి! ధృవ మిది కావున శీఘ్రము నేడే మొదలుకొనీ,
చచ్చినవానికీ సమానుండవై శయనింపుము భూతలమునను! 24

అటుబిమ్మట యా బ్రహ్మ శాపమున యట్టి కుంభకర్ణుండు మఱిన్,
అల ప్రజాపతికి సమక్షమందే యా రాక్షసుడును క్రిందబడెన్!
అటుమీదట సంభ్రాంత చిత్తుడై యా రావణుడును నిటు బలికెన్! 25

ప్రజాపతీ! ఓ బ్రహ్మదేవుడా! బస్నుగ బంగరు వృక్షంబున్.
ఫలముల నిచ్చే సమయము నందున బరగ నఱుక బడుచున్నదిగా!
నీ మునిమనుమడు కుంభకర్ణునీ నిర్దయతో నీ విధముగనూ!
శపించుటది మఱి న్యాయముకాదూ! చయ్యన శాపము మరలింపూ! 26

నీ మాటయు మఱి వ్యర్థమగుటకును నిక్కము! వ్యర్థము కారాదూ!
ఈతడు దప్పక నిదురింపగ వలె నిమ్ముగ ధరణీ తలమందున్,
సందేహము మఱి యింతలేదుసుమ! సరసత దెలుపుము నిర్ణయమున్!
నిదురించుటకును మేలుకొనుటకును నిశ్చిత కాలము దెలుపవలెన్! 27

ఆ దశగ్రీవుని వచనములను విని యలరి స్వయంభూ దేవుండున్,
ఇటుల బలికె మఱి ప్రీతిపూర్వము నిమ్మగ యందఱు వినునటులన్,
ఆఱుమాసములు నిదురించును ధర యలరి మేల్కొనును నొకరోజున్! 28

ఈవీరుడు నా యొక్క దినమునను నిమ్మగ బహు నాకలిని గొనీ,
నోరుదెఱచుకొని వసుధను దిరుగుచు నాఱిపోని పెన్నిప్పు వలెన్!
లోకములను భక్షింపగలడు సుమ! లోకాతీతము నగు నటులన్! 29

ప్రస్తుతంబు కష్టముల జిక్కుకొని బరగ నీదు విక్రమమునకున్,
భయమును జెందిన రాక్షసేంద్రుడును బరగ రావణుడు సీతనినీ
నిద్రనుండి మఱి మేలుకొలిపెనూ ఛిద్రము సేయగ వానరులన్! 30

భయంకరంబగు బరాక్రమముగల బరగ యట్టి వీరుడునైనా!
కుంభకర్ణు డదె సేనా శిబిరము గూరిమి వెడలుచు నున్నాడూ!
భృశ సంక్రుద్ధుండైన యాతడును భీమ బలంబున వానరులన్,
భక్షించుచు మఱి బరుగులెత్తుచును బల్లిదు డిటు రానుండె నికన్! 31

ఈ వానరులును కుంభకర్ణునీ యిపుడు జూడగనె వేగముగన్,
బరుగులెత్తుచును నాలుగు దిక్కుల పాఱిపోవుచును నుండి రదే!
అనిలో క్రుద్ధుండైన యాతనిని యలరి యెటుల వారింపుదురూ? 32

పైకి లేవదీయగ బడినట్టి బన్నుగ యిది యొక యంత్రమనీ!
మన వీరులకును దెలుపుట మంచిది మానుగ వారలు దెలిసికొనీ,
భయము వీడుదురు ధైర్యము నందీ బరగ రణంబును జేయుదురూ! 33

సుముఖోద్గతమును యుక్తియుక్తమును సురుచిర విభీషణుని బలుకుల్,
విని రఘువీరుడు రామచంద్రుడును వేగము సేనాపతియైనా,
నీలుని బిలిచీ యుక్తియుక్తముగ మేలిమి బలుకుల నిటు లనియెన్! 34

అగ్నితనయ! ఓ నీలుడ! వినుమా! యలరి నాదు వాక్యంబులనూ!
సమస్తమైనా సేన లన్నిటిని సరిగ మోహరింపుము నచటన్,
లంకాపురి వీధులను ద్వారముల వంకలు లేనీ వంతెనలన్,
ఆక్రమించి యుండుము శీఘ్రముగా యలసట, యలసత లేకుండన్! 35

పర్వత శిఖరములను వృక్షములను బన్నుగ యొక చోటికి జేర్చి,
వానరు లందఱు నాయుధములనూ వనర ధరించియు సిద్ధముగా
బండశిలల హస్తముల బుచ్చుకొని బన్నుగ నిలుతురు గాత! యటన్! 36

వానరశ్రేష్ఠుడు కపిసేనాపతి వనర బలీయుడు నీలుండున్,
రామునిజేతను సమాదిష్టుడై రామ కార్య పరతంత్రుడై,

వానర సేనలు దగు విధములుగా వనరగ యా యా స్థానములన్,
వ్యూహంబులుగా దీర్చి దిద్దెనూ యుదధి వోలె గనిపింపగనూ! 37

అటుపిమ్మట పర్వతముల వంటి యలరు గవాక్షుడు, శరభుండున్,
హనుమంతుడు మఱి యంగదుండునూ యలరు బర్వతపు శిఖరములన్,
హస్తములందున ధరించి బోయిరి నటగల ద్వారమునకు వేగన్! 38

జయింపబడిదా భయంబు గలిగిన జయము గూర్పగా రామునికిన్,
రాముని వాక్యములను కపి వీరులు రయమున వెడలిరి రణమునకున్,
శిలలజేత మఱి వృక్షంబులచే జితుక బొడిచిరీ శత్రువులన్! 39

అటుపిమ్మట వృక్షముల గిరులమా హస్తములందున ధరియించీ,
భయంకరంబగు నా హరిసైన్యము బర్వతమునకును సమీపమునన్,
అనుసరించి యుండిన యుగ్రంబగు నలరు మేఘరాశికి బోలెన్
ప్రకాశించు చుండెను హరి వాహిని భయంకరంబగు నాకృతినీ, 40

(యుద్ధకాండయందు 61వ సర్గము సమాప్తము)

   

# యుద్ధకాండము - మొదటి భాగము

## అరువది రెండవ సర్గము

(కుంభకర్ణుడు రావణుని భవనమునకు బోవుట— రామునివలన యేర్పడిన భయమును గూర్చి జెప్పి, రావణుడు నతనిని శత్రుసేనా వినాశనము జేయుమని కోరుట.)

విపులవిక్రముడు రాక్షసశ్రేష్ఠుడు వికట రూపమును గలవాడున్,
అట్టి కుంభకర్ణుండు వెడలెనూ యిట్టె సేవకులతో గూడన్,
నిద్రామదమున సమాకులుండై నిరతము దూగుచు నూగుచునూ,
రాజమార్గమున ప్రవేశించెనూ రమ్య గౌరవము నందుచునూ! 1

పరమ దుర్జయుడు! కుంభకర్ణుడును బరగ వేల రాక్షసులు మఱిన్
వెంబడింపగా, గృహముల నుండీ విమల పువ్వు వర్షంబులునూ,
వికీర్యమాణములగు చుండగ మఱి విమలాంజలులను గైకొనుచున్,
రాజమార్గమున బ్రయాణించెనూ రావణాసురుని గృహమునకున్! 2

హేమజాల వితతం బైనదియును భాను భాస్వరా దర్శనమున్!
విశాలమైనది, సుందరమైనది, వివిధ శిల్పములు గలదియునూ,
అట్టి రావణుని నివేశంబునూ యిట్టె కుంభకర్ణుడు గాంచెన్! 3

అభ్రజాలమున యల సూర్యుండును నలరి ప్రవేశించిన యటులన్!
కుంభకర్ణుడును రావణు గృహమున కూరిమి యటుల బ్రవేశించెన్,
దూరమునుండీ యాసనంబునను గూరిమి గూర్చొని యుండిన యా
అన్నగారయిన రావణాసురుని యల దేవేంద్రుడు దూరముగా
ఆసనమందున నా స్వయంభువుని యలరి జూచినటు దా జూచెన్! 4

రక్షో గణములతో గూడిన యా రాక్షసుండు బటు వేగముగా,
అన్నగారి గృహమునకును బోవుచు సన్నని నడకలు నడువకనూ,
తన పాదన్యాసంబుల జేతను దగ చలింప జేసెను ధరణిన్! 5

కుంభకర్ణుడును సోదరు గృహమును గూరిమితో నటు జేరుకొనీ,
వాకిలి లోనికి బ్రవేశించియును వనరగ పుష్పకమందుననూ,
గూర్చొని యున్నా, దిగులు జెందినా గురుని గాంచె, బ్రీతియు బొంగన్! 6

అటుబిమ్మట నా దశగ్రీవుండును నలరి వచ్చినా సోదరునీ,
కుంభకర్ణునీ గాంచి శీఘ్రముగ కూరిమి సంతోషించుచునూ,
సమీపంబునకు నాహ్వానించెను సాహసుదగు నా రావణుడున్! 7

అటుబిమ్మట యా మహాబలుండును నట్టి కుంభకర్ణుండు మఱిన్,
పర్యంకంబున నాశీనుండగు బరగ సోదరుని పాదములన్,
అంజలి ఘటించి నమస్కరించెను నటు బిమ్మట నాతండు మఱిన్,
'ఏమి జేయవలె?'నని ప్రశ్నించెను నిమ్ముగ దశగ్రీవుని యంతన్! 8

రావణుండు మఱి యెగిరి లేచియును రమ్యరీతి దన సోదరునీ,
కౌగలించుకొని యక్కున జేర్చెను కన్నుల భాష్పము రాలగనూ!
ఆవిధముగ తన సోదరు జేతను నటుల కౌగలింపగ బడియున్,
ఆవిధముగ యభినందన బొందిన యట్టి కుంభకర్ణుడు మఱిన్,
మంగళకరమగు వరాసనంబును మానుగ బొందెను నచ్చోటన్! 9

మహాబలముగల కుంభకర్ణుడును మానుగ యాసనమందుననూ,
కూరుచుండి కోపంబు వలననూ కూర్మి యరుణ నేత్రంబులతో!
అన్నయైన రావణుతో బలికెను నఖిల భూతములు వెఱగందన్! 10

అన్నా! నన్ను బ్రయత్నపూర్వకము యలరి లేపితివి యెందులకూ?
ఏకారణమున మేల్కొల్పితి విటు నిమ్ముగ నిదురను లేపితివీ?
ఎవనినుండి యాపద గలిగినదో యిపుడు దెలుపు బహువేగముగా!
ఎవని జంపి రావలెనో దెలుపుము నేఘన కార్యము జేయవలెన్? 11

ఆ రావణుడును గోపించిన యా యచట యున్న తన సోదరునీ!
కుంభకర్ణునీ గాంచి రావణుడు కుంభిని వణకగ క్రోధముతో,
బరివృత్తములగు నేత్రంబులతో బన్నుగ రావణు డిటు లనియెన్! 12

మహాబలా! ఓ కుంభకర్ణుడా, మానుగ బహు కాలము క్రితమే!
నిద్రించితివి నీవు హాయిగా భద్రముగా నీ శిబిరమునన్,
నిదురించిన మఱి నీకు దెలియదూ నిశ్చితముగ నా యాపదయున్,
రాముని వలనను గలిగిన భయమును రహి వానరుల భయంబు మఱిన్! 13

దశరథ రాజు కుమారుండును మఱి దగ బలశాలియు రాఘవుడున్,
సుగ్రీవునితో గూడి సంద్రమును సురుచిరముగ దాటియు వేగన్,
మన కులమును ఛేదించు చుండెనూ మానుగ తన శర జాలమునన్! 14

వానరవీరులు సేతువు జేతను వనరగ సుఖముగ యరుదెంచి,
లంకలోని యుద్యానవనములను శంకలేక మన వనములనూ!
వానర సముద్రమయముగ జేసెను వన్నెలాడు నా రాఘవుడున్!
అయ్యో! అయ్యో! చూడుము! చూడుము: నలరు లంక దీనస్థితినీ! 15

ముఖ్యులైన యేరాక్షస వీరులు మోదమునను బూర్వము గలరో!
వారందఱు నీ యుద్ధమునందున వనరగ వధింపబడిరి కటా!
రణమునందు నా వానరు లెవ్వరు రహి నశింపబడుటయు లేదూ!
యుద్ధమందునను బూర్వమెన్నడును బొలుపుగ రాక్షస వీరులునూ!
అపజయ మొందుట జూడలేదు మఱి యలరి వచ్చె యాపద మనకున్! 17

మహాబలా! ఓ కుంభకర్ణుడా! మఱి యీ భయంబు పుట్టినదీ!
ఈ విషయంబున మము రక్షింపుము నీశ్వరుండవే నీ విపుడున్!
నశింపజేయుము రామ లక్ష్మణుల నయముగ వానర వీరులనూ!
అందుకొఱకు నిను మేలుకొలిపితిని చందముగా రక్షింప మమున్! 18

ధనాగారమంతయు బూర్తిగనూ దగ్ధము గావింపగ బడియెన్,
ఇట్టి సమయమున నాదుకొనుము నను నీశ్వరు డెటుల దలంచెడినో!
బాలురు, వృద్ధులు మాత్రము మిగిలిరి బన్నుగ లంకా పురియందున్,
రక్షింపుము! లంకా నగరంబును రయమున నన్నును రాక్షసులన్! 19

మహాబాహువులు గలవాడా! మఱి మహాబలంబును గలవాడా!
సుదుష్కరంబగు కర్మము జేయము సోదరు కొఱకై పరంతపా!
సోదరుడా! పూర్వము నే నెన్నడు జొలుపుగ యితరుల నెవ్వరినీ
కోరి యుండగా లేదుగదా మఱి కోర్కె తెలియ జేయగలేదూ! 20

నీ యందున బహు స్నేహము సోదర! నిండు గారవము గలదు సుమా!
దేవాసురులకు సంబంధించిన ధీరుగ యుద్ధము లందుననూ!
అనేకమారులు నెదిరించితివి! యా దేవతలను నసురులనూ!
రణమునందునను నపజయ మెరుగవు రణ మార్తాండుడ వీవు సుమా! 21

భీమ పరాక్రమ! యా కారణమున భీమ పరాక్రమ మంతయుమా
చూపించెడి యా సమయ మొచ్చినది చూపుము నీదు బరాక్రమమున్
నీ దృశుండు బలవంతుడు జగతిని నిశ్చితముగ యే ప్రాణులలో
లేడుగదా మఱి వెదకి జూచినను లే డీ జగతిని నత్యముగన్! 22

యుద్ధ మందు నాస క్తియు గలిగిన యుద్ధతుడవు మఱి పరంతపా!
బంధువు లందున ప్రీతి గలిగినా బాంధవుడవు మఱి నీవు సుమా!
సోదర! నాకి ప్రియమును: హితమును శూరత నే విధి జేయదగున్
ఆ విధి జేయుము! నాదుకొనుము నను నాపద దప్పింపుము వేగన్!
మహా వాయువులు శరద్ఘ నంబును మానుగ యెగురగ గొట్టినటుల్
నీ తేజంబున శత్రు వాహినిని నిలిచి యెగుర గొట్టుము వేగన్! 28

(యుద్ధకాండమునందు 62వ సర్గము సమాప్తము)

* * *

# యుద్ధకాండము - మొదటిభాగము

## అఱువదిమూడవ సర్గము

[కుంభకర్ణుడు రావణుడు జేసిన చెడ్డ పనులకు అతనిని మొదట నిందించుట, తుదకు తన యుద్ధోత్సాహమును ప్రకటించుట]

రాక్షసేంద్రుడగు నా రావణుని రహి పరిదేవితములను వినీ,
కుంభకర్ణుడును నవ్వి బిగ్గఱగ కూరిమితో బలికెను నిటులన్! **1**

మంత్రవినిర్ణయ సమయము నందున మానుగ పూర్వము మన మపుడున్
ఏ దోషంబును యోచించితిమో యదియె నేడు సంప్రాప్తించెన్
హితుల మాటలను లక్ష్యముసేయక నీతి దప్పితిని యానాడున్
దానికి ఫలముగ యా యాపదయే దగ ప్రాప్తించెను నీ నాడున్! **2**

దుష్కృత కర్మలుడైన వానికిని దురంతములు నగు నరకములన్
బడుట యెటులనో యా విధముగనే పాపమైన యా కర్మలకున్
పాపఫలము సంప్రాప్తించినదీ బన్నుగ నే డీ సమయమునన్! **3**

మహారాజ! యీ కృత్యము గూర్చియు మానుగ యోచింపగ లేదూ!
ముందు వెనుకలను జూడకుండుటను మోస మొచ్చినది యీనాడున్!
వీర్య దర్పమున కార్యము వలనను వేగము వచ్చెడి ఫలములనూ
ఆలోచింపగ బడలేదు గదా! యలరి మిత్రులును జెప్పునదీ! **4**

ఐశ్వర్యంబున బలగర్వములను నిలరి పూర్వ కార్యంబులనూ
తరువాతను మఱి జేయునో యతడు దగ యుత్తర కార్యంబులనూ
పూర్వము జేయుచు నుండునో యతడు బొలుపుగ నీతిని దుర్నీతిన్
ఎఱుగడుగా మఱి యజ్ఞానంబున నెఱుగడు మద గర్వము జేతన్! **5**

దేశకాలములు ననుకూలముగను దీరుగ జూడక గర్వమునన్,
విపరీతములగు పనులు జేయునో విడివడి నీతిని దప్పి మఱిన్,
అపవిత్రుల హస్తములందున మఱి యలరి హవిస్సులు జెడు రీతిన్,
విపరీతములగు బనులకు గూడను విపరీత ఫలంబులు గలుగున్! **7**

ఎవడు మంత్రులను బరిశుద్ధముగా నిమ్ముగ యాలోచన జేసి,
మూడు విధములగు కర్మల తోడను మోదముతో దన కార్యములన్,
ఐదు విధములగు సాధనంబులను మది కోరికలను సాధించున్,
అతడే యుత్తమ నీతిమార్గమున యలరి యుండెడివాడు మఱిన్! 7

మంచి నీతి యందున్న భూవరుడు యంచితముగ శాస్త్రంబుననూ,
యున్నరీతిని నిర్ణయంబులను సన్నగ జేయును నిర్భయతన్,
తన బుద్ధిని మఱి యాలోచించును దగ మంత్రులతో, మిత్రులతో,
ఆలోచించిన పిదప కార్యముల యాచరించు సాదరముగనూ! 8

రాక్షసరాజా! పురుష డెప్పుడును రహి ధర్మార్థ సుకామములన్,
వేఱువేఱుగా గాని మఱియునూ విమలముగా నన్నిటిగానీ,
ధర్మార్థంబులు, ధర్మకామములు, అర్థ కామములు ద్వంద్వములన్,
మూడిండిని గానీ మఱి పురుషుడు మోదముగా సేవింపవలెన్,
కాలంబును మఱి యనుసరించుచును కల్మషమును లేకుండగనూ! 9

ధర్మార్థము మఱి కామంబులతో దగ యెది యే సమయమునందున్,
శ్రేష్ఠమైనదో దెలిసికొనవలయు శ్రీకరముగ యా రాజు మఱిన్,
అటుల దెలియనీ రాజుగాని మఱి యట్టి రాజ సదృశుడు ఇలన్,
చేసిన శాస్త్రాభ్యాసము వ్యర్థము జెడును సర్వకార్యంబులునూ! 10

రాక్షస శ్రేష్ఠుడ! రావణ వినుమా! రమ్యమైన నా వాక్యములన్,
దగ మంత్రులతో నాలోచించియు దానము, సామము, భేదంబున్,
దగు సమయంబున బరాక్రమంబును కర్మాంతంబోపాయములన్!
పంచ విధములగు సాధనంబులను బలమగు యోగమునను గూడి,
ధగ కాలంబును ననుసరించుచును ధర్మము, అర్థము, కామములన్,
సేవించెడి యా బుద్ధి మంతుడును స్థిర వ్యసనంబును నందడుగా! 11-12

రాజు కార్యముల యథార్థ రూపము రహి యెఱిగిన మంత్రులతోడన్,
సంప్రదించి యెటుజేసిన దనకును, సర్వజనులకు హితమగునో,
ఆలోచించియు రాచకార్యములు ననుసరింపవలయును జగతిన్! 13

ఆలోచనలను రాజు మంత్రులకు నవకాశంబును నిచ్చినచో,
పశుబుద్ధులునగు మంత్రులట్టి యెడ బరగ శాస్త్ర విషయంబులనూ!
అనభిజ్ఞులునై ప్రాగల్భ్యంబున యలరి దెలిపెదరు నేమేమో!
ముఖస్తుతులతో కాలము గడుపుచు ముంగిట యాపద దెచ్చెదరూ! **14**

అశాస్త్ర విదుషులు, నర్థశాస్త్రమును నలరి డెలియనీ వారు మఱిన్,
అధికమైన యైశ్వర్యము మాత్రము నలరి కోరుచుండెడి వారున్,
అట్టివారి యభిమతమును నెప్పుడు నలరి జేయగా రాదు సుమా! **15**

ఏ మనుష్యు లిల హితాకారమున యిమ్ముగ యహితంబులను మఱిన్,
మొండిగ యుపదేశము జేయుదురో మునుముందుగ వారిని వేగన్,
కార్యాలోచననుండి దూరముగ కడకు ద్రోయవలె వేగమునన్!
అట్టివారు రాజుల కార్యములను నిట్టె ధ్వంసమును జేయుదురూ! **16**

మంత్రులు గొందఱు బండితులైనా మానుగ శత్రుల గలియుచునూ!
తమ ప్రభువునకు వినాశము జేయగ దగ వర్తింతురు దుష్టతనూ!
అతనిచేత విపరీత కార్యములు నలరి ప్రేరణను జేయుదురూ! **17**

మంత్రులనుండీ యుపసంహితముల యలరి బుచ్చుకొని మారుదురూ!
మిత్రులవలె మఱి కనబడుచుందురు శత్రుల వలె భావింపవలెన్!
మంత్ర నిర్ణయము నందున రాజును మానుగ వారి ప్రవర్తననూ!
అనుసరించి గుర్తింపగ వలెనూ యలరి పరీక్షను జేయవలెన్! **18**

రాజు చపలుడై తొందర బడుచును నయముగ జేసిన కార్యములన్,
లోపంబుల మఱి దెలిసికొందురూ పాప మనక శత్రువులు మఱిన్,
క్రౌంచపర్వతపు రంధ్రములోపల యంచితముగ మఱి పక్షులునూ!
ప్రవేశించినటు శత్రువులును మఱి ప్రవేశింత్రు రాజ్యము నందున్! **19**

ఎవడు శత్రువును ననాదరంబున నిమ్ముగ నుండునా తనను మఱిన్
దన రాజ్యంబును రక్షణసేయక దగ యుండునా నిర్లక్ష్యముగన్,
అనర్థంబులను నాతడు బొందును నది నిజంబుగద లోకమునన్!
స్థానము నుండియు దింపి వేయుదురు సర్వసంపదలు ధ్వంసమగున్! **20**

నీకు పూర్వమున విభీషణుండును నీతి గఱపినటు జేయు మికన్,
ఆతడు దెలిపిన నీతివాక్యమే యవధార్యము మన కందఱికిన్,
అటుల గానిచో నేదియిష్టమో! నదియే జేయుము సహోదరా! 21

ఆ దశగ్రీవుడు కుంభకర్ణునీ యావచనములను వినియు మఱిన్
భ్రుకుటిని విరిచెను గోపము జెందెను బొలుపుగ యీరీతిని బలికెన్! 22

గౌరవింపదగు నాచార్యునివలె గడగి నాకు నుపదేశంబున్,
జేయుచుంటివీ! యిది మఱి దగునా ఛీ! నీయన్నను రాజును నే!
ఇట్టి వాక్యప్రియయు యెందులకో మఱి యిక నాపుము! నీ వచనమ్ములన్,
ఈ సమయంబున యేది యుక్తమో యిమ్ముగ యది సేయుము వేగన్! 23

భ్రాంతి వలననో, చిత్తమోహమున బరాక్రమంబును జూచికొనో!
బాహుబలంబును జూచికొనో మఱి బరగ జేసితిని యానాడున్!
తెలియక జేసిన దానిని గూరిచి దీరుగ చర్చించుట యేలా?
ఈ సమయంబున యేది యుక్తమో యిమ్ముగ యది సేయుము వేగన్! 24

ఈ సమయంబున యేది యుక్తమో యిమ్ముగ యది యోచింప వలెన్,
గడిచిపోయినా దానిని గూరిచి గడగి బుద్ధిమంతులు నెపుడున్,
ఆలోచింపరు 'గతం గతము' గద! యాలోచింపుము బ్రస్తుతమున్! 25

నా యందున మఱి స్నేహమున్నచో నయముగ నీ కెంతటి బలమున్,
బరాక్రమం బున్నదొ మఱి దెలిసిన బన్నుగ నా కార్యంబు మఱిన్,
జేయగదగినది యని హృదయంబున స్థిరముగ భావన జేసినచో,
నా పొరపాటున గలిగిన దుఃఖము నయముగ నీ విక్రమముననూ!
సరిజేయుము దానిని శీఘ్రముగా దాపనేల యీ విషయంబున్! 26

విపన్నార్థుడగు దీనమానవుని వేగ యాదుకొనువాడు సుమా!
స్నేహితుండు నని యనబడు మిక్కిలి స్నేహితుండు నీ లోకములో
నీతిని దప్పిన వానికి సాయము నిశ్చయముగ మఱి జేయుటకున్,
ముందున కొచ్చినవాడు సుమా! ధర ముదమున కీర్తింపగ బడునూ! 27

అటుదిమ్మట యా కుంభకర్ణుడును నా రావణుడును దారుణమున్,
భయంకరంబగు బలుకులు బలుకుట బన్నుగ విని యా మీదటనూ!
కోపించినవాడని మది తెలిసీ కోమలముగ బహు నెమ్మదిగా,
మెల్లమెల్లగా నీ విధి బలికెను మృదు వచనములను మధురముగా! 28

సోదరుండయిన యా రావణుడును క్షుభితేంద్రియుడై యున్నటులన్,
మదిలో గ్రహించి కుంభకర్ణుడును మానుగ యతనికి ధైర్యమునూ,
ఓదార్చుచు బహు మెల్లన బలికెను సాదరముగ మృదు భాషణలన్! 29

అరిందమా! ఓ రాక్షసరాజా! యలరి వినుము నా వాక్యములన్,
సంతాపంబును బొందితి విప్పుడు చాలు నింక పరితాపంబున్!
మనసునందు రోషంబును విడిచీ మానుగ స్వస్థుడవును గమ్మా! 30-31

రాక్షసేంద్ర! నే నీ ధరణిని మఱి రహి జీవించియు యుండగనూ!
నీవు మనస్సున నీరసబడకుము! నిఖిలంబును సాధించెద నే!
ఎవని నిమిత్తము బరితాపంబును నిమ్ముగ బొందుచు నున్నావో!
అతనిని నేను నశింప జేసెదను యానవాలు లేకుండగనూ! 32

పార్థివ! నీవును నెట్టి యవస్థను బన్నుగ యుండినగూడ మఱిన్,
నీకు హితంబును జెప్పగవలయును నీకు నేను సోదరుడ మఱిన్,
అందుచేత బంధుత్వము వలనను జిందెడి సోదర ప్రేమ మఱిన్,
హితము జెప్పబడినది నా జేతను నీతియుక్తమగు వచనములన్! 33

ఇట్టి కాలమున బంధువు జేతను నిమ్ముగ స్నేహము జేత మఱిన్,
రణరంగమునందున యే విధమగు రహి శత్రువుల వినాశనమున్,
జేయవలయునో యట్టి కార్యమును జేసెద జూడుము! దశాననా! 34

మహాబాహు! ఓ దశాననా! విను! మానుగ రణాగ్ర భాగమునన్,
శ్రీరాముడు సౌమిత్రిని గూడుక శ్రీకరముగ స్వర్గము నేగున్,
వానరసేనయు జారి పోవునూ! వనరగ సముద్రమును దాటీ,
నా ప్రతాపమును జూడుము సోదర! నయముగ రణరంగము నందున్! 35

మహాబాహూ! రణరంగము నుండీ మానుగ రాముని శిరస్సునూ,
దెచ్చెద సుమ్మా! దానిని గాంచీ దీరుగ సంతోషింపుము నేడున్!
సీత దుఃఖమును బొందును గాతను! స్థిరముగ నా వచనము నిజమూ! 36

లంకలోని యే రాక్షసులందఱు శంకలేక తమ బంధువులన్,
గోలుపోయిరో, వారందఱునూ గూరిమి శ్రీరాముని శిరమున్,
సుమహత్ప్రియముగ రాముని మరణము సురుచిరముగ గాంతురు గాతన్! 37

రాక్షస రాజా! యా రాఘవుడును రహి నను వధించు ముందుగనూ!
ఆ పిమ్మట మఱి నిన్ను వధించును నంత భయము నీకెందులకూ?
నాకు నా విషయ మందే మాత్రము నయముగ దుఃఖము లేదు గదా! 38

అరిందమా! ఓ యతులవిక్రమా! యలరి యిపుడు గూడను నన్నున్,
నీ యిష్టము వచ్చిన రీతిగనూ నిర్ణయింపు నీ యాజ్ఞలనూ
రణరంగమునకు బంపుట కొఱకై రయమున మఱి యొక్కని కొఱకై
వెదుకగ వలసిన పనిలేదు గదా! వెదలెద నే నీ సమయమునన్! 39

మహాబలము గల నీ శత్రువులను మానుగ నశింప జేసెదనూ!
శక్రుడైననూ యముడైనను మఱి విక్రముడగు వాయువు నుఱియున్
కుబేరుడైనను వరుణ పావకులు గూరిమి యందఱి తోడుతనూ
రణరంగంబున యుద్ధము జేయుదు రయమున వారల నోడింతున్! 40

ఈ దినమున రణరంగము నందున యిమ్ముగ వైరిని వధియించి,
స్వబంధు మరణముచే దుఃఖించెడి శోక పరీతుల రాక్షసులన్,
ఓదార్చెద! కన్నీళుల దుడిచెద యొప్పుగ సాంత్వన వాక్యములన్! 41

సూర్యునితో గూడిన మేఘమువలె సురుచిర పర్వత సదృశుడున్,
వానరరాజగు నా సుగ్రీవుని వసరగ సమరము నందుననూ,
నేలమీద బడవేయుదు జూడుము! నిఖిల భూతములు గనుగొనగన్ 42

అనఘా! విను! ఓ రాక్షసేంద్రుడా! యలరి మాదు వాక్యంబులనూ!
ఆ దాశరథిని యనిలో మేమును నంతము జేసెద మని యనుచున్!

ఈ రాక్షసులును, నేను మిక్కుటము నిమ్మగ ధైర్యము దెలుపంగన్,
ఎందు కిప్పు డిటు వ్యధను జెందెదవు? జిందుము! దీరత, శౌర్యమునూ! 43

గిరిమాత్ర శరీరము గలవాడను కెప్పన కేకిడు వాడను నే,
శూలము ధరించు వాడను నేనును సూది కోఱలును గలవాడన్!
నన్ను గాంచి యా మహేంద్రుండునూ నయముగ భీతిల్లును ననిలో!
రణమునందు మఱి నా సరి యెవ్వరు రాదు గదా! రాక్షసరాజా! 44

ఆయుధములు నే పిడిచియు గూడను నలరి బలముచే శత్రువులన్,
మర్దించుచు నే నుండగా మఱియు మానుగ నిలిచియు నా యెదుటన్!
జీవింపగ దలచిన వాడెవ్వడు భావింపడు నను నెదిరింపన్! 45

శక్రవైరి నే కోపించినచో శక్తిగాని, మఱి గదగానీ,
ఖడ్గముగానీ నిశిత శరములను గాంక్షింపను నుపయోగింపన్!
చేతుల తోడను నింద్రుని గూడను శీఘ్రము వధింపగలను సుమా! 46

ఈ దినమున యా రామచంద్రుడును నిమ్మగ నా పిడికిలి పోటున్,
సహించి మఱి జీవించినట్లయిన సరసత యా సమయమునందున్,
నా బాణంబులు రాముని రక్తము నయముగ ద్రావును నిజముగనూ! 47

రాక్షస రాజా! నేనుండగ మఱి రహి చింతింపగ పనియేలా?
బాధ యెందులకు? భయమెందులకూ? బరగ పోయెదను రణమునకున్!
నీ శత్రువులను దునుముట కొఱకై నిలిచి రణము జేయుట కొఱకున్,
సిద్ధముగా నుంటిని రాజేంద్రా! స్థిర విజయంబును సాధింపన్! 48

రామునినుండీ ఘోర భయంబును నయముగ వీడుము! దశాననా!
యుద్ధమునందున రామలక్ష్మణుల యుద్ధతుడగు నా సుగ్రీవున్
ఎవని చేత యీలంక కాల్చబడి యిమ్మగ యనేక రాక్షసులన్,
వధించెనో మఱి యట్టి మారుతిని వసరగ జంపెద రణమందున్! 49

సముపస్థితమగు నీ యుద్ధంబున సరగున వానర వీరులనూ!
భక్షించెద! నీకును యనంతమగు వసర యశంబును సమకూర్తున్! 51

మహారాజ! యింద్రుని వలనను మఱి మానుగ స్వయంభువుని వలనన్,
భయముగలుగునో దీర్చి వేసెదను బాధనంతయుడు దొలగింతున్!
విశి సంబంధమునగు దమన్నునూ నిర్మలమగు రవి ప్రభలవలెన్,
నశింపజేసెద, నే గోపించిన నయముగ దేవతలను గూడన్!
మహీతలమునను భయనింతురు మఱి మానుగ వాదు భయంబుననూ! 52

కాలయముని గాంతింపజేసెదను గడగి పావకుని భక్షింతున్,
నక్షత్రంబులతో గూడిన సూర్యుని నయముగ నేలను బడవైతున్! 53

వనరగ యింద్రుని వధించి వేసెద వరుణాలయమును ద్రావెదనూ!
పర్వతంబులను జూర్ణము జేసెద బన్నుగ ధరణిని జీల్చెదనూ! 54

అన్నివైపులను భక్షింపగ బడు నఖిల భూతములు నీ నాడున్,
దీర్ఘకాలమును నిద్రించిన యా దీరుగ బలవంతుండు నగూ!
కుంభకర్ణునీ పరాక్రమంబును గూరిమి వీక్షించెడు గాతన్!
సర్వదివంబును నాహారమునకు సరిపోదుగదా నాకు మఱిన్! 55-56

దశరథ రాముని వధచే నీకును సుఖావహంబగు సుఖములనూ!
సంపాదించుటకై రణమునకును సరసత బోవుచు నున్నాడన్!
లక్ష్మణ సహితుండైన రామునీ లలి వధింతు రణమందుననూ!
వానర సైన్యములోని ముఖ్యులను వరుసగ భక్షింతును నేడున్! 57

రాక్షసరాజా! క్రీడింపుము నిక రమ్య వారుణిని ద్రాగు మికన్,
దుఃఖంబులనూ దొలగించుకునీ దూరము నుండుము భయమునకున్!
చేయగవలసిన సర్వకార్యముల జేసికొనుము బహుశాంతముగన్!
ఈనాడే నాచేత రాముడును నిమ్ముగ యమక్షయమునకు జనున్!
పంపిన పిమ్మట చిరకాలమునకు కంపితయై యా సీతయునూ,
వశురాలగు ఓ లంకాధిపతీ! వనరగ నీ కోర్కెయు దీరున్! 58

(యుద్ధకాండమునందు 63వ సర్గము సమాప్తము)

## యుద్ధకాండము - మొదటి భాగము

### (అరువది నాలుగవ సర్గము)

(మహోదరుడు కుంభకర్ణుని మాటకాదని యుద్ధము జేయకుండరనే యిష్టమైన విషయమును సాధించుటకు ఉపాయము జెప్పుట)

అతికాయంబును బలవంతుండును నతి ధృఢ బాహువులును గలిగీ,
ప్రకాశించు నా కుంభకర్ణునీ బరగ వచనముల వినియు మఱిన్,
మహోదరుండును బలికె నిట్టులను మానుగ యా రాక్షసుతోడన్! 1

కుంభకర్ణుడా! సత్కులం మందున కూరిమి జన్మించితిని మఱిన్!
అయినను మూర్ఖత్వమువలనను నిట నలరుచు సామాన్యులకి వలెన్!
ఆలోచనలను జేయుచుంటివీ యలరి మదంబును గూడికొనీ,
ఎచట యేమి మఱి జేయగవలెనో యిమ్ముగ తెలియక నుంటివిగా! 2

కుంభకర్ణుడా! నయా నయంబులు గూరిమి రాజుకు దెలియునులే!
ఇంత మాత్రమును ప్రభువుకు దెలియద? యింత రాజ్యమేలుచు నుండన్,
కాని నీవు బాల్యంబు జేతనూ గల మూర్ఖత్వము జేత మఱిన్,
ఏదో మాటందగ పలయుననీ యిటుల మాటలాడితివి యిటన్! 3

దేశకాలముల విభాగంబునూ దీరుగ రాక్షసరాజు మఱిన్,
ఎఱిగిన వాడును తన స్థానంబును నిమ్ముగ యితరుల స్థానంబున్,
వృద్ధిని హానిని యితరంబుల మఱి వివరముగా నెఱిగిన వాడున్! 4

వృద్ధుల సేవను జేయని వాడును బన్నుగ ప్రాకృత బుద్ధియునూ!
ఎంతటి బలవంతుండు నైననూ యే కార్యంబును జేయనటుల్!
అట్టికార్యమును యే మానవుడును నిట్టె జేయుటకు యత్నించున్? 5

ధర్మము! అర్ధము, కామంబులకును దగ పృథగాశ్రయములు ననుచున్
మాటలాడుచుంటివి మఱి నీవును మానుగ వాని స్వరూపంబున్,
స్పష్టముగా మఱి దెలిసికొనుటకును సరి లక్షణమును లేదుగదా! 6

సుఖ దుఃఖాదీ రూపములైనా సురుచిర ఫలముల కన్నిటికీ,
కర్మయేగదా పరమసాధనము కర్మల వలనను ఫలితముల్!
అయితే యొక్కొకమాఱు నేర్పడును నలరు పాప కర్మంబులకున్,
శ్రేయస్సులు మఱి గలుగుచు నుండును స్థిరమగు యుత్తమ ఫలములునూ! 7

ధర్మార్థములకు గొఱకు జేసెడీ దగ కర్మలు మఱి యధర్మమున్,
యనర్థములకును సాధనమైనా యలరెడి కర్మలుగూడ మఱిన్!
శ్రేయస్సును గలిగించుచుండునూ స్థిరముగ ప్రాణుల కెల్లపుడున్!
కానీ యధర్మ యనర్థంబులకు గదగి జేయు కర్మంబులునూ,
వ్యతిరేక ఫలంబులు గలిగించును ప్రత్యవాయమును గలిగించున్! 8

పురుషులు కామముతోని గూడికొని పొలుపుగ యిహలోకంబునకున్,
బరలోకమునకు సంబంధించిన బరగ కర్మలను జేయుదురూ!
కామము నవలంబించెడి వారును కల్యాణపు గుణములనైనా
కర్మఫలములను బొందుచు నుండురు గడు విశేషము లేదిందున్! 9

ధర్మమునకు శ్రేయస్సులు ఫలమూ, దగ యధర్మమున దుఃఖాదే,
ఫలమని నియమం బేమియులేదూ బన్నుగ బాగుగ చింతింపన్,
కామంబే మఱి దుఃఖహేతువను గదగి నియమ మేమియు లేదూ!
కావున మన రాజయిన రావణుడు గదగి మదిని నిర్ణయముననూ,
ఆపని జేసెను, మనముగూడ మఱి యిమ్ముగ సమ్మతి దెలిపితిమా!
ఇపుడు వైరి విషయంబున మనమును యే సాహసమును జేయవలెన్?
ఏ లోపంబును దీర్పగ వలయును నిమ్ముగ వివరింపుము నాకున్! 10

నీ వొక్కడవే శత్రువు మీదికి నిక్కముగా దండెత్తి మఱిన్,
వెళ్ళుట యందును నే హేతువులను వికటముగా మఱి దెలిపితివో!
దానియందునూ యుక్తము కానిది దగ యసాధువైనది మఱియున్,
అంశంబును చే దెలియజెప్పెదను సంశయంబు లేకింతయునూ! 11

పూర్వమందునను జనస్థానంబున బొలుపుగ బలవంతులునైనా,
చాలమంది రాక్షసులను జంపెను చయ్యన యలసట లేకుండన్!

అట్టి రామునీ నీవొక్కడవును నెట్లు రణంబున గెలిచెదవో,
నిక్కముగా వివరింపుము నాకును నక్కజ మింతయు లేకుండన్! 1

పూర్వకాలమున జనస్థానంబున బొలుపుగ యోడింపగనుబడి!
మహాతేజమును గలవారైనా మానుగ రాక్షసు లందఱునూ!
భయభ్రాంతులై లంకాపురినీ బన్నుగ నుండిరి వసించుచున్,
అట్టి కాందిశీకులను నీవునూ గట్టిగ దిలకించుట లేదా? 1:

కోపించిన సింహంబును వోలెను క్రోధపూరితుడు నగువానిన్,
దశరథాత్మజుడు నా శ్రీరాముని దగ నిద్రించెడి సర్వముగన్
తెలిసికూడ మఱి మేలుకొలుపుటకు దీరుగ గోరుచు నున్నావూ! 1·

నిత్యంబును తేజస్సుల తోడను నిండియుండు శ్రీరాఘవుడున్,
కోపము వచ్చిన యెవ్వరైననూ కూరిమి యెదిరింపగలేరూ!
మృత్యుదేవతకు వలె నాతండును మీరిన రణరంగమునందున్,
సహింపశక్యము గాని వాడతడు సకల విద్యలను జతురుండున్,
అట్టి రామునీ యెవరీ జగతిని గట్టిగ యెదిరింపగ గలరూ? 1:

ఒక్కడవే శత్రువు నెదుర్కొనుట చిక్కదు మనకును విజయంబున్,
సర్వము సంశయమై నేడున్నది సారహీనమగు నీ లంకన్,
నీ వొక్కడవే యనికిని బోవుట నిక్కముగా నది సరికాదూ!
నాకు మాత్రమిది యిష్టముగాదూ! నయముగ బలుకుచు నుంటి నిదే! 16

క్షీణించిన బలమును గలవాడును జీవితేచ్ఛ విడనాడుచునూ!
బలవంతుండగు నా శత్రువును ప్రాకృతి మానవునికి వోలెన్!
వశముజేసికొన బ్రయత్నించు నా వలనకాని కార్యంబులనూ! 17

రాక్షసోత్తమా! కుంభకర్ణుడా! రామునీ సదృశుడగు వాడున్,
మనుష్యలందున లేడు సుమా మఱి మహావీరు డాతడు వినుమా!
ఇంద్ర వివస్వులతోని తుల్యుడును సాంద్ర వీరబల సంపదయున్,
గలవాతడు నెటుల నతనితో గడగి నిలిచి పోరాడెదవూ, 18

మహోదరుడు నా కుంభకర్ణుతో మానుగ రాక్షసులకు మధ్యన్
మిగుల త్వరితముగ నటుల బలికి మఱి మిగుల చతురతను జూపుచునూ
లోక కంటకుడు రావణుతోడను లోలత యీరీతిని బలికెన్! 19

ఎదురుగ వైదేహిని జూచుచును నెందుల కీ యాలస్యంబున్
జేయుచుంటివీ రాక్షసేంద్ర విను! శీఘ్రము మది భావించినచో
సీత నీ వశము కాగలదు సుమా! చిరకోరిక నీకును దీరున్! 20

సీత నీ వశము నగుటకు రాజా! సరసత నా కొక ఉపాయమున్
మదిలో దోచెను మెఱుపు దీగె వలె మానుగ దెలిపెద నీకు మఱిన్
ఇష్టమైనచో జేయుము దానిని కష్టముగా దది జేయగనూ! 21

రాక్షసేంద్ర, నేనును ద్విజిహ్వుడును రయమున వితర్దనుండు మఱిన్
కుంభకర్ణుడును, సంహ్రాదీ యును గూరిమి యీట్లైదుగురు మఱిన్
రాముని జంపుట కొఱకై వేగము రణమున కేగుచునున్నారూ!
అని చాటింపుము లంకాపురిలో నందఱు వినగా సీతయునూ! 22

అటుబిమ్మట మే మైదుగురమునూ యనికి బోయి శ్రీరామునితో,
యత్నపూర్వకము రణమును జేసీ యలరి జయించెద మాతనినీ,
నీ శత్రువులను జయించినను మఱి నిఖిలము మనకును వశనుగునూ
ఉపాయములతో బనిలే దింకను సురుతర ప్రయత్నముల తోడన్! 23

అటులగాక మనశత్రువు రాముడు నలరి జీవమున యుండినచో
యుద్ధముజేసిన మేము మనస్సున యలరి యోచనల విధముగనూ!
అలరి సేసెదము మాయాజాలము నందఱు నాశ్చర్యము జెందన్, 24

అటుబిమ్మట మేమైదుగురమునూ నల రామాంకిత బాణములన్
శరములచేతను మా శరీరముల, సరసత జీల్చికొనీ మఱియున్
రక్తముచేతను శరీరమంతయు రహి సముక్షితమునై మేమూన్
యుద్ధరంగమున నుండి వేగముగ యొద్దికగా నిట కొచ్చెదమూ! 25

మాచేతను నా రామలక్ష్మణులు మానుగ భక్షింపగ బడిరీ
అనుచు బలికి నీ పాద ములకును నలరి మ్రొక్కెదము లంకేశా!
ఆవుడు మాకు దగు బహుమతులిచ్చి యాదరింపు మన్నన తోడన్! 26

అటుబిమ్మట ఓ రాక్షసేంద్ర విసు! నలరు నాదు నాలోచననూ!
అలరాముడు దన సైన్యము దోడను నలరు భ్రాత లక్ష్మణుతోడన్,
చంపబడెను రణమందు ననుచునూ సొంపుగ లంకాపురి యంతన్
గజస్కంధమును నెక్కించియు మఱి కడు బలవంతుని తోడుతనూ
చాటింపుము మఱి మూల మూలలను చయ్యన సీతయు విను నటులన్ 27

అరిందమా! ఓ రాక్షసేంద్ర విను నటు బిమ్మట నీవును మఱియున్
అలరి సంతసముతో నున్నట్టుల అభినయింపుమూ దశాననా!
భృత్యులందఱికి భోగంబులనూ యతి కామములను ధనంబులన్
పారితోషికముల మఱి యిప్పింపుము బన్నుగ యందఱు నమ్మగనూ! 28

అటుబిమ్మట మాల్యములు వస్త్రములు అల పీరులు దేహంబునకున్
అనులేపనములు నిమ్ము నధికముగ యలరి యోధులకు బహుమతులన్
ఆనందముతో నీవు గూడ మఱి నలఱి ద్రాగుమూ! మద్యమునూ! 29

లక్ష్మణ సహితుండైన రామునీ భీషణమగు యుద్ధము నందున్
దగ రాక్షసులును భక్షించిరి యని రహి యీ సంగతి యంతటనూ!
వ్యాపించిన బిమ్మట మఱి నీవును వనరగ జానకి దరిజేరీ
యోదార్చుము మఱి రహస్యముగనూ, యొప్పుగ బ్రతిమాలుము నామెన్!
ధన ధాన్యములను కామంబులచే దగ రత్నంబుల జూపి మఱిన్
ప్రలోభపెట్టుము భ్రాంతి నొందగా బన్నుగ నీకును వశమగునూ! 30-31

రాక్షసేంద్ర! కపటోపాయంబున రమణి సీత భ్రాంతిని జెందున్,
భయ శోకంబుల జేత గూడికొని బన్నుగ జానకి చింతిలుచున్,
నష్టనాథనని, మది భావించుచు నిష్టము లేకుండిన గూడన్,
నీ వశమగునూ! నిరాశ తోడను నీదు గోరికయు దీరు నికన్! 32

రమణీయుండగు రామచంద్రుడును రహి మరణించిన యట్లు మదిన్,
దెలిసికొనిన యా సీతాదేవియు దీరుగ విరాళ వశురాలై
స్త్రీసహజంబగు లఘుత్వంబునను స్థిరముగ త్వద్వశమగున్ మఱిన్ 33

సీత పూర్వమున సుఖముగ పెరిగెను స్థిరముగ సుఖింప దగినదియున్,
కానీ ప్రస్తుత మా జానకియును గడు వేదనల గృశించినదీ!
అట్టి సీత తన సుఖమంతయునూ యిట్టె నీపయిని యున్నదనీ,
మనసున గ్రహించి మన్నన తోడుత మానుగ నిను జేరగ గలదూ! 34

ఇదియంతయు నా యాలోచనచే మది నిర్ణయమును జేసితినీ!
శ్రీరాముని దర్శించినచో మఱి స్థిర యనర్థమును జరుగుగదా!
రణము జేయకుండగనే నీకును రమ్య సుఖంబులు సిద్ధించున్,
విచారింపకుము! వేదన మానుము విమల సుఖము గలుగును గాతన్! 35

అనష్ట సైన్యము గలిగినవాడై యని సంశయ మింతయు లేకన్,
యుద్ధంబనునది లేకుండగనే యుద్ధతులగు మఱి శత్రువులన్!
జయించుచుండెడి మహీపతిని గని జయమును బలుకును ప్రజాళియున్,
ఆరాజునకును గొప్ప యశస్సును నలరు పుణ్య యైశ్వర్యంబున్!
మనస్సునకు మఱి ప్రసన్నత్వమును మఱి జేకూరును రూఢిగనూ! 36

(యుద్ధకాండములోని 64 వ సర్గము సమాప్తము)

  

# యుద్ధకాండము - మొదటి భాగము

## అ ఱు వ ది ఐ ద వ స ర్గ ము

(కుంభకర్ణుడు యుద్ధమునకు బయలుదేరుట).

కుంభకర్ణుడును మహోదరుని యా కుటిలపు వచనములను వినియున్,
ఆతని మిక్కిలి భయబెట్టుచునూ యటు బిమ్మట దన యన్నయునూ!
రాక్షసేంద్రుడగు దశగ్రీవునితో రయమున యీ రీతిని బలికెన్! 1

దుర్మాతుడగు నా రాముని జంపీ దూరము జేసెద నీ భయమున్,
మనసున నున్నా వేదన నంతయు మాయము జేసెద జూడు మికన్,
వైరము లేకను సుఖమున నుండుము వనరగ లంకను నేలుచునూ! 2

తమను దాము మఱి బొగడుకొనుటయును దగ శూరులు వాంఛింపరుగా!
పైకి నలుగురిక దెలుపకుండగనె బన్నుగ ఘన కార్యంబులనూ!
జేయుచుండెదరు విక్రమంబునను చిరకాలము గీర్తింపగన్! 3

నిర్జలంబులగు దోయదముల వలె నిక్కము శూరులు వ్యర్థముగా
గర్జింపరుగా సకల కార్యములు సావధానముగ జేయుదురూ!
రణమున విజయము సాధించియు మఱి రహి జేసెద నే గర్జనలన్! 4

మహోదరా! నీ పలికెడి పలుకులు మానుగ కలతను గలవారున్,
అబుద్ధిమంతులు, బండితులము నని యభిమానముగల వారికినీ,
అట్టి రాజులకు నిష్టమగును మఱి నిట్టి మరెవ్వరు మెచ్చ రిలన్! 5

మీరందఱునూ యుద్ధమునందున మిగుల పిరికి వారలు సుమ్మా!
ఎల్లప్పుడు ప్రియములను బలుకుచును నుల్లము సంతసమును బఱచీ!
అనుసరించుచును నుందురు మీరలు నాశ గలిగి స్వార్థంబుననూ,
అట్టి మీరు నీకార్యము నంతయు గట్టిగ నశింప జేసిరిగా! 6

ధనాగారమును క్షీణించినదీ దగ సైన్యంబును నశియించెన్,
మాత్రము స్నేహితు లుండిరి పెద్ద గారవము లేదుగదా!

పేరుకు లంకకు రాజు మాత్రమే పెను సంపదలును లేవుగదా!
మీరందఱునూ కపట నీతిచే మీరిటు జేసిరి యీ లంకన్! 7

అన్నా! రావణ! నేను ప్రస్తుతము నల రాముని నిర్జించుటకై,
బోవుచుంటినీ సన్నద్ధుడనై బన్నుగ శత్రుల మర్దింపన్!
మీరు జేసినా దుష్ట నీతినే మిగులకుండ సరిదిద్దెదనూ!
యుద్ధంబునకును బోవుచుంటినీ యుద్ధభయము నాకును లేదూ! 8

బుద్ధిమంతుడగు కుంభకర్ణునీ పొలుపగు వాక్యంబులను వినీ,
రాక్షసరాజగు రావణాసురుడు రయమున నవ్వుచు నిటు లనియెన్, 9

యుద్ధ విశారద! తండ్రీ! వినుమా! సిద్ధము నా పలుకులు వినుమా!
ఈ మహోదరుడు నా రామునికిని యిమ్ముగ భయపడుచుండె నిటన్!
సందేహం బింతయు లేదు సుమా! సరసమైన నీ వాక్యములన్,
అందుచేతనే రణము జేయుటను చందముగా నిష్టము లేదూ! 10

కుంభకర్ణుడా! తమ్ముడ వినుమా! కూరిమి నా ప్రియ వాక్యములన్!
స్నేహము జేతను బలముచేత మఱి స్థిరుడు; సమానుడు లేడుసుమా!
శత్రువులగు నా రామలక్ష్మణుల సంహరింపుమా వేగముగన్,
లంకకు విజయము సాధింపుము నిక శంకలేక మన వారలకున్, 11

నిదురించెడి నిను నిదుర లేపితిని నీరసమును మఱి బొందకుమా!
శత్రువులను మఱి సంహరించుటకు మిత్రమ! నిదురను లేపితినీ!
శత్రుమర్దనా! కుంభకర్ణ! విను! సరసత యీసమయంబు మఱిన్
రాక్షసులకు శుభకర సమయంబిది రహి యుద్ధంబును జేయుటకున్!

అందువలన శూలమును ధరించియు నలరి పాశమును హస్తమునన్
యున్న యమునికిని వలె శీఘ్రముగా గన్నుల నిప్పులు గురియంగన్,
ఆ వానరులను నలరి వధింపుము నా సుగ్రీవుని గూడ మఱిన్,
ఆదిత్యుని తేజస్సు గలిగినా యా రాజొమరుల శిక్షింపూ! 13

నీ రూపంబు సమాలోకించియు నిఖిల వానరులు వేవేంటన్,
బరుగులు దీతురు దిక్కులు దిశలును వెరతురు భయభీతిని జెందీ!
రామలక్ష్మణుల గుండెలు గూడను రయముగ బ్రద్దలు నగును సుమా! 14

మహాతేజమును గల రావణుడును మహా బలంబును గలిగిన యా
కుంభకర్ణుతో నటులను బలికీ కూరిమి. మౌనముతో నుండెన్!
తనను మఱల బుట్టిన వానినిగా దగ భావించెను రావణుడున్! 15

కుంభకర్ణునీ బల విక్రమములు గూరిమి దెలిసిన రావణుడున్,
సంతోషించుచు నుండెను మిక్కిలి చంద్రునికిని వలె ప్రసన్నుడై! 16

మహా బలముగల కుంభకర్ణుడును మానుగ యన్నయు బలుకంగన్,
సంతోషించియు బయలు దేరెనూ సరగున రణరంగంబునకున్!
రాజాయైన రావణుని మాట విని రణమును జేయగ సిద్ధుండై
బయలుదేరె తన పరివారముతో బ్రబల శూలమును బట్టుకొనీ! 17

శత్రు నిబర్హణుడైన రాక్షసుడు సరసత యినుమున జేయబడీ,
తప్తకాంచనము భూషణములతో దగ నిశితంబగు శూలమునూ,
దీప్తిమంతమై సూర్యుని వలెనూ దిక్కులు కాంతులు జిమ్ముచునూ
అలరి హస్తమున గ్రహించి యాతడు అందఱు వినగా నిటు లనియెన్! 18

ఎఱ్ఱని మాలికలను గూడికొనీ నిమ్ముగ తేజస్సును గలుగూ,
అట్టి శూలమున నుండి మంటలును నిట్టె ప్రజ్వరిల్లుచు నుండెన్
ఆ శూలము శత్రువుల రక్తమున అలరి జ్వలించుచు నుండె నటన్,
మహా తేజమును గల రాక్షసుడును మానుగ ఘన శూలము బట్టీ,
అన్నయైన రావణుతో బలికెను నఖిల భూతములు వినునటులన్!
ఈ శూలము మఱి కాంతి బరువులను నింద్రుని వజ్రముతో సమమూ!
ఈ శూలము మఱి యనేక మారులు నిమ్ముగ సురలను యక్షులనూ!
దానవ పన్నగ గంధర్వులనూ దగ నాశనమును జేసె నిదీ! 19-20

సైన్యమంతయును నుండుగాక యిటు! సరసత బోయెద రణమునకున్!
ఒంటరిగానే బోయెద యనికిని జంట యెవరు లేకుండగనూ!
ఆకలిగొని కోపించి యున్న నే నలరి వానరుల భక్షింతున్! 21

కుంభకర్ణునీ వచములను విని కూరిమి రావణుడును బలికెన్,
శూలంబులు మరి ముద్గరంబులను బొలుపుగ ధరించినటువంటి,
శూరవరులతో గూడి గదలుమా! శూరత జూపగ రణ మందున్! 22

మహా శరీరంబులును గలిగినా మహా శూరులును నగువారున్,
మంచి ప్రయత్నంబులను గలిగినా యంచితముగ యా వానరులన్,
ఒంటరిబాటున యుండిన వారిని, యొనరగ యేమరి బాటుననూ,
యుండిన వారిని దంతంబులచే కండలు కండలుగా గొరికి,
చంపివేయదురు యెచ్చటి కచ్చట యంపుచు నుందురు యమపురికిన్, 23

అందువలన సైన్యముతో గూడుక యలరి బొమ్ము యుద్ధంబునకున్!
నెదిరింపగ శక్యము గాకున్నను నెదిరింపుము నీ శత్రువులన్!
మనరాక్షసులకును యహిత మొనర్చెడి మానుగ యాకపి బీరులనూ!
శత్రుపక్షమున ధ్వంసమొనర్పుము మిత్ర పక్షమును గెలువంగన్! 24

అటుబిమ్మట తేజంబును గలిగిన చటుల విక్రముడు రావణుడున్,
ఆసనమున నుండియు మఱి లేచియు నలరుచు దన మెడలో నున్నా
మణులను గూర్చిన మణిమాలను వే మానుగ హస్తమునను దీసీ
కుంభకర్ణునీ మెడలో వేసెను కూరిమి ప్రేమయు బొంగారన్! 25

బలవంతుండగు కుంభకర్ణునకు బన్నుగ యా రావణుడుమఱిన్,
బాహు పురులనూ, యుంగరములనూ బన్నుగ భూషణములు మఱిన్,
శశి సంకాశంబగు హారంబును చయ్యన తమ్మునికిని వేసెన్! 26

కుంభకర్ణునీ యంగము అందున కూరిమి యారావణుడు మఱిన్,
గాత్రమునందున శ్రేష్ఠములైనా కమ్మని సుగంధ మాల్యములున్,
కర్ణములందున కుండలములనూ కడు సొగసుగ మఱి కట్టించెన్! 27

ఉంగరు నంగదములును మఱియునూ బన్నుగ కేయూరంబులునూ,
వక్షస్థల యాభరణంబులచే వనరగ యలంకరింపబడీ,
బృహత్కర్ణుడగు కుంభకర్ణుడును భీమబలుండగు నాతండున్,
హోమము జేయగ బడిన యగ్నివలె విమల రూపమున జ్వలించెనూ! 28

సుందరమును బహు నల్లనిదైనా శ్రోణీ సూత్రము దోడుతనూ!
అమృతంబు మథియించు సమయమున నా వాసుకి సర్పము చేతన్
కట్టబడిన యామందరగిరి వలె యిట్టె గానబడు చుండె నటన్! 29

ఉంగరు వికారమైనది మఱియును బహు భారముల వహించునదీ,
శస్త్రములకును నభేద్యమైనదియును చారు సుందరం బైనదియున్
అట్టి కవచమును ధరించె నాతడు నిట్టె ప్రభలు జిందుచునుండన్,
అట్టి కవచమును ధరించు చుండగ సంధ్యాకాలపు మేఘంబున్,
ఆలుముకున్న యా యద్రిరాజువలె యా రాక్షసుడు ప్రకాశించెన్! 30

సకలా భరణంబులు వేగముగా సకలాంగములను ధరియించీ,
శూలపాణియై యా రాక్షసుడును శురుచిరముగ యత డపుడుండెన్!
మూడు పాదములు వేయుట కొఱకై ముదితోత్సాహంబును గలుగూ!
నారాయణునీ వోలె నాతడును నయముగ యుండె ప్రకాశుండై! 31

బృహత్కర్ణుడగు కుంభకర్ణుడును భీమబలుండగు రావణునీ,
కౌగలించుకొని ప్రదక్షిణంబును గడుభక్తిని యాతడు జేసెన్!
అన్నకు శిరసా నమస్కరించీ యాతని దీవెన గైకొనుచున్,
పర్వతంబువలె బయలు దేరెనూ బన్నుగ యందఱు భయమందన్! 32

బయలు దేరెడీ బలవంతుని మఱి బరగ మహాకాయము గలుగూ!
మహానాదమును జేయుచు వెడలెడి మహావీరుడగు సోదరునీ,
రావణుం డపుడు గౌగలించుకొని యతి గౌరవమున జూచుచునూ!
మంగళకరమగు నాశీస్సులతో మానుగ బంపెను రణమునకున్! 33

మహాబుద్ధి గల రథికు లంతటను మానుగ రథికుల శ్రేష్ఠుండున్,
కుంభకర్ణునీ యనుసరించియును గూరిమి శంఖంబుల ధ్వనితో,

దుందుభి భేరీ ధ్వనులతోడనూ దురంతమగు నాయుధములునూ,
గజ సైన్యముతో గజ హయములతో కఠినమైన - ధ్వనియును గలుగూ!
రథములతోడను కుంభకర్ణుని రమ్యముగా బోయిరి వెనుకన్! 34

మహాబలుండును మహా వీర్యుడును మానుగ భయంకరుడు నైనా,
కుంభకర్ణుని వెంట నడిచిరీ కూడిన సైన్యము నట్టి యెడన్,
సర్పంబులు మఱి యొంటెల మీదను సరసత గజములు ఖరములపై!
సింహంబులు మఱి లేళ్ళపైననూ శీఘ్రము శకుంతముల పైనీ! 35

దానవులకు మఱి నాకవాసులకు దగ శత్రువు నగువాడు మఱిన్,
కుంభకర్ణుడును శిత శూలంబును గూరిమి ధరించి హస్తమునన్,
బోవుచుండగా నతని శిరస్సున బొలుపుగ ఛత్రము బట్టి రటన్,
పుష్ప వర్షమును గురిపించిరిగా బొలువుగ లంకాపుర మందున్! 36

మదోత్కటుడు నాతడు సహజముగా మానుగ రక్త సుగంధములన్,
మఱింత మదమును బొందె నాతడును మానుగ సుగంధముల వలనన్!36

మహాసారమును గలవారును మఱి మహాబలంబును గలవారున్,
భీమాక్షులు మఱి శస్త్రపాణులును భీమాయుధముల ధరించియున్,
అసంఖ్యాకులగు రాక్షసవీరులు నాతనితో నడిచిరి వేగన్,
కాలిబంటులై కుంభకర్ణుని కలిసి యనుసరించిరి వేగన్! 37

రక్తాక్షులునూ, మహాకాయులును నల్లని కాటుక ప్రోవులటుల్,
యుండిన యా రాక్షసులు శూలములు, మెండుగ ఖడ్గంబులు మఱియున్,
వాడియైన గొడ్డళ్ళు, గదలునూ! వనరగ పరిఘలు, రోకళ్ళన్,
భింది పాలములు, దూరమునుండీ చిందగ విసరెడి ప్రాసులునూ,
గ్రహించి యతనిని యనుసరించిరీ గడు రయమున బోయిరి యనికిన్!38

ఆటుపిమ్మట యా మహాతేజుడును నా బలవంతుడు రాక్షసుడున్,
దారుణంబునూ, ఘోర దర్శనపు దగ మఱి యొక్క శరీరమున్,
ధరించి యాతడు బయలువెడలెనూ దగ రణరంగమునకును మఱిన్!

ఆతని శరీరపు చుట్టుకొలతయును నలరి రెండు వందల గజముల్,
ఎత్తును బంద్రెండొందల గజములు సత్తువతో నడుచుచుండెన్!
శకట చక్రముల వంటి నేత్రములు వికటముగా నుండెను జూడన్,
మహాపర్వతము వోలె నాతడును మానుగ కనిపించుచు నుండెన్! 40-41

మహాశరీరము గలవాడును మఱి మహా వక్త్రమును గలవాడున్,
కాల్చిన పర్వతమును వలె నుండెను గానరాని ముఖమును గలిగీ,
అట్టి కుంభకర్ణుండు నవ్వుచును నా రాక్షసులకు దరిజేరీ
ఇటులబలికె స్పష్టాక్షరంబులను బటు తరముగ గంభీరతనూ! 42

కోపముతో నుండిన నేనిప్పుడు గూఱిమి యగ్నియు మిడతలనూ,
కాల్చివేసినటు గాల్చి వేసెదను గపివీరుల నందఱ నిపుడున్,
వానర శ్రేష్ఠుల గుంపుల నే నిట వనరగ ఖాగ ప్రకారములన్,
కాల్చివేసెదను భక్షించెదనూ, గదగి రక్తమును ద్రావెదనూ! 43

వనమునందు చరియించు వానరులు వనరగ విరోధులును గారూ!
నా కేమియు నపరాధము పూర్వము నయముగ జేయగలేదు గదా!
ఆ వానర జాతియు మనవంటి యలఘు నాగరక వాసులకున్,
పురోద్యాన వన పుణ్యభూములకు భూషణంబులును నగును గదా! 44

ఈ లంకాపురి ముట్టడించుటకు నిమ్ముగ లక్ష్మణ సహితుడునూ,
ఆ రాముడుగద మూలకారణము నతడె కేంద్ర బిందువు మఱియున్,
అతని హతము జేసిన యందఱినీ హతము జేసినట్లగను గదా!
అందుచేత నాతనిని వధించెదను యందఱి బాధలు దీరగనూ! 45

బృహత్కర్ణుడగు కుంభకర్ణుడును భీకరముగ బలుకుచు నుండన్,
రాక్షసులందఱు నా సముద్రమును రహి కంపింపగ జేయుచునూ
యున్నారా యనునట్లుగ వారును నుర్వి యదరగా దిక్కులునూ
భయంకరంబగు ధ్వనులను జేసిరి బిమ్మగ సంతసమునను మఱిన్! 46

ధీమంతుండగు కుంభకర్ణుడును ధీరత వెడలుచు నుండగనూ!
భయంకరంబులు నగు శకునంబులు బిమ్మగ కనబడె నచ్చోటన్!

ఉల్కలు బడినవి! పిడుగులు బడినవి నురుతరమగు వర్షము తోడన్,
గాడిద బూడిదరంగు మేఘములు గగనంబున దిరుగాడినవి!
సముద్రంబుతో నరణ్యములతో చక్కని వసుధయు గంపించెన్! 48

భయంకరంబగు రూపము గలిగిన బన్నుగ నక్కలు బుతియందున్,
జ్వాలాపిండములగు ముఖములతో చలించి మిక్కిలి యఱచినవి!
పక్షులుగూడను నపసవ్యముగా బరగ మండలము గట్టినవి! 49

మార్గమునందున బోవుచున్న యా మహా రాక్షసుని శూలముపై
గ్రద్ద యొక్కటియు వచ్చి వ్రాలినది కఠిన శబ్దమును జేయుచునూ,
అతని యెడమ కన్నదిరెను మఱియును నతని యెడమ భుజమును నదిరెన్!

అట్టి సమయమున భీకరధ్వనితో నల బడె నొక్కటి యుల్కయునూ,
మండుచున్నదియు మహాగ్ని జ్వాలల మెండుగ పొగలను జిమ్ముచునూ,
సూర్యుడు గూడను కాంతిహీనుడై సురుచిర రశ్మలు గోల్పోయెన్,
వాయువు సుఖముగ వీచుటలేదూ! వనర ప్రకృతియు స్తంభించెన్! 51

బృహత్కర్ణములు గలవాడును మఱి భీకర కాయము గలవాడున్,
కుంభకర్ణుడును మార్గమునందున కుదురుగ రోమాంచము గలుగూ,
మహోత్పాతముల దుశ్శకునములను మానుగ లెక్కింపని వాడై,
కృతాంత బలచోదితుడై వాడును ప్రశాంత చిత్తము కోల్పోయెన్! 52

పర్వతంబుతో సమానుడైనా బరగ కుంభకర్ణుండు మఱిన్,
పాదతలంబులచే నడిచిపోయెనూ ప్రాకారంబును దాటి మఱిన్,
ప్రావృట్కాలము మేఘమాలి వలె బన్నుగ యాశ్చర్యము గొలుపన్,
వానరసేనను గాంచె నాతడును వనర మహోదధి యలల వలెన్! 53

పర్వతసముడగు కుంభకర్ణుని బన్నుగ వానరులును గాంచి,
పరుగులు దీసిరి పలుదిక్కులకును బరగ వికల మానసు
గాలిచేత మఱి యెగురగొట్టబడి కదిలెడి మేఘంబులకు వలెన్,
ఆ కపివీరులు జెదిరి పోయిరి యన్ని దిక్కులకు వేగముగన్! 54

ప్రావృట్కాలపు మేఘంబుల వలె బన్నుగ నల్లని రూపముతో,
నుండినట్టి యా కుంభకర్ణుడును దండిగ గాలులజేత మఱిన్,
జెదరగొట్టబడు మేఘంబుల వలె చెదిరి పారిపోవుచునున్నా
భయంకరంబగు వానరసేనను బరగ జూచి మఱి గర్జించెన్! 55

ఆకాశంబున నున్న మేఘముల యలరు ధ్వనికి వలె యుండిన యా
భయంకరంబగు రాక్షసు ధ్వని విని బన్నుగ భయపడి వానరులున్,
మొదళ్ళు నఱికిన మద్దిచెట్ల వలె యెద నలుగుచు నేలను బడిరీ! 56

శత్రువినాశము జేయుట కొఱకై మిత్రపక్షమును బ్రోచుటకున్,
ఘన శూలంబును ధరించి వచ్చిన వనర కుంభకర్ణుండు మఱిన్,
ప్రళయకాలమున దండము గైకొని బన్నుగ వచ్చిన యముని వలెన్,
కపిసేనకు మఱి భయంకరంబగు విపుల భయంబును గలిగించెన్! 57

(యుద్ధకాండమునందు 65వ సర్గము సమాప్తము)

★ ★ ★

## యుద్ధ కాండము - మొదటి భాగము

### అఱువది యాఱవ సర్గము

[కుంభకర్ణుని గాంచి పారిపోచున్న వానరవీరులకు ధైర్యమును జెప్పి, అంగదుడు యుద్ధమునకు బ్రోత్సహించుట — కుంభకర్ణుడు వానర వీరులను సంహరించుట — మఱల అంగదుడు వారిని వెనుకకు మరల్చుట ]

పర్వత శిఖరముతో సమానుడును బరగ మహాబలవంతుండున్,
అట్టి కుంభకర్ణుండు శీఘ్రముగ యిట్టె దాటె బ్రాకారంబున్,
శీఘ్రముగా లంకాపురి నుండీ స్థిరముగ యడుగులు వేయుచునూ?
బయలుదేరె రణరంగంబునకును బన్నుగ రఘువీరుని బంపన్! 1

పిడుగుల జయించుచున్నాడా యన భీకర ధ్వనులను జేయుచునూ,
పర్వతంబులను నెగుర గొట్టుచును బన్నుగ యుండెనొ యన్నటులన్,
అపరిమిత ధ్వని గల సంద్రంబును నలరి ప్రతిధ్వని జేయునటుల్
బృహత్కర్ణముల గలిగినట్టి యా భీకర రాక్షసుడును మఱియున్
గర్జించెను బది దిక్కులు నదరగ కపి సేనయు మూర్ఛను బొందన్! 2

సురరాజగు నింద్రునిచే గానీ సురచిరముగ వరుణుని జేతన్,
కాలాంతకుడగు యముని జేతనూ గడగి వధింప నశక్యంబౌ,
భయంకరంబగు నేత్రంబులు గల బరగ కుంభ కర్ణుని గాంచీ,
వానరవీరులు బరుగులు దీసిరి వరుసను దిశలను దిక్కులకున్! 3

పారిపోవు నా వానరవీరులు బన్నుగ నలుడును, నీలుండున్,
గవాక్షుండు మఱి వీర్యవంతుడగు గర్కశుడగు కుముదుండు మఱిన్,
మున్నగు వానర వీరుల గాంచీ చెన్నుగ వాలికుమారుండున్,
అంగదుండు నీ విధమున బలికెను నలరి క్రోధ పూరితముగనూ! 4

మీ మీ వీర్య పరాక్రమంబులను మీ మీ యుత్తమ వంశములన్,
అన్ని మఱచి సామాన్యులకునువలె చెన్నుగ పరుగులు దీయుచునూ!
ఎచటికి బోదురు నీవిధి భయపడి అచట నిలువుడో! సఖులారా! 5

సౌమ్యులార! కపివీరులార యిక సరసత వెనుకకు మఱలు డికన్,
వీరత ధీరత గోలుపోయి యిటు చాలెడు ప్రాణంబులను యిటుల్,
రక్షణ జేయుట దగునా మీకును రయమున యుద్ధము జేయుడికన్,
ఈరాక్షసుడును రణమును సలుపగ నిమ్ముగ యసమర్థుండు సుమా!
మనలను భయపెట్టుటకై జేసిన మానుగ యిదియొక బొమ్మసుమా! 6

వానరులారా! వెనుకకు మఱలుడు వనరగ యుద్ధము జేయుడికన్,
భయమును గలిగింపగ రాక్షసులును బన్నుగ పన్నిన తంత్రమిదీ!
మహత్తరంబగు నీ విభీషికను మానుగ పరాక్రమము జేతన్,
నశింపజేసెద యుద్ధ రంగమున నయముగ నిలువుడు మఱలు డికన్! 7

అటులిమ్మట యా వానరులందఱు నలరి ధైర్యమును దెచ్చుకొనీ,
నాలుగు వైపులనుండి మఱలి మఱి నయముగ యొకచోటను జేరీ,
వృక్షంబుల మఱి శిలలు బుచ్చుకొని వెడలిరి రణరంగంబునకున్! 8

అంత వనౌకసులందఱు మఱలీ నంచతమున సంరబ్ధులునై,
పరమ క్రుద్ధులై మదగజముల వలె బరగ కుంభకర్ణుని మఱియున్,
రాక్షసవీరుల గొట్టసాగిరీ రహి శిలంను వృక్షంబులతో! 9

బహువిపులములగు శిలలతోడనూ, బన్నుగ పుష్పించిన యట్టీ
వృక్షంబులతో నా రాక్షసునీ విపరీతముగను గొట్టిననూ!
బలియుడగు నా కుంభకర్ణుడును మానుగ కదలడు మెదలడుగా! 10

అతని గాత్రమున బడిన శిలలునూ యలరి బ్రద్దలై పోయినవీ!
పుష్పితాగ్రములు గల బాదపములును బొలుపుగ రెండుగ విరిగినవీ!
భూమియందు మఱి పడిపోయినవీ విమల శిలలు మఱి వృక్షములున్! 11

అతడుగూడ కోపించినవాడై యలరి ప్రయత్నము దోడుతనూ,
అగ్ని హోత్రమది యల వనములనూ భగ్గున మండించిన యటులన్,
మహాతేజమును గల వానరులను మహాసైన్యమును మథియించెన్! 12

అట్టి సమయమున వానర శ్రేష్ఠులు నిట్టి రక్తమున దడిసియునూ!
భూమి మీదబడ వేయగ బడిరీ బొలుపుగ యా రాక్షసుచేతన్!
భూమిమీద బడిపోయిన కపులును బొలుపుగ యెఱ్ఱని పుష్పంబుల్,
గలిగిన వృక్షంబులకును పోలెను కనిపించిరి యా సమయమునన్! 13

ఆ వానరులును గంతులు వేయుచు నలరి దుముకుచును భీతిలుచున్,
పరుగెత్తుచు నుండిరి దిక్కులకును బరగ వెనుకకును జూడకనూ!
కొందఱు గపివీరులు సంద్రంబును నందక నీటను బడిరి మఱిన్,
కొందఱు మఱి యాకాశములోనికి యందకుంద బోయిరి వేగన్! 14

రాక్షసుడగు నా కుంభకర్ణుడును రహి లీలగ కపివీరులనూ,
చంపివేయుచుండెను రణమందున యంపుచుండె యమక్షయమునకున్!

అంతు కొందఱగు వానరవీరులు సందు జూచుకొని వేగముగా
ఏమార్గంబున యుదధి దాటిరో యా మార్గము బయనించిరిగా! 15

అంతట భయమున వానర వీరులు సుంత ధీరతయు లేకుండన్,
వివర్ణ వదనంబులతో వారలు వేగముననుఁ బరుగెత్తుచునూ,
కొందఱు నెత్తు ప్రదేశములందున కొందఱు బల్లపు స్థలములలో
నాశ్రయించిరీ, భల్లూకంబులు నలరుచు వృక్షంబులు నెక్కెన్!
భల్లూకంబులు మఱికొన్నియునూ పారిపోయినవి కొండలకున్! 16

కొందఱు నార్ణవమందు మునిగిరీ కొందఱు గుహలను దాగి రటన్,
కొందఱు నటు నిటు బారిపోయిరీ కొందఱు బడిరి వసుంధరనూ!
కొందఱు నిలువగ లేకపోయిరీ కొందఱు బరుగిడు చుండిరటన్,
మఱికొందఱు మరణించి నట్లుగా మాయ నటనలను జేయుచునూ,
బిట్టు బిగిసి మఱి శయనించిరిగా భీతిచేత యా రాక్షసునీ! 17

భగ్నహృదయులై వానరవీరులు పారిపోవుచును నుండగనూ,
వారిని గాంచుచు వాలికుమారుడు వనరగ యంగదు డిటు బలికెన్!
వానరులారా! నిలువుడు! మీరలు! భయములేదు వెనుకకు రండీ!
మనమందఱమును రణమున జేరీ మానుగ రాక్షసు గూల్చుదమూ! 18

మీరిట భయపడి యనిలో యోడీ మీరిన యపజయమును బొందీ,
భూమియంతయును దిరిగిన గూడను బొలుపుగ స్థానము దొరుకదుగా!
వెనుకకు మఱలుడు! వేగము నిలిచీ యిపుడు రణంబును జేయు డికన్,
ప్రాణంబుల రక్షించుట యెందుకు బరగ పిరికిపందలకు వలెన్! 19

అడ్డు లేని గమనంబును గలిగీ యతి జవమునుగల కపులారా!
ఆయుధంబులను విడిచి యుద్ధమున నటు బరుగెత్తెడి మిమ్ములనూ,
మీభార్యలు మఱి బరిహసించెదరు మిగుల హీనముగ గాంచుచుమూ,
సుజీవితులకును నీ యవమానము జూడ మరణమే గద! ధాత్రిన్! 20

మనమందఱమును నతి ప్రాచీనము మానుగ సుదీర్ఘ మౌను నైనా
పరంపరయుగల యుత్తమ కులముల బన్నుగ జననము నొందితిమీ!

అట్టి మీరు సామాన్య కపులవలె యిట్టి భీతి బరుగిడుచు మఱిన్,
ఎచటికి బోవుచు నున్నవారు మఱి ఎంత హీన మది యందఱకున్,
మీ పరాక్రమము విడిచి పోవుటిది మీరు ననార్యులు నగుదు రికన్! 21-22

యుద్ధమునకు వచ్చెడి యా వేళను యుద్ధతి యా బలికిన మాటల్,
అందఱ ముందఱ జెప్పిన మాటలు నతి దంభంబులు నగునుగదా!
ఎచటికి బోయెను బడాయి మాటలు యెచటికి బోయెను బీరములున్, 23

ఛీ! ఛీ! యని పదిమంది జేతనూ జీవించియు నిల యుండుటయున్,
జనుల నిందలను వినవలయును సుమ! జనుల దిరస్కారంబులనూ!
అందుజేత సత్పురుషుల మార్గము చంరముగా నడువుడు మీరున్!
భయమును దూరము జేయుడు వేగము ప్రాణభయంబును వీడు డికన్! 24

ఆయుర్దాయము నల్పమైనచో నల వైరులతో బోరాడీ,
నేలమీద మఱి శయనించెదమూ నిహితులమై శత్రువు తోడన్,
కుయోధులకు దుష్ప్రాప్యమైన యా కుదురుగ బ్రహ్మ సులోకములన్,
అందుకొందుమా? వానరులారా! చందము నడువుడు నాపథమున్! 25

వానరులారా! యాహవ మందున యలరి శత్రువుల నోడించీ,
చిర యశస్సునూ యలరి బొందుదము శ్రీకరముగ జనులును బొగడన్!
మనమే రణమున మరణించినచో మానుగ వీరుల లోకమున
ఐశ్వర్యంబును ననుభవించెదము నా యా లోకములందుననూ! 26

దీప్యమానమగు నగ్నిని జేరీ దీరుగ మిడతయు బ్రదుకదుగా!
ఆవిధముగ యీ కుంభకర్ణుడును యా రాముని దృష్టిని బొందీ,
ప్రాణంబులతో దిరిగిపోడు గద బన్నుగ ధర జీవింపగనూ! 27

రణరంగంబున యుద్ధము జేయగ రహి నియమింపగబడి మనమున్,
ఒక్కని జేతను మన మందఱమును జక్కగ యపజయమును బొందీ,
పాఱిపోయి యని ప్రాణంబులనూ బరగ రక్షణను సేయుటయున్,
కీర్తి యశస్సులు నాశనంబగును నార్తి బొందుముము శాశ్వతమున్! 29

పారిపోవు నా వానరవీరులు జన్నుగ బలుకుచు నున్నట్టి
కనకాంగదములు గలిగిన శూరుడు ఘన వీర్యుడు నా యంగదుతో!
శూర విగ్రహితమైన వాక్యముల శూరునితో బలికిరి యిటులన్! 30

ఇంతవఱకునూ కుంభకర్ణుతో బంతములను యని జేసితిమీ!
చాలు నింక యీ యుద్ధము మాకును సరగున బోయెద మెటకైనా!
ఇది నిలుచుటకును సమయము గాదూ! యిదె యాతడు వచ్చుచునుండెన్!

ప్రాణంబులు బహు ప్రియముగదా మఱి ప్రాణుల కెపుడును నీధాత్రిన్!
సమస్తమైనా కపి సేనానులు సత్వరముగ యిటులను బలికీ,
భీమాక్షుండును భయంకరుండును భీమబలుడు రాక్షసు గాంచీ,
దిక్కులు బట్టీ పారిపోయిరీ దీనావస్థను బెగ్గిలుచున్! 32

పారిపోయెడి వానర వీరుల జన్నుగ వారల నందఱినీ,
అంగదుండు బ్రతిమాలుచు వారల నింగిత వచనము బలుకుచునూ
రాముని పరాక్రమంబును దెలిపీ రమ్యమైన యుక్తుల తోడన్,
బోయెడి వారల మరల్చె వెనుకకు ధీర వీర యుక్తుల తోడన్! 33

బుద్ధిమంతుడగు నంగదుజేతను ప్రోత్సాహితులై ధీరతనూ,
ఆ వానర సేనానాయకులునూ నలరి నిలిచిరీ రణమునకున్!
అతని యానతికి యెదురు జూచుచును నట నిలిచిరి రణరంగమునన్! 34

ఋషభుడు,శరభుడు,మైందుడు,ధూమ్రుడు,సుషేణుండు,నీలుడుమఱియున్,
కూరిమి కుముదుడు గవాక్షుండునూ, కుదురుగ రంభుడు దారుండున్,
ద్వివిదుడు, పనసుడు, హనుమంతుండును దిరముగ మున్నగు కపివీరుల్!
త్వరితగతిని యా కుంభకర్ణునకు దగ యభిముఖులై వారలునూ
రణరంగమునకు బోయిరి వారలు రణము సలుప యా రాక్షసుతో!

(యుద్ధకాండములోని 66వ సర్గము సమాప్తము)

## యుద్ధకాండము - మొదటిభాగము

### అ ఱు వ ది యే డ వ స ర్గ ము

(కుంభకర్ణుడు భయంకరమైన యుద్ధముజేసి రామునిచే సంహరింపడుట)

ఆటుమీదట యంగదుని వాక్యముల నలరుచు విని యాకపివీరుల్,
మహాకాయులగు వారందఱునూ మానుగ స్థిరబుద్ధిని గలిగీ,
రణ కాంక్షాపరులై వారందఱు రహి వేచియు యుండిరి యచటన్! 1

అత్యధికంబగు విక్రమంబుగల యా వానర వీరులు మఱియున్!
అంగదుజేతను ప్రోత్సహింప బడి యలరుచు నిలిచిన వారలునూ,
పరాక్రమంబును నవలంబించియు బటుతర యుత్సాహము నందీ,
మరణించుటకును నిశ్చయించు కొని మానుగ బోయిరి రణమునకున్!
ప్రాణంబులకును లెక్క సేయకను బటుతర రణమును జేసి రటన్! 2

అటుపిమ్మట యా మహాకాయులును, నా కపివీరులు వేగముగా,
వృక్షంబుల మఱి పర్వతములలను వివిధములగు ద్రుమ శాఖలనూ,
హస్తంబులతో నెత్తి తూర్ణముగ చిత్తంబుల ధైర్యము బూనీ,
కుంభకర్ణుని పైకి బోయిరీ కూరిమి యుద్ధము సేయగనూ! 4

మహాకాయమును గలవాడును మఱి మహావిక్రమము గలవాడున్,
కుంభ కర్ణుడును మదగజమును వలె కూరిమి కోపించికవాడై,
గద నొకదానిని గ్రహించి జేతను కదనము నందున శత్రువులన్,
అన్ని వైపులనూ జిమ్మి వేసెనూ యలరి వారు భయమందగనూ! 5

కుంభకర్ణుచే జిమ్మి వేయబడి కుదురుగ దూరముగా బడుచున్,
ఏడువందలును, ఎనిమిది వందలు నిమ్ముగ వేయియు వానరులున్
విసిరివేయబడి నేలమీదనూ వికటముగా బడి రందఱునూ! 6

బృహత్కర్ణుడగు కుంభకర్ణుడును భీమ కోపమున గూడికొనీ,
పదునాఱుగురను, నెనమండుగురినీ పదిమందిని యిరవై మందీ
ముప్పది మందిని తన బాహువులను మోదముగా నోటను జొనిపి,

కరకర నములుచు నుండెను నాతడు గరమున విష సర్పంబులనూ,
భక్షించెడి యా గరుత్మంతువలె బరగ కుంభకర్ణుండు మఱిన్,
యుద్ధరంగమున దిరుగుచు నుండెను యుద్ధతుడై విషమంబుగనూ! 7

ఆ వానరులును నతి కష్టంబున యరి ధైర్యమును దెచ్చుకొనీ,
అన్ని వైపులను నుండి వచ్చిరీ నల సంగమ స్థానాబు వలెన్,
వృక్షంబుల మఱి పర్వత శిలలను వివిధ ద్రుమానులను శాఖలనూ,
హస్తములందున ధరించి నిలిచిరి యరి యనికి సంసిద్ధముగా! 8

అటుదిమ్మట వానర శ్రేష్ఠుండును నా ద్వివిదుడు నొక పర్వతమున్,
పెకలించియు మఱి గగనము నందున విలంబమగు దోయదము వలెన్,
పర్వత శిఖరము వంటి కాంతిగల బరగ కుంభకర్ణుని గూర్చి,
పరుగులు దీసెను నాతని పైకిని బడవేయగ నా శిఖరంబున్! 9

పైకి యెగిరి మఱి నా ద్వివిదుండును బర్వతమున రాక్షసు పైకిన్,
విసిరివేసె యా పర్వతంబు మఱి విస్తృత దేహము గలిగిన యా
కుంభకర్ణునీ జేరకుండగను గూలెను నాతని సైన్యంబుపై! 10

ఆ నగోత్తమము నశ్వంబుల మఱి యల గజంబులను, రథములనూ,
ధ్వంసముజేసెను మఱియొక గిరినీ దగ ప్రయోగింపగా నతడున్,
ఇతరులైన సైనిక రాక్షసులును నిమ్ముగ మరణించిరి యపుడున్! 11

ఆరాక్షసులా మహా యుద్ధమును నల పర్వత శిఖరంబులచే,
గొట్టబడినవై యనేక గజములు గూరిమి హయములు, సారథులున్,
జచ్చిరి రణరంగం బంతయునూ విచ్చలవిడిగా మొండెములున్
రక్తంబులు ధారలు గట్టినవీ రహి ధాత్రీతల మంతయునూ! 12

భీమ నిస్వనము గల రథికులునూ భీమ ప్రళయకాలము నందున్
మృత్యుదేవతకు సమానంబు లగు మీరిన బాణంబుల తోడన్,
గర్జించెడి యా వానర శ్రేష్ఠుల కరముల శిరసుల ఖండించీ
రక్తము మడుగులు జేసిరి వారలు రయమున పృథ్వీతలమంతా! 13

మహాత్ములగు నా వానర వీరులు మహావృక్షముల బెకలించి
రథాశ్వంబులను, మహాగజములను రయమున యొంచెల రాక్షసులన్,
నశింపజేసిరి యుద్ధరంగమున నయముగ రాక్షస బలములనూ! 14

హనుమంతుడును నాకాశంబును నలరి యాశ్రయించిన వాడై
పర్వత శిఖరంబుల మఱి శిలలను బన్నుగ యనేక వృక్షములన్
కుంభకర్ణునీ శిరస్సుపైనీ కూరిమి వర్షించెను నపుడున్! 15

మహావీర్యుడగు కుంభకర్ణుడును మానుగ దగ శూలము జేతన్
ఆపర్వత శిఖరములను శిలలను నలరి బ్రద్దలుగ గొట్టి మఱిన్
వృక్షవర్షమును భగ్నము జేసెను విపులమైన తనశూలమునన్! 16

అటుపిమ్మట యా కుంభకర్ణుడును నల శూలంబును గ్రహియించి
భయంకరంబగు హరి సైన్యముపై బన్నుగ విజృంభించి మఱిన్
హనుమంతుండును మహీధరాగ్రము నలరి గ్రహించియు హస్తములన్
వచ్చి మీద బడుచున్న రాక్షసుని వనరగ యెదుటను నిలుచుండెన్! 17

కోపించిన యా హనుమంతుండును కూరిమి యుత్తమ గిరినొలెన్,
భయంకరమునగు దేహము గలిగిన బాహు బలుండగు రాక్షసునీ,
కుంభకర్ణునీ గొట్టెను మారుతి కుంభిని కంపము నొందగనూ
అట్టి సమయమున నాతని శిలచే నభిభూతంబై రాక్షసుడున్
క్రొవ్వుచేత, మఱి రక్తము జేతను గూరిమి దేహము దడిసినదై
శోభజెందెనూ కుంభకర్ణుడును శోచనీయమగు స్థితినందెన్! 18

మండుచుండి దా శిఖరాగ్రమువలె మెండగు మెఱుపుల ప్రకాశమున్
గలిగినట్టి యా మహా శూలమును గట్టిగ హస్తమునను బట్టి
ఆ కుమార స్వామియు దన శక్తిని యలరి క్రౌంచపర్వతమును వే
గొట్టినట్లుగా నా హనుమంతుని గొట్టె వక్షమున రాక్షసుడున్! 19

అట్టి మహా సంగ్రామమునందున యిట్టి మహాశూలము జేతన్
కుంభకర్ణుడును వక్షస్థలమున గుదురుగ గొట్టగ మారుతియున్

వ్యాకులత్వమును బొందెను మిక్కిలి వనరగ రక్తము జిందుచునూ !
ప్రళయకాల మేఘపు నుఱుములవలె బరగ భయంకర ధ్వని జేసెన్! 20

అటుబిమ్మట వ్యధజెందినట్టి యా హనుమంతుని గని రాక్షసులున్
పెద్దపెట్టునను సంతోషంబును బెనుకేకలు వేవిరి యపుడున్!
వానరులైతే వ్యధను జెందిరీ వనరగ భయ బీడితులగుచున్,
కుంభకర్ణునీ దాపున నుండీ కూరిమి దొలగిరి కపివీరుల్! 21

అటుబిమ్మట బలవంతుడు నైనా యల నీలుడు సైన్యంబునకున్
ధైర్యముజెప్పి నిలబెట్టుచునూ ధీమంతుడగు రాక్షసుపై!
శైలాగ్రంబును విసిరిగొట్టెనూ శైల సమానుడు రాక్షసుపై! 22

వచ్చిబడెడి యా శైలాగ్రంబును మచ్చికతో నా రాక్షసుడున్
తన బిడికిలితో బలమున గొట్టెను దగ నచ్చట నిలబడి యుండన్
ఆ రాక్షసునీ పిడికిలి దెబ్బకు నా శైలాగ్రము బద్దలునై
అగ్ని కణములను, నగ్నిజ్వాలలను నలరి ధాత్రిపై బడిపోయెన్! 23

మహావీర్యులును, మహాకాయులును మహా విక్రమము గల వారున్
శరభుడు, ఋషభుడు, నీల, గవాక్షులు, గంధమాదనుడు నైదుగురున్
కుంభకర్ణునీ మీదికి బోయిరి కుదురుగ రాక్షసు సమయింపన్! 24

మహావీర్యులును, మహా కాయులును మఱి యా యయిదుగురైన కపుల్
మహాదేహమును గల రాక్షసునీ మానుగ పర్వతముల జేతన్
వృక్షంబులచే, నరచేతులచే, బాదంబులచే! బిడికిళ్ళన్!
అన్నివైపులను నుండి కొట్టిరీ యలరి భ్రమాని కొమ్మల జేతన్! 25

ఆప్రహారములు నా రాక్షసునకును నంత యింత బాధయు లేదూ!
స్పర్శ మాత్రములుగా భావించెను సరగున వ్యధ జెందను లేదూ!
మహావేగమున యా ఋషభునినీ మానుగ తన భుజముల జేతన్,
గొగలించుకొని వదిలి వేసెనూ గ్రక్కున నేలను బడిపోవన్! 26

భయంకరుండగు వానరశ్రేష్ఠుడు బన్నుగ యా ఋషభుండు మఱిన్
కుంభకర్ణునీ భుజముల జేతను గూరిమి బహు పీడింపబడీ,
ముఖము నుండియును రక్తముగార్చుచు మూల్గుచు నేలను బడిపోయెన్! 27

కోపించిన యా యింద్ర శత్రువగు కుంభకర్ణుడును వేగముగన్,
శరభుని తన పిడికిటిచేతను మఱి సరసత నీలుని మోకాలిన్,
గవాక్షునీ మఱి తన యఱచేతను గంధమాదనుని పాదములన్,
బలమున గొట్టెను బలబల రక్తము బన్నుగ నేలను నొలుకంగన్! 28-29

ఆ కపివీరులు నా రాక్షసుడును అలరి కొట్టినా దెబ్బలకున్,
బహు వ్యథజెందిన వారగుచును మఱి బహు రక్తములను నొలుకుచునూ!
మూర్ఛను జెందీ నేలను బడిరీ మోదమంతయును మాయంబై
ఖండించిన కింశుకములకును వలె కదన భూమి యందున బడిదీ! 30

మహాత్ములునగు వానర వీరులు మానుగ నేలను బడుటయునూ
గాంచి వేలకొలదియు వానరులును కరముల శిలలను గ్రహియించీ,
కుంభకర్ణునీ మీదికి బోయిరి కుంభిని మిక్కిలి చలియింపన్! 31

పర్వతములవలె బలశాలురునూ బన్నుగ వానరు లందఱునూ!
పర్వతమును వలె నున్న యాతనిని బన్నుగ దేహముపై నెక్కి,
ఎగిరి యెగిరి మఱి యాతని గఱచిరి దగ కండలు నేలను రాలన్! 32

మహాబాహువులు గల రాక్షసునీ మానుగ యా వానరవీరుల్,
గోళ్ళచేత మఱి దంతంబులచే గుదురుగ బిడికిళ్ళను బట్టి
పీడించిరి యా కుంభకర్ణునీ తాడించిరి తమ పాదములన్,
కానీ రాక్షసు కిది యంతయునూ గర్వము ద్రిప్పిన యటులుండెన్! 33

వేలకొలదీ వానరులు మూపునను విలవిల నెక్కుచు దిగుచుండన్,
పర్వతంబుతో సమానుడైనా బన్నుగ యా రాక్షసుడు మఱిన్,
పచ్చని వృక్షములను గూడిన యా పర్వత రాజుకు వలె నుండెన్! 34

మహాబలుండగు కుంభకర్ణుడును మానుగ కరముల వానరులన్,
బట్టుకొనియు భక్షించుచు నుండెను బన్నుగ వినతా తనయుండున్,
కోపించియు సర్పముల బట్టుకొని కూరిమి భక్షించిన యటులన్, 35

పాతాలమునకు సమమగు ముఖమున బరగ కుంభకర్ణుండు మఱిన్,
దన నోటను బడవేయు వానరులు దగ నాసాపుటముల నుండీ,
కర్ణ రంధ్రముల నుండి వెలుపలికి దగ వెడలిరి మఱి వెల పలకున్! 30.

భృశ సంక్రుద్ధుండైనవాడునూ భీకర పర్వత సమానుడున్,
రాక్షసోత్తముండైన యాతడును రయమున కోపము జెందుచునూ!
హరివీరులు మఱి నమలుచు మ్రింగుచు నట కొందఱినీ విఱచుచునూ!
యుద్ధభూమి యందంతట తిరిగెను యుద్ధతుడై యా రాక్షసుడున్! 37

ఆ రాక్షసుడును భూమి నంతటిని నలరి మాంస రక్తంబులచే
దడియునట్లుగా జేయుచు నాతడు దగ జ్వలించుచున్నది మఱియున్,
ప్రళయము నందలి కాలాగ్నికి వలె బన్నుగ హరి సైన్యమునందున్,
సంచరించె నా కుంభకర్ణుడును మించిన రాక్షస కృత్యములన్! 38

మహాబలుండగు కుంభకర్ణుడును మానుగ శూలము హస్తమునన్,
ధరించి నిలిచిన యా రాక్షసుడును దగ హస్తమునను వజ్రమునూ,
ధరించి నిలిచిన యింద్రుని వలెనూ దగ పాశంబును హస్తమునన్,
ధరించి నిలిచిన యమునికి వోలెను దగ జ్వలించె నా సమయమునన్! 39

శుష్కంబగు నా యరణ్యములనూ సురుచిరమగు నా గ్రీష్మమునన్,
పావకుండు మఱి గాల్చినట్లుగా బరగ కుంభకర్ణుండు మఱిన్,
వానర సైన్యంబులను గాల్చెనూ వసర యుద్ధ రంగము నందున్! 40

అటుపిమ్మట కపి మూక లన్నియును హరించి పోగా గపివీరుల్,
నాయకులు లేనట్టి వారలయి నయముగ యా రాక్షసు జేతన్,
తాడింపబడుచు భయ సంవిగ్నులునై కంపము జెందుచు నఱచి రటన్! 41

కుంభకర్ణుని చేత వానరులు గూరిమి యనేక విధములనూ,
జంపగబడుచును వ్యథను జెందుచును గంపము జెందిన మనసులతో,
శ్రీరాముని మఱి శరణు జొచ్చిరి శ్రీకరముగ రక్షింపుమనీ! 42

ఆ మహాహవము నందున గపులును నలని భగ్నులై బోవుటయున్,
అంగదుండు నది జూచి వేగమే యలరి కుంభకర్ణుని పైకిన్,
పర్వతశిఖరము నొక్కదానినీ బరగ గైకొనియు బరుగెత్తెన్! 43

ఇంద్రుని మనుమడు నైన యంగదుడు సాంద్రశైల శృంగంబు మఱిన్,
హస్తమునందున గ్రహించి యాతడు నట బలుకుచు గర్జించునూ!
కుంభకర్ణునీ యనుసరించుచును గూరిమి వచ్చిన రాక్షసులన్,
భయపెట్టుచు మఱి బాధ బెట్టుచును బరగ హస్తమున యుండిన యా
శైలశృంగమును కుంభకర్ణునీ శిరసుపైని విడిచెను వడిగా!

ఆ సమయంబున యా యంగదుచే నలరి శైల శృంగము జేతన్,
శిరసు మీదవడి కొట్టబడిన యా శూరుడు రాక్షసు డంగదుపై
మహాకోపమున మండి పడుచు మఱి మహావేగమున దూకుచునూ!
క్రోధావిష్టుండైన యంగదుని కుదురుగ జంపగ బరుగెత్తెన్! 45-46

మహాబలముగల కుంభకర్ణుడును మహా నాదమును జేయుచునూ!
వానరవీరుల నందఱ నచ్చట వనర భీతి గలిగించుచునూ!
కోపముతో నావాలి పుత్రుపై కుదురుగ శూలంబును విసిరెన్! 47

యుద్ధమార్గముల యందు జతురుడును యుద్ధపద్ధతిని నేర్పరియున్,
బలవంతుడగు వాలి పుత్రుడును పైబడు చుండెడి శూలంబున్,
పైబడకుండగ లాఘవంబుతో బన్నుగ చతురత దప్పుకొనెన్! 48

వాలి కుమారుండగు నంగదుండును పైకి యెగిరి తన యఱచేతన్,
కుంభకర్ణునీ వక్షస్థలమును కూరిమి బలముగ గొట్టె మఱిన్,
అంగదుం డటుల గొట్టుట జేతను నింగి సమానుడు రాక్షసుడున్,
పర్వత శిఖరము విరిగి నట్లుగా బన్నుగ బడుచును స్పృహ దప్పెన్! 49

మహాబలముగల కుంభకర్ణుడును మానుగ క్షణమున స్ఫృహతెంది,
పిడికిలి బిగించి పరిహాసంబున వడి హస్తంబును జాచి మఱిన్,
అనాయాసముగ యంగదు పైనీ యటు బడవేసెను వేగముగన్!
ఆ యంగదుఁడును స్ఫృహా కోల్పోయెను నదుపు దప్పి నేలను బడియెన్! 50

వానర శ్రేష్ఠుండైన యంగదుడు వనరగ స్ఫృహ దప్పియు నేలన్,
బడిన పిమ్మటను కుంభకర్ణుడును బన్నుగ శూలము గ్రహియించీ,
సుగ్రీవుడు యున్నట్టి చోటికిని శూరత నతడును బరుగెత్తెన్! 51

ఆట్టి సమయమున బలవంతుండును నిట్టి కుంభకర్ణుండు మఱిన్
తన వైపునకే వచ్చుచుండెనని తన మనస్సునను భావించీ,
మహావీరుడగు వానరేంద్రుడును మానుగ సుగ్రీవుం దపుడున్
పైకిని యెగిరెను నందకుండగా బరగ యతని శూలంబునకున్! 52

మహాబలముగల సుగ్రీవుండును మానుగ పర్వత శిఖరంబున్
పైకి యెత్తి మఱి బట్టుకొనుచునూ బన్నుగ బలవంతుడు నైనా!
కుంభకర్ణునీ యెదిరింపగనూ కూరిమి యాతనిపై గవిసెన్! 53

మహాకాయుడగు కుంభకర్ణుడును మానుగ తనపై బడుచున్న
సుగ్రీవుని సంప్రేక్ష్యమానుడై సురుచిరముగ సర్వాంగములున్,
గనబఱచుచు మఱి బొమ్మ విరిచియును గరమున దొడలును గొట్టుచునూ
రవిపుత్రుండగు సుగ్రీవునకును రయమున నిలిచెను ధీరతనూ! 54

తనయెదుటను మఱి రొమ్మ విఱచుచును దగ తన తొడలను గొట్టుచునూ,
వానరులను భక్షించుచు మఱియును వారల రక్తము ద్రావుచునూ,
కపిశోణిత దిగ్ధాంగుడైన యా కఠిన చిత్తుడగు రాక్షసుతో
కపిరాజగు సుగ్రీవుడు బలికెను కఠిన వాక్యముల నీరీతిన్! 55

వానరవీరుల నెందఱినో మఱి వనరగ నేలను బడవైచీ
సుదుష్కరంబగు కర్మంబును మఱి సురుచిరముగ జేసితి వీవున్

సైన్యములను గూడను భక్షించియు సాహస కార్య మొనర్చితివి!
పరమ యశస్సును బొందినావు మఱి బన్నుగ రణరంగము నందున్! 56

కుంభకర్ణుడా! నా మాటలు విను! కూర్మి సావధానము తోడన్,
ఆ వానర సైన్యమును వదులుమూ! వారలతో బనియేమి యికన్?
ఓ రాక్షసుడా! నేను విసరెడి యొప్పుగ యీ గిరి నొక దానిన్
సహింపుమా! యీ దెబ్బకోర్చి మఱి సరసత నిలువుము! రణమందున్! 57

సత్త్వ ధైర్యముల గూడికొనీ మఱి సమస్త కపులకు రాజైనా,
ఆ సుగ్రీవుని వచనములను విని యల రాక్షస శార్దూలుండున్,
కుంభకర్ణుడును నిటులను బలికెను గూరిమి వీరోచితముగనూ! 58

ఓ వానర విను! ప్రజాపతికినీ యొప్పుగ పౌత్రుండవు నీవున్,
ఋక్షరజస్సుకు బుత్రుండవు మఱి సాక్షాత్ భాను సమానుడవున్,
ధృతి పౌరుష సంపన్నుడ వీవును మతిమాలిన గర్జన లేలా? 59

కపిరాజగు నా సుగ్రీవుండును గడు భీకరుడగు రాక్షసునీ,
వచనములను విని యా పర్వతమును వనరగ హస్తమునను బట్టీ,
వజ్రము జేతను, పిడుగు జేతనూ వనరగ సమానమును నైనా,
ఆ పర్వతమును కుంభకర్ణునీ యల వక్షస్థలమున గొట్టెన్! 60

ఆ పర్వతమును కుంభకర్ణునీ యల విశాలమగు వక్షమునన్,
బడిన వెంటనే యా పర్వతమును బగులుచు చూర్ణంబై పోయెన్!
అట్టి సమయమున వానరు లందఱు నిట్టె దిగులు జెందిరి వేగన్,
రాక్షస సైన్యము సంతోషముతో రమ్య నాదములు జేసిరటన్! 61

శైల శృంగమున గొట్టబడుచునూ విలవిల లాడుచు రాక్షసుడున్,
కోపము తోడను నోరును దెఱచీ కూరిమి బిగ్గఱ గర్జించెన్!
తటిత్ప్రకాశంబైన శూలమును దగ హస్తంబున బట్టుకొనీ,
సుగ్రీవుని జంపుటకై విసరెను జూచు వారలును వెఱగందన్! 62

అట్టి సమయమున ననిల సుతుండును నా హనుమంతుడు పైకెగిరీ,
కుంభకర్ణునీ భుజముల తోడను గుదుదుగ విసరగ బడినట్టి

వాడియైన మఱి కాంచనదామము వనరగ గలిగిన శూలమునూ,
పైకి యెగిరి హస్తముల బట్టికొని బన్నుగ విరిచెను ముక్కలుగా! 63

అట్టి సమయమున యా హనుమంతుడు సంతోషించిన వేగముగన్!
వేయిపుట్లతో నిర్మించిన యా విపులమైన బరువును గలదీ!
ఇనుప వికారంబైన శూలమును నిమ్ముగ మోకాలును మోపి,
రెండు ముక్కలుగ విరిచెను దానిని మెండుగ హర్షము జెలరేగన్! 64

హనుమంతుడు శూలమును విఱచుటయు నా వానరసేనయు గాంచి,
సంతోషించుచు హర్షనాదములు వింతగ జేసెను నచ్చోటన్,
నలుదిశలకు బోయిన యా కపులును నయముగ వచ్చిరి యచ్చటికిన్! 65

అటుపిమ్మట యా కుంభకర్ణుడును నటు ధైర్యంబును గోల్పోయెన్,
యుద్ధమునకు మఱి విముఖుండయ్యెను యుద్ధతియును మఱి గోల్పోయెన్!
కపి సైన్యంబును సంతోషించుచు కదిలి సింహనాదము జేసెన్,
శూలము విఱచుట గాంచి మారుతిని సురుచిరముగ పూజించి రటన్! 66

మహాత్ముడగు నా కుంభకర్ణుడును మానుగ శూలము నారీతిన్,
భగ్న మగుటయును గాంచి మనస్సున బన్నుగ మిక్కిలి కోపించెన్,
మఱి లంకాపురి దగ్గఱనున్నా మలయ పర్వతము నుండియునూ
ఒక శిఖరంబును బెకలించియు మఱి యొనరగ సుగ్రీవుని గొట్టెన్! 67

వానరేంద్రుడగు సుగ్రీవుండును వనరగ రణరంగము నందున్,
పర్వత శిఖరము జేత గొట్టబడి బరగ స్పృహను మఱి గోల్పోయెన్,
స్పృహను దప్పి మఱి నేలను బడినా సిరిగలవాడగు సుగ్రీవున్,
జూచి రాక్షసులు సంతస మందిరి సురుచిర ధ్వనులను జేసి రటన్! 68

ఆ రాక్షసుడును యుద్ధమునందున యద్భుత ఘోర పరాక్రమమున్,
గలిగిన కపిరాజగు సుగ్రీవుని గ్రహించి యతి తీవ్రమువైనా,
గాలి మేఘమును హరించినటులను గదది హరించెను [illegible]! 69

తఱమున మేఘ సమానమునైనా [illegible] రూపము గలిగిన యా,
కపిరాజగు సుగ్రీవు నెత్తికొని [illegible]చున్న యా రాక్షసుడున్,

మేరు పర్వతము సమానమైనా మేలిమి రూపము గలిగిన యా
భయంకరంబగు శిఖరముతోడను బరగ మేరు పర్వతము వలెన్,
ఆ సమయంబున కుంభకర్ణుడును నలరి ప్రకాశించుచు నుండెన్! 70

అటుబిమ్మట యా మహావీరుడగు నలరు కుంభకర్ణుండు మఱిన్,
రణభూమిని రాక్షసుల జేతనూ రమ్యముగా స్తుతులను గొనుచున్,
ఆ సుగ్రీవుని బట్టుకొనుటచే నాశ్చర్యము జెందుచునున్నా
సురలు జేసెడీ ధ్వనులను వినుచును సుగ్రీవుని మఱి గొనిపోయెన్! 71

ఇంద్ర వీర్యమును గలవాడును మఱి యింద్ర శత్రువగు రాక్షసుడున్,
అటుబిమ్మట యా యింద్రసముండగు నా సుగ్రీవుని గ్రహించియున్,
ఈతని జంపినచో శీఘ్రముగా నిమ్ముగ రామునితో గూడన్
సైన్యమంతయును నశించు ననుచును సరసత మదిలో భావించెన్! 72

కపిసైన్యము చిందర వందరగా గలతను బరుగిడుచున్నదనీ,
సుగ్రీవుని మఱి కుంభకర్ణుడును సురుచిరముగ గొనిపోవుచునూ,
నున్నాడనియును మారుతాత్మజుడు బన్నుగ జూచియు యోచించెన్! 73

సుగ్రీవుడు మఱి శత్రువు జేతను సుభీషణముగా బట్టువడెన్,
ప్రస్తుతంబు నేనేమి జేయవలె బన్నుగ రాజును విడిపింపన్,
ఏది న్యాయసమ్మతమో దానిని యిమ్ముగ జేయుదు నిర్భయతన్,
గిరి సంకాశుండయిన రాక్షసుని 'గీ' నెట్టించెద నే నిపుడున్! 74-75

మహాబలంబును గలవాడును మఱి మహావీర్యమును గలవాడున్,
కుంభకర్ణునీ ముష్టి ఘాతమున కూరిమి యాతని దేహమునూ,
బ్రద్దలుగొట్టియు నశింపజేసెద బరగ రాజు సుగ్రీవుని నే,
విడిపింతును గపివీరులంతఱును విజయ నాదములు జేయగనూ! 76

అటుగాకను లేదా దేవతలును ననుడులు, సురగులు గలిసి మఱిన్
ఈసుగ్రీవుని బంధించిననూ, నిమ్ముగ యీతడు స్వయముగనే,
బంధవిముక్తుడు గాగలండు మఱి బాహు బలంబున ధీరతనూ! 77

యుద్ధమునందున కుంభకర్ణుడును యుద్ధతి బర్వతమును జేతన్,
గొట్టుట జేతను వానరాధిపుడు కూరిమి మానసమున గుందెన్,
తనను దాను దెలియుట లేదనియును తథ్యము! నే భావించెదనూ! 78

ఈ సుగ్రీవుడు సంగ్రామంబున నిమ్ముగ ముహూర్త కాలమునన్,
లబ్ధ సంజ్ఞుడై జాగృతి నొందును లలి తనకును మఱి కపులకునూ,
యేది సుహితమో దానిని జేయును నిమ్ముగ మనసున యోచించీ! 79

నాచేతను విడిపింపబడినచో నయముగ యీ నీతిజ్ఞుడునూ,
మనసునందు బహుకష్టము నొందును మానుగ యప్రీతిని బొందున్,
శాశ్వతమైనా యపకీర్తియునూ సరగున యాతనికివి గలుగున్! 80

ఆకారణమున ముహూర్తకాలము నలరి రాజు దన విక్రమమున్,
జూపుటకొఱకై వేచియుండెదను సురుచిరముగ మఱి దేరుకొనున్,
అంతలోపలను జెదిరి పోయినా చింతను మునిగిన గపిసేనన్,
ధైర్యము దెలిపీ యోదార్చెద నే దగ రణమున నిలువగను మఱిన్! 81

మారుతాత్మజుడు హనుమంతుండును మదిలో నీవిధి యోచించీ;
కపిసేనలకును ధైర్యము జెప్పి కడు ధీరత్వమునను నిలిపెన్! 82

అటువిమ్మట యా కుంభకర్ణుడును నలరి కదిలెడి సుగ్రీవున్,
దీసికొనియు మఱి లంకాపురిలో దీరుగ ప్రవేశమును జేసెన్,
అట్టిసమయమున విమానములలో నలరి వీధి గృహములనున్నా
గోపురములలో నున్న జనంబులు గూరిమి సంతోషమున మఱిన్!
పుష్పవర్షమును గురిపించిరి యట బొలుపుగ సన్మానము తోడన్! 83

మహాబలముగల సుగ్రీవుండును మఱి లాజల వర్షము జేతన్,
గంధోదక వర్షంబుల జేతను జిందునటుల సేవింపబడీ,
రాజవీధులను శీతలత్వమున రహి వీచిన గాలుల జేతన్!
మెల్లమెల్లగా జాగృతినొందెను నల్లనల్లనా దెలిచి కనుల్! 84

బలవంతుండగు కుంభకర్ణుని బన్నుగ భుజాంతరము నందున్,
నున్న మహాత్ముడు సుగ్రీవుండును సురుతరమగు గర్వమునొందెన్.

జాగృతి నొందుచు రాజమార్గమును సరసత వీక్షించుచును మఱిన్,
మాటిమాటికిని త్రోవలో దానిటు మానుగ యాలోచించె నిటుల్! 35

ఈవిధముగ నే బట్టుబడితిని యీ రాక్షసునికి రణమందున్,
ఏమి జేయవలె నే నిప్పుడు మఱి యేటుల ప్రవర్తింపగవలయున్?
వానర వీరులకును, రామునకును వనరగ యిష్టంబును నగునో!
హితమును నగునో యట్టి కార్యమును నీతియుక్తముగ జేసెదనూ, 6

వానరేంద్రుడగు నా సుగ్రీవుడు వనరగ యీవిధి యోచించి,
అటుమీదట దన వాడిగోళ్ళతో నా రాక్షసునీ కర్ణములన్,
దంతంబులచే నాసాగ్రంబును వింతగ పాదంబుల చేతన్,
పార్శ్వభాగముల జీల్చివేసెనూ బన్నుగ రక్తము స్రవియింపన్! 7

సుగ్రీవుని దంతంబుల జేతను సూదులైన గోరులజేతన్,
జీల్చబడియు తన ముక్కూ చెవులును శీఘ్రము రోషము జేత మఱిన్,
శరీరమంతయు రక్తధారలను సరగున దడిసియు నాతండున్
ఆ సుగ్రీవుని నేలమీదకును నలరి విసిరిగొట్టెను వేగన్!
కరములజేతను నలిపి వేసెనూ కనికర మింతయు లేకుండన్!

భయంకరంబగు బలమును గలిగిన బరగ కుంభకర్ణుని జేతన్,
నేలమీద బడవేసి నలపగా విలవిల రాక్షసులును గొట్టన్,
ఆ సుగ్రీవుడు కందుకమును వలె యాకాశము లోనికి యెగిరి,
రామచంద్రునీ సన్నిధానమున రయమ్ముగ వ్రాలెను నంజలితో!

ముక్కూచెవులను బోయినవాడై యుక్కు ముక్కయగు రాక్షసుడున్
రక్తధారలను దడిసిన వాడై రమ్యమైనగిరి స్రోనలతో
ప్రవహించెడి ప్రస్రవణవుగిరి వలె ప్రకాశించె నా సమయమ్మునన్!

రక్తముజేతను దడిసిన వాడును రహిభయంకరుడు నగు వాడున్,
భీమదర్శనము గలవాడును మఱి భీకర దంష్ట్రిలు గలవాడున్,
నల్లని కాటుక ప్రోవుసమంబును నయముగ రావణు దమ్ముండున్,
కుంభకర్ణుడును క్రోధము తోడను గుదుగుడుగ రక్తము గ్రక్కుచునూ!

తమ్మి సంజలను గూడినట్టి యా తహి మేఘము వలె రాజిల్లెన్,
అట్టి కుంభకర్ణుండు వేగమున యుద్ధ రణంబును సలుపుటకై
నిర్ణయించుకొని మానసమందున నిఖిల భూతములు గంపింపన్! 91-92

ఆ సుగ్రీవుడు బోయిన విదపను నల రాక్షసుడును గ్రోధమునన్,
రణమును సేయగ మఱలి వచ్చెనూ మానుగ రణరంగంబునకున్,
మహారౌద్రుడగు కుంభకర్ణుడును మానుగ యనాయుధుడననుచున్
అనియోజించియు ముద్గరంబొకటి యలరి గ్రహించెను శీఘ్రముగా! 93

మహాత్ముడగు నా కుంభకర్ణుడును మానుగ యటు బిమ్మటను మఱిన్,
నగరమునుండియు బహు వేగముగా నయముగ వెడలెను రణమునకున్,
ప్రవృద్ధ యుగాంత ప్రళయాగ్నికి వలె బన్నుగ రణరంగము నందున్,
భయంకరంబగు గపి సైన్యంబును బన్నుగ భక్షించెను నతడున్! 94

ఆకలితోడను రక్త మాంసముల నలరుచు గోరెడి రాక్షసుడున్,
భయంకరంబగు బన్నుగ జొరబడి కపి సైన్యంబున యాతండున్,
రణరంగంబున యెవరెవరో మఱి రహి దెలియక యా రాక్షసుడున్,
రాక్షసులను మఱి వానరవీరుల రహిపిశాచముల ఋక్షములన్,
భక్షించెను నా కుంభకర్ణుడును బన్నుగ యందఱు బీతిలగన్,
ప్రళయకాలమున మృత్యువు ప్రజలను బన్నుగ భక్షించిన యటులన్! 95

కోపించిన యా కుంభకర్ణుడును గూరిమి తొందర బడుచు మరిన్,
రాక్షసులను మఱి వానర వీరుల రహి యిద్దఱు ముగ్గురు చొప్పున్,
చాలమందినీ యొక్క చేతనూ సరగున బట్టి యెత్తికొనీ,
నోటిలోపలను వేసికొనుచునూ, పెటపెట నములుచు నుండె మరిన్! 96

ఆసమయంబున మహాబలుండును నట్టి కుంభకర్ణుండు మఱిన్,
నగేంద్రాగ్రముల వానరవీరులు నయముగ గొట్టుచు నుండగనూ!
క్రొవ్వును రక్తము శరీరమంతయు గుదురుగ ప్రవహించుచు నుండన్,
కుంభకర్ణుడును గపివీరులనూ కూరిమి భక్షించుచు నుండెన్!

అట్టిసమయమున యా రాక్షసుడును నిట్టి వానరుల భక్షింపన్,
వానరులందఱు శరణము వేడిరి వసరగ శ్రీరఘువీరు నటన్,
కోపించిన రాక్షసుడును మాత్రము గూరిమి దినుచును వానరులన్,
సంచరించుచుండెను రణభూమిని సంచలనంబును జేయుచునూ! 98

పందమందినీ యేడుగురిని మఱి విందుగ యెనమండుగురిని యటన్
ఇరువదిమందిని ముప్పది మందిని యిమ్ముగ కరముల బట్టుకొనీ,
దినుచు సంచరించుచు వేగంబున దీరుగ బరుగెత్తుచు నుండెన్! 99

క్రొవ్వుచేత, వసచేత, రక్తమున కుదురుగ శరీరమంతయునూ
గప్పబడిన వాడై యతడుండెను కర్ణములకు మఱి బ్రేవులునూ,
దగిలి ముడులువడి వ్రేలాడుచునూ దగ భయంకరముగా నుండెన్
సుతీక్షణములగు కోరల తోడను శూలము పట్టుక యాతండున్
ప్రళయకాలమున యమునికి వలెనూ బరగ శూలముల వర్షించెన్! 100

ఆ సమయమున సుమిత్రా తనయుడు నలరు శత్రు మర్దనుడు మఱిన్
పరపురంజయుడు లక్ష్మణు దప్పుడు బన్నుగ బహు కోపించి మఱిన్,
రణరంగంబున యుద్ధము జేసెను రమ్య ధనుస్సును ధరియించీ! 101

వీర్యవంతుడగు లక్ష్మణ మూర్తియు విపుల బలాఢ్యుడు రాక్షసునీ,
శరీరమందున యేడు బాణములు సత్వరమున గుదియించె నటన్,
ఇతరమైన బాణములను గూడను నిమ్ముగ వేసెను నాతనిపై! 102

ఆ రాక్షసుడును నా యస్త్రముచే నటు బీడిలపగబడి దానిన్,
నిశ్శేషంబును జేసి వేసెనూ నిర్మూలించెను వేగముగన్,
పిమ్మట బలవంతుడు, లక్ష్మణుడును నిమ్మడిగా కోపించి మఱిన్! 103

ఆటుపిమ్మట లక్ష్మణ మూర్తియునూ బటు శుభ్రము, సుందరమైనా
బంగారంపు వికారమైన యా సింగారమునగు కవచమునూ,
వాయువు సంధ్యాకాల మేఘమును వసరగ గప్పిన యట్టులుగా,
శరములజేతను గప్పివేసెనూ వర గర్వము గలవాని నటన్! 104

కాంచన భూషణములుగల శరముల కలన పీడ నొందుచును మఱిన్
నీలాంజనచయ ప్రఖ్యుడైన యా నిశాచరుండును నట్టి యెదన్,
మేఘంబులతో గూడినట్టి యా మిలమిల కిరణంబుల తోడన్,
అంశుమంతునికి వోలె ప్రకాశము నలరి రాక్షసుడు వెలుగొందెన్! 105

అటుబిమ్మట మఱి భయంకరుండును నా రాక్షసుడును వేగముగా
మేఘధ్వనికిని సమానమైనా మీరిన ధ్వనితో నాతండున్,
అనాదరంబుగ యా లక్ష్మణుతో నలరుచు నీ విధమున బలికెన్! 106

యుద్ధమునందున యకష్టకముగా యుద్ధరి నింతకు గూడమఱిన్,
జయించు వాడను నట్టి నన్ను మఱి జయింప యెదుటను నిలిచితివి!
నీ వీరత్వము ప్రదర్శించితివి! నీ విక్రమమును జూపితివి!
నిన్ను మెచ్చుకొనుచున్నాడను నే నిపుణత్వము నీ చతురతనూ! 107

రణమున యాయుధము ధరించి మఱి రహి మృత్యువు వలెనున్న ననున్
నెదుటనిలిచినా వాడును గూడను నెన్నదగిన వాడగును మఱిన్
రణమును సలిపిన వాని సంగ తిక రహి వేఱుగ జెప్పగ వలెనా? 108

ఐరావతమున సమారూఢుడై యలరి సురలతో గూడికొనీ,
సమర్థుండునగు మహేంద్రుండునూ సరసత వజ్రము పట్టుకొనీ,
రణమున యెదుటను బూర్వ మెన్నడును రమ్యముగా నిలబడ లేదూ! 109

సౌమిత్రీ! మఱి నీ వీ రోజున సరసత బల విక్రమములచే
సంతోషింపగ జేసితి విప్పుడు సంతోషించితి రఘువీరా!
నా యానతి మఱి బొందుచు వేగము నయముగ శ్రీరాముని కడకున్,
జేరవలయునని గోరుచుంటినీ శీఘ్రము నీ రణమున నుండి! 110

వీర్య బలోత్సాహంబుల నేడిట విమల రణంబును జూపితివి!
సంతసించితిని సౌమిత్రీ! మఱి జాలును! నిక నీ యుద్ధంబున్,
రాముని మాత్రము జంపగవలెనని రయముగ గోరుచు నుంటిని నే
అతని జంపినచో సమస్తమును వలరి జంపి నట్లగును సుమా! 111

శ్రీ రఘువీరుని జంపిన పిమ్మట శీఘ్రము యుద్ధము నందుననూ
ఆ మిగిలిన సేనలను శత్రువుల నయముగ చరింప జేయుదునూ!
నా సైన్యము యుద్ధమును జేయునటు నయముగ వేయుదు సౌమిత్రీ! 112

ఆ విధంబుగను నా రాక్షసుడును నాత్మస్తుతి పూర్వకముగనూ,
పలికిన మాటలు విని సౌమిత్రియు బన్నుగ నవ్వుచు మందముగా
ఘోరతరంబగు వాక్యము బలికెను గూరిమి రాక్షసుడును వినగన్! 113

ఓ వీరా! ఓ కుంభకర్ణుడా! యెవ్వగ నా మాటలు వినుమా!
పౌరుషమును జూపించు సమయమున బలమున శక్రాదులు గూడన్,
నిన్ను సహింపగ జాలరనుచునూ నిలిచి దెలుపుచున్నాను మఱిన్,
అది నిజమే! మఱి నీ విక్రమమును సలరి గాంచితిని నే నిపుడున్,
కానీ, దశరథ రాజకుమారుడు ఘనవీరుడు శ్రీరాఘవుడున్,
ఇదిగో! కదలని పర్వతంబువలె యిమ్ముగ నిలిచెను గనుగొనుమా! 114

సుమిత్ర నందనుడగు లక్ష్మణునీ ఘోర వచనములను వినియున్,
నిశాచరుండును మహాబలీయుడు, మానుగ యారాక్షసుడు మఱిన్,
సౌమిత్రిని మఱి లక్ష్యపెట్టకను సరసత యాతని దాటుచునూ!
భూమిని కంపింపగ జేయుచునూ బొలుపుగ పోయెను రామునిపై 115-116

అటుపిమ్మట యా దశరథాత్మజుడు నా శ్రీరాముడు శీఘ్రముగా,
రౌద్రాస్త్రంబును ప్రయోగించి మఱి రయమున రాక్షసు వక్షమునన్,
గొట్టెను మఱియును వాడి బాణముల కూరిమి విడిచెను నాతనిపై! 117

రఘువీరుండగు రాముని జేతను రహి యావిధి గొట్టగబడినా,
కుంభకర్ణుడును రామునికెదురుగ కోపముతో బరుగెత్తుచునూ
వచ్చుచున్న రాక్షసు ముఖముననూ వనర యగ్నిపిండంబులునూ
అగ్నిజ్వాలలును బయలుదేరినవి యంతటనూ మఱి జ్వలించుచున్! 118

రామాస్త్రముచే గొట్టబడిన యా రాక్షస శ్రేష్ఠుడు క్రోధుండై
భయంకరముగా నఱచుచు నాతడు బలిమిని కపులను దరుముచునూ!
రాముని మీదకు బరుగిడికెనూ రహి యాతని నోడింపగనూ! 119

నెమిలియీకలును గట్టిన శరములు నిమ్ముగ రాక్షసు వక్షమునన్,
దిగిపోయినవి బటుతరంబుగను దీరుగ మఱి రాకుండగనూ!
హస్తమునుండి పరిభ్రష్టమునై యాతని గద నేలను బడియెన్! 120

సమస్తమగు నాతని యాయుధములు సరసత నేలను జిమ్మబడెన్,
మహాబలుండగు కుంభకర్ణుడును మానుగ దన యాయుధములునూ,
నేలమీద బడి పోపుటగాంచి నిగిడి యుద్ధరంగమునందున్
ముష్టులజేతను, కరముల జేతను కష్టముగా రణమును జేసెన్! 121

బాణంబులచే నతి నిబద్ధుడగు బరగ యంగములు గలవాడై,
రక్తముజేతను దడిసినట్టి యా రక్కసుండు నీ సమయమునన్,
ప్రస్రవణపు బర్వతము నందునను బన్నుగ సెలయేఱుల వలెనూ
ఆతడు గూడను స్రవియించెను మఱి నలరు రక్తధారలును నటన్! 122

తీవ్రమైన కోపముతో గూడుక దీరుగ తెలియని మైకముతో
రక్తము జేతను దడిసినవాడై రణమునుండి మఱి విముఖుండై,
వానరులను మఱి రాక్షసవీరుల వనరగ ఋక్షంబులను మఱిన్,
భక్షించుచు మఱి దిరుగుచుండెను బరుగు లెత్తుచును రణభూమిన్! 123

అటుబిమ్మట యా భయంకరంబగు నలరు విక్రమము గలవాడున్,
బలవంతుండును, యముని తోడనూ బన్నుగ సమముగువాడు మఱిన్,
కుంభకర్ణుడును భీమశృంగమును గూరిమి గట్టిగ బట్టుకొనీ,
రఘువీరుండగు శ్రీరామునిపై రయమున విసరెను దన బలిమిన్! 1 4

ఆ పర్వత శిఖరము దన మీదికి నటు రాకుండగనే దానిన్,
రామచంద్రుడును దన కార్ముకమును రయమున నెక్కుడు బెట్టి మఱిన్,
ఏడుబాణములతో శిఖరంబును బడి పోవగ ధర ఖండించెన్! 125

అటుబిమ్మట మఱి ధర్మాత్ముండును [illegible] నైనా
అట్టివేళ నా కొండ శిఖరమును [illegible] చిత్రాంగములన్,
గలిగిన శరములచే ఖండించెను [illegible] ప్రముఖున్! 126

క్రోధము జేతను అరుణ నేత్రముల కోపించిన యా రాఘవుడున్
చూపులతో మఱి కాల్చి వేయుచును నేపుగ యుండెను ననునటులన్,
వేగముగా ముందుకు నడుచుచునూ విపులమైన కాయము గలుగూ,
కుంభకర్ణునీ వలన భయంబున కూరిమి పిడితులైనట్టి,
వానర నాయకు లందరినీ మఱి వనర సంతసము గూర్చుచునూ,
ఆ భీకర రాక్షసుని యెదుర్కొని యా శ్రీరాముడు నిర్భయతన్! 135-136

భుజంగ కల్పంబైనదియును మఱి పొలుపగు దృఢమగు నారియునూ
ఉగ్రంబగు దపనీయ చిత్రమగు సురుతర ధనుస్సు గ్రహియించి,
వానరవీరుల యోదార్చుచు మఱి వనర సంతసము గూర్చుచునూ,
ఉత్తమ బాణములను గూడిన యా యురుతరమగు నంబుల పొదులన్,
గైకొని శ్రీరాముడు నటకొచ్చెను గలని రాక్షసుని దునుమాడన్! 137

పరమ దుర్జయుండైన వాడునూ పతిత పావనుడు రాఘవుడున్,
సౌమిత్రియు మఱి వెంట నడువగా సకల వానరులు వెడలగనూ!
కపిసేనా నాయకులు వెంట రా తరిలెను రాముడు రణమునకున్ 138

మహాబలంబును గలవాడును మఱి మహావీర్యుడగు రాఘవుడున్,
ముకుటము శిరసున గలవాడును మఱి మోహ విక్రమము గలవాడున్!
నరాధముండును రక్తనేత్రముల యలరు చుండినా వాడు మఱిన్,
మహాత్ముడగు నా కుంభకర్ణునీ మానుగ శ్రీరాముడు గాంచెన్!

అట్టి కుంభకర్ణుండు గోపమున యలరు దిశాగజమును బోలెన్
గ్రోధముతో బరువెత్తుచు దరుముచు గొందఱ నట భక్షించుచునూ
వానరులను రణమందున వెదకుచు వనరగ గూల్చుచు నుండెనటన్,
రాక్షసపరివారమున జుట్టబడి రమ్య పూజలను గైకొనుచున్
మహాత్ముడగు నా కుంభకర్ణునీ మానుగ శ్రీరాముడు గాంచెన్! 140

వింధ్య మందరప్రు పర్వతముల వలె విపులమైన యాకారమునన్,
కాంచనాంగదములును మఱి గలిగి కాంచన భూషణముల తోడన్,
అలంకరించుక యలర్రి యుండెనూ నట్టి కుంభకర్ణుండు మఱిన్

ముఖమునుండి మఱి రక్తధారలును ముసముస నేలను బడుచుండెన్,
పైకి లేచినా వర్షాకాలపు బన్నుగ మేఘము వలెనుండెన్
మహాత్ముడగు నా కుంభకర్ణునీ మానుగ శ్రీరాముడు గాంచెన్! 14

రక్తముతో దడిసిన కర్ణములను రక్తి నాలుకను నాకుచునూ
వానర సేనను వెదికి వెదికి మఱి వనరగ మర్దించుచు నుండెన్!
ప్రళయకాలమున సంహారంబును బరగ జేయు యమునికివి వలెన్
రక్తము గారుచు శరీరమంతయు రక్తము మఱి గ్రోలుచునుండెన్
అట్టి మహాత్ముడు కుంభకర్ణునీ యల రాఘవుడును నట గాంచెన్! 142

దీప్తానల తేజము గలవాడును దీరుగ పురుషర్షభుడైనా,
రామచంద్రుడును రాక్షసుగాంచీ రయమున దన చాపమును మఱిన్,
నారివి వే సంధించి చఱచెనూ నయముగ రాక్షసుడును వినగన్! 143

శ్రీరాముడు జేసిన చాపధ్వని శ్రీఘ్రము విని యా రాక్షసుడున్,
ఆ శబ్దంబును సహింప జాలక యలరి క్రోధమున శ్రీఘ్రమునన్,
బరువెత్తెను రఘువీరుని పైకిని బన్నుగ ముద్గరమును బట్టి! 144

గాలిచేత మఱి యొగుర గొట్టబడి గగన మేఘమును బోలుచునూ,
ఆదిశేషునీ దేహము వలెనూ యతని బాహువులు నటు లుండెన్!
శైల శృంగముల కాంతి గలిగినా యలరు కుంభకర్ణుని గాంచీ,
రఘువీరుండగు రామచంద్రుడును రమ్యముగా నీ విధి బలికెన్! 145

రాక్షసాధిపా! రమ్ము! రమ్ము! మఱి రహి విషాదమును బొందకుమా!
మహా చాపమును ధరించి నేనును మానుగ నిలిచియు నుంటి నిటన్,
ముహూర్తకాలమునందు ప్రాణములు మోదముగా విడిచెదవు సుమా!
రాక్షసవంశము నశింపజేసెడి రామునిగా నను దెలియు మికన్! 146

కుంభకర్ణుడును నితడు రాముడని కుదురుగ మనసున దెలిసికొనీ,
వికృతధ్వనితో బకబక నవ్వుచు వికటముగా గోపించుచునూ,
వానరవీరుల దరిమి వేయుచును వనరగ ముద్గరమును బట్టి
రఘువీరుడు శ్రీరామచంద్రునకూ రయముగ నెదురుగ బరువెత్తెన్! 147

మహా తేజుడగు కుంభకర్ణుడును మఱి ముద్గరమును ధరియించి,
సకల వానరుల హృదయంబులమూ సరసత జీల్చుచు నుండె యనన్,
వికృతంబుగా భయంకరముగా విలవిల మేఘధ్వనికి వలెన్
పకపక నవ్వుచు నట్టహాసమున బన్నుగ రామునితో ననియెన్! 148

నేను విరాధుడ ననుచు గాని మఱి నేను కబంధుడనని గానీ,
ఖరుడననుచు మఱి వాలి యనుచునూ కథమున మారీచుడ ననుచున్,
మనసునందు భావింపబోకుమా మానుగ రణమున భద్రమునూ,
రావణు దమ్ముడ! కుంభకర్ణుడను రహి వచ్చితి నే రణమునకున్! 149

పరిపూర్తిగ మఱి యినుమున జేసిన భయంకరంబగు ముద్గరమున్,
కన్నుల జూడుము! దీని వలన నే గడగి దేవతల దానవులన్,
మహావీరులను జయించితిని మఱి మానుగ జేజేలను గొంటిన్!
మహావీరులను జయించితిని మరి మానుగ జేజేలను గొంటిన్! 150

ముక్కు చెవులు మరి లేనివాడనని మోదము నందకు రఘువీరా!
చిన్నచూపు మఱి జూడబోకుమా! శీఘ్రము రణమునకు రమ్మా!
ముక్కు చెవులు మఱి లేకపోవుటను మునిగిన దేమియు లేదు సుమా!
స్వల్పమైన బాధయు మరి లేదూ యల్పమైన వీ యంగంబుల్! 151

అనఘా! యిక్ష్వాకుల శార్దూలా! యిన వంశోత్తమ! శ్రీరామా!
నా గాత్రముననను నీ! బలాక్రమము నయముగ జూపుము వేగముగన్,
నీ పౌరుష విక్రమములు గాంచియును నిను భక్షించెద బిమ్మటనూ! 152

కుంభకర్ణుని వచనములను విని క్రూరమి రఘువీరుండును వే[illegible]
పుంఖంబులతో గూడిన శరముల బౌలుపుగ యా[illegible] పైన వేసెన్! [illegible]
వజ్రసమానము లైన శరములను వడివడి గొట్టిన దూ[illegible]
రాక్షసుండు మఱి [illegible] రహి వ్య[illegible] యెన్! 153

ఏ బాణంబులు [illegible]
ఏ బాణంబులు మహావీరు[illegible]

ఆ బాణంబులు వజ్రోపము నగు నలరు కుంభకర్ణుని తనువున్,
ఛేదింపగ జాలక పోయెను మఱి బాధయింత గలుగక పోయెన్! **154**

ఆ సాయకముల వారి ధారలుగ నలరుచు దనదు శరీరమునన్
గ్రాగివేయుచును కుంభకర్ణుడును నుగ్రగ వేగమును గలిగిన యా
ముద్గరమును మఱి త్రిప్పుచు నాతడు మోదముననుఁ శ్రీరాముని యా
బటు బాణంబుల దీవ్ర వేగమును బరగ యడ్డగించెను నతడున్! **155**

అటుబిమ్మట నా రాక్షసుండునూ నట రక్తముచే బూయబడీ,
దేవ సేనలను భయపెట్టునదీ దీరుగ భీకరమైనదియున్
దన ముద్గరమును త్రిప్పుచు వేగము దగ వానర సైన్యంబులనూ
తతిమివేసెనూ, బహు దూరంబును దిరిగి జూడకుండను మఱియున్! **156**

అటుబిమ్మట యా రఘువీరుండును నలరెడి వాయువ్యం బనెడీ,
మహాస్త్రమును మఱి గ్రహించి వేగము మానుగ రాక్షసుపై విడిచెన్!
దానిచేత ముద్గరమును గూడిన దగ హస్తము ఖండింప బడెన్,
బాహువు ఛేదింపగ రాక్షసుడును బన్నుగ వ్యాకులముగ యఱచెన్! **157**

గిరి శృంగముతో సమానమైనా ధీర రక్కసుని బాహువునూ!
రామబాణమున ఖండింపగబడి రయమున ముద్గరమును గూడీ!
ఆ బాహువు మరి యా సుగ్రీవుని యలరు సైన్యమునపై బడియెన్,
అనేకమందీ కపివీరులనూ నట మరణించిరి శీఘ్రముగన్! **158**

ఆ రాక్షసు బాహువు బడుటకు నల యా సుగ్రీవుని సైన్యమునన్,
ఎంతోమందికి గాయము లాయెను ఎంతో మందియు హతమైరి!
మిగిలిన వానర వీరులచ్చటను మీరిన దిగులును జెందుచునూ!
ప్రక్కల నిలబడి భయంకరంబగు ప్రబల రణంబును గాంచి రటన్!
ఆ శ్రీరాముని కుంభకర్ణునీ యల భయంకరము నగు రణమున్! **159**

అస్త్రముచే బాహువు ఖండింపగ యలరు రావణుని తమ్ముడునూ
మహాఖడమున శరీరమును మఱి మానుగ ఖండించిన గిరిలా

ఉన్న చేతితో కుంభకర్ణుడును నొక వృక్షంబును పెకలించి
రాముని మీదికి బరుగులెత్తెనూ మానుగ నాతని శిక్షింపన్! 160

ఆ రాఘవుడును ఐంద్రాస్త్రంబును నలరెడు బంగరు బాణముతో,
కుంభకర్ణుని సర్వ శరీరము గూరిమి సదృశమైనట్టి
తాలవృక్షమునతో కూడిన యా దగ సముద్యతంబగు కరమున్,
ఖండించెను శ్రీరామచంద్రుడును మొండి చేతు లతనికి నయ్యెన్ 161

గిరి సంకాశంబైన భుజంబును క్రిందబడెను ఖండింపబడి,
కుంభకర్ణుని యా భుజంబునూ కూరిమి నటునిటు గొట్టుకొని,
పర్వతములతో, వృక్షంబులతో బన్నుగ రాక్షస వీరులతో
వానరవీరులతో ఢీకొనెనూ వరుసను గొందఱ జంపెనటన్! 162

చిన్న బాహువులు గలవాడును మఱి భీతిలేక యా రాక్షసుడున్,
రాముని మీదికి బోయెను నాతడు రాముడు నాతని వీక్షించి!
వచ్చిబడెడి యా కుంభకర్ణుని వనరగ ధనుస్సు జేబట్టి!
అర్ధచంద్ర బాణములను రెండిట యతని పాదముల ఖండించెన్! 163

అట్టి కుంభకర్ణుని బాదములును నఖిలమైన దిక్కులు దిశలున్,
పర్వతగుహలును, మహార్ణవంబును బన్నుగ లంకా నగరంబున్,
వానర రాక్షస సైన్యంబులనూ వనరగ ప్రతిధ్వనించుచునూ,
ఆ పాదంబులు క్రింద బడినవి నఖండమగు పర్వతములుగా! 164

రెండు బాహువుల, రెండు పాదముల చెందగ రాముడు దెగవేయన్,
బడబాగ్నికి వలె నోరు దెఱచుకొని బన్నుగ కాంతుల [illegible],
నోరుదెఱచుకొని గర్జన సేయుచు నూరుము కారాల్ [illegible]!
అంత రిక్షమున రాహువు శీఘ్రము చెంతకు [illegible]
రాముని మీదకు నా రాక్షసులును రయమున బోయెను [illegible]! 165

రామచంద్రుడును శితాగ్రంబులును [illegible] యా
శరములతో నా రాక్షసు ముఖమును [illegible].

బాణంబులచే నిండిన ముఖమును బన్నగ గలవాడై యతడున్!
మాటాడుటకును శక్యముగాకను మఱి యఱచెను బహుకష్టముగా!
మూర్ఛను గూడను బొందెను నతడును ముని జనంబులును హర్షింపన్ 66

అటుపిమ్మట యా రఘువీరుండును యలరి ధనుస్సును సంధించి,
మహేంద్రునికి మఱి సంబంధించిన మహాశరంబును సంధించెన్,
ఆశరమును మఱి సూర్యకిరణముల యలరి ప్రకాశించుచు నుండెన్
బ్రహ్మదండముగ మృత్యు దేవతగ బరగ యమునివలె భీమంబై
వాయువుతోడను సమానంబునై వనరగ యొప్పుచు నుండె నటన్,
శత్రువులకు నది యమంగళంబై శాత్రవ సంహారము జేయున్! 67

వజ్రంబులచే, బంగారముచే వనరగ పుంఖము గలిగినదీ,
ప్రజ్వలించు నాదిత్యునికిని వలె ప్రకాశంబు గలదియును మఱిన్,
వజ్రాయుధమును, బిడుగు తోడనూ వనర జవమును గలదియునూ!
అట్టి బాణమును నా రాక్షసుపై నిట్టె విడిచె రఘువీరుండున్! 168

ధూమములేని యగ్నికి వోలెను దోరము జూడ భయంకరమై,
ఇంద్రుని వజ్రమువంటి శక్తిగల సాంద్రజ్వాల గల బాణంబున్,
రాముని బాహువులను విడువబడి రయమున బోవుచు దన కాంతిన్
పదిదిక్కులకును జిందుచు వేగము బన్నగ బయనించెను నదియ 169

పర్వత శిఖరముతోని సమానము బన్నగ సువృత్త దంష్ట్రంబున్
కదులుచున్న కుండలములు గలదియును ఘన స్వేదంబును జిమ్మ !
రాక్షసాధిపతి కుంభకర్ణునీ రమ్యమైన యా శిరస్సునూ,
పూర్వము నింద్రుడు వృత్రుని శిరమును బొలుపుగ ఖండించిన రీ ;
ఆవిధముగ శ్రీరామవిభుండును నలరి రాక్షసుని ఖండించెన్! 170

కుండలంబులును భూషితంబునగు మెండుగ కాంతులు జిమ్ముచున్
మహాఘనంబగు యా రాక్షసునీ మహాద్భుతంబగు నా శిరసున్,
రాత్రియందు యుదయించినట్టి యా రమ్య పునర్వసు మధ్యమున
తారాధిపుడు బ్రకాశించినటు దగ ప్రకాశమున శిరముండెన్! 171

రామబాణమున గొట్టబడిన యా రాక్షసు శిరస్సు క్రిందబడెన్!
పర్వతశిఖరమువలె నుండెను నది బన్నుగ ఘన నక్షత్రంబువలెన్,
మార్గమునందున మహా గృహంబులు మఱి గోపురములను బడగొట్టెన్,
ఉన్నతమగు లంకాప్రాకారము జెన్నుగ బడగొట్టెను వేగన్! 172

మహాకాయమును, మహాప్రకాశము మానుగ రాక్షసు శరీరమున్,
మహా సముద్రములో బడిపోయెను మానుగ యురుతరములు నైనా,
మకరంబుల మఱి మీనంబులను మానుగ విషసర్పంబులనూ!
మర్దించుచు మఱి భూమిని జేరెను మఱల తిరిగి రాకుండగనూ! 173

బ్రాహ్మణులకు మఱి దేవతలకునూ బరగ మహాశత్రువు నైనా!
కుంభకర్ణుడును సంగ్రామంబున కూరిమి చంపగ బడుచుండన్,
భూమి చలించెను, పర్వతంబులును భూరి ధ్వనులతో చలించెనూ!
సురలుగూడ సంతోషము తోడను సురుచిరముగ జేసిరి ధ్వనులన్! 174

అటులిమ్మట మఱి దేవఋషులునూ, యల మహా ఋషులు దేవతలున్,
ఇతర భూతములు, సుపర్ణులును మఱి యిమ్ముగ యక్షులు, గంధర్వుల్,
గుహ్యకులును మఱి యాకాశంబున కూరిమి జేసిరి హర్షమునన్,
శ్రీరాముని యా పరాక్రమంబును శ్రీకరముగ కీర్తించి దటన్! 175

అటుబిమ్మట రావణుని బంధువులు నలరు మహాత్ముడు, మనస్వియున్,
కుంభకర్ణుని మరణము జేతను కూరిమి వ్యథజెందిన వారై
సింహంబును గని మాతంగంబులు శీఘ్రము ధ్వని జేసిన యటులన్,
ఆ శ్రీరాముని గని రాక్షసులును యఱచుచు ధ్వని జేసిరి మిగులన్! 176

రఘువీరుండగు రామచంద్రుడును రాక్షసు వేగము ఖండించి,
రాహువు ముఖమున నుండి సూర్యుడును రహి విముక్తుడై చీకటినీ,
తొలగజేసి మఱి గగన మధ్యమున దోరము వెలుగుల నింపినటుల్,
రాముండును కపిసైన్యము నందున రమ్య ప్రకాశములను నింపెన్! 17"

వానరు లందఱు సంతోషించిరి వనరగ పద్మ ముఖంబులతో,
భీమబలుండగు కుంభకర్ణుని భీకర మరణము గాంచి మఱిన్!

దుర్ధర్షుండగు దశరథాత్మజుడు దురితుండగు నా రాక్షసునీ
చంపినందులకు సొంపగు ధ్వనులను నింపిరి రణరంగము నందున్!

సుర సైన్యములకు బీడకుండు మఱి సురుచిరముగ రణరంగమునన్!
అపజయ మెఱుగని పేరుబడైన యా యలరు కుంభకర్ణుని యనిలో,
వృత్రాసురునీ జంపి యింద్రుడును విమలానందము నొంది నటుల్,
శ్రీ రాఘవుడును రాక్షను జంపీ స్థిరముగ యానందము నొందెన్!
వానర సేనయు గంతులు వేసెను వనరగ సంతసమున నపుడున్!

(యుద్ధకాండమునందు 67వ సర్గము సమాప్తము)

* ★ *

## యుద్ధకాండము - మొదటి భాగము

### అఱువది యెనిమిదవ సర్గము

[కుంభకర్ణుని వధను విని రావణాసురుడు విలపించుట]

మహాత్ముడగు శ్రీరామచంద్రుడును మానుగ రావణు దమ్ముడగూ!
కుంభకర్ణునీ జంపినట్లుగా కూరిమి గాంచియు రాక్షసులన్,
దశగ్రీవునకును విన్నవించిరీ దగ యీ వార్తను వేగముగన్!

రాక్షసేంద్ర విను కాలయమునితో రహి సమానుడును విక్రముడున్!
కుంభకర్ణుడును రణరంగమునను గూరిమి కొందఱ దరిమె నటుల్!
కొందఱు వానరులను భక్షించెను కొందఱ వికలాంగుల జేసెన్!
కాలకర్మ పరిపక్వమగుటచే గతించి స్వర్గమునకు జేరెన్!

నీ సోదరుడగు కుంభకర్ణుడును నిష్ఠుర ప్రతాపమును జూపీ,
వానర సేనను, ఋక్ష సైన్యమును వనర జంపె విక్రమమునన్గా!

తుదకు రాముని తేజస్సులచే దోరముగా శాంతించె యనిన్!
రాముని శరముల పీడింపగ బడి రహి భీమంబగు సంభ్రమునన్!
కుంభకర్ణుని మొండెము నటబడి కూరిమి మునిగెను జలరాశిన్!

ముక్కుచెవులు మఱి రెండు కరములును చక్కని శిరసును బాదములన్,
శ్రీరాముడు ఖండించుట చేతను చిక్కని రక్తము స్రవించుచున్!
లంకాద్వారము నడ్డగింపబడి యంచితముగ యటబడి యుండెన్!
దావాగ్నిని మఱి గాల్పబడిన యా దగ వృక్షమువలె నట బడియున్!
వికృతమగు యాకారము తోడను వింతగ ముద్దగ యైపోయెన్! 3-5

రావణుండు మఱి సంగ్రామంబున రమ్య బలాఢ్యుడు విక్రముడున్,
కుంభకర్ణు డని నిహతుడయ్యెనని కూరిమి విని సైన్యము జేవన్!
బహు శోకంబున సంతాపితుడై బన్నుగ మూర్ఛను నేలబడెన్! 6

పినతండ్రియు మరణించినట్లుగా విని దేవాంతక నరాంతకుల్,
అతికాయుండును, త్రిశిరస్సుడును మఱి యలరి శోకమును జెంది రటన్,
గొంతునెత్తి మఱి రోదది జేసి వింతగ లంకయు మార్మోగన్! 7

అక్లిష్ట కర్మఉడగు రామునిచే నలసోదరుడును విక్రముడున్,
కుంభ కర్ణుడును నిహతుడైనటుల కూరిమి విని ధ్వని జేయుచునూ,
మహోదరుండును, మహాపార్శ్వుడును మానుగ దుఃఖించిరి మిగులన్! 8

ఆటుబిమ్మట రాక్షస పుంగవుడును నతికష్టమునను జాగృతినీ
బొంది కుంభకర్ణుని వధవలనను గూరిమి దీనత నొందుచునూ!
ఆకులేంద్రియములును గలవాడై వికలత జెందుచు శోకించెన్! 9

అయ్యో! వీరుడ! శత్రుమర్దనా, హాబలవంతా! సుసోదరా!
కుంభకర్ణ! మఱి నను విడిచితివా? కూరిమి విధి విపరీతముచే
యమసదనమునకు బయనించితివా? విమలమైన లంకను విడిచి; 10

మహాబలా! ఓ కుంభకర్ణుడా! మానుగ బోతివి నను విడిచీ,
నాదు మఱియు బంధుల హృదయములను నయముగ యుండిన శల్యముల న్
తొలగింపకనే వెడలిపోతివీ, దోరముగా యమ క్షయమునకున్!

శత్రు సైన్యమును బీడించియు మఱి సరగున నీ వొక్కఁడవు మఱి
ఎచటికి బోవుచు నుంటివి ధీరా! యిలపై యుండుమటంచు ననున్! 11

ఆశ్రయించుకొని నేను దేనినీ యలరి సురాసురులకు గూడన్,
భయపడకుండగ నిరాకరించీ ఖిన్నుగ ధీరత నున్నానో!
అట్టిసాదు దక్షిణ భుజంబునూ యిట్టె నేలబడి పోయెగదా!
అందుచేత నేనును ధరిత్రినీ పొందుగ లేనట్లే యింకన్! 12

దేవదానవుల దర్పంబును మఱి దీరుగ దొలగించిన వాడున్,
కాలాగ్నికి మఱి సరిసమానుడును గడు విక్రమ మంతుడు వాడున్!
అట్టి వీరునీ సంగ్రామంబున యిట్టె రాఘవుడు నే రీతిన్,
చంపగలిగినాడో తెలియదు గద! కంపము గలిగెడి నాకు మఱిన్! 13

వజ్రప్రహారముగూడ నీకు మఱి వనరగ దుఃఖము గలిగించీ,
భయార్తునను మఱి గలిగింపదుగా బాధనొందగను జేయదుగా!
అట్టి నీవు రాముని శరములచే యిట్టె వ్యసనమును బొందుచునూ,
నేలమీద యెటు బడిపోయితివీ దూళి యందు బొరలుచును మఱిన్! 14

దేవగణంబులు ఋషుల తోని మఱి దీరుగ యాకాశము నందున్,
యున్నవారలై యుద్ధమునందున ఖిన్నుడవై మరణింపగనూ!
నిన్ను జూచి సంతోషించుచునూ అన్న సేయుచుండిరి ధ్వనులన్! 15

పొందబడిన లక్ష్యము గలవారై బొందుగ సంతోషించుచునూ,
వానరు లిప్పుడు దుర్జయమైనా వనరగ లంకా ద్వారములన్,
అన్నివైపులను నధిరోహింతురు బన్నిదముల మఱి గట్టికొనీ! 16

నాకిక రాజ్యముతో బనిలేదూ! నయముగ సంపదలను గూడన్,
ఏమి ప్రయోజన మింక సీతతో నిమ్ముగ సౌఖ్యంబుల దోడన్,
కుంభకర్ణు డిల లేని నాకు మఱి కుదురుగ జీవిత మందుననూ!
ఆసక్తియు యించుకయు లేదు మఱి యాశ యించుకయు లేదు స ! 17

నా సోదరునీ జంపిన రాముని నయముగ యుద్ధము నందుననూ,
వధింపజాలక బోయినచో యిక వనరగ నాకును మరణంబే!
శ్రేయస్కరమును నగును గదా మఱి శేష జీవితం బిక నేలా?
వ్యర్థమైన యీ జీవితంబు మఱి వదులుదు ముక్తిని బొందుదునూ! 18

నా యనుజుడు మఱి యెచట నుండెనో నే నా దేశమునకు బోదున్,
ఇపుడు బోయెదను నాలసింపకను నిమ్ముగ జలధులు నాకడైనన్!
సహోదరుల నే విడిచి క్షణంబును సరసత గోరను జీవింపన్! 19

పూర్వము నే నపకారము జేసిన బొలుపుగ దేవత లందఱునూ,
నన్ను గాంచి మఱి హసించెదరు గద! నలుగురిలో నా బ్రతుకేలా?
తమ్మి! నీవు మరణించిన తదుపరి దగ యింద్రుని నెటు నిర్జింతున్? 20

అజ్ఞానముచే మహాత్ముడైనా యా విభీషణుని వచనములన్,
గ్రహింప లేకను బోతిని యయ్యో! గర్వమునను మద చంచలతన్!
అట్టి విభీషణు బలుకు లివే మఱి యిట్టి నాకు సంప్రాప్తించెన్,
ముందాలోచన జేయక నేనును బొందుగ భంగము నొందితినీ! 21

కుంభకర్ణుడును, ప్రహస్తుండునూ కూరిమి దారుణ విషమమునన్,
నశించిపోయిన పిమ్మట నాకును నయముగ విభీషణుని వాక్కుల్,
సిగ్గును గలిగించుచును నాకు మఱి భగ్గున మండించుచు నుండెన్! 22

ధార్మికుండు మఱి శోభాయుక్తుడు దగ విభీషణుడు మఱి నాచే
అవమానింపగబడె దానికి మఱి యలరి యిట్టి ఫలమును గలిగెన్!
ఎట్టి కర్మముల జీవి జేయునో యట్టి ఫలములను బొందుగదా! 23

ఇంద్ర రిపుండును, దన యనుజుండును సాంద్ర బలుండును విక్రముడున్!
కుంభకర్ణుడును వధింపబడెనని కూరిమి విని యా రావణుడున్,
వ్యాకులమైనా చిత్తము దోడుత వనరగ యనేక విధములుగా
బహుదీనముగా విలపించియుమా, బహు దుఃఖార్తుండై మఱియున్,
మూర్ఛిల్లియు మఱి నేలపై బడెను మోదము నందిరి దేవతలున్! 24

(యుద్ధకాండమునందు 68వ సర్గము సమాప్తము.)

....o....